# పల్నాటి సీమలో కోలాటం

రచన :

డాక్టర్ బిట్టు వెంకటేశ్వర్లు

[1981 లో నాగార్జున విశ్వవిద్యాలయం నుంచి పిఎచ్.డి. పట్టా పొందిన సిద్ధాంత వ్యాసం. నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో ఉత్తమ పిఎచ్.డి. పరిశోధనా గ్రంథానికి నిర్ణీతమైన ఆచార్య తూమాటి దోణప్ప బంగారు పతకం ఈ గ్రంథానికి లభించింది.]






ప్రచురణ :

తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

palnaaTı seemaloo koolaaTam by Dr BITTU VENKATESWARLU, M.A., Ph.D., ( A critical study of a Folk Dance koolaaTam ) Thesis awarded of the Degree of Ph.D. from the Nagarjuna University in the year 1981.

---

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు – 500 004.

ప్రథమ ముద్రణ : 1988

ప్రతులు : 2000

వెల : రూ. 24/–

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు
ప్రతులకు :
తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు–500 004.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు–500 029.

# అంకితం

తల్లిదండ్రులు

శ్రీమతి బిట్టు సోమమ్మ

శ్రీ పుల్లయ్య

గారల

జ్ఞాపకార్థం

# ప్రకాశక విజ్ఞప్తి

ఆదిమ మానవుడు వేసిన తొలి కేక ప్రకృతిలో ప్రతిధ్వనించినప్పుడు, లయాన్వితమైన ఆ ధ్వనిని అనుకరిస్తూ అతను చిందులు వేసినప్పుడు ఆటా పాటా పుట్టాయని విజ్ఞులు అంటారు. మౌలికమైన ఈ ఆటపాటలు అతని మేధావికాసంతో పాటు ఎదిగి నగిషీలు దిద్దుకొని బహుళ కళా రూపాలుగా వెలిశాయి జానపదులు సృష్టించిన నిసర్గ మధురమైన ఈ కళారూపాలే జాతి సంస్కృతికి మూల సంపదలై నిలిచాయి.

ఆంధ్ర దేశంలో బహుళ ప్రచారంలో ఉన్న అనేక జానపద కళా రూపాలలో 'కోలాటం' అనే క్రీడా వినోద ప్రక్రియ ఒకటి. ఈ కళారూపం ఆంధ్రదేశంలోనే గాక ఇతర రాష్ట్రాలలో కూడా కొంచెం భిన్నంగా కనిపించి నప్పటికీ తెలుగువారి 'కోలాటం' ఒక ప్రత్యేకతను, విశిష్టతను సంతరించు కొన్నది.

'కోలాటం' ముఖ్యంగా పల్నాటి సీమలోని 'కోలాటం' అభినయించే విధానం, పుట్టు పూర్వోత్తరాలు, దానిలోని రకాలు మొదలైన అంశాలను కూలం కషంగా పరిశోధించి, నిబంధించిన సిద్ధాంత గ్రంథమిది. సద్వివేచనా తత్త్వంగల డాక్టర్ బిట్టు వెంకటేశ్వర్లు దీనిని నాగార్జున విశ్వవిద్యాలయానికి సమర్పించి పిఎచ్ డి పట్టా పొందారు. ఇప్పుడు తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన దీనిని ప్రచురింపజేసే అవకాశం కలిగించినందుకు రచయితకు మా ధన్యవాదాలు.

తెలుగు జానపద కళారూపాలను అధ్యయనం చేయగోరేవారికి ఈ గ్రంథం ఉపయుక్తం కాగలదని మా నమ్మిక. పాఠకులు దీనిని సమాదరిస్తారని ఆశిస్తున్నాం.

హైదరాబాదు - 500 004
తేదీ: 5-3-1988

ప్రకాశకులు
తెలుగు విశ్వవిద్యాలయం

# మంగళాశాసనం

—ఆచార్య తూమాటి దోణప్ప
కులపతి
తెలుగు విశ్వవిద్యాలయం

వర్ధిష్ణువు డాక్టర్ బిట్టు వెంకటేశ్వర్లు స్నాతకోత్తర స్థాయిలోనూ పరిశోధనా స్థాయిలోనూ మా విద్యార్థి. అన్ని స్థాయీ భేదాలలోనూ గురుచరణుల ఆశీర్బలమూ, సహవ్రతుల సహకారమూ అమరిన బోధశాలి; స్నేహశీలి. చిన్ననాట ఇంటా బయటా ఎన్నెన్నో ప్రతికూల స్థితిగతులను ఎదుర్కొని పై చదువులకు వచ్చి, స్వయం కృషితో ఉన్నతోన్నత పట్టాలను స్వీకరించిన నిరంతర జిజ్ఞాసువు. శాస్త్ర సంసేవనం వల్లా, శాస్త్ర సంభావనం వల్లా చక్కటి వ్యుత్పత్తినీ, శాస్త్రీయ విశ్లేషణా సంపత్తినీ సంతరించుకున్న సాధకుడు సదభ్యాసం, సదాభ్యాసం అతని జ్ఞాన తృష్ణలోని ఆయువు పట్టులు.

డాక్టర్ వెంకటేశ్వర్లు పల్లె పట్టులలో పుట్టిపెరిగినవాడు, పల్లెటూరి వారి గుట్టు మట్టు లెరిగినవాడు బాలుడాడిన సీమ పలనాటిసీమ అతని అభిజనం. జానపదుల పట్ల సానుభూతీ, జానపద కళారూపాలపట్ల సదవగాహనా అతని సహజ లక్షణాలు. ఆ సీమలో ప్రచుర ప్రచారంలో ఉన్న సకల జానపద కళారూపాల పుట్టుపూర్వోత్తరాలు అతనికి హృత్కవిలె పులిజూదం, అచ్చనగళ్ళు మొదలైన జానపద క్రీడావినోదాలపై వెంకటేశ్వర్లు ప్రకటించిన పరిశోధనా పత్రాలు సాహితీ తత్త్వ విదులనూ, సామాజిక విజ్ఞాన కోవిదులనూ మెప్పించిన మేలి రకపు రచనలు.

నాగార్జున విశ్వవిద్యాలయం వారి పిఎచ్.డి. పట్టాన్నిపొంది, సువర్ణాంకిత రచనగా సువర్ణ పతక పురస్కారం సాధించిన సిద్ధాంత ప్రబంధం ప్రకృత కృతి. పలనాటి సీమలో ఊరూరా తిరిగి, ఆయా కళాకారులందరినీ పలకరించి, వారి అనుపానులను అనుశీలించి, తన కృషికి ఆధారభూమిగా అవశ్యకమైన

సమస్త సామగ్రిని సేకరించి, శిష్ట సాహితీ నీడలను శోధించి, జానపద వాఙ్మయ పథాలను పరికించి, ఇతర సీమలలో ప్రచలితమవుతూ ఉన్న సంవాది కళా రూపాలతో తైపారు వేసి, అన్ని కోణాలనుంచి కోలాట తీరుతెన్నులను సరిచూచి, సరసంగా, సమర్థంగా సమన్వయించిన సమగ్ర సమీక్షణమిది. కోలాట పాటల పాఠప్రదర్శనమూ, శైలీపరమైన వాటి తీరుతీయాల నిరూపణమూ ప్రస్తుత పరిశీలనానికి అదనపు సొగసులు.

ఆనందవర్ధనమైన కృషిని సాధిస్తున్న ఈ సాహితీ వంశ వివర్ధనునికి మా మంగళాశాసనాలు.

హైదరాబాదు
విభవ, ఉగాది
18-3-1988

ఆచార్య తూమాటి దోణప్ప

# కృతజ్ఞతా నివేదనం

నాకు పరిశోధనకు అవకాశమిచ్చి, నా పరిశోధనాంశాన్ని అంగీకరించి, పరిశోధనా పద్ధతులను బోధించి, జానపద కళాకారులవద్ద విషయ సంగ్రాహణంలో ఎదురయ్యే ఇబ్బందులను వివరించి, అచట మెలగవలసిన విధానాలను సూచించి, సిద్ధాంత వ్యాసాన్ని ఆసాంతం ఓపికతో పరిశీలించి, నాకు పర్యవేక్షకులుగా వ్యవహరించిన నాటి నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులూ-నేటి తెలుగు విశ్వవిద్యాలయం కులపతీ అయిన ఆచార్య తూమాటి దొణప్పగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

నా పరిశోధనలో నాకు అమూల్యమైన సూచనలనిచ్చిన శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ, ఆచార్య నాగరాజు, ఆచార్య డి. రామకోటయ్య, ఆచార్య తమ్మారెడ్డి నిర్మల, డా॥ ఆకురాతి పున్నారావు, డా॥ యస్. గంగప్ప, డా॥ బేతవోలు రామబ్రహ్మం గార్లకూ—

నాకు కావలసిన గ్రంథాలను సమకూర్చి తోడ్పడిన నాగార్జున విశ్వవిద్యాలయం గ్రంథాలయాధికార్లకూ, వేటపాలెం గ్రంథాలయాధికార్లకూ, శ్రీ కేశం సింగరయ్య గారికీ—

విషయ సేకరణలో నాకు తోడ్పడిన శ్రీ పరిటాల ప్రభాకరరావు, గుర్రం చెన్నారెడ్డి, కటకం వెంకటయ్య, కేశం రామయ్య, ఆళ్ల అంతయ్యగార్లకూ-

నా పరిశోధనకు కొంతఆర్థిక సహాయాన్ని అందజేసిన I.C H.R. వారికి; ఉపకార వేతనాన్ని మంజూరుచేసి, ఈ సిద్ధాంత గ్రంథానికి పిఎచ్. డి. పట్టానిచ్చిన నాగార్జున విశ్వవిద్యాలయం వారికీ—

నా అభ్యర్థనను మన్నించి ప్రచురణ బాధ్యతను స్వీకరించిన తెలుగు విశ్వవిద్యాలయాధికార్లకూ—

నా పరిశోధన గ్రంథంలోని చిత్రాలను గీసి ఇచ్చిన మిత్రులు శ్రీ మారేమండ శ్రీనివాసరావు, శ్రీ వుద్దేమర్రి గోపాలరావు గార్లకూ—

ఈ పరిశోధనలో సహకరించిన కళాకారులకూ, కళాభిమానులకూ, కళాహృదయులకూ ప్రతిఒక్కరికీ నా కృతజ్ఞతలు.

—బిట్టు వెంకటేశ్వర్లు

# ప్రస్తావన

నేటి ప్రపంచంలో జానపద విజ్ఞాన రంగంలో అధ్యయనం, పరిశోధన విరివిగా సాగతోంది. అందులో కొద్దో గొప్పో భారతదేశంలో కూడా కృషి జరుగుతూనే ఉంది. అయితే ప్రత్యేకంగా ఈ శాస్త్ర విభాగాల ద్వారా పరిశోధన జరగడం దేశం మొత్తంలో తక్కువనే చెప్పాలి. జానపద విజ్ఞాన విభాగాలు ప్రత్యేకంగా ఏర్పాటు చేసి మరుగున పడిపోతున్న ఎన్నో అమూల్యాంశాలను ఉద్ధరించవలసిన రోజులివి. దక్షిణ భారతదేశంలో జానపద విజ్ఞానంలో కృషి జరిపిన వారిలో కర్ణాటులది అగ్రస్థానం. ఆంధ్రప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయాల్లో తెలుగు శాఖల్లో జానపద విజ్ఞాన కృషి నెమ్మదిగా జరుగుతోంది. అయితే ఇంత వరకు జానపద సాహిత్యం (**Folk Literature**) మీదనే పరిశోధన జరిగింది. కాని జానపద విజ్ఞానంలోని ఇతర అంశాలపై పరిశోధన జరుగలేదు. ఇలాంటి సమయంలో జానపద విజ్ఞాన అంశాలపై పరిశీలన జరగవలసిన అవసరం ఎంతైనా వుంది. జానపదుల సమస్త విషయాల్లో వారి కళారాధన గమనించదగింది. ఈ ప్రజాకళలు ఎంతో ఉత్సాహకారకాలుగాను, విజ్ఞానదాయకాలుగాను ఉంటాయి. అందులో కోలాటం ఒకటి. కోలాటానికి ఎన్నో గతులు, అభినయాలు, రూప బేదాలు ఉన్నాయి. ఈ కోలాటానికి జానపద విజ్ఞానంలో ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఆనందం, ఉత్సాహం, ఉల్లాసం, శారీరక పుష్టిని ప్రసాదించే ఈ కోలాటంపై పరిశోధన జరగడం అవసరం అనిపించింది. పరిశోధనలో విస్తీర్ణం ఎక్కువయిన కొద్దీ విషయం విపులీకరించడానికి వీలు పడదు. ఆ దృష్టితోనే ఈ పరిశోధనలో పల్నాటి సీమను ముఖ్య కేంద్రంగా తీసుకోవడం జరిగింది. 'పల్నాటి సీమలో కోలాటం' అనేదే ఈ సిద్ధాంత వ్యాస విషయం.

కోలాట కళాకారుల నుంచి విషయం సేకరించేటప్పుడు అడుగడుగునా నిరుత్సాహమే. అడిగినదే తడవుగా చెప్పరు కొందరు. 'నేను పాడేటప్పుడు గమనించి రికార్డుచేసుకో' అనేవారు కొందరు, 'రేపురా! మాపురా!' అంటూ నెలల తరబడి తిప్పేవాళ్ళు కొందరు, విషయం చెప్తే జీవన వ్యాపారంలో పోటీకి

వస్త్రానేమోనని లనుమానంతో నాపై నిషా వేసేవారు కొందరు— ఒకటేమిటి ! అన్నీ సమస్యలే. అందుబాటులో ఉన్నట్లు కనబడతాయి విషయాలు. కాని ఏదీ అందదు. ఎన్నో ఇబ్బందులను అధిగమించి ఈ పరిశోధన ముగిసింది.

ఈ సిద్ధాంత వ్యాసం పది అధ్యాయాలుగా విభజించబడింది. ఒకటో అధ్యాయంలో కోలాటం పద నిర్వచనం - పర్యాయ పదాలు - రూపాంతరాలు - ఆడే పద్ధతి - జట్టు - జట్టు నాయకుడు - ఆటగాళ్ళు - గరిడి - ఉద్ది - కోలాట కర్రలు - గజ్జెలు - ఎత్తుగడ - ఉసెత్తు - ముక్తాయింపు - చల్లే వస్తువులు - కోలాట సమయాలు అనేవీ, రెండో అధ్యాయంలో పురావస్తు నిర్మాణాలు - సాహిత్యం - చారిత్రకుల ఉద్ధరణలలో కోలాటం ప్రసక్తి, మూడో అధ్యాయంలో పెద్దల కోలాటం - పిల్లల కోలాటం - డప్పు కోలాటం - కోలాట్టం - కుమ్మి - కోల్కాలి - దండియారాస - గర్బా - కిదీ - భాంగ్రా - మోరీస్ అనేవీ, నాల్గో అధ్యాయంలో జానపద విజ్ఞాన నిర్వచనం - లక్షణాలు - విభజన - వాక్సహిత - కళలు, వాగ్రహిత కళలు - మిశ్ర కళలు - జానపద విజ్ఞాన లక్షణాలలో కోలాటం సమన్వయం అనేవీ, ఐదో అధ్యాయంలో సగ్గొండు - పద వ్యుత్పత్తి - పర్యాయ వాచకాలు - ఉనికి - విస్తీర్ణం - పంటలు - వృత్తులు - జలాధారాలు - ప్రాచీనత - దేవాలయాలు - సౌకర్యాలు - వినోదాలు - ప్రజా కళలు - ప్రజా కళలలో కోలాటం అనేవీ, ఆరో అధ్యాయంలో కులుకుల కోలాటం - కుప్పెకట్టె కోలాటం - గుజరాతు కోలాటం - గోల్కొండ కోలాటం - చీల కర్ర కోలాటం - దసరా కోలాటం - నాటు కోలాటం - బజారు కోలాటం - మురళి కోలాటం - ముప్పయ్యారు కోపులు : వాటి రేఖా చిత్రాలు అనేవీ, ఏడో అధ్యాయంలో కోలాటం పాటల వర్గీకరణం - కన్నీటి పాటలు - చరిత్ర సంబంధాలు - తత్త్వ సంబంధాలు - దేశ భక్తిగేయాలు - పౌరాణికాలు- ప్రార్థన పాటలు - మంగళారతులు - లాలి పాటలు - వలపు పాటలు - హాస్య ప్రధానాలు అనేవీ, ఎనిమిదో అధ్యాయంలో కోలాటం పాటలలో కన్పించే మతాలు- కులాలు - కళలు - అలంకరణలు - ప్రజా సౌకర్యాలు - వ్యవసాయం - ఉప వృత్తులు - అడవులు - చెట్లు - ఇతరాలు అనేవీ, తొమ్మిదో అధ్యాయంలో కోలాటం పాటలలోని శబ్ద విపరిణామం - సంధులు - కృతక ప్రామాణికాలు - అన్యదేశ్యాలు - శబ్ద దోషాలు - విభక్తి విధానం - సమాసాలు - క్రియా

నిర్మాణం - వాక్య నిర్మాణం అనేవి, పదో అధ్యాయంలో చెప్పాం. చెన్నయ్య - చౌల నరసింహదాసు - ముందపాటి రాములు - మక్కెన బంగారయ్య - జక్కా వెంకయ్య - జాష్టి సీతా రామయ్య - తోట హనుమయ్య పొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు - నెమలి రామలింగా రెడ్డి మొదలయిన కోలాట కళాకారుల నేపథ్యం మొదలయినవన్నీ చర్చనీయాంశాలు. ఇంతటితో పదో అధ్యాయమూ, సిద్ధాంత వ్యాసమూ ముగించబడింది. అనుబంధంలో ఈ పరిశోధనకు పల్నాటి సీమలో నేను సేకరించిన కోలాటం పాటలు ఇవ్వబడ్డాయి.

# ఆధార గ్రంథ సూచి
## ( BIBLIOGRAPHY )

### తెలుగు గ్రంథాలు :


1. అప్పకవి, కాకునూరి - అప్పకవీయము· రామమూర్తి పంతులు, గిడుగు & వేంకట నరసింహాచార్యులు, ఉత్పల(పరి.), వావిళ్ళ, మద్రాసు, 1970.

2. ఆరుద్ర - సమగ్రాంధ్ర సాహిత్యం, ప్ర.ము., యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, 1965.

4. ఈశ్వర దత్తు, కుందూరి - ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, ప్ర.ము., ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, హైదరాబాదు, 1963.

5. ఎర్రన, ఎదపాటి - మల్హణీయం, ఆంధ్రపత్రికా ముద్రణాలయం, చెన్నపురి, 1927.

6. కృష్ణకుమారి, నాయని - తెలుగు జానపద గేయ గాథలు, నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, బషీర్‌బాగ్, హైదరాబాదు, 1977.

7. కొండయ్య ఊట్ల (అను.) - భారతీయ జానపద నృత్యాలు, ప్ర. భా., హంస పబ్లికేషన్స్, విజయవాడ, ప్ర. ము., 1960.

8. గంగాధరం, నేదునూరి (సంపలన.) - మున్నీరు, సరస్వతి పవర్ ప్రెస్, రాజమండ్రి, 1973.

9. గోపాలకృష్ణ, రెంటాల - పల్నాటి వీర చరిత్ర, జయంతి పబ్లికేషన్స్, విజయవాడ, ప్ర.ము., 1971.

10. దోణప్ప, తూమాటి - జానపద కళా సంపద, ప్ర.సం., నిర్మలా పబ్లికేషన్స్, విశాఖపట్టణం, ప్ర.ము., 1975.

11. దోణప్ప, తూమాటి - తెలుగు హరికథా సర్వస్వం, శ్రీ లక్ష్మి ప్రెస్, గుంటూరు, ప్ర.ము., 1978.

12. నారాయణామాత్య కవి, అయ్యలరాజు - హంస వింశతి, వావిళ్ళ., చెన్నపురి, 1964

13. పాపరాజు, కంకంటి-ఉత్తర రామాయణం, వావిళ్ళ., చెన్నపురి., 1966.

14. ప్రతాపరెడ్డి, సురవరం - ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1949.

15. ప్రభాకర శాస్త్రి, వేటూరి (సంపా.,)-చాటు పద్య మణిమంజరి, వావిళ్ళ., చెన్నపురి, 1961.

16. బలరామమూర్తి, ఏటుకూరు - ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, ద.ము., 1966.

17. మల్లన, తరిగొప్పుల - చంద్రభాను చరిత్రము, వావిళ్ళ., చెన్నపురి, 1922.

18. మాధవయ్య, సురభి - చంద్రికా పరిణయము, ఆనంద ప్రెస్, మద్రాసు, 1904.

19. యశోదాదేవి, వారణాసి - భారతదేశ చరిత్ర - సంస్కృతి, ప్ర. భా., తెలుగు అకాడమి, హైదరాబాదు, 1972.

20. రఘునాథరాయలు - వాల్మీకి చరిత్ర, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1968.

21. రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని - ఆంధ్ర నాటకరంగ చరిత్ర, శ్రీ వెంకటేశ్వరా ప్రింటర్సు, కత్తివాక్కం హైరోడ్, మద్రాసు, ప్ర. ము., 1969.

22. రామకృష్ణ, నటరాజ - నృత్యజ్యోతి, నృత్య నికేతనము, నాట్యకళా ప్రెస్, హైదరాబాదు, 1970.

23. రామరాజు, బిరుదురాజు - తెలుగు జానపద గేయ సాహిత్యము, జానపద విజ్ఞాన ప్రచురణలు, 1-8-117/2, చీకటిపల్లి, హైదరాబాదు, ద్వి. ము., 1978.

24. రామరాజు, బిరుదురాజు & కృష్ణకుమారి, నాయని - (సంపా.) - జానపద గేయాలు - సాంఘిక చరిత్ర, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, ప్ర. ము., 1974.

25. రామానుజరావు, దేవులపల్లి (సంకలన.) - సారస్వత నవనీతము, శివాజి ప్రెస్, సికింద్రాబాదు, 1955.

26. రామారావు, మారేమండ (సంపా.) - కాకతీయ సంచిక, ఆంధ్రేతిహాసక పరిశోధన మండలి, రాజమండ్రి, 1935.

27. వల్లభరాయడు, వినుకొండ- క్రీడాభిరామం, వావిళ్ళ., చెన్నపురి, 1953.

28. వెంకటరమణయ్య, నేలటూరి - చరిత్ర రచన, ప్ర. ఖా., వేదం అండ్ బ్రదర్సు, మద్రాసు, 1948

29. వెంకట సుబ్బారావు, తంగిరాల (సంపా.)- కాటమరాజు కథలు, ప్ర.సం., ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1976.

30. శాస్త్రి, బి. యన్. - ఆంధ్రుల సాంఘిక చరిత్ర, సరస్వతీ నిలయం, హైదరాబాదు, 1975.

31. శ్రీనాథుడు - పల్నాటి వీరచరిత్ర, ఉమాకాన్తం, అక్కిరాజు (పా. ని.) శ్రీరామ ముద్రాక్షర శాల, చెన్నపురి, 1938.

32. శ్రీనాథుడు - భీమేశ్వర పురాణం, వావిళ్ళ, చెన్నపురి, 1968.

33. శ్రీరామ అప్పారావు, పోణంగి - తెలుగు నాటక వికాసము, నాట్యమాలా ప్రచురణము, సికింద్రాబాదు, 1967.

34. సుందరం, ఆర్. వి. యస్., - జానపద సాహిత్య స్వరూపం, జానపద విజ్ఞాన సమితి, బెంగుళూరు, 1976.

35. సుందరం, ఆర్.వి.యస్. - తెలుగు-కన్నడ జానపద గేయాలు, అరవింద ప్రింటర్స్, సీతారామరావు రోడ్డు, మైసూరు, 1979.

36. సూర్యనారాయణ శాస్త్రి, మల్లాది - సంస్కృత వాఙ్మయ చరిత్ర, ద్వి. సం., ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1961.

37. సోమన, నాచన - ఉత్తర హరివంశము, వావిళ్ళ., మద్రాసు, 1972.

38. సోమన, పాల్కురికి - పండితారాధ్య చరిత్ర, ఆంధ్ర గ్రంథమాల, ఆంధ్రపత్రిక ముద్రశాల, చెన్నపురి, 1939.

39. సోమన, పాల్కురికి- బసవపురాణం, సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1969.

## నిఘంటువులు - విజ్ఞాన సర్వస్వాలు :

1. కృష్ణారావు, వై. వి. అండ్ బలరామమూర్తి, ఏటుకూరి(సంపా)-ఆంధ్ర ప్రదేశ్ దర్శిని, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1976.

2. నరసింహారావు, బి. వి. (సంపా.) - సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము, సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశసమితి, హైదరాబాదు, 1961.

3. నరోత్తమరెడ్డి, యన్. (సంపా.) - విజ్ఞాన దీపిక, ఆంప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1976.

4. బాపినీడు, మాగంటి (సంపా.) - ఆంధ్ర సర్వస్వము, కొండపల్లి వీర వెంకయ్య అండ్ సన్స్, రాజమండ్రి, 1961.

5. రంగాచార్యులు, చెలమచర్ల - ఆంధ్రశబ్ద రత్నాకరము, వెంకట్రామ అండ్‌కో, మద్రాసు, ప్ర. సం., 1966, ద్వి. సం., 1970, తృ. సం., 1970.

6. రామయ్య పంతులు, జయంతి - సూర్యరాయాంధ్ర నిఘంటువు, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ, ప్ర. సం., 1936, ద్వి. సం., 1939.

7. లక్ష్మీనారాయణ శాస్త్రి, వేదము - లఘుశబ్దార్థ చంద్రిక, వావిళ్ళ., చెన్న పురి, 1950.

8. లక్ష్మీపతి శాస్త్రి, శ్రీపాద & వేంకటేశ్వరులు, బలుసు - వావిళ్ళ నిఘంటువు, వావిళ్ళ., మద్రాసు, ప్ర.సం., 1949, ద్వి.సం., 1951, తృ. సం., 1953.

9. లక్ష్మీరంజనం, ఖండవల్లి (సంపా.) ఆంధ్రదేశ చరిత్రభూగోళ సర్వస్వం, ఆంధ్ర రచయితల సంఘం, హైదరాబాదు, ప్ర.సం., 1971.

10. వెంకటేశ్వరరావు, నార్ల - పదబంధ పారిజాతము, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, ప్ర.సం., 1959, ద్వి సం., 1961.

11 వేంకటశాస్త్రి, ముసునూరి - విద్యార్థి కల్పతరువు, వేంకట్రామ అండ్ కో, మద్రాసు, 1964.

12. వేంకటాచార్యులు, మామిడి - ఆంధ్రదీపిక. శ్రీ వాసవి గ్రంథ ప్రచురణ సమితి, మచిలీపట్టణం, 1965.

13. శ్యామల కామశాస్త్రి, కొట్ర - ఆంధ్ర వాచస్పత్యము, ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ మద్రాసు, మూడు సంపుటాలు, 1959.

14. శ్రీరామచంద్రుడు, పుల్లెల & లక్ష్మణశాస్త్రి, కప్పగంతుల (సంపా.) ఆంధ్ర సంస్కృత కోశము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1971.

15. సీతారామాచార్యులు, బహుజనపల్లి - శబ్ద రత్నాకరము, చెన్నపట్టణపు దేశ భాషా గ్రంథకరణ సభ, మద్రాసు, 1963.

16. సుబ్బరాయడు, మహాకాళి - శబ్దార్థ చంద్రిక, వావిళ్ళ., మద్రాసు, 1969.

17. సోమశేఖర శర్మ, మల్లంపల్లి (సంపా.) - విజ్ఞాన సర్వస్వం, తెలుగు భాషాసమితి, మద్రాసు, తృ.సం., 1959, చ సం., 1961.

## వ్యాసాలు :

1. కోదండ రామయ్య, తిమ్మావఝ్ఝల - బసవ పురాణంలో జానపద కళా ధర్మములు, భారతి, అక్టోబరు, 1976.

2. గంగప్ప, యస్ - జానపద సాహిత్య సంపద - కోలాటం పాటలు, భారతి, మార్చి, 1977.

3. రా. కృ. చక్రవర్తి - కోలాట, భారతి, డిసెంబరు, 1951.

4. రాజేశం గౌడ్, నాగుల - కరీంనగర్ జిల్లా పల్లెపట్టులందు కోలాటం వేడుకలు, స్రవంతి, మే, 1978.

5. రామకృష్ణ, నటరాజ - జానపద నృత్యాలు, నాట్యకళ, ఫిబ్రవరి - మార్చి, 1970.

6. రామానుజాచార్యులు, శేషం - జానపద గాయకులు - పంజాబు, నాట్యకళ, ఫిబ్రవరి - మార్చి, 1970

7. వెంకటరావు, కవికొండల - ఆంధ్రదేశపు జానపద గీతములు, భారతి, నవంబరు, 1948.

8. సీతాదేవి, వింజమూరి - జానపద సంగీతం - గేయం, నాట్యకళ, ఫిబ్రవరి - మార్చి, 1970.

## సంస్కృత గ్రంథాలు :

1. జాయపసేనాపతి - నృత్తరత్నావళి, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ (తెలుగు సేత), ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి హైదరాబాదు, 1969.

2. దండి - కావ్యాదర్శమ్, శ్రీ రామచంద్ర మిశ్ర (వ్యాఖ్యాత), చౌఖాంబ విద్యాభవన్, వారణాసి, 1958

3. రఘువీర (సంపా.) - మహాభారతమ్, విరాట., భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, పూనా, 1936.

4. రాజారాధాకాంత దేవబహదూర్ (సంపా.)-శబ్ద కల్పద్రుమమ్, మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ, 1961.

5. విద్యానాథ - సాహిత్యదర్పణమ్, సత్యవ్రతసింగ్ (హిందీ వ్యాఖ్యాత), చౌఖాంబ విద్యాభవన్, వారణాసి, 1970.

6. శారదాతనయ - భావప్రకాశమ్, మాధవరామశర్మ, జమ్మల మడక (తెలుగు సేత), ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, హైదరాబాదు, 1973.

## కన్నడ గ్రంథాలు :

వసంతకుమార్, మళలి - కోలుపదగళు, మైసూరు ప్రింటింగ్ అండ్ పబ్లిషింగ్ హౌస్, మైసూరు, ద్వితీయ ముద్రణ., 1978.

# English Books :


1. Children's Britanica, Vol-4, Encyclopedia of Britanica Ltd., London, 1961.
2. David L Sills — International Encyclopedia of the Social Sciences, The Macmillan Company & Free Press, Md in U. S. A., 1968.
3. Durga Bhagwat — An out line of Indian Folklore, First Edition, Popular Book Depot, Bombay-7, 1958.
4. Encyclopedia of Asiatic, Vol-III, Cosmo Publications, New Delhi, 1976.
5. Encyclopedia of India, S Chand & Co. (pvt ) Ltd., Ramnagar, New Delhi, 1975.
6. Guntur District Census, Hand Book, Village & Town Directory, Andhra Pradesh Census - 1961, Govt. of Andhra Pradesh, 1973.
7. History & Culture of the Indian People, Vol-III, [The Classical Age], Bharatiya Vidhya Bhavan, Bombay, 1954.
8 Imperial Gazetteer of India, Today & Tomarrow's printers & Publishers, 22-B/5, Original Road, New Delhi.
9 The International WEBSTER New Encyclopedic Dictionary of the English Language, The English Language Institute of America, Inc., 1727, South Indian Avenue, Chicago, 1973.
10 James Hastings (Edi ) — Encyclopedia of Religion and Ethics, T & T. Clark, Edinburgh, 38, George Street, Charles Seribner's Sons, Newyark, 1974.
11. Jawaharlal Handoo — Current Trends in Folk lore, Institute of Kannada Studies, University of Mysore, University Press Mysore - 12, First Edition, 1978.

12. Kameswara Rao, V. — Select Vijayanagar Temples o Rayalaseema, Govt. of Andhra Pradesh, Hyderabad, 1976

13. Kapila Vastyan — The traditions of Indian Folk Dance Indian Book Co., New Delhi, 1977.

14. Krishna Murthy, N. S. — Andhra Dance Sculpture Andhra Pradesh Sangeetha Nataka Akademy & Andhra Pradesh Lalitakala Akademy, Hyderabad 1975.

15. Mariappa Bhat, M. — Kittel's Kannada-English Dictionary, University of Madras, Madras, Second Edition, 1968

16 Mariappa Bhat, M (General Editor) & Khanker Kedilaya, A. — Tulu-English Dictionary, University of Madras, Rathnam Press, Madras, 1967.

17. Maurizio Taddei (Text) — Monuments of Civilisation India, Cassell, London, 1977

18. Monier Monier Williams — Sanskrit-English Dictionary, Oxford University, Oxford, 1964

19. The New Encyclopedia of Britanica, University of Chicago, U. S A, Fifteenth Edition, 1977.

20. Oxford English Dictionary, Clarendon Press, Oxford, 1961.

21 Brown, Charles Philip — Brownya English-Telugu Dictionary, Andhra Pradesh Sahitya Akademy, Hyderabad, 1974

22 Rajendra Prasad, B — Temple Sculpture of Andhra Pradesh, Govt. of A. P., Hyderabad, 1978

23. Rama Rao, M. — Eastern Calukyan Temples of A. P., A. P. Govt. Archiological Series No. 19, Govt. of A P., Hyderabad, 1964.

24. Rama Swami, N. S — Temples of Taadpatri, A P. Govt. Text Book Press Hyderabad, 1976

25. The Random House Dictionary of the English Language, The Unabridged Edition, Random House, Inc., New Yark, 1966.

26. Robert Sewel — The Forgotten Empire, Indian Book House, Hyderabad, 1970.

27. Sankaranarayana, P. — Telugu - English Dictionary, Vavilla, Madras, 1964.

28. Shyamchand Mukherjee — Folk lore museum, Indian Publication Folk Lore Series, Number Fourteen, Calcutta, 1969.

29. Vanam Shivaram Apte — The Students Sanskrit-English Dictionary, Motilal Banarasidas, Jawahar Nagar Road, Delhi, 1970.

30. Young Students Encyclopedia, FUNK & WAGNALLS, Inc., New yark, 1973.

| | |
|---|---|
| అను. | అనువాదం |
| అను., | అనుబంధం. |
| అ. సం. | అష్టమ సంపుటం. |
| ఆం. వా. | ఆంధ్ర వాచస్పత్యం. |
| ఆ. క. త. | ఆంధ్ర కవి తరంగిణి. |
| ఆ. దీ. | ఆంధ్ర దీపిక. |
| ఆ. ప్ర. ద. | ఆంధ్రప్రదేశ్ దర్శిని. |
| ఆ. శ. ర. | ఆంధ్ర శబ్ద రత్నాకరం. |
| ఆ. సం. కో. | ఆంధ్ర సంస్కృత కోశం. |
| ఆ. స. | ఆంధ్ర సర్వస్వం. |
| కొ. వెం. | కొండం వెంకట నర్సయ్య. |
| చ. ము. | చతుర్థ ముద్రణ. |
| చ. సం. | చతుర్థ సంపుటం. |
| చూ. | చూడుము. |
| చూ., పు. | చూడుము, పుట. |
| చె. చె. | చెప్పాల చెన్నయ్య. |
| చౌ. దా. | చౌల నరసింహదాసు |
| జా. సీ. | జాష్టి సీతారామయ్య. |
| జూ. పొ. | జూపల్లి పొట్టెయ్య. |
| తృ. ము. | తృతీయ ముద్రణ. |
| తృ. సం. | తృతీయ సంపుటం. |
| తో. హ. | తోట హనుమయ్య. |
| ద్వి. ము. | ద్వితీయ ముద్రణ. |
| ద్వి. సం. | ద్వితీయ సంపుటం. |
| ది. భా. | ద్వితీయ భాగం. |

| | |
|---|---|
| నె. రా. | నెమలి రామలింగారెడ్డి. |
| ప. పా | పదబంధ పారిజాతం. |
| పరి. | పరిష్కర్త. |
| పం. సం. | పంచమ సంపుటం |
| పా. | పాట |
| పా. ని. | పాఠ నిర్ణేత. |
| ప్ర. ము | ప్రథమ ముద్రణ. |
| ప్ర. భా. | ప్రథమ భాగం. |
| ప్ర. సం | ప్రథమ సంపుటం. |
| భా. | భారతి |
| మ. బం. | మక్కెన బంగారయ్య |
| మం. రా. | మందపాటి రాములు. |
| ల. శ. | లఘు శబ్దార్థ చంద్రిక |
| వా ని | వావిళ్ళ నిఘంటువు |
| వి క. | విద్యార్థి కల్పతరువు. |
| వి దీ. | విజ్ఞాన దీపిక. |
| వి. స | విజ్ఞాన సర్వస్వం |
| శ. చ. | శబ్దార్థ చంద్రిక. |
| శ ర. | శబ్ద రత్నాకరం |
| శ్లో. | శ్లోకం |
| సంకలన | సంకలనం. |
| సం. వి కో. | సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము. |
| సంపా. | సంపాదకులు. |
| సం | సంపుటము. |
| సూ. ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు. |

# విషయసూచిక

# కోలాట స్వరూపం

జానపదుల సమస్త జీవితానుభూతుల్నీ, ఆచార విచారాల్నీ, ఆహార విహారాల్నీ నిండుగా, దండిగా ఎరుకపరిచేవి జానపదగేయాలు. ఇలాంటి గేయాలతో ముడిపడిఉన్న పల్లెటూరి ఆటల్లో కోలాటం ఒకటి. కోలాటం ఆట ఆడుతూ పాటలు పాడుతుంటారు. వయః భేదం లేకుండా అందరూ పాల్గొంటారు. పగలెల్లా పనిపాటులతో కాయకష్టం చేసి రాత్రుల్లో ఉత్సాహంతోను, ఉల్లాసంగాను ఆడే ఈ కోలాటం ఒకరకంగా వ్యాయామ క్రీడగానూ చెప్పవచ్చు. పగలెల్లా కాయకష్టమే అయినా ఉత్సాహాన్ని రెకెత్తించే ఈ ఆటలో పాల్గొని అలసిపోయి సొక్కుతూ, సోలుతూ రెగ గస పెడుతూ, చెమటలు కక్కుతూన్నప్పుడు ఆట గాళ్ళు పొందే ఆనందం అంతా యింతా కాదు. ఉత్సాహంతో ఆకర్షితులై ఉల్లాసంగా ఆడడం, ఆనందించడం ఇది ముఖ్యంగాని ఇందులో పాల్గొనడం వ్యాయామం కోసం కాదు. పగటి కష్టాల్నిగాని, వంటి బాధల్నిగాని, ఇంటి బాధల్నిగాని పట్టించుకోక ఈ కోలాటం అనే ఉల్లాససముద్రాన్ని దరిజేరా ఈదుతారు జానపదులు. చూసేవారికి సైతం అందులో చేరి కాలుకదపాలనే అపేక్ష కలుగుతుంది. ఉల్లాసపరం, ఉత్సాహజనకం అయిన ఈ కోలాటం అంటే ఏమిటో పరిశీలిద్దాం.

నిర్వచనము :

కోలాట అనే పదానికి 'కోల + ఆట' అనేది వ్యుత్పత్తి. తమిళంలో 'కోల + ఆట్టం'[1]-కోలాట్టం అనేది వ్యుత్పత్తి దీనినుంచి కోలాటం అనే పదం ఏర్పడింది. దీనికి కోలన్న, కోలాటలు[2], కోలుకోలన్నలు, కొట్టిమాట అనేవి రూపాంతరాలు.

1. తెలుగు వ్యుత్పత్తి పదకోశం, 1-146
2. వ. పా. జా. 1-566.



కోల అంటే దండము[3], కట్టి,పుల్ల[4], అని అర్థాలు కట్టియ[5], పుడక[6], కర్ర అనేవి పర్యాయ పదాలు, 'ఆట' శబ్దానికి 'తాండవం, నటనం, నర్తనం, నృత్తం,నృత్యం, నాట్యం, లాస్యం'[7], క్రీడ, విహారం[8] అనేవి పర్యాయ పదాలు. కోలాటం అంటే చేతుల్లోని కోలలతో చేసే నృత్యం ఇంకా విపులంగా చెప్పాలంటే "రెండు చేతులతోను కర్రముక్కలు పట్టుకొని పదములు పాడుచు గుండ్రముగా తిరుగుచు లయానుగుణముగా అడుగులు వేయుచు ఒకరి చేతి కర్రముక్కలను వేరొకరి చేతి కర్రముక్కలతో తాకించుచు ఆడెడి ఒక ఆట."[9] దీని వ్యాప్తి ఆంధ్రదేశంలోని అన్ని సీమల్లో కనపడుతుంది. జన వ్యవహారంలో అధికంగా ప్రచారంలో ఉన్న బృంద నృత్యాల్లో ఈ కోలాటం ఒకటి,[10] అనే భావాన్ని, కోలాట లక్షణాల్ని తెలియజేశారు కృష్ణమూర్తిగారు కన్నడ-ఇంగ్లీషు నిఘంటువులో కోలాటం పిల్లల ఆటగా చెప్పబడింది.[11] తుళు - ఇంగ్లీషు నిఘంటువులో కోలాటం ఒక వర్గం

---

3. వా. ని., 2-817.
4. ఆ. శ. ర., 1-771
5. ఆ. సం. కో., 181.
6. సూ. ని., 2-562.
7. వి. క., పర్యాయ., 100.
8. శ. దీ., 328
9. ఆ. శ. ర, 1-772.
10. "One of the popular interesting group dances is Koolaatam. Small stick-lets are handled and waved in a graceful manner, to produce the timing sounds, harmonising with the steps, agreeing to time beats and the whole group moving in an un-ending chain. The whole cadence is aesthetically fine Geometric formations can be marked during the movement."
Andhra Dance Sculpture, p 275.
11. "A play, especially of children, at which they make alternate motions and strike mutually small sticks in each other's hands."
Kittel - English Dictionary, p. 637.

నృత్యంగా పేర్కొనబడింది[12]. అయితే ఈ ఆట ఇదే మాటతో దక్షిణ భారత దేశంలో కన్నడ, తుళు, తమిళ, మలయాళ భాషా ప్రాంతాల్లోకూడా ప్రచురంగా ప్రచారంలో ఉన్నట్లు కన్పిస్తుంది. కోలాటం తమిళనాడు, కేరళలలోని జానపద నృత్యం అని Encyclopedia of India[13] లో చెప్పబడింది. కోలుపదగళు అనే పుస్తకంలో కర్నాటక, కేరళ, తమిళనాడులో కోలాటం ప్రస్తావన పేర్కొన బడింది[14]. నృత్త రత్నావళిలో కోలాటానికి నామ సాదృశ్యంతో మరొక నృత్యం ఉంది. దాన్ని 'కోల్లాట నర్తనం' అంటారు. దానికి జాయప సేనాపతి తన నృత్త రత్నావళిలో లక్షణాలు వివరించాడు. ఆ కోల్లాట నృత్యం కోలాటానికి పూర్తిగా విరుద్ధం. పేరులో మాత్రమే పోలిక ఉంది. జాయప చెప్పిన కోల్లాటనర్తనం లక్షణాలు ఇట్లా ఉన్నాయి :

"కాహలైర్మార్గ పటహైః కాంస్యతాల సమన్వితైః
మర్దలైః జయ ఘంటాభిః భేరీభిస్తంబ కైరపి॥
వాద్యమానేషు వాద్యేషు వాదకైర్భావ్యమద్భుతమ్
వరత్రాగమనైశ్చిత్రైః కరణైః రంచితాదిభిః ॥
ప్రాంశోరుపరి వంశస్య భ్రమరైరతి దుష్కరైః
ప్రాణసందేహ కరణైః శస్త్రధారాగ్ర వంచనైః ॥
మనుష్య దుర్వహైర్భారైః మృదంగ పరివర్తనైః
ఉచ్చైః ఖగవదుడ్డీనైః శస్త్రాణాం చాలనాదిభిః
యత్ర నృత్యంతి కోల్లాట స్తత్స్యాత్ కోల్లాట నర్తనమ్ ॥[15]

---

12. "A Kind of community dance done with beating of sticks".

Tulu - English Dictionary, p 82.

13. [Koolaatam :- Folk dance of Kerala and Tamilnadu is performed by young women of festive occations or to amuse themselves. It is also called the stick dance].

Encyclopedia of India, p. 303.

14. కోలుపదగళు, పు. 12.
15. నృత్తరత్నావళి, 7.అ., 149-152 శ్లో.

ఈ కోల్లాట నర్తనంలో బాకాలు, మార్గపటహాలు, కంచు తాళాలు, మద్దెలలు, జేగంటలు, భేరులు, తప్పెటలు దివ్యంగా, అద్భుతంగా వాద్యాలవాళ్లు వాయిస్తుండాలి అపుడు కోల్లాటవారు ఆటకు దిగుతారు. వీరు దొమ్మరవారు.[16] వీరు అంచితం మొదలైన కరణాలతో వింతవింతగ తోలుపగ్గాల మీద నడుస్తూ, పొడవైన వెదురుగడమీద చాలా దుష్కరాలైన భ్రమరాలు చేస్తూ ప్రాణసందేహం కలిగేటట్లు ఆయుధాల వాదరలనుంచి తప్పుకొంటూ, మనుష్యులు మోయలేని బరువులు మృదువైన అంగాలమీద పెట్టుకొంటూ, పక్షులవలె ఎత్తుగా ఎగురుతూ, కత్తులు మొదలయిన శస్త్రాలు తిప్పడంవంటి పనులు చేస్తూ నర్తించడం జాయప నిర్ణయించిన తీరు గమనించ దగింది.

జాయప సేనాపతి పేర్కొన్న కోల్లాటం తెలుగువారి ఈ కోలాటానికి భిన్నమైందయినా బహుశః నామసాదృశ్యం కారణంగా దేశీయమైన నృత్తభేదమే కావడంవల్ల తెలుగునాట కోలాటంగా వ్యవహృతమైందని ఊహించడానికి వీలుంది. అంటే వెదురు కోల ఊతగా త్రాటిమీద ఆడే ఆట కాబట్టి ఇది కూడా కోలాటమే కాని మన చర్చలోని కోలాటంకంటె భిన్నం.

ఒక దేశి నృత్యం మార్గగానో, మార్గ నృత్యం దేశిగానో మారడానికి వీలుందని చూపిస్తూ జాయప సేనాని చెప్పిన మార్గ-దేశి లక్షణాలు, అవి ఏర్పడే తీరుతెన్నులు చూస్తే కుతూహల జనకంగా గోచరిస్తున్నాయి.

> "భవంతి ధరణీపాలాః ప్రాయేణాభినయ (వ?) ప్రియాః
> అతస్త ప్రీతయేఽద్యాపి యద్య దుత్పాద్యతేనవమ్
> నృత్తం తతః స్మృతం దేశీ తత్తద్దేశానుసారతః॥

16. "దొమ్మరవారు :- డోంబలనువారు తక్కువ జాతివారు. చాలా ప్రాచీన కాలం నుండియు వీరికి నాట్య - నృత్య గానములు వృత్తి ఉపరూపకము లలో 'డోంబి' అను విశిష్టరచన పూర్వముండినది. వీరే దొమ్మరివారు. కన్నడమున వీరికే 'కొల్లటిగ' అను మారుపేరును గలదు. కొల్లలాడు - కొల్ల మున్నగు తెలుగు పదములకు ఈ 'కోల్లాటము'తో సంబంధమేమైనా కలదేమో"నని శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు నృత్తరత్నావళి తెలుగు వ్యాఖ్యలో రాశారు.

భూతం శాస్త్రముఖాద్జ్ఞేయం భవిష్యన్నావగమ్యతే
భవన్నిరూపణీయం స్యాత్‌నృత్తందేశీతి సంజ్ఞితమ్"॥[17]

శాస్త్రానుగుణాలయిన వాటిని మార్గభేదాలనీ, అట్లా కాకుండా ఇంకా శాస్త్ర బద్ధంకాని ఆయాదేశాల్లో వెలసిన వాటిని దేశిభేదాలని చెబుతున్నారు. రాజులకు ప్రాయికంగా కొత్త విషయాలలో ప్రీతి ఉంటుంది. వారి ప్రీతికోసం కొత్తగా ఏ నృత్తం కల్పించబడుతుందో అది ఆయా దేశాలననుసరించేదికాబట్టి దేశి అంటా రని జాయప సేనాని దేశి నిర్వచనం. భూతకాలికమైన దేశినృత్తం శాస్త్ర ప్రమా ణాన్ని పొందుతుంది. భవిష్యద్విషయాలు తెలపడానికి అవకాశంలేదు. కాబట్టి తన కాలంలో ఉన్నట్టి దేశిబేదాల్ని మాత్రమే తెలిపినట్లు జాయపసేనాని చెప్పిన అంశం గమనించదగి ఉంది. కాని లక్షణం నిర్దేశించినంత మాత్రాన జానపద క్రీడలు అన్నీ మార్గబేదాలుగా మార్పునందవు.

'కోలన్న, కోలు కోలన్నలు' అనే పదాలు పాటల్లో ప్రచురంగా రావడం చేత కోలాటానికి అవి పేరుగా నిలబడి ఉన్నాయి.

కోలాటంలో ఒక్కొక్క ఆటగానికి రెండేసి చొప్పున కర్రలుంటాయి. చాల మంది ఆటగాళ్ళు కోలాటంలో పాల్గొంటారు. వీరందరి దగ్గర కర్రలు కలిపితే అధిక సంఖ్యలో ఉంటాయి. కాబట్టి ఈ యాటకు 'కోలాటలు' అన్న పేరు వచ్చి ఉండవచ్చు. ఈ పదానికి ప్రచారం అంతగా లేదు.

పెద్ద పెద్ద కొట్టాల (పశుశాల)లో కోలాటం వేస్తారు కాబట్టి 'కొట్టమాట' అనే పేరు వచ్చి ఉండవచ్చు ఈ పదం వ్యవహారంలో చాల తక్కువ.

కోలాటం అనే పదానికి కొట్టం,[18] దండనర్తనం,[19] దండరాసకం,[20] దండలాసకం,[21] దండలాస్యం,[22] వేష్టితం,[23] హల్లీసకం[24] అనేవి పర్యాయ

17 నృత్తరత్నావళి, 5. అ, 3. 4 శ్లో.
18. ఆ. సం. కో., పు. 181.
19. జానపద కళా సంపద, పు 6.
20. నృత్త రత్నావళి, 7. అ., 101-104 శ్లో.
21. సూ. ని., 4-206.
22. పైది, 4-206.
23. శ. చ., 1178; శ. దీ, 1253.
24. సూ. ని., 2-564.

పదాలు. ఒక్కొక్క దాని వ్యుత్పత్తి పద వ్యాప్తుల్ని ఇట్లా పరిశీలించ వచ్చు :

**కోట్టం :**

గోష్ఠమ్ అనే సంస్కృత శబ్దానికి గొట్టం అనేది ప్రాకృత రూపం. దీని నుంచి ఏర్పడింది కొట్టము. కొట్టాము అనేది రూపాంతరం. దీనికి పశుశాల, శాల, చావడి అనే అర్థాలున్నాయి [25] చావడి, పశుశాలల్ని కొట్టాలు అంటారు. ఈ పశుశాలల్లో వేసేది కాబట్టి కొట్టమాట అన్నట్లుగానే కొట్టం అని పేరు పడి ఉండవచ్చు. ఈ పదం వ్యవహారంలో లేదు. ఒక్క ఆంధ్ర సంస్కృత కోశం లోనే కోలాటానికి పర్యాయ పదంగా కొట్టం అనే పదం కన్పిస్తుంది.

**దండ నర్తనం :**

దండం అంటే పుల్ల, కోల, కర్ర అనే అర్థాలున్నాయి. నర్తనం అంటే ఆట, నృత్యం అనే అర్థాలున్నాయి. దండ నర్తనం అనే పదం కర్రలతో ఆడే ఆట అనే అర్థాన్నిస్తుంది. ఈ పదం నిఘంటువుల్లోకానీ, సాహిత్యంలోకానీ కన్పించదు. ఈ పద ప్రచారం లోక వ్యవహారంలో మాత్రమే ఉంది.[26]

**దండ రాసకం :**

దండం అనే శబ్దానికి కర్ర అని అర్థం.[27] ఇది సంస్కృత శబ్దం, రాసకం అనేది సంస్కృత శబ్దం. రెండూ విశేష్యాలే. రాసశబ్దే+భావి అధి కరణేవా 'ఘఙ్' అనేది శబ్దం.[28] హల్లీశంటే తాళబంధవిశేషయుక్తమైతే రాసక మని ప్రేమచంద్ర శర్మ పేర్కొన్నాడు [29]

---

25. పైది, 2-409.
26. జానపద కళా సంపద, పు. 6.
27. ఆ. శ. ర., 2-258.
28. శ. క., 4-158
29. "హల్లీశమేవ తాళబంధ విశేష యుక్తం
రాస కమితి ప్రేమచంద్ర శర్మాణం."
కావ్యాదర్శం, ప్రకాశ-హిందీ-సంస్కృత వ్యాఖ్య, పు. 34.

రాసకాన్ని గూర్చి భావప్రకాశంలో—

"మండలేన తు యన్నృత్తం తద్రాసకమితి స్మృతం
ఏక కర్తస్య నేతాస్యాద్గోపస్త్రీణాం యథాహరిః॥
అనేక నర్తకీ యోజ్యం చిత్రతాల లయాన్వితం
ఆచతుష్షష్టి యుగలాద్రాసకం మసృణోద్ధతమ్॥"[30]

అంటే మండలాకారాన నృత్తం చేయడాన్ని రాసకం అంటారు. గోప స్త్రీలకు హరి ఒక్కడే నాయకుడయినట్లు రాసకాన ఒక్కడే నాయకుడు ఉంటాడు. రాసకం అనేక నర్తకీయోజ్యమవుతుంది చిత్రతాల లయాన్వితం అవుతుంది. మసృణం ఉద్ధతంగా ఉండే ఈ రాసకం చతుష్షష్టి పర్యంతం నర్తకీ గణాన ప్రయోజ్యమవుతుంది.

రాసకానికి జాయపసేనాని చెప్పిన లక్షణాలు ఇట్లా కన్పిస్తాయి:

"బంధం పిండ్యాది మాశ్రిత్యయస్మిన్ షోడశనాయికాః
నృత్యంతి ద్వాదశాష్టౌవారాసకం తత్ ప్రకీర్తితమ్॥
పిండీ శృంఖలికా భేద్యలతా బేదాత్ చతుర్విధః
అభ్యధాయి బుధైర్బంధః; తత్రపిండీతు పిండనాత్॥
గుంఫనాత్ శృంఖలా, భేద్యో బేదనాత్; జాలవత్‌లతా
ప్రత్యేకం బహుబేదాః స్యుః ప్రౌఢైస్తై నర్తకైః కృతాః।
షోడశైవ పరం తత్ర యత్తాబిర్బంధ పూర్ణతా
చేల మర్ధోదుకం యద్వాకా (కూ?)ర్పాసం కంచుకంతదా
ధమ్మిల్లం వేణికాం వాపి తత్తద్దేశాను సారతః॥
దధానాః సుభగం వేషం క్వణన్మంజీర కంకణమ్
యౌవనం చ మనోహారి పీవరోరు కటిస్తనమ్
వాద్యేన ద్వంద శస్తుల్యా చారీ ప్రభృతయః క్రమాత్
రంగం యవనికా గర్భాక్ విశేయుః పార్శ్వయోరిమాః
చర్చర్యాది ప్రబంధేషు దేశీ సూడస్థితేషుచ
వాద్యేషు చ ప్రయుక్తేషు సదృక్షేషు విచక్షణైః॥

30. భావప్రకాశం, 9, అ., 120, 121. శ్లో.

ఖండమండల చారీభిః లాస్యాంగ ప్రముఖైరపి
కుర్వత్యః ప్రస్తుతై రంగగైః గీతార్థాభినయం సమమ్
ప్రవేశైర్నిర్గమైః సంధిహీనై రప్య పసారణైః
ఛోటికా భిర్మిథోహస్త తాలికాభిః లయానుగమ్
బంధురై ర్వివిధైర్బంధైః నృత్యేయు రిహనాయికాః।।''[31]

అంటే పింది మొదలయిన బంధాలను, కట్టుబాట్లను - ఆశ్రయించి నాయికలు పదహారు మందిగాని, పన్నెండు మందిగాని, ఎనిమిది మందిగాని చేసే నృత్యం రాసకం అనబడుతుంది. పిండి, శృంఖలిక, బేద్యము, లత-ఇట్లా బంధము నాల్గు తెగలని బుధులు చెప్తారు అందులో పిడుచులాగా గుంపుగా గూడడం పిండి. సరంలాగా గూర్చడం శృంఖల, వేరుగా విడివడి ఉండడం బేద్యం, వలలాగా ఏర్పడడం లత. ప్రౌఢులైన నర్తకులు వీటిలో ఒక్కొక్కదాన్ని అనేక భేదాలుగా చేస్తారు పదహారు సంఖ్యతోటే బంధం పూర్ణమవుతుంది కాబట్టి నాట్య గత్తెలు పదహారుగురే ఉండాలి ఆయా దేశ పద్ధతుల్ని అనుసరించి నాట్యగత్తెలు చీర, చల్లడం, కుబుసం, రవిక, కొప్పు, జడ మొదలయిన వాటిని తాల్చవచ్చు. చేతి కడియాలు, కాలందెలు ఉండాలి. ఊరు, కటి, స్తనాలు మొదలయిన అవయవాలు లావుగా ఉండే మనోహరమైన ప్రాయంలో ఉన్నవాళ్ళు కావాలి. వీళ్ళు క్రమంగా జంటలు జంటలుగా, వాద్యంతో సరిగా చారి మొదలయిన వాటితో తెరలో నుంచి రంగస్థలానికి ఇరుప్రక్కల నుంచి రావాలి. చర్చరి మొదలయిన ప్రబంధాల్ని, దేశి సూడలో ఉన్న వాటిని పాడుతుంటే నేర్పరులు తగిన వాద్యాల్ని వాయించాలి.

ఖండాలతోటి, మండలాలతోటి, చారులతోటి, ప్రస్తావంలోని అంగాలతోటి పాట అర్థాన్ని సమంగా అభినయిస్తూ, ప్రవేశిస్తూ, వెళ్లిపోతూ, సందులేకుండా తొలగుతూ, లయకు సరిగా చిటుకులువేస్తూ ఒకరొకరి చేతులమీద తాళం తడుతూ పలువిధాలయిన నిండుబంధాలతో నర్తించాలి.

సాహిత్యదర్పణంలో పద్దెనిమిది ఉపరూపకాల్లో ఒకటిగా పేర్కొనబడిన రాసకం లక్షణాలు ఇవి:

---

31. నృత్త రత్నావళి, 7 అ, 84-89; 93-97, శ్లో.

"రాసకం పఞ్చపాత్రం స్యాన్ముఖ నిర్వహణాన్వితం
భాషా విభాషా భూయిష్టం భారతీ కైశికీయుతం॥
అసూత్రధారమే కాఙ్కం సవీథ్యఙ్గం కలాన్వితమ్
శ్లిష్టనాందీయుతమ్ ఖ్యాతనాయికం మూర్ఖనాయకం॥
ఉదాత్తభావ విన్యాస సంశ్రితంచోత్తరోత్తరమ్
ఇహ ప్రతిముఖమ్ సంధిమపికేచిత్ప్రచక్షతే॥"[32]

రాసకం అనేది ఉపరూపకబేదం. దీంట్లో ఐదు పాత్రలుంటాయి. ముఖం, నిర్వహణం, అనే నాటకసంధులు రెండు ఉంటాయి. సూత్రధారుడు ఉండడు. ఒకటే అంకం. వీధి అనే ఉప రూపకంలోని అంగాలన్నీ దీనిలో ఉంటాయి. ఇది నృత్యం, గీతం మొదలయిన కళలతో కూడి ఉంటుంది. నాందీగీతం శ్లిష్టమై ఉంటుంది. నాయకుడు ప్రసిద్ధుడూ, మూర్ఖుడై ఉంటాడు. ఉదాత్తమైన భావ విన్యాసంతో కూడి ఉత్తరోత్తర రసస్యందిగా ఈ ఉపరూపకం విలసిల్లుతుంది. దీనిలో ప్రతిముఖసంధికూడా ఉందని కొందరంటారు. రాసకానికి గోపాలుర క్రీడావిశేషం అని మేదినీ నిఘంటువు అర్థం చెబుతున్నది.[33]

మొత్తంమీద రాసకం అంటే నృత్తం అనే అర్థంతో తీసుకుంటే దండ రాసకం అంటే కర్రతో చేసే నృత్యం అని తేలుతుంది. ఈ దండరాసకం పార్శ్వదేవుని సంగీతసమయసార సంగ్రహంలో కొద్దిగా వివరించబడింది. జాయపసేనాని తన నృత్త రత్నావళిలో సవివరంగా తెల్పిన దండరాసక లక్షణాలివి :

"పాత్రాణ్యష్టౌ సమారభ్యవర్ధంతే దండరాసకే
క్రమాత్‌చత్వారి చత్వారి నాయకేచ్ఛానుసారతః
చతుష్షష్టిర్భవేద్యావత్ యావత్సాద్విగుణాపరైః
అరత్ని సమ్మితౌ దైర్ఘ్యాత్ అంగుష్ఠపరిణాహినౌ॥
దండౌ కనక బద్ధాంతౌమదనాద్రిదుమోద్భవౌ
సువృత్తౌ మసృణౌ నానావర్ణకైశ్చారు చిత్రితౌ॥

---

32. సాహిత్యదర్పణం, 6. అ, 283-290, శ్లో.
33. శబ్ద కల్పద్రుమమ్, 4-158.

దధీరన్ పాణిపద్మాభ్యాం అథవా దండచామరే
క్షురికా దండకౌయ ద్వాత్ తద్దేశీయ పంగిభిః.''[34]

దండరాసకంలో ఎనిమిదిమంది మొదలు నాయకుని ఇష్టాన్ననుసరించి క్రమంగా నల్గురు నల్గురుగా అరవైనాలుగుదాకా ఆడేవాళ్ళ సంఖ్య పెంచవచ్చు. అయితే వారు రెండు రెండు సరిజట్లుగా ఏర్పడాలి

మన కోలాటంలోగూడ ప్రస్తుతం జట్టులో అరవైమ విదాకా ఉండొచ్చు. అయితే ఒకేజట్టు ఉంటుంది. ఉద్దులుగా ఏర్పడ్డ తర్వాత రెండు జట్లు అని చెప్ప వచ్చు.

రెండు చేతుల్లో రెండు కోలలు ధరించాలి. అవి ఒక్కొక్కటి చిటికెనవేలు సాచితే మూర పొడుగుండాలి. బొటనవేలు లావుండాలి. గుండ్రంగా వుండి రంగులు కల్గి ఉండాలి. నేటి కోలాటంలో కర్రలు ధరించడంలోనూ, పొడవు లావుల్లోనూ, రంగులు వేసి అలంకరణ చేయడంలోనూ జాయప వర్ణించిన కర్రల లక్షణాలకు సరిపోతుంది. జాయప సేనాని పొగడజాతి కర్రలు వాడుతారని తెలిపాడు నేడు వివిధ ప్రాంతాల్లో సులువుగా దొరికే కర్రజాతుల్నిబట్టి కర్రలు మారుతున్నాయి. కొన్ని ప్రాంతాల్లో బిల్లుడు, రేల, వేప, తుమ్మ లాంటివి వాడితే, మరికొన్ని ప్రాంతాల్లో సంద్ర, నర్లంగి, ఏపె లాంటివి వాడుతారు. ఈ కర్రల వాడుకను వివరిస్తూ 'ఆటగాళ్ళు రెండుచేతుల్లో రెండు కర్రలు వాడవచ్చు; లేకపోతే ఆ యా దేశ రీతుల్నిబట్టి ఒకచేత కోల, మరొకచేత చామరం లేక చురకత్తిని కూడా ధరించవచ్చు'— అనే జాయపసేనాని మాటలు ఒక చేత కోల మరొక చేత కొరడా లాంటివి వాడుతున్న నేటి కోలాటం జట్టు నాయకునికి వర్తిస్తాయి

ఈ దండరాసకం అడే తీరు కూడా లక్షణపరంగా కన్పిస్తుంది

"ఉక్తేషు వాద్యమానేషు చిత్ర బంధేషు వాదకైః
లాస్యాంగ భ్రమరీ పాదచారీ భిశ్చారు చంక్రమమ్॥

34. నృత్త రత్నావళి, 7. అ, 101-104, శ్లో.

సవ్యాపసవ్య తశ్చక్రభ్రాంత్యాఖండ ప్రయోగకైః
సుశబ్దం పంచ ఘాతైః కుర్వీరన్ దండలాసకమ్॥"[35]

పైన చెప్పిన చిత్ర బంధాలను వాదకులు వాయిస్తుంటే లాస్యాంగాలయిన భ్రమరాలు, పాదాలు, చారులు వీటితో అందమైన దాష్టలో ఎడమ కుడి పక్కల్లో చక్రంవంటి తిరుగుళ్ళతో, ఖండ ప్రయోగంతో ఉండి సుశబ్దాలయిన ఐదు ఘాతాలతో పరస్పరం కోలలు కలపాలని భావం. అయితే నేటి కోలాటంలోని రకరకాల కోపులు ఆయా కోపుల్లో తిరిగే పద్ధతికి ఇక్కడ పోలికలు కన్పిస్తాయి ఆనాటి గ్రామాల్లో పైనచెప్పిన అన్ని లక్షణాలు కన్పించే దండరాసకం ఆడేవారని ఊహించవచ్చు.

**దండలాసకం :**

దండం, లాసకం రెండూ కూడ సంస్కృత పదాలు. దండైః లాసః అత్ర-దండలాస + కప్-అనేది వ్యుత్పత్తి.[36] దండం అంటే కర్ర అని అర్థం.[37] లాసకం అంటే నృత్యం, నాట్యం అనే అర్థాలున్నాయి.[38] దండలాసకం అంటే "కర్రపుల్లలు పట్టుకొని లాకించుచు చేయు నృత్యము"[39] అని అర్థం దీనికే కోలాటం అని అర్థం ఉంది.[40] దండలాసం అనే వేరొక పదం కన్పిస్తుంది. లాసం అంటే కూడా నృత్యం, నాట్యం అనే అర్థాలున్నాయి.[41] ఈ దండలాసం అనే పదం దండలాసకం అనే పదానికి రూపాంతరం. దండలాస్యం అనే మరొక పదం కన్పిస్తుంద లాస్యం అంటే "నృత్యము, నృత్యము చేయుట; గీత వాద్యాలతో కూడిన నృత్యము, అభినయము చేతను ముఖ ప్రఖరిచేతను కామ వికారములను

35. పైది, 7. అ., 105, 106., శ్లో
36. ఆ. శ. ర., 2-256.
37. సూ. ని., 4-170.
38. పైది, 6-940.
39. ఆ. శ. ర., 2-258.
40. సూ.ని., 4-206.
41. ఆ. శ. ర., 3-1652

తెలిపెడి నృత్యము" అనే అర్థాలున్నాయి [42] దండి తన కావ్యాదర్శంలో కావ్య భేదాలను వివరిస్తూ—

"లాస్యచ్ఛలిత శంపాది ప్రేక్షార్థమ్ ఇతరత్ పునః
శ్రావ్యమే వేతిసై షాఽపి ద్వయీ గతిరుదాహృతా.[43]"

అని లాస్యాన్ని దృశ్యభేదంగా పేర్కొన్నాడు. దండలాస్యానికి, దండ లాసకానికి ఒకే అర్థం ఇవ్వబడింది.[44] మొత్తం మీద దండలాసకం, దండలాసం, దండలాస్యం అనే మూడు పదాలకు అర్థం ఒకటే. ప్రాచీన సాహిత్యంలో ఈ పదాల ప్రయోగాలున్నాయి తప్ప ప్రస్తుతం వ్యవహారంలో కన్పించవు

**వేష్టితం :**

ఇది సంస్కృత శబ్దం. "పెక్కండ్రు స్త్రీలు మండలాకారముగ తిరుగుచు చేయు నృత్యం"[45] అని అర్థం వేష్టితం అంటే కొట్టిమాట, హాల్లీసకం అనే అర్థాలు మరొక నిఘంటువులో కన్పిస్తున్నాయి.[46] సూర్యరాయాంధ్ర నిఘంటువులో మాత్రం పై అర్థాలతో సంబంధాన్ని తెలిపే పదం ఒక్కటి కన్పించదు. కోలాటం అనే అర్థాన్నిచ్చే దృష్టితో వేష్టితం అనే పదం లోక వ్యవహారంలో గాని, సాహిత్యంలోగాని కన్పించదు

**హాల్లీసకం :**

హాల్లీసకం అనే పదం హల (= విలేఖనే) + క్విప్ —హల్ + లస + అచ్—కజ్—వృపో, శబ్దాల కలయికవల్ల ఏర్పడింది [47] హాల్లీసం అనే పదం

---

42. సూ.ని 6-941.
43. కావ్యాదర్శం, 1-39.
44 ఆ శ.ర , 3-258.
45. శ.దీ., 1253.
46. శ.చ., 1178.
47. ఆ.శ ర., 3-2315

దీని రూపాంతరం.[48] శబ్దకల్పద్రుమంలో 'హల్లీషం' శబ్దం సూచించబడింది. స్వార్థాన 'కన్' ప్రత్యయం చేర్చగా 'హల్లీషకం' అవుతుంది.[49] ఆలంకారికులు కొందరు 'హల్లీశ' శబ్దాన్ని వాడారు కాబట్టి ఈ మూడు ప్రయోగాల్లోని 'స-ష-శ' లకు అభేదత్వాన్ని గమనించడం అవసరం. అంటే 'హల్లీస-హల్లీష-హల్లీశ' పదాలకు అభేదత్వం చెప్పవచ్చు. హల్లీసకానికి లక్షణాలు చాలమంది పేర్కొన్నారు. వాటిలో కొన్ని ఇవి :

హల్లీసకాన్ని జటాధారుడు "స్త్రీణాం మండలికా నృత్యం" అనీ, హేమచంద్రుడు "మండలేనతు యన్నృత్యం స్త్రీణాం హల్లీషకం తు తత్" అనీ, పేర్కొన్నట్లు[50] శబ్దకల్పద్రుమంలో పేర్కొనబడింది. "ఒక పురుషుడు అనేక మంది స్త్రీలతో ఆడే ఆటగా"[51] సూర్యకాంత నిఘంటువులో పేర్కొనబడింది.[51] కావ్యాదర్శంలో కావ్యభేదాల్లో దృశ్య కావ్యాల్ని వివరిస్తూ దండి "లాస్యచ్ఛలిత శంపాది ప్రేక్షార్థమ్ ఇతరత్ పునః, శ్రావ్యమే వేతి సైషాఽపి ద్వయీ గతిరుదాహృతా"[52] అని చెప్పిన శ్లోకంలోని ఆది శబ్దంతో తాండవం, హల్లీసకం, రాసకం మొదలయినవి గ్రహించాలని వ్యాఖ్యాత ఆచార్య శ్రీరామ చంద్ర మిశ్ర పేర్కొన్నారు.[53] ఆయన హల్లీసక లక్షణాల్ని కూడా వివరించారు.

"మండలేన తుయత్ స్త్రీ ణాం నృత్యం హల్లీశ కంతుతత్
తత్ర నేతాభవే దేకో గోప స్త్రీ ణాయదాహరిః॥"

స్త్రీల వలయంతో చేయబడే నృత్యం హల్లీశకం. గోప స్త్రీలకు కృష్ణునివలె హల్లీశకంలో ఒక నాయకుడుంటాడు. హల్లీశకాన్నే తాళబంధ విశేష యుక్తమైతే

---

48. ల.శ.చం, 724.
49. శ.క., 5-525.
50. పైది, 5-525.
51. **SuryaKanta Sanskrit-Hindi - English Dictionary, p.** 688.
52. కావ్యాదర్శము, 1-39.
53. కావ్యాదర్శము, [ప్రకాశ సంస్కృత - హిందీ వ్యాఖ్య], పు. 34.

రాసకం అని హేమచంద్ర శర్మ పేర్కొన్నట్లు కావ్యాదర్శ సంస్కృత-హిందీ వ్యాఖ్యాత పేర్కొన్నారు.[54] ఆప్టే నిఘంటువులో హల్లీశం పద్దెనిమిది ఉప రూపకాల్లో ఒకటిగా చెప్పబడింది.[55] ఉప రూపక భేదంగా సాహిత్య దర్పణం తోను, భావ ప్రకాశంలోను చెప్పబడింది. సాహిత్యదర్పణంలో—

"హల్లీష ఏవ ఏకాంకః సప్తాష్టాదశ వా స్త్రియః
వాగు దాత్తైక పురుషః కైశికీ వృత్తి రుజ్జ్వలా
ముఖాంతిమౌ తథా సంధి బహుతాలలయ స్థితిః"[56]

అని చెప్పబడింది. అంటే ఇందులో ఒకే అంకం ఉంటుంది. ఏడు, ఎనిమిది లేక పదిమంది స్త్రీలు ఉంటారు. పురుషుడు మాత్రం ఒక్కడే ఉంటాడు ఉదాత్తమైన భాష ఉంటుంది. కైశికీ వృత్తి, మొదటి-చివరి సంధులు రెండితో కూడి అనేక తాళ లయాన్వితమై ఉంటుంది. భావ ప్రకాశంలో—

"అథ హల్లీసకం సప్త నవాష్టదశ నాయికం
సానుదాత్తోక్తి చైకాంకం కైశికీవృత్తి భూషితం
ఏకాంకం వా భవే ద్వ్యంకం విమర్శముఖ సంధిమత్॥
సగేయలాస్యం యతిమత్ఖండ తాలలయాన్వితమ్
ఏక విశ్రామ సహితం యథాస్యాత్కైరి రైవతమ్॥
లలితాం వక్షణాః ఖ్యాతాః నాయకాః పంచషా అపి
విప్ర క్షత్ర వణి క్ఛూద్రాస్స చివాయత్త సిద్ధయః
ద్వ్యంకే ముఖావమర్శౌ స్తః ఏకాంకీగర్భ నిర్గమః॥"[57]

54. పైది, పు. 35.

55. "One of the Eighteen Uparupakas or minor dramatic compositions (described as a piece in one act and consisting mainly of singing and dancing by one male and seven, eight or ten female performers "

The students Sanskrit-English Dictionary, p 637.

56. సాహిత్య దర్పణం, 6-306.

57. భావ ప్రకాశము, 9. అ., 125-127, శ్లో.

అని చెప్పబడింది. హల్లీసకం ఏడు, ఎనిమిది, తొమ్మిది లేక పదిమంది నాయి కలతో ఉంటుంది. ఉదాత్త వచనాలు ఉంటాయి. గేయ వాద్యం ఉంటుంది. యతి ఉంటుంది (యతి = ఒక విధమైన వాద్య రీతి) హల్లీసకం ఖండతాల లయాలతో కూడి ఉంటుంది. ఒక విశ్రామం ఉంటుంది. కేవల కైశికి మనేది హల్లీసకం. ధీర లలితులు, దక్షిణులు, ప్రఖ్యాతులు ఐన నాయకు లుపనాయకులు ఉంటారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య పుత్రులు సచివాయత్త సిద్ధులై ఇందులో కన్పిస్తారు. రెండంకాలవరకూ ఉండొచ్చు. ముఖ సంధి, విమర్శక సంధి అనే రెండు సంధులు ఉంటాయి

> "పృథుం సువృత్తం మసృణం వితస్తి
> మాత్రోన్నతం కౌవినిఖన్యశంకుకమ్
> ఆక్రమ్య పద్భ్యామితరే తరంతు
> హస్తైర్భ్రమోఽయం ఖలురాసగోష్ఠీ॥"[58]

పెద్దదిగా, గుండ్రంగా ఉండేటట్లు, నున్నగా ఉండేటట్లు పన్నెండు అంగుళాల పొడవుండేటట్లు ఒక పీల తయారుచేసి దానిని భూమిలో పాతి, పాదాలతో ఆక్రమించి ఒండొరుల్ని చేతులు పట్టుకొని దానిచుట్టూ తిరుగుతూ ఆడే ఆటను రాసగోష్ఠి అంటారని హరివంశటీకా వ్యాఖ్యాత నీలకంఠుని హల్లీశక లక్షణాలు శబ్ద కల్పద్రుమంలో ఉటంకించబడినాయి. సూర్యరాయాంధ్ర నిఘంటువులో హల్లీసకం పద్దెనిమిది ఉపరూపకాల్లో ఒకటిగా పేర్కొంటూ "స్త్రీలు పలువురుచేరి మండలాకారముగాఁ దిరుగుచు చేయు నృత్యము" అని నిఘంటుకర్త వివరించారు.[59] అయితే ఉపరూపకాల్లోను, నీలకంఠ వ్యాఖ్యానంలోను చెప్పబడిన హల్లీసక లక్షణాలు నేటి మనకోలాటంలో కన్పించవు. పైన చెప్పిన లక్షణాలనుంచి క్రమంగా మార్పుపొందుతూ వచ్చినరూపం కోలాటం లనేది అంగీకారయోగ్యం. హల్లీసకాన్ని పూర్వ ఆలంకారికులు ఉపరూపక భేదాల్లో చేర్చి లక్షణాలు నిర్దేశించి

---

58. శబ్ద కల్పద్రుమమ్, 5-525.
59. సూ. ని., 8-1213.

నప్పటికే, పైన పరిశీలించిన విషయాల ఫలితంగా హల్లీసకం అంటే కోలాటం అని ఆంధ్రభాషార్ణవ కర్త చెప్పినట్లు కోలాటం అనే పదానికి హల్లీసకం అనే పదం పర్యాయ పదం అని స్పష్టమవుతుంది.

కోలాటానికి ఇన్ని పర్యాయపదాలు, రూపాంతరాలు ఉన్నప్పటికీ కోలాటం పూర్తి పద్ధతికానీ, స్వరూపంకానీ అటు సాహిత్యంలోగానీ ఇటు నిఘంటువుల్లోకానీ కానరాదు. కోలాట స్వరూపాన్ని కొద్దో గొప్పో ప్రత్యక్షంగా చూసి తెలిసి కోవలసిందే.

## ప ద్ధ తి

కోలాటం అనగానే ముప్పై లేక నలభై మంది ఆటగాళ్లు, ఆటగాళ్ళంతా రెండు చేతుల్లో రెండు కర్రల్తో వలయంగానూ, ఒకచేతిలో కొరడా, రెండోచేతిలో భజన చెక్కలు, నోటిలో పీకతో గరిడి లోపలి భాగాన చుట్టూతిరుగుతూ ఉండే జట్టు నాయకుడు; గరిడీ మధ్యలో మద్దెల, ఆర్మోనియం, తాళాల్తో కొందరు వాద్యాలవాళ్ళు; ఘల్లు ఘల్లుమనే శబ్దంచేసే కాళ్ళ గజ్జెల శబ్దం; కణ్ కణ్ మనే శబ్దం చేసే కోలాట కర్రలు మొదలయినవన్నీ మన కళ్ళకు ప్రత్యక్ష దృశ్యాలు.

ప్రపంచంలోని ప్రతి దేశానికి, ప్రతి మతానికి, ప్రతి వస్తువుకు, చివరకు ప్రతి విషయానికి చరిత్ర ఉంది. అట్లాగే అన్ని ఆటలకు చరిత్ర ఉంది. ఆ కోవ లోనే కోలాటాన్ని పరిశీలిస్తే —

కొందరు ఆటగాళ్ళు జట్టుగా ఏర్పడి జట్టు నాయకుని ఆధీనంలో కోలాటాన్ని ఆడుతారు. జట్టు నాయకుని ఆజ్ఞమేరకు ఆటగాళ్ళంతా ముందుగ గరిడీలోకి వచ్చి వలయంగా ఏర్పడతారు. తర్వాత ప్రార్థన గేయం పాడుతారు సామాన్యంగా ప్రార్థన గేయంలో కోలాటం ఆడరు. వలయంగా నిల్చున్న ఆటగాళ్ళు ఇద్దరిద్దరు చొప్పున ఎదురెదురుగా నిల్చొని (ఒకే వలయంలో ఉండి) ఒకరి రెండు కర్రలను ఇద్దరూ చెరొకపక్క పట్టుకుంటారు. రెండోవాడు తన రెండు కర్రలు కలిపి ఒక చేత పట్టుకొని ఇద్దరు కలిసి పట్టుకున్న కర్రమీద పాటకనుకూలంగా, లయానుగుణంగా కొడుతుంటాడు. పాట పాడడం అయిపోయిన తర్వాత జట్టు నాయకుడు

"ఇట్టయ్యకుతద్ధిమి" అని చెప్పి పీక[60] ఊదుతాడు సామాన్యంగా జట్టులో ఆట గాళ్ళకు సగంమందికి రాముళ్ళని, మిగిలిన సగంమందికి లక్ష్మణులని పేర్లు పెడతారు. అప్పుడు రాముళ్లంతా లోపలి వలయంగాను, లక్ష్మణులంతా వెలుపలి వలయంగాను ఏర్పడతారు. ఇద్దరు కలసి పట్టుకున్న పుల్లలు విడివిడిగా చేతుల లోనికి తీసికొని కొట్టడంతో ఆట ప్రారంభం అవుతుంది. అపుడు జట్టునాయకుడు లయను సరిదిద్దుతాడు. కొన్ని ప్రాంతాల్లో "తాకా, తాకా, తాకా, తాకా, తాకా, తాకా, తాక, తయ్యకు తద్ధిమి" అనీ, మరికొన్ని ప్రాంతాల్లో "తకిట ధిమి ధింధిమిత ధిమిధిం - ఎంతమంచి గురుడుదొరికేనే" అనీ; కొందరు "లాలి, లాలి, లాలి, లాలి, లాలి, లిలాయ్, లో, లలీ, లాలి, లిలాయ్, లో, లలీ, లాలి, లిలాయ్, లో" అనీ; మరికొన్నిచోట్ల కొన్ని పాటల కనువుగా 'కోలు కోలు కోలే, కోలన్న కోలు కోలోయ్, కోలు కోలు కోలే, కోలన్న కోలు కోలోయ్' అని లయను సరిదిద్దు తారు.[61] ఇట్లా లయను సరిదిద్దిన తర్వాత ఒక పాటా, ఆ పాటతోపాటే కోపు మొదలుపెడతారు పాట అయిన తర్వాత ఆ కోపులోనే సంవాద గేయంతో ఉసెత్తులో ఆడుతారు. ఉసెత్తులో కొంతసేపు కోలాటమాడిన తర్వాత ఆటను, పాటను, 'ఇట్టయ్యకు తద్ధిమిత్త' అని జట్టు నాయకు డిచ్చిన ముక్తాయింపుతో నిలుపుచేస్తారు. తర్వాత మరొక పాటతో మరొక కోపును ఆడుతారు. ఇట్లా బాగా అలసిపోయేదాకా కొన్ని కోపులు ఆడి ఆరోజుకు కోలాటాన్ని ముగిస్తారు. ఇది కోలాటం స్థూలస్వరూపం. ఈ కోలాటం ఆడడానికి ఉపకరించే కొన్ని వస్తువులు, కోలాటంలోని సాంకేతిక పదజాలం, ఆటగాళ్ళకు సంబంధించిన వేషధారణ- అంటే జట్టు, గరిడి, ఉద్ది, జట్టునాయకుడు, కోపు, కర్రలు, కోలాట సమయాలు, కోలాటంలో చర్లే వస్తువులు మొదలయిన వాటిని గూర్చి పరిశీలన అవసరం.

---

60. పీక ఊదడం ఇటీవలి కాలంలో కన్పిస్తుంది. ఇది ఆట మొదలుపెట్టడానికి గాని, ఆడుతున్న ఆట వేగం పెంచడానికిగాని, ఆట విరమించడానికిగాని సంజ్ఞగా తీసుకుంటారు.

61. జానపద కళాసంపద, పు. 7.

**జట్టు :**

కోలాటం ఆడడానికి ఆటగాళ్ళంతా కలిసి ఒకచోట చేరుతారు. వీరందరిని కలిపి జట్టు అంటారు. జట్టు అంటే గుంపు లేక సమూహం అని అర్థం.[62] ఈ జట్టుకు ఆటగాళ్ళతోపాటు ఒక నాయకుడు అవసరం. అతన్ని జట్టునాయకుడు అంటారు. జట్టులోనివారు సరి సంఖ్యలో ఉండాలి. ఉద్దులుద్దులుగా ఏర్పడిన తర్వాత ఆటగాళ్ళు మిగలరాదు. బేసి సంఖ్యలో తీసుకుంటే ఒక సభ్యుడు మిగులుతాడు. జట్టు ఆటగాళ్ళంతా జట్టు నాయకునికి విధేయులు. జట్టు నాయకుడు ఆటగాళ్ళపై బాధ్యత వహిస్తాడు. ఇద్దరు ఆటగాళ్ళు కలిసి ఏర్పడిన సమూహాన్ని ఉద్దీ అంటారు గదా! జట్టులోని ఆటగాళ్ళంతా కోలాటం ఆడే సమయంలో ఉద్దులుగా ఏర్పడవలసిందే. జట్టు ఆటగాళ్ళ సామర్థ్యం, జట్టునాయకుని నైపుణ్యం మీద ఆధారపడి ఉంటుంది. ఆటగాళ్ళ మంచి చెడ్డలు చెప్పుకునేటప్పుడు జట్టు పేరుతోనే పరామర్శిస్తారు. ఫలానా ఊరి జట్టు బాగుంది అనే అంటారు కాని ఆటగాళ్ళ పేర్లు ప్రత్యేకంగా ప్రస్తావనకు రావు. పర్యాంత జట్టు నాయకుని పేరు ప్రస్తావనకు వస్తుంది. జట్టులో నేర్పరులు ఉన్నట్లయితే పేరు ప్రతిష్ఠలు జట్టు మొత్తానికి వస్తుంది. జట్టుకు ముఖ్యమైన వ్యక్తి జట్టు నాయకుడు.

**జట్టు నాయకుడు :**

జట్టు నాయకునే కోలన్న పంతులనీ, పెన్నుద్దీ, ముందు పాటగాడు, అయ్యవారు, మేళగాడు[63] అనే పేర్లతో పిలుస్తారు. జట్టు నాయకుని నైపుణ్యాన్ని బట్టి కోలాటం మెరుగులు దిద్దుకుంటుంది. జట్టు నాయకుని చెప్పుచేతల్లో ఆటగాళ్ళు కోలాటం ఆడుతారు. ఈతని సూచనలు, సలహాలు, సవరింపులతో ఆట వన్నెకెక్కుతుంది. గరిడి ఏర్పాటు చేయడానికి, ఆట ముగించడానికి జట్టు నాయకుని సంజ్ఞ మీద ఆటగాళ్ళు ఆధారపడి ఉంటారు. సమయనిర్ణయం, గరిడికి స్థల నిర్ణయాల్లో జట్టు నాయకునికి ప్రమేయం ఉంటుంది. ఆటలో తప్పటడుగులు వేసినవాళ్లనూ ఆట చెడిపోవడానికి కారణమయినవాళ్ళనూ మందలించడం లేక కొరడాతో కొట్టడం జట్టు నాయకుడిచ్చే శిక్షలు. ఆటను

---

62. తె.శ.ర., 1-1205.

63. జానపద కళా సంపద, పు. 6.

అంతరాయం కలిగేట్లు ఎక్కువసార్లు తప్పులుచేసే ఆటగాణ్ణి, అతనికి తోడుగా ఆట సరిగా రాని మరొకనిని కూడా ఆటనుంచి బహిష్కరిస్తాడు జట్టు నాయకుడు. ఆటగాళ్ళు కూడా నాయకుని మందలింపుకంటే తమవల్ల ఆట చెడినందుకు అవమానంతో బాధపడతారు. ఆటగాళ్ళందరూ జట్టు నాయకుని గురుభావంతోనే చూస్తారు. ఆటగాళ్ళు నాయకుని పాటను అనుసరించి పాడుతుంటారు. లయను సరిదిద్దడం, తాళానికనుగుణంగా కోలాటం ఆడించడం అతడు చేసేపనులు. ఉసెత్తులో దాదాపు సంవాద గేయం పాడుతారు. అపుడు మధ్యమధ్య పెద్దగా కేకలువేస్తూ, చంగు చంగున ఎగురుతూ ఆడేవాళ్ళకు ఉత్సాహపూరితమైన ఉత్తేజాన్ని, చూసేవాళ్ళకూ ఆనందాన్నీ పంచిపెడతాడు జట్టు నాయకుడు. ఒక ప్రదర్శనకు ఏడెనిమిది కోపులు వేయించి ఆటను ముగిస్తాడు. కొందరు జట్టునాయకులు కోలాటం నేర్పడం, జట్లు తయారుచేయడం తమ ముఖ్య వృత్తిగా గడుపుతారు కొందరు వేరే ముఖ్య వృత్తులు ఉన్నా ఉల్లాసానికీ, పేరు ప్రతిష్ఠల కోసమూ ఉపవృత్తిగా కోలాటాన్ని నేర్పడం స్వీకరిస్తారు. ఒక మారు నేర్చిన జట్టు ఎప్పుడయినా ఉల్లాసానికి కోలాటం వేయాలనుకుంటే జట్టులోని ఆటగాళ్ళనుంచే సమర్థుడైన ఒక ఆటగాణ్ణి జట్టునాయకునిగా ఎన్నుకుంటారు అంటే ఈ జట్టు నాయకుడుగా ఎన్నికైన వ్యక్తి పాటలు లయబద్ధంగా తాళం తెలిసినవాడే అయి ఉంటాడు. కోలాటం నేర్పడమే ముఖ్య వృత్తిగా గల జట్టు నాయకులు ఏడెనిమిది గ్రామాల్లో ఒకరో, ఇద్దరో ఉంటారు. నేర్వదలచిన ఉత్సాహవంతులు జట్టు నాయకునికి వేతనం ఏర్పాటు చేసి నేర్చుకుంటారు ఎప్పుడయినా పోటీల్లో పాల్గొని గెల్చిన ఆ బహుమతులు ఆటగాళ్ళంతా కలిసి జట్టు నాయకునికి ఇస్తారు. ఇది ఒక రకంగా ఆటగాళ్ళిచ్చే గురుదక్షిణ అవుతుంది ఎంత ఎక్కువ మొత్తంలో బహుమతులు గెలిస్తే జట్టు నాయకునికి అంత పెద్ద పేరు ప్రఖ్యాతులున్నట్లు. పట్టణాల్లో ఈమధ్య పారిశ్రామిక సంస్థలు, ఇతర సంస్థలు, మిల్లులు, కార్మిక సంఘాలు తమ సభ్యులకు కోలాటం నేర్పిస్తున్నారు. ఈ సభ్యులు గెల్చిన బహుమతులు జట్టు నాయకునికి ఇవ్వకుండా తమకు ఆట నేర్చుకోవడానికి ప్రోత్సాహమిచ్చినందులకు కృతజ్ఞతా సూచకంగా ఆ సంస్థలకే ఇస్తున్నారు. అయితే ప్రదర్శన దినంలో తాము గెల్చిన పతకాలను జట్టు నాయకునికి అలంకరిస్తారు.

లేదా తమ సంస్థ పేరు మీదుగ ఒక గుడ్డతో కాని, అట్టతో కాని తావీదు తయారుచేసి, దానికి బహుమతులు అన్నీ అలంకరించి ప్రదర్శిస్తారు. ఇట్లు కోలా

టంలో జట్టు నాయకునకు విశిష్ట స్థానం ఉంది. అయితే ఈ జట్టు నాయకునికి ఉండవలసిన అర్హతలు ప్రత్యేకంగా ఏమీ ఉండవు. ఆట, లయ, తాళం తెలిసి, పాటలు పాడడం నేర్చి ఉండాలి. స్వరం బాగా ఉంటే రాణింపు ఉంటుంది. జట్టుపై పెత్తనం చేయగలిగిన సమర్థత ఉండాలి. ఇవేకాక అంగవైకల్యం లేని వారయి ఉండాలి. ముఖ్యంగా చేయి కుంటివారు, కాలు కుంటివారు. మూగవారు, చెవిటివారు, నత్తివారు, గుడ్డివారు, బోసి నోటివారు, పెద్ద పొట్ట ఉన్నవారు, లావు పాటివారు, రక్తపు పోటు, క్షయ మొదలయిన జబ్బులున్నవారు, ఇంకా ఇతర రోగగ్రస్తులు, ముసలివాళ్ళు, మరుగుజ్జులు మొదలయినవారు జట్టు నాయకుని స్థానానికి పనికి రారు.

**జట్టు నాయకుని అలంకరణ :**

జట్టునాయకుని అలంకరణ ఆటగాళ్ళందరి అలంకరణకంటే విశిష్టంగానూ, వేరుపరిచేదిగానూ ఉంటుంది. వెనుకటిరోజుల్లో జట్టు నాయకుని అలంకరణ నేటి అలంకరణకంటే భిన్నంగా ఉండేది. అంటే పూర్వం తెల్లపంచె, తెల్ల అరచేతుల చొక్కా, మోకాళ్ళదాకా కట్టిన పంచె, నడుముకు కట్టిన దట్టీ సామాన్యవేషం. దట్టీ కట్టడం అంటే రెండుమూరల పొడుగు, మూరెడు వెడల్పాగల రంగువస్త్రాన్ని ఐమూలగా మడతవేసి నడుముకు కట్టే విధానం. దీని ముడి నడుముకు కుడివైపు వేస్తారు, త్రికోణాకారంగాఉండే రెండు అంచుల్లో ఎడమకాలి తొడకు ఒకటి ముందుకు, మరొకటి వెనక్కువస్తాయి. దీన్ని చొక్కామీద కడతారు. జుట్టు అందంగా దువ్వి వెనుకకు ముడివేయడం, ముడిపై బంతి, మల్లె, చేమంతి మొదల యిన పూలు పెట్టడం, మెడలో వెండికంటె; చెవులకు అంటుజోడు,చేతులకు వెండి మురుగులు పెట్టుకోవడం; కాళ్ళకు గజ్జెలు; నుదుట కుంకుమతో గుండ్రని పెద్ద బొట్టు, చేతుల్లో రెండు తాళాలతోనూ; కాళ్ళకు గజ్జెలతోనూ; పాటకు తాళాలకు అనుగుణంగా అడుగులువేస్తూ ఆటగాళ్ళకుత్సాహమిచ్చే అరపులతో ఎంతోఅందంగా ఆకర్షణీయంగా ఉండేవారు. అయితే ఇవి దాదాపు నలభై, యాభైయేళ్ళ కిందటి వేషాలు. ప్రస్తుతం జుట్టుముడిగాని, కేశాలంకరణకు పూలుపెట్టడంగాని, చేతులకు మురుగులు, మెడలో కంటె కానరావు. దట్టీకట్టడంకూడా కొన్నిచోట్ల కానరాదు. పైన ఉత్తరీయం కొందరు వేస్తారు, కొందరు వేయరు. నుదుటబొట్టు కొందరు పెడ తారు, కొందరు పెట్టరు. మెడలో పూలదండగాని, చమ్కీదండగాని, రంగుకాగితా

లతో కట్టిన దండలుగానీ, రంగు నూలుదారాలతో తయారుచేసిన (గాంధీగా
దండలుగాని వేసుకుంటారు. పోటీల్లో గెల్చిన బహుమతులు పతకాలయితే దండ
గుచ్చి మెడలో వేసుకుంటారు. పతకాలదండ వేసుకుంటే పూలదండను వేయర
కొందరు పతకాలను పిన్నీసులతో చొక్కాకు పెట్టుకుంటారు. గెల్చిన బహుమతుల్లో
కడెం ఉన్నట్లయితే చేతులకో, కాళ్ళకో వేసుకుంటారు. కాళ్ళకు గజ్జెలు కట్టుకు
టారు. చేతుల్లో కోలాటం కర్రలుగానీ, తాళాలుగానీ, భజనపలకలుగానీ ఉంటాయి
కొందరు ఒకచేత భజనపలకలు, మరొకచేత కొరడాతో గరిడీకి దిగుతారు. ఈ
కొరడా ఆటలో తప్పుచేసినవారిని శిక్షించడానికి అన్నట్లు అప్పుడప్పుడు ఊపుతు
టారు. కొందరు ఎత్తుగడ, ముక్తాయింపు చరణాలను చెప్పకుండా పీకద్వార
సంజ్ఞలిస్తారు. అందువల్ల కొందరు జట్టు నాయకుల నోటిలో పీక ఉంటుంది
చేతిలో కోలాటం కర్రలు ఉన్నట్లయితే ఆ కర్రలు గజ్జెలతోనూ, గజ్జెలమధ్యలో
ఎరుపు, ఆకుపచ్చరంగుపూలుకుచ్చులతోనూ అలంకరించబడి ఉంటాయి. కొందరు
జట్టునాయకులు పీకకు జేబురుమాలు కట్టిఉంచుతారు. కుడిచేత కొరడా, ఎడమచేత
భజనపలకలతో గరిడీచుట్టూ తిరుగుతూ అప్పుడప్పుడు కొరడాఝళిపిస్తూ జట్టుఆట
గాళ్ళకు కొద్ది భయంకరంగానూ, ప్రేక్షకులకు అందంగానూ కనుపిస్తూ ఉంటాడు.
జట్టు నాయకుని ఉత్సాహపూరితమైన కేకలు, వేసే గంతులు ఆటగాళ్ళంతా అను
కరిస్తారు, ఉసెత్తులో ఎగిరి గంతులు వేయడంతోను కేకలు వేయడంతోను కోలా
హలంగా ఉంటుంది. జట్టు నాయకుని అనుసరణ, అనుకరణలతో ఆటగాళ్ళు
కోలాటం ఆడుతారు. నాయకుని తర్వాత చెప్పుకోదగింది జట్టులోని ఆటగాళ్ళు.

**ఆటగాళ్ళు :**

ఆటగాళ్ళు ఇరవై నుంచి నలభైదాకా ఉండవచ్చు. కొందరు జట్టు నాయ
కులు జట్టును యాభై లేక అరవై మందితో కూడా తయారు చేస్తారు. జడకోపుకు
పన్నెండు మందిని గాని, పదహారు మందిని గాని, పద్దెనిమిది మందిని గాని తీసు
కుంటారు. ఎక్కువ మందితో జడకోపు వేయడం కష్టం. పూర్వపు రోజుల్లో ఈ
ఆటగాళ్ళ ఆలంకరణ జట్టు నాయకుని అలంకరణకు కొద్ది తేడాతో విశిష్టంగా
ఉండేది. అందరికి అరచేతుల తెల్ల చొక్కాలు ఉండేవి. తెల్ల పంచెలు ఉండేవి.
మోకాలిదాకా కాలికి కరచుకొని ఉండేట్టు పంచె కడతారు. జట్టులో సగం మంది
ఆటగాళ్ళు ఎర్రసిల్కు పంచెను నడుముకు దట్టీ కడతారు. మిగిలిన సగం మంది

ఆటగాళ్ళు పసుపు పచ్చరంగు లేదా ఆకు పచ్చరంగు సిల్కు పంచెను నడుముకు దట్టీ కడతారు. ఒక ఎర్రసిల్కు పంచె దట్టీ కట్టిన ఆటగానితో ఒక పచ్చసిల్కు పంచె దట్టీ కట్టిన ఆటగాడు కలసి ఉద్దీగా ఏర్పడతాడు. అట్టి ప్రతి ఉద్దిలో ఉంటారు. ఉద్ది అంటే ఇద్దరు ఆటగాళ్ళ సమూహం అని అర్థం. ఆటగాళ్ళందరి కాళ్ళకు గజ్జెలుంటాయి గజ్జెల మధ్యలో ఎరుపు, ఆకు పచ్చ రంగుల పూలు కుచ్చులు (గుత్తులు) గా కడతారు. చేతులకు మురుగులు, మెడలో కంటె, నొసట కుంకుమ బొట్టు, చెవులకు అంటుజోడు, తలదువ్వి ముడివేయడం, ముడిపై పూలు పెట్టడం మొదలయిన విధంగా పూర్వకాలపు వేషం ఉండేది. కాని ప్రస్తుత కాలం అలంకరణ దీనికి భిన్నంగా ఉంటుంది. ఆటగాళ్ళలో సగం మందికి రాముళ్ళని, మిగిలిన సగం మందికి లక్ష్మణులని పేర్లు పెడతారు ఒక రాముడు, ఒక లక్ష్మణుడు కలసి ఉద్దీగా ఏర్పడతారు ప్రస్తుత కాలపు అలంకరణలో ముఖ్యంగా రంగు చొక్కాలు నిండు చేతులవి ఎక్కువగా కన్పిస్తాయి. రాముళ్ళకు ఒకరంగు చొక్కాలు, లక్ష్మణులకు వేరొక రంగు చొక్కాలు వాడుతారు, వాడే రంగుల్లో ఎరుపు, నీలం, ఆకుపచ్చ, పసుపుపచ్చ, నలుపు మొదలయిన వాటిలో వారి వారి ఇష్టాన్ననుసరించి ఏవైనా రెండు రంగులు తీసుకుంటారు. పంచెలు మాత్రం అందరూ తెల్లవే వాడుతారు. ఇప్పట్లో దట్టీలు కట్టడం కానరాదు. కొన్ని జట్లలో - ముఖ్యంగా పట్టణాలల్లో పంచెలకు బదులుగా నిక్కర్లు (అరలాగులు) కన్పిస్తాయి. మెడలో పూల దండలుగాని, చమ్కీ దండలుగాని, రంగుకాగితాల దండలుగాని ధరిస్తారు. పూలదండలకు బంతిపూలు, చేమంతిపూలు, మల్లెపూలు మొదలయినవి వాడుతారు. రెండుచేతుల్లో రెండు కర్రలు ఉంటాయి. రెండుకర్రలకు పిడివద్ద గజ్జెలుగాని, అందెగాని అమర్చబడి ఉంటాయి. కొందరు పిడివద్ద జేబురుమాలును ఒక కొన కడతారు తక్కిన గుడ్డంతా వేలాడుతుంటుంది. ఆటగాళ్ళలో మొదట రాముళ్ళంతా లోపలి వలయంగానూ, లక్ష్మణులంతా వెలుపలి వలయంగాను ఏర్పడతారు. రాముళ్ళంతా ఒకే రంగు చొక్కాలు, లక్ష్మణులంతా ఒకే రంగైన వేరొకరంగు చొక్కాలు ధరించి ఉంటారు కాబట్టి లోపలి వలయం ఒక రంగుగాను, వెలుపలి వలయం మరొక రంగుగాను కన్పిస్తుంది. ఆటగాళ్ళు కోలాటం ఆడే సమయంలో వెలుపలి వలయంవారు లోపలి వలయానికి, లోపలి వలయంవారు వెలుపలి వలయానికి గతులనుబట్టి కోపుల్లో మారుతున్నప్పుడు ఈ రంగులు ఎంతో అందంగా కన్పిస్తాయి. ఉసెత్తులో ఎగిరే

టప్పుడు తాళం, గజ్జెల, మద్దెల, అందెల మోతలన్నీ కలసి మంచి ఇంపైన ధ్వని నిస్తాయి. ఈ అలంకరణలతో ఆటగాళ్ళు గరిడీలో మహాముచ్చటగా ఉంటారు. గరిడీకి అందాన్ని చేకూర్చేదీ, ఆటను మెప్పించవలసిందీ, ప్రేక్షకుల్ని పూర్తిగా ఆనందపరవశుల్ని చేసేది ఆటగాళ్ళు. ఆటగాళ్ళు లేనిదే గరిడీ లేదు. గరిడీకి అందం ఆటగాళ్ళ వల్లనే వస్తుంది.

గరిడి :

గరిడి అనేది వైకృత పదం. దీనికి 'ఖురళి' ప్రకృతి. గరిడీ అనేది రూపాంతరం. దీనికి సాము నేర్చుచోటు లేక అభ్యాసస్థలం, ప్రదర్శనశాల అనే అర్థాలున్నాయి [64]. దాదాపు పదిహేను నుంచి ఇరవై అడుగుల వ్యాసం గల వలయం ఏర్పడడానికి అనుకూలమైన విశాల ప్రదేశం. కోలాటం ఆడటానికి సామాన్యంగా ఊరుబయట ఖాళీ ప్రదేశంలోగానీ, వెడల్పుగల బజారులోగానీ, పశువుల కొట్టం (చావడి)లోగానీ, బజారు కూడలిలోగానీ గరిడి ఏర్పాటు చేస్తారు. అయితే పశువుల చావడిలోని ఖాళీప్రదేశంగానీ, బజారులోగానీ కోలాటం నేర్వ డానికి పనికివచ్చే ప్రదేశాలు మాత్రమే. ఇది కొద్దిమంది ప్రేక్షకులు మాత్రమే చూడడానికి వీలవుతుంది. గరిడీకి కావలసిన ప్రదేశం ఒక ప్రత్యేకతతో ఉండాలి. అంటే బురదలేని చోటూ, ఎగుడుదిగుడులు లేకుండా భూమి చదునుగా ఉండే చోటూ, మధ్యలో బోటిరాళ్ళు (ఎత్తుపాటి చిన్నరాళ్ళు. ఇవి సగం భూమిలో పూడి మిగిలిన సగం వెలుపలకు ఉంటాయి) లేనిచోటూ, గుండ్రలాంటి కొసగల రాళ్ళు (ఇలాంటి గుండ్రరాళ్ళవల్ల ఉపెత్తులో ఎగిరేటప్పుడు కాళ్ళు కోసుకుపోవడం గాని, దెబ్బలు తగిలే ప్రమాదంగాని ఉంటుంది ) లేనిదీ అయిన మెత్తని మన్ను గల ప్రదేశం కావాలి. సామాన్యంగా గరిడీలు చెట్టుక్రింద ఏర్పాటు చేస్తుంటారు. గరిడి ఎక్కడ ఏర్పాటు చేసినప్పటికి ఆ ప్రదేశంలో ఉండే రాళ్ళను తీసివేసి శుభ్రంగా తయారుచేయాలి. పగలెల్ల తమతమ జీవనోపాధి మార్గాల్లో శ్రమించి రాత్రుల్లో ఉత్సాహంగానూ, ఉల్లాసంగాను వేసే సందర్భాల్లో మాత్రమే పై ప్రదే శాలు గరిడీగా వాడుతారు. ఈ సమయాలనే ఉత్సాహ సమయాలు అంటారు. ఉత్సాహ సమయాల్లోనే శిక్షణగూడ ఉంటుంది. సుశిక్షితులైన జట్టు ఆటగాళ్లకూడా

---

64. ఆ. శ. ర., 1-557.

ఉత్సాహ సమయాల్లో ఉల్లాసంగా కోలాటమాడుతారు. అయితే ఈ ఉత్సాహ సమయాల్లో వేసే కోలాటానికి ఏర్పాటుచేసే గరిడీకి అలంకరణ ఉండదు. ఉత్సవ సమయాల్లో ప్రదర్శన ఇచ్చేచోట ఏర్పాటుచేసిన గరిడీకి అలంకరణ చేస్తారు. ముఖ్యంగా ఈ గరిడీ చాలా విశాల ప్రదేశంలో ఏర్పాటు చేస్తారు. అంటే చుట్టూ ప్రజలు చేరి చూడడానికి అనుకూలంగా ఉండే ప్రదేశం ఎన్నుకుంటారు. గరిడీ మధ్యలో ఒక పొడవైన కర్రను (దాదావు పదిఅడుగుల ఎత్తుగలది) తీసికొని దాని ఒక కొన రెండు అడుగుల వరకు భూమిలో పాతి పెడతారు. దాని రెండో కొనకు పెట్రొమాక్స్‌లైటును కడతారు. పూర్వపు రోజుల్లో వెలుతురు నిమిత్తం కాగడాలు వాడేవారు ఒక చేతిలో ఉగ్గం కట్టిన ఆముదం ముంత (పట్టుకోవడానికి అనుకూలంగా ముంత మూతికి తాడు కట్టడాన్ని ఉగ్గం కట్టడం అంటారు) మరొక చేతిలో కాగడాతోను నలుగురైదుగురు గరిడీకి చుట్టూ ఉండేవారు. కాగడాకు కొన్ని ప్రాంతాల్లో కొబ్బరినూనె, మరికొన్ని ప్రాంతాలల్లో కిరసనాయిలు వాడడం కూడా ఉంది ఉత్సాహ సమయాల్లో వేసే కోలాటానికి నీ౦టిరాత్రులయితే కొన్ని పల్లెటూళ్ళలో ఇప్పటికీ కాగడాలు వాడడం కనిపిస్తుంది. ప్రదర్శన పగలు ఇస్తుంటే వెలుతురు ప్రసక్తి ఉండదు. ఉత్సవ సమయాన గరిడీచుట్టూ ఈ కర్రలు పాతిపెట్టి వాటికి రంగు కాగితాల దండలుగాని, పూల దండలుగాని చుట్టూ కడతారు. అంటే ఈ కర్రలు గరిడీకి వెలుపలి భాగంగా ఉంటాయి. గరిడీ చుట్టూ జట్టు వలయంగా ఏర్పడుతుంది; గరిడీ మధ్యలో మద్దెల, తాళాలు, ఆర్మోనియం మొదలయిన వాద్యాల వాళ్ళు కూర్చుంటారు. తప్పెట, ఫిల్లు (ఫ్లూట్) వాయించేవారు నిల్చొనే ఉంటారు. జట్టు నాయకుడు గరిడీ చుట్టూ లోపలి భాగాన తిరుగుతూ, పాటలు పాడుతూ ఆటగాళ్ళ పొరపాట్లను సవరిస్తూ, ఉసెత్తులో ఉత్సాహాన్ని రేకెత్తించే ఉత్సాహభరితమైన కేకలువేస్తూ, ఎగురుతూ అందరికీ ఉత్సాహం ఇచ్చేరీతిలో చరిస్తూ ఉంటాడు. ఈ గరిడీ చూడడానికి ఎంతో అందంగా ఉంటుంది. ఆటగాళ్ళంతా రంగుల పూలమాలలు ధరిస్తారు. మధ్యమధ్యలో రంగు రంగుల కుంకుమలు, పలురంగులతో కూడిన రంగుకాగితాల ముక్కలు చల్లుతుంటారు. ఉత్సవ సమయంలో కర్రలకు గజ్జెలు, అందెలు కడతారు. కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు ఈ గజ్జెల సవ్వడితో పాటు వాద్యాల సమ్మేళనంతో కూడిన ధ్వని విశేషంగానూ వినడానికి ఇంపుగానూ ఉంటుంది. కోలాట కర్రల సవ్వడి ఈ ధ్వనిలో కలిసిపోతుంది. ఉత్సవ సమ

యాల్లో గరిడీ వేసిన ప్రదేశం ఐదారు రోజులదాకా అందంగా ఉంటుంది. ఏ సమయాల్లోని ఆటకైనా ఇరవైనుంచి నలభైదాకా (అంటే పదినుంచి ఇరవై ఉద్దీల దాకా) ఉండవచ్చు. అంతకు మించితే బాగుండదు.

ఉద్ది :

ఉద్ది అనే పదానికి జత, సమానులగు వారి సముదాయం, జట్టు, సాంగత్యం, చెలిమి[65] అని అర్థాలున్నాయి. ఉజ్జి అనే పదం దీని రూపాంతరం. జత, జంట అనేవి పర్యాయపదాలు. ఉద్ది అనేది బాల క్రీడా విశేషమని నిఘంటువులు వక్కాణిస్తున్నాయి. ఈ పదం విశేషంగా కూడా చెప్పవచ్చు. అపుడు ప్రతిస్పర్థి, ఎదిరి, పోటీవాడు, సమానము, సాటి, జంటగా నున్నది.[66] అనే అర్థాలు చెప్పవచ్చు. ద్వంద్వం, ద్వయం అనీ, పోటీ అనీ[67] ఇంకా అర్థాలున్నాయి. కోలాటంలో ఇలాంటివి కొన్ని ఉద్దులు ఉంటాయి. ఉద్దిలోని వాళ్ళను ఉద్దికాళ్ళు అంటారు. ఏక వచనంలో ఉద్దికాడు అని అంటారు. అంటే జతకాడు, చెలికాడు, మిత్రుడు అని అర్థాలు. ఈ ఉద్దికాళ్ళందరిపైన ఒక నాయకుడు ఉంటాడు. అతనిని పెన్నుద్ది అంటారు. పెను + ఉద్ది—పెన్నుద్ది. పోటీ చేయువారి నాయకుడు.[68] ఇతర క్రీడల్లో రెండు జట్లు, రెండు జట్లకు ఇద్దరు పెన్నుద్దులు ఉంటారు. కాని కోలాటంలో జట్టు అంతటికి కలిపి ఒకే పెన్నుద్ది ఉంటాడు. అతనినే మనం జట్టు నాయకుడు అంటున్నాం. పెన్నుద్ది సలహా మేరకు అందరూ ఉద్దులుగా ఏర్పడతారు. ఈ పద్ధతినే "ఉద్దించు = పోటీచేయు, ప్రతిస్పర్థించు, ఉద్దులుచేయు," "ఉద్దిగొను = జతగూడు," ఉద్దిచేయు = జతచేయు, కూర్చు"[69] అని అంటారు. పిల్లల ఆటల్లో గూడ ఇద్దరిద్దరు ఒక్కొక్క ఉద్దీగ పరిగణించడం అలవాటుంది. ప్రాచీన కావ్యాల్లో 'ఉద్ది' అనే పదంతో ప్రయోగాలు కన్పిస్తాయి. జట్టు నాయకుని ఆజ్ఞమేరకే కోలాటంలో ఈ ఉద్దీలు ఏర్పడడం, విడిపోవడం

---

65. సూ.ని , 1-630.
66. పైదే.
67. ఆ సం కో., 79.
68. సూ.ని., 1-631.
69. పెది 1-657

జరుగుతుంది. ఉద్దులుగా ఏర్పడిన తర్వాతనే కర్రలు కలపడం మొదలు పెడతారు. అంటే, ఆట ఆడటం మొదలుపెడతారు.

**కోలాటకర్రలు :**

కోలాటానికి మూలాధారం కోలాట కర్రలు. పేరుగూడ కర్రల మూలంగా వచ్చిందే. కోలలతో ఆడే ఆట అని అర్థం. కోలాటం ఆడే ఆటగాళ్ళందరికి రెండు రెండు కర్రలు అవసరం. రెండు కర్రలు రెండు చేతుల్లో ఉంటాయి. కర్రలు దాదాపు పద్దెనిమిది అంగుళాల పొడవు, ఒకటిన్నర అంగుళాల నుంచి రెండున్నర అంగుళాల వరకు వ్యాసం కలిగి ఉంటాయి. కొందరు గిరకకు[70] వాడి తీసివేసిన కర్రలను కోలాట కర్రలుగా వాడుతారు. చిటితో కోలాటం వేస్తే వచ్చే ధ్వని వినడానికి ఇంపుగా ఉంటుంది. మంచి బలమైన, చేవగలిగిన కర్ర లనే గుండ్రంగా సంగటి పట్టించి (చిత్రిక పట్టించి) గిరకకు వాడుతారు. కొందరు కోలాట కర్రలు ప్రత్యేకంగా తయారు చేయిస్తారు. ఈ కర్రలను ముఖ్యంగా బిల్లుడు, సండ్ర, ఏపె, రేల, నల్లంగి, టేకు, ఏగి మొదలయిన కొయ్యజాతి కర్రలను చిత్రిక పట్టించి వాడుతారు. చేవబయటపడి అందంగా ఉంటుంది. కొందరు ఎరుపు, పసుపుపచ్చ, ఆకుపచ్చరంగులు కర్రలకు రంగులు ఒక దాని తర్వాత మరొకటిగా కట్లు కట్లుగా వేస్తారు. వీటిని చెక్కపని చేసేవారు తయారు చేస్తారు. కర్రకు పిడివద్ద చిన్న రేగుపండు పరిమాణంలో ఉండే గజ్జెలు కడతారు. ఈ గజ్జెల మధ్యలో ఎరుపు, ఆకుపచ్చ రంగుల పూలుతో కుచ్చులు కుచ్చులుగా కడతారు. కొందరు పిడివద్ద రెండు వైపుల అందెలు కడతారు. అందెను కర్రకు దూర్చి ఎరుపు, ఆకుపచ్చ పూలు దారంతో జాలపోస్తారు. దానికి పూలు కుచ్చులు కూడా కడతారు. కొందరు పిడికి ఒక వైపునే అందె వేస్తారు. పిడి అంటే కర్ర పట్టుకొనే భాగం. పట్టుకోడానికి అనుకూలంగాను నడుమ పల్లంగా ఉండి పండు వెనుకలు ఉబ్బెత్తుగా గట్టు ఉంటాయి. అందెగాని, గజ్జెలుగాని కోలాటం ఆడే సమయాన ఇంపైన ధ్వనిని ఇస్తాయి. ఈ పిడినే కాయ అని అంటారు. ఇట్లా అలంకరణ చేసిన కర్రలను ఉత్సవ సమయాల్లోని ప్రదర్శన రోజే వాడుతారు.

---

70. ప్రత్తిలోని గింజలనుంచి దూదిని వేరు చేసే సాధనాన్ని గిరక అంటారు. పల్నాటి సీమలోని గ్రామాలలో గిరక దాదాపు అన్ని ఇండ్లలో ఉంటుంది.

ఆట నేర్చే సమయాల్లో గాని, ఉత్సాహ సమయాల్లో వేసే కోలాటంలో గాని ఈ కర్రలు వాడరు. నేర్చే సమయాల్లో తుమ్మ, వేప, చింత కర్రలు వాడుతారు ఇంకా చిరిశెన, కుందురు, పులిచింత, దంతె మొదలయిన కొయ్యజాతి కర్రలను కూడా ఆయా ప్రాంతాల్లో సులభంగా దొరికే వాటితో వేస్తారు. ఉత్సవ సమయంలో కర్రల శబ్దం వినడానికి ఇంపుగా ఉంటుంది. ఉసెత్తులో ఈ శబ్దం వినడానికి ఇంపుగా ఉంటుంది. ఎత్తుగడలో కోలాటం వేసే విధానం నెమ్మదిగా ఉంటుంది. కాబట్టి ఇచ్చట కర్రల ధ్వని మరొక రకంగా ఉంటుంది.

**ఎత్తుగడ :**

ఆట మొదలుపెట్టే పద్ధతిని ఎత్తుగడ అంటారు. అంటే జట్టు నాయకుని ఆజ్ఞమేరకు ఆటగాళ్ళంతా వలయంగా ఏర్పడడం, తర్వాత ఉద్దిలుగా ఏర్పడడం జరుగుతుంది. అపుడు జట్టు నాయకుడు గణపతి స్తవం, స్థానిక దేవతల ప్రార్థన, భారతదేశాన్ని, జాతీయ నాయకులైన జాతిపిత, తదితర నాయకుల పేర్లు చెప్పి ఆటగాళ్లచేత 'జే' కొట్టిస్తాడు. అది ఈ కింది పద్ధతిలో జరుగుతుంది.

జట్టు నాయకుడు - విఘ్నేశ్వరునికి -
జట్టు :- జెయ్
జ. నా .- మాచెర్ల చెన్నకేశవస్వామికి—
జ - జెయ్
జ నా - కారెంపూడి అంకమ్మకు -
జ :- జెయ్
జ. నా :- భారతమాతకూ -
జ .- జెయ్
జ. నా :- గాంధితాతకూ -
జ .- జెయ్
జ. నా - జవహర్‌లాల్ నెహ్రూకూ -
జ - జెయ్
జ. నా .- సుభాస్ చంద్రబోస్‌కూ -
జ :- జెయ్

తర్వాత జట్టులోని-

ఒక ఆటగాడు :- కోలన్న పంతులుకూ-

జః- జెయ్. అని 'జే' కొడతారు, కొందరు కోలన్న పంతులు శ్రీ . . అని పేరుకు 'జే' కొడతారు. అపుడు జట్టు నాయకుడు ప్రార్థన గేయం పాడి, ఆటను మొదలు పెడతాడు. ఈ ఆటను మొదలు పెట్టడానికి "ఇట్టియ్యకు, ఇట్టియ్యకు, ఇట్టియ్యకు" అని అంటూ "ఇట్టియ్యకు తాద్ధిమి" అని చెప్పగనే ఆటగాళ్ళంతా ఆట మొదలుపెడతారు. జట్టు నాయకుడు వారి ఆటతో పాటే పాట మొదలుపెడతాడు. ఇట్లా ఆట, పాట ఒకేసారి మొదలు పెట్టడాన్నే 'ఎత్తుగడ' అంటారు. ఈ ఎత్తుగడనే పలుచోట్ల పలురకాలుగా వాడుతారు. "కిట కిట త-ఝనుత, కిటకిటత- ఝనుతా, కిట కిట తయ్యకు తాద్ధిమి" అని కొందరూ; "కిట కిట తయ్యకు, తయ్యకు, కిటకిట తయ్యకు, తయ్యకు, ఇట్టియ్యకు తాద్ధిమి" అని కొందరూ ఆట మొదలుపెడతారు. కొందరు ఎత్తుగడతో ప్రార్థన గేయం మొదలు పెడతారు. ఎత్తుగడతో మొదలయిన ఆటను నెమ్మది నెమ్మదిగా వేస్తూ వేగం పెంచుతారు. పాట పూర్తి కాగానే ఒక సంవాద గేయాన్ని పాడుతారు. సంవాద గేయంలో చరణంలోని ఒక మాటను జట్టు నాయకుడు, చరణంలోని మరొక మాటను ఆటగాళ్ళు పాడుతారు. అపుడు ఆటనుగూడ వేగం పెంచి ఉసెత్తులో ఆడుతారు.

ఉసెత్తు :

ఉసెత్తు అంటే రెండో కాలంనుంచి మూడో కాలానికి వెళ్ళడం. ఉసెత్తు (<ఉసి + ఎత్తు) అంటే అప్పటివరకు నెమ్మదిగా వేస్తున్న ఆటగాళ్ళు ఒక్క మారుగా హుషారుగా ఎగురుతూ, పాట పాడుతూ, పాట కనుగుణంగానే అడుగులు వేస్తూ వేసే కోలాటం. దీనికే 'ఉసి, దుడుకు, త్వరితం' అనే పేర్లు ఉన్నాయి. ఉసెత్తులో కొంతసేపు ఆట ఆడించిన తర్వాత ఆటను ముక్తాయించి మరొక కోపుతో ఆటను మరలా మొదలుపెడతారు. ఒక్కొక్క కోపులో వరుసగా నాలుగైదు పాటలు పాడేవారు ఉసెత్తు తర్వాత నెమ్మదిగా వేస్తూ మరొక పాటను పాడుతూ మరలా ఉసెత్తులో ఆడుతూ, పాటను అందుకుంటూ ఆడుతుంటారు. ఇట్లా ఒక్కొక్క కోపులోనే కొన్ని పాటలు పాడిన తర్వాత ఆటను ముక్తాయించి మరొక కోపు మొదలుపెడతారు. పూలు, బుక్కాయి, కుంకుమ, రంగు కాగితా

ల్లాంటవి కోలాటం ఉసెత్తులో వేసేటప్పుడు ఉల్లాసంగా చల్లుతారు. ఇవి కోలాటం వేసే వారికి హుషారు నిస్తాయి చూసే ప్రేక్షకులకు ఆనందాన్ని ఇస్తాయి జట్టు నాయకుడు, తప్పెట వాద్యగాడు మొదలయినవారు ఉసెత్తులో వేసే కేకలు, ఎగిరే గంతులు చూసే ప్రేక్షకులకు ఒళ్ళు గగుర్పొడుస్తుంది. వారి ఉల్లాసపు కేకలకు ప్రేక్షకులు సహితం జట్టులో కలసి కాలు కలిపి ఆట ఆడాలనిపిస్తుంది. ఉసెత్తు ఆట ముక్తాయింపు చరణంతో సమాప్తం మరలా మరొక కోపులో ఒకటి రెండు పాటలయిన తర్వాత మరలా ఉసెత్తు, మరలా ముక్తాయింపులు ఉంటాయి.

**ముక్తాయింపు :**

దీనికి మరొక పేరు ఆట తెగగొట్టడం. దీనికి దాదాపు 'ఇట్టయ్యాకు తద్ధిమిత్త' అనే చరణాన్నిగాని, "కిటకిట తయ్యాకు తద్ధిమిత్త" అనే చరణాన్ని గాని వాడుతారు. ఈ చరణాన్ని ముక్తాయింపు చరణం అంటారు. తర్వాత మరొక ఎత్తుగడతో మరొక పాట. మరలా ఉసి, తర్వాత ముక్తాయింపు. ఇట్లా కోపు కోపుకి ఎత్తుగడ, ఉసెత్తు, ముక్తాయింపులు ఉంటాయి.

**చల్లేవస్తువులు :**

ఉత్సాహ సమయాల్లో వేసే కోలాటానికి ఏమీ చల్లరు. కాని ఉత్సవ సమయాల్లోని ప్రదర్శనలకు పూలు, బుక్కాయి, కుంకుమ, రంగు కాగితాలముక్కలు, గంధం, వసంతం మొదలయిన వస్తువులు చల్లుతారు. ఇవేకాకుండా అత్తరు, పన్నీరు లాంటివి చల్లేవారున్నారు. అంటే ప్రదర్శకుల తరపున కొందరు ఉల్లాసాన్ని కలుగజేస్తూ అప్పుడప్పుడు చల్లే వస్తువులు ఇది పిడికెడు గంధం గాని, పిడికెడు బుక్కాయి గాని, పిడికెడు కుంకుమ గాని తీసికొని పైకి చల్లాడంటే జట్టు అందరికీ చుట్టుకుంటుంది. జట్టు అంతా కోలాటం పూర్తయే సమయానికి కుంకుమ గోతాల్లో (సంచులలో) ముంచి తీసినట్లు కనుగొనడానికి వీలులేనంతగా రంగుంతో నిండిఉంటుంది. ఈ వస్తువులు చల్లుతుంటే కోలాటం ఆడే ఆటగాళ్ళకు మరికొంచెం ఉల్లాసంగా ఉంటుంది ఈ చల్లే వస్తువులు సామాన్యంగా ఉసెత్తులో చల్లుతారు. కోలాటం ఆడిన తర్వాత ఐదారు రోజులదాకా గరిడి వేసిన చోటంతా అందంగానే ఉంటుంది ఈ వస్తువులవల్ల ముఖ్యంగా ఉల్లాసం పెంపొందుతుంది. ప్రతి కోపుకు ఉసెత్తులో ఇవి చల్లుతారు.

కోలాట సమయాలు :

కోలాటం ఆడే సందర్భాలనుబట్టి కోలాట సమయాలు రెండుగా చెప్పవచ్చు
1. ఉల్లాస సమయాలు, 2. ఉత్సవ సమయాలు.

ఉల్లాస సమయాలు దాదాపు రాత్రుల్లోనే ఉంటాయి ఉత్సవ సమయాలు రాత్రులుగాని, పగళ్ళుగాని ఎప్పుడయినా ఉండవచ్చు. పగలెల్ల శ్రమించి, తమ శ్రమను మరచి, ఉల్లాసాన్ని కలిగించే చల్లని గాలికి, తెల్లని వెన్నెలకు కోలాటం వేస్తుంటారు. శ్రామికులకు తీరిక సమయాలైన రాత్రి వేళల్నే ఎన్నుకుంటారు పూర్తిగా నేర్చుకున్న తర్వాత వెన్నెల రోజుల్లో అప్పుడప్పుడు వేస్తుంటారు. ఇవి ఉల్లాస సమయాలు. ఈ సమయాల్లో ఆటగాళ్ళకు గాని, కర్రలకు గాని, గరిడీకి గాని అలంకరణలు ఉండవు. ఉల్లాస సమయాల్లో వేసే కోలాటం ప్రదర్శన కాదు. చూసే ప్రేక్షకులు తక్కువ.

ఉత్సవ సమయాల్లో వేసే కోలాటానికి అన్ని రకాల అలంకరణలతో సాధ్యమైనన్ని వాద్యాలతో గరిడీకి దిగుతారు. దాదాపు డిసెంబరుకు వర్షాలు వెనుకు పట్టడం, అచ్చటనుంచే పండుగలు మొదలవడం కోలాట ప్రదర్శనలకు మంచి అనుకూల వాతావరణం. దాదాపు ప్రతి పండుగకు కోలాట ప్రదర్శనలు ఉంటాయి. సంక్రాంతి, మహాశివరాత్రి, ఉగాది, శ్రీరామనవమి, దసరా, గణపతి ఉత్సవాలు, రంజాన్, క్రిస్టమస్ మొదలయిన పండుగలకు వేస్తుంటారు. ఇంకా తిరునాలలు, కొలుపులు, వేడుకలు, జాతరలు, పందగ ఊరేగింపులు, రాజకీయ నాయకుల ఊరెగింపులు, ఎన్నికల ఊరేగింపులు, కుంకుమ బండ్లు మొదలయిన సందర్భాల్లో కోలాటం వేస్తుంటారు. ఈ సమయాల్లో ప్రదర్శనలు ప్రత్యేక అలంకరణలతో ఏర్పాటు చేస్తారు ఉత్సవ సమయాల్లో వేసే కోలాటంలో సుగంధ ద్రవ్యాలైన గంధం, బుక్కాయి, కుంకుమ, వసంతం, పూలు, రంగు కాగితాల ముక్కలు మొదలయిన వస్తువులు అనుకూలాన్నిబట్టి చల్లుతుంటారు. ఉత్సాహభరితమైన ఈ ఆటను చూడడానికి కుల, మత భేదాలు లేకుండా అందరూ వస్తారు. ఆనందానికి వర్ణభేదం ఉండదు గదా! అయితే ఉల్లాస సమయాల్లో వేసే కోలాటానికి అందరూ రారు దాదాపు శ్రామిక వర్గానికి చెందిన వారే వస్తుంటారు. ఉల్లాస సమయం గాని, ఉత్సవ సమయంగాని పేడెనిమిది కోపులు

వేసేటప్పటికి ఆటగాళ్ళు పూర్తిగా అలసిపోతారు కాబట్టి ఆటను ముగిస్తారు. కోలాటంలో కోపుకి కోపుకీ తేడా ఉంటుంది.

కోపు :

కోపు అనేది దేశ్య శబ్దం. విశేష్యం. దీనికి 'నాట్యము, నాట్యము తీర్పు',[71] 'నాట్యగతి భేదము, ఆట,'[72] 'నాట్యగతి విశేషము'[73] అనే అర్థాలున్నాయి. అంటే కోలాటంలో వివిధ రకాల గతిభేదాలుంటాయి. ఇట్టి గతి భేదాలనే కోపులు అంటారు. కోలాటం పాటలను కొప్పు అని పిలుస్తారని నాగుల రాజేశం గౌడ్ గారన్నారు[74] కాని అది అంత సమర్థనీయంగా కానరాదు. కోలాట గతి భేదాలను మాత్రమే కోపులు అంటారు కాని పాటలను కోపులు అంటానికి ఆధారం కనిపించదు. ఐతే కొన్ని కోపుల పేర్లు పాటల్లోని మొదటి చరణాలను బట్టి ఏర్పడే మాట వాస్తవమే పాటలోని మొదటి చరణంతోగాని, సారాంశాన్ని బట్టిగాని ఎర్పడతాయి. ముఖ్యమైనవి పది లేక పన్నెండు కోపులు నేర్పుతారు. ఇంకా ఎన్నో కొపులు తెలిసినా ముఖ్యమైన కోపులు వేసి కోలాట ప్రదర్శన ముగిస్తారు. ఆ కోపుల్లో—

1. ప్రార్థన కోపు
2. ఉజ్జి తిరుగుడు కోపు
3. వరగత్తెర కోపు
4. కృష్ణ కోపు
5. చెలియ కోపు
6. కంస కోపు
7. జడ కోపు
8. భారత కోపు

---

71. ఆ.దీ., 230.
72. ఆ.వా., 1-407.
73. ఆ.సం. కో., 180.
74. స్రవంతి, మే, 1978.

9. భామ కోపు
10. లాలి కోపు
11. లంకె కోపు
12. కలువరాయ కోపు - మొదలయినవి ముఖ్యమైన కోపులుగా వాడుక.

**వర్ణాలు :**

కోలాటంలో దాదాపు బ్రాహ్మణ, వైశ్య కులాలవాళ్ళు చాలా తక్కువగా పాల్గొంటారు. ఇతర కులాల్లోని ప్రజలు దాదాపు అందరూ పాల్గొంటారు. తెలగ, ముతరాసు, పెరిక, రెడ్డి, కంసాలి, తొగట, చాకలి, మంగలి, మాదిగ, మాల, కమ్మరి, కుమ్మరి, కమ్మ మొదలైన కులాలవారు పాల్గొంటారు. నా సేకరణలో కోలాటం నేర్పే జట్టు నాయకుల్లో ఎక్కువ మంది వెనకబడిన తరగతుల కులాల వాళ్ళే ఉన్నారు. ఉత్సాహ సమయాల్లో వేసే కోలాటానికి ప్రేక్షకులు తక్కువ. ఉత్సవ సమయాలో వీరు వారనకుండా అందరూ చూస్తుంటారు. ఉత్సాహ సమయాల్లో వేసే కోలాటం దాదాపు ఊరు వెలుపలనో, లేక మైదానం గల ఏదో బజారులోనో ఏర్పాటు చేస్తుంటారు.

ఇట్లు కోలాటం ఇరవై నుంచి నలభై మంది ఆటగాళ్ళతో ఒక జట్టు నాయకుని అధీనంలో ప్రార్థన గేయంతో మొదలయి ఎత్తుగడ—ఉసెత్తు—ముక్తాయింపుల్తో ఒక్కొక్క కోపు వేస్తూ, ఒక్కొక్క ప్రదర్శనలో కొన్ని కోపులు వేస్తూ ఆటను ముగిస్తారు. బాగా వెనుకబడిన ప్రాంతాల్లో ఈ కోలాటం ఇప్పటికీ కన్పిస్తుంది. కోలాటపు ఉనికి జానపదుల్లో, జన సామాన్యపు నిత్యజీవనంలో ఒక భాగంగా ఉత్సవాల్లో నేటికీ నిలిచి ఉంది.

# ప్రాచీన ఆకరాలు : కోలాటం ప్రసక్తి

కోలాటానికి పురావస్తు నిర్మాణాల దృష్టిలోను, ప్రాచీన సాహిత్యపరంగాను, చరిత్రకారుల ఉద్ధరణల ముఖంగాను పరిశీలిస్తే ఆధారాలు లభిస్తాయి. వాస్తు నిర్మాణాల్నీ, సంస్కృత - తెలుగు సాహిత్యాల్నీ, చరిత్రకారుల ఉద్ధరణల్నీ క్రమంగా పరిశీలిద్దాం.

**పురావస్తు నిర్మాణాలు**

కోలాటానికి పురావస్తు నిర్మాణాల్లో క్రీ. శ. 7 శతాబ్దంనుంచి ఆధారాలు కన్పిస్తున్నాయి. పల్లవుల కాలంలోని మహాబలిపుర దేవాలయంపైన ఉన్న చిత్రాల్లోను, తూర్పు చాళుక్యుల కట్టడాలైన బిక్కవోలు, ద్రాక్షారామం, సామర్లకోట, పట్టడకల్, విజయవాడ సమీపంలోని జమ్మిదొడ్డి మొదలయిన ప్రదేశాల్లోను, దేవాలయ కుడ్యాలపైన ఉన్న చిత్రాల్లోను, హైహయుల తర్వాతికాలంలో నిర్మించబడ్డ మాచర్లలోని వీరభద్రాలయం గోడలపైన ఉన్న చిత్రాల్లోను, కాకతీయుల కట్టడమైన రామప్పగుడిమీద ఉన్న చిత్రాలలోను, విజయనగర రాజులకాలంలో నిర్మించబడ్డ శ్రీశైలం, హంపి, తాడిపత్రి, నెల్లూరు మొదలయిన దేవాలయ కుడ్యాలపైన ఉన్న చిత్రాల్లోను కోలాటం బొమ్మలు కన్పిస్తాయి.

**పల్లవులు - మహాబలిపురం :**

పల్లవులు అనేకులు ఆంధ్ర దేశాన్ని పరిపాలించారు. వారిలో కళా ప్రియులు, విద్యాప్రోత్సాహకులు, నాట్యపోషకులు ఉన్నారు. ఈ రాజులు కట్టించిన దేవాలయాల మీద వీరి కళారాధన చిహ్నాలా అన్నట్లు శిల్ప సంస్కృతి కన్పిస్తుంది. పల్లవుల కాలంలో వెలసిన మహాబలిపుర శిల్పాలు ప్రపంచ ప్రసిద్ధి పొందాయి. ఈ కట్టడాలు క్రీ.శ. 630 నుండి 660 దాకా కాంచీ పట్టణం రాజధానిగా పల్లవ సామ్రాజ్యాన్ని పాలించిన మొదటినరసింహవర్మ కాలంలో నిర్మించబడ్డాయి. మహాబలిపురానికి పూర్వం 'కదలి - మలై - తల - శయనం' అని పేరుండేది. అంటే సముద్ర సమీపస్థ పర్వతం అని అర్థం. సముద్రంలో చేపలు

పట్టి జీవించే బెస్తల పల్లె అది. మొదటి నరసింహవర్మ ఆ ప్రదేశాన్ని చూసి, అచటి ప్రకృతి సౌందర్యానికి ముగ్ధుడై, ఆ పల్లెను రేవు పట్టణంగా తీర్చి దిద్దాడు. అతనికి 'మహామల్ల' అని బిరుదు ఉంది. తన బిరుదు ననుసరించి ఆ 'కడలి - మల్లై - తల - శయనం'కు 'మహామల్ల పురము' అని నామకరణం చేశాడు దానికి క్రమంగా వాడుకలో 'మామల్లపురం, మహాబలపురం, మహాబలిపురం'[1] అనే రూపాలు ఏర్పడ్డాయి. ఇచటి కట్టడాలపై పలురకాల చిత్రాల శిల్పాలున్నాయి. వీటిలో కోలాటం వేస్తున్నట్లున్న శిల్పం కూడా ఉంది [2] కోలాటానికి పురావస్తు నిర్మాణ ఆధారాల్లో ఇదే మొదటిదని చెప్పవచ్చు.

**పశ్చిమ చాళుక్యులు :**

పశ్చిమ చాళుక్యుల కాలంలో వికసించిన పట్టడకల్ లోని దేవాలయ కుడ్యాలపై కూడా కోలాటం బొమ్మలున్నట్లు చెబుతారు.[3] ఇది ప్రస్తుతం బాదామి తాలూకా, బీజాపూరు జిల్లా, బొంబాయికి[4] చెంది ఉంది. ఇచ్చట పాపనాథ దేవాలయం, విరూపాక్ష దేవాలయం ఉన్నాయి. విరూపాక్ష దేవాలయం క్రీ. శ. 740 ప్రాంతంలో నిర్మాణం జరిగినట్లు చారిత్రక పరిశోధకులు చెబుతున్నారు.

**తూర్పు చాళుక్యులు :**

పల్లవుల తర్వాత తూర్పు చాళుక్యుల శిల్పం సాగరాంధ్ర ప్రాంతాల్లో కన్పిస్తుంది.

**గుణగ విజయాదిత్యుడు :**

తూర్పు చాళుక్యుల్లో గుణగ విజయాదిత్యుడు [క్రీ. శ. 848-891] నిర్మించిన దేవాలయాల్లో నేటి తూర్పుగోదావరి మండలంలోని బిక్కవోలులో భీమేశ్వరాలయం ఒకటి. ఆ దేవునికి విజయీశ్వర మహాదేవుడని (**Bijayiswara**

---

1. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము, 7-123.
2. **Traditions of Indian Folk Dances, p. 27.**
3. పైది.
4. **Imperial Gazetteer of India, XX-73.**

Mahadeva) పేరు కూడా ఉంది.[5] ఈ దేవాలయం మీది శిల్పాల్లో కోలాటం[6] శిల్పం ఉంది.

మొదటి చాళుక్య భీముడు :

గుణగ విజయాదిత్యుని తర్వాత మొదటి చాళుక్యభీముడు [క్రీ. శ. 892-922] ద్రాక్షారామం, చాళుక్య భీమవరం, చేబ్రోలులలో భీమేశ్వరాలయాలు కట్టించాడు.[7] ఈ చాళుక్య భీమవరం ప్రస్తుతం సామర్లకోటలో కలిసిపోయింది.[8] ఈతడు కట్టించిన ద్రాక్షారామం, చాళుక్య భీమవరాల భీమేశ్వరాలయాల కుడ్యాలపై ఉన్న చిత్రాల్లో కోలాటం బొమ్మలు[9] కూడా ఉన్నాయి.

చాళుక్యుల కాలంలో విజయవాడ వద్దగల జమ్మిదొడ్డిలో వెలసిన దేవాలయపు కట్టడాలపై ఉన్న శిల్ప కళాఖండాల్లో కోలాటం బొమ్మలు ఉన్నాయి. ఈ దేవాలయం క్రీ.శ. 9. శతాబ్దంలో నిర్మించబడినట్లు చరిత్ర పరిశోధకులు నిర్ధారించారు.[10]

వీరభద్ర దేవాలయం : మాచెర్ల :

చాళుక్యుల కాలంలో హైహయులు కోన మండలాన్ని పాలించారు. వీరు చాళుక్య చోళులకూ, వెలనాటి చోళులకూ లోబడి పాలించినరాజులు. వీరి శాసనాలు క్రీ శ. 1112-1206 లలో కనిపిస్తున్నట్లు చెబుతారు. వీరిలో పల్నాటి యుద్ధం [క్రీ. శ. 1178-1182]తో[11] ప్రశస్తికి వచ్చిన నలగామరాజువద్ద మంత్రిగా

---

5. Andhra pradesh Government Archeological series No. 19, p. 3.
6. సమగ్రాంధ్ర సాహిత్యం, 1-98
7. Eastern Chalukyan Temples of A.P., p. 2.
8. ఆంధ్రప్రదేశ్ దర్శిని, పు. 679.
9. ఆంధ్రనాటకరంగ చరిత్ర, పు. 42.
10. Temple Sculpture of Andhra Pradesh, p. 16.
11. పల్నాటి వీరచరిత్ర, ప్రథమ భూమిక, పు. 26.

చేరిన నాగమ్మ మాచర్లలోని వీరభద్రాలయం కట్టించిందని కొందరు చెబుతారు. కాని ఆధారాలు కన్పించవు, మాచర్లకు వాయవ్యదిశలో చంద్రవంక నదిఒడ్డున దాదాపు నూరు మీటర్ల దూరములో బ్రహ్మనాయునిచే నిర్మింపబడినట్లు వాడుకలో ఉన్న చెన్నకేశవాలయం ఉంది. దానికి దక్షిణ ప్రక్కన వీరభద్రాలయం ఉంది. ఈ రెండు దేవాలయాలకు ఒకే వెలుపలి ప్రాకారం ఉంది. లోపలి ప్రాకారం తూర్పు ద్వారానికి ఎడమప్రక్క వెలుపలివైపునగల ప్రాకార కుడ్యంపై కోలాటం బొమ్మలు ఉన్నాయి. వివిధ భంగిమల్లో కోలాటం వేస్తున్న స్త్రీమూర్తి చిత్రాలు చెక్కబడ్డాయి. ఇదే ప్రాకారం ఉత్తరదిశలో వెలుపలివైపున కొన్ని కోలాటం వేస్తున్న స్త్రీమూర్తుల రేఖాచిత్రాలు అసంపూర్ణంగా గోచరిస్తాయి.

**కాకతీయులు :**

కాకతీయ చక్రవర్తులందరిలోను కడు కీర్తి గడించిన గణపతి దేవుడు [క్రీ. శ. 1199-1261] కళాభిమాని. నృత్తరత్నావళి కర్త జాయప సేనాని ఈతని కాలం వాడే. ఈ గణపతి దేవుని సేనాని, మంత్రి అయిన రేచర్ల రుద్ర దేవుడు క్రీ. శ. 1213లో కట్టించిన రామప్ప దేవాలయ కుడ్యాల మీద ఉన్న శిల్పసంపద ప్రసిద్ధి చెందింది.[12] జాయప సేనాని నృత్తరత్నావళిలో లక్ష్యలక్షణ సమన్వయంగా పేర్కొన్న అనేక నృత్యభంగిమలకు రామప్పదేవాలయం ప్రత్యక్ష ప్రమాణంగా శిల్పించబడిందా అని ఆశ్చర్యం కలుగుతుంది. ఈ దేవాలయంలో కోలాట భంగిమలు గల చిత్రాలు రూపుదిద్దుకున్నాయి.

**విజయనగర రాజులు :**

విజయనగర రాజులు క్రీ.శ. 1398 నుంచి 1567 వరకు విజయనగర సామ్రాజ్యాన్ని పాలించారు. ఈ రాజుల కాలంలో నిర్మితమైన దేవాలయపు కట్టడాల్లో[13] శ్రీశైల మల్లికార్జున దేవాలయ కుడ్యాలపైననూ, హంపి దేవాలయ కుడ్యాలపైనను ఉన్న శిల్పసంపదలో కోలాట బొమ్మలు కూడా ఉన్నాయి. తాడిపత్రిలో వీర నరసింగరాయల ఆదేశానుసారం ఆయన మంత్రి సాళువ

12. ఆంధ్రనాటక రంగచరిత్ర, పు. 93, 94.

13. **Select Vijayanagar Temples of Rayalaseema** p. 89



మాచర్ల వీరభద్రాలయం ప్రాకార కుడ్యంపై ఉన్న కోలాట చిత్రం.

తిమ్మయ్యగారు క్రీ.శ. 1509 సంవత్సరంలోగా రామలింగేశ్వరస్వామి దేవాలయానికి కట్టించిన భోగమంటపం, గోపురం ప్రాకారాల్లోని శిల్పాల్లో కోలాటం[14] వేస్తున్నట్లున్న శిల్పం ఉంది. వెల్లూరు దేవాలయ కట్టడాల్లోని శిల్పాల్లోనూ కోలాటం శిల్పం ఉంది.

ఇట్లు కళాపోషకులు, చరిత్ర ప్రసిద్ధులు, ప్రాచీన రాజులైన పల్లవులు, చాళుక్యులు, హైహయుల తర్వాతి రైపులు, కాకతీయులు, విజయనగరరాజుల కట్టడాలపై ఉన్న శిల్పాల్లో కోలాటం బొమ్మలు కన్పిస్తాయి.

సంస్కృత సాహిత్యం :

సంస్కృత సాహిత్యంలో కోలాటం అనే పదానికి పర్యాయవాచకాలైన దండరాసకం, హల్లీసకం పదాల ప్రసక్తి కన్పిస్తుంది. దండి-కావ్యాదర్శం, శారదాతనయుడి భావప్రకాశం, జాయప సేనాపతి నృత్తరత్నావళి, విద్యానాథుని సాహిత్యదర్పణం మొదలయిన కావ్యాల్లోనూ, శబ్దకల్పద్రుమమ్‌లోను వీటిని గమనించవచ్చు.

దండి-కావ్యాదర్శం :

దండి [క్రీ.శ. 6 శతాబ్ది] తన కావ్యాదర్శంలో కావ్యభేదాలను-

"లాస్యచ్ఛలిత శంపాది ప్రేక్షార్థమ్ ఇతరత్ పునః
శ్రావ్యమే వేతి సైషాఽపి ద్వయీ గతిరుదాహృతా॥"[16]

అని రెండు రకాలుగా పేర్కొన్నాడు. ఇందులో లాస్యం, చలితం, శంపాదులు దృశ్యాలు. ఈ శ్లోకంలోని 'ఆది' శబ్దంతో తాండవం, హల్లీసకం, రాసకం మొదలయినవి గ్రహించాలని వ్యాఖ్యాత ఆచార్య శ్రీరామచంద్ర మిశ్ర పేర్కొన్నారు. ఇది వ్యాఖ్య మాత్రమే కాని దండి హల్లీసకం అనే పదాన్ని స్పృశింపలేదు. మిశ్రగారు—

14. జానపద కళాసంపద, పు. 6.

16 కావ్యాదర్శం, 1-39.

"మండలేనతు యత్ స్త్రీణాం నృత్యంహల్లీసకంతుతత్
తత్ర నేతా భవేదేకో గోప స్త్రీణాం యథాహరిః॥"[17]

అని హల్లీసక లక్షణాలను కూడ వివరించారు

**శారదాతనయుడు - భావప్రకాశం :**

శారదా తనయుడు (క్రీ.శ. 12 వ శతాబ్ది) తన భావ ప్రకాశంలో[18] ఉపరూపక బేదాలను వివరించాడు ఆ ఉపరూపక బేదాల్లో హల్లీసకం ఒకటిగా పేర్కొని—

"అథ హల్లీసకం సప్తనవాష్ట దశనాయికం
సానుదాత్తోక్తి చైకాంకంకైశికీవృత్తి భూషితం
ఏకాంకం వాభవేద్వ్యంకం విమర్శముఖ సంధిమత్"[19]

అని హల్లీసక లక్షణాలను వివరించాడు. అంటే హల్లీసకంలో ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది మంది నాయికలు ఉంటారు. ఒక అంకమే ఉంటుంది. ఉదాత్త వచనాలతో ఉంటుంది. ముఖ సంధి, విమర్శక సంధి ఉంటాయి. కైశికీ వృత్తి ఉంటుంది.

**జాయప సేనాపతి- నృత్త రత్నావళి :**

కాకతీయ గణపతి దేవుని బావమరది అయిన జాయప సేనాపతి క్రీ.శ. 1254 లో[20] నృత్త రత్నావళిలో ఏడో అధ్యాయంలో ఆ కాలంలో ప్రచారంలో ఉన్న దేశి నృత్య పద్ధతులను వివరించాడు. అందులో ప్రస్తుత కోలాటానికి నామ సాదృశ్యంతో ఉన్న 'కోల్లాటము' అనే ఒక దేశి నృత్యాన్ని, దండరాసకాన్ని లక్షణ సహితంగా వివరించాడు. ఈ లక్షణాలను మొదటి అధ్యాయంలో విపులంగా పరిశీలించాం.[21]

---

17. కావ్యాదర్శము, ప్రకాశ సంస్కృత-హిందీ వ్యాఖ్యా, పు. 34,35.
18. విద్యార్థి కల్పతరువు, 2-572.
19. భావ ప్రకాశం, 9-125-127.
20. విజ్ఞాన సర్వస్వం, 4-806.
21. నృ.ర. చూ., పు. 12.

**విద్యానాథుడు-సాహిత్య దర్పణం :**

కాకతీయ ప్రతాపరుద్రుని కాలం (క్రీ.శ. 1292-1323)[22] వాడైన విద్యానాదుడు తన సాహిత్య దర్పణంలో ఉపరూపక భేదాల్ని వివరిస్తూ హల్లీసకం కూడా ఒక ఉపరూపక భేదంగా పేర్కొన్నాడు.

> "హల్లీష ఏప ఏకాంకః సప్తాష్టౌదశ వాస్త్రియః
> వాగుదాత్తైక పురుషః కైశికీ వృత్త సంకులః
> ముఖాంతి మౌ తదా సంధి బహుతాలలయ స్థితిః ।"[23]

అని హల్లీసక లక్షణాలు వివరించాడు. అంటే హల్లీసకంలో ఒకే అంకం ఉంటుంది. ఏడు, ఎనిమిది లేక పదిమంది స్త్రీలు ఉంటారు. ఉదాత్తమైన భాష ఉంటుంది. పురుషుడొక్కడే ఉంటాడు. కైశికీ వృత్తి ఉంటుంది మొదటి - చివరి సంధులు ఉంటాయి. అనేక తాళ లయాన్వితంగా ఉంటుంది.

**నీలకంఠ దీక్షితులు-హరివంశ టీక :**

నీలకంఠ దీక్షితుడు (క్రీ.శ. 17వ శతాబ్ది) హరివంశ టీకలో పేర్కొన్న హల్లీసక లక్షణాలు శబ్ద కల్పద్రుమమ్‌లో ఉటంకించబడినాయి.[24] వీటిని మొదటి అధ్యాయంలో చూడవచ్చు.[25]

ఇట్లు సంస్కృత సాహిత్యంలో కోలాట పర్యాయ వాచకాల ప్రసక్తి కన్పిస్తుంది.

**తెలుగు సాహిత్యం :**

తెలుగు సాహిత్యంలో పాల్కురికి సోమన, తిక్కన, నాచన సోమన, వినుకొండ వల్లభరాయడు, శ్రీనాధుడు, ఎడపాటి ఎర్రన, తరిగొప్పుల మల్లన,

---

22. విజ్ఞాన సర్వస్వం, 4-703.
23. శబ్ద కల్పద్రుమమ్, 5-525.
24. పైది.
25. చూ., పు. 15.

రాయసం వెంకటపతి, రఘునాథరాయలు, సురభిమాధవరాయలు, నుదురుపాటి వెంకన, కంకంటి పాపరాజు, కనుపర్తి అబ్బయామాత్యుడు, అయ్యలరాజు నారాయణామాత్యుడు మొదలయిన వారి రచనల్లో కోలాటం ప్రసక్తి కన్పిస్తుంది. ఒక్కొక్కరి కావ్యాలలో కోలాటం ప్రసక్తిని పరిశీలించవచ్చు.

**పాల్కురికి సోమన :**

పాల్కురికి సోమన క్రీ.శ. పన్నెండో శతాబ్ది చివర, పదమూడో శతాబ్ది ఆరంభకాలం వాడుగా ఎక్కువ మంది అంగీకరించారు. ఈయన పేరెన్నిక గన్న శైవ కవి. తెలుగు సాహిత్యంలో జానపద లక్షణాలను ప్రవేశపెట్టిన ఘనత పాల్కురికి సోమనకు దక్కింది ఈయన గ్రంథాలయిన బసవపురాణం, పండితా రాధ్య చరిత్రల్లో ఆనాటి తెలుగుజాతి జీవన విధానం నిండుగ ప్రతిఫలిస్తుంది. నిజంగా తెలుగు సాంఘిక చరిత్ర నిర్మాణానికి సోమన రచనలు ఉపకరించినంత విరివిగా ఇతరుల రచనలు ఉపకరించవనడం ప్రాజ్ఞులు అంగీకరించిన విషయమే.

సోమన శివరాత్రి ఉత్సవాలు వర్ణించే సందర్భంలో దేశీనృత్యాలు, దేశీ గీతాలు వివరించడం కన్పిస్తుంది. పండితారాధ్య చరిత్రలోని మహిమ ప్రకరణంలో ధవళేశ్వర చరిత్ర కథనంలో కోలాట ప్రస్తావన కనబడుతుంది. మల్లికార్జునుడు కళ్యాణ కటకానికి అభిగమనంచేసే సందర్భంలోని-

"శుద్ధ సాళగ గీత సూర్ణాదులులియ
నంతంత గోలాట లంతంత జోక
లంతంత గేళిక లభినయింపంగ
జాంగుభళా! యంచు శబ్దముల్ మ్రోయ"[26]

అనే పద్యభాగాల్లో మనకు కోలాటం ప్రస్తావన గోచరిస్తుంది.

**తిక్కన :**

తిక్కన [క్రీ. శ. 1205-1290][27] రచించిన ఆంధ్ర మహాభారతంలో దండలాసకం ప్రస్తావన ఉంది. మూలభారతంలో బృహన్నల రూపధారి అర్జునుడు శాస్త్ర పాండిత్యాన్ని గూర్చి—

26. పండితారాధ్య చరిత్ర, మహిమ ప్రకరణం. పు. 179.
27. విజ్ఞాన సర్వస్వం, 4-809-811.

ప్రాచీన ఆకరాలు : కోలాటం ప్రసక్తి

> "గాయామి నృత్యామ్యథ వాదయామి
> భద్రోఽస్మి నృత్తే కుశలోఽస్మి గీతే
> త్వముత్తరాయాః పరిదత్స్వ మాంస్వయం
> భవామి దేవ్యా నరదేవ నర్తకః"[28] అని మాత్రమే చెప్పుకుంటాడు.

కాని తిక్కన తెనిగించిన భారతంలో బృహన్నల దేశినృత్యాలుకూడా నేర్చినట్టు-

> "ఒండు పనులకు నెలవు లేకునికిఁజేసి
> యభ్యసించితి శైశవమాదిగాక
> దండలాసక విధమును గుండలియును
> ప్రేంఖణంబు తెఱంగును బ్రేరణియును"[29]

అనే పద్యంవల్ల తెలుస్తుంది.

ఇందు దండలాసకాన్నే గాక కుండలి, ప్రేంఖణ, ప్రేరణి మొదలయిన దేశి నృత్యాలనుకూడా పేర్కొన్నాడు.

**నాచన సోమన :**

విజయనగర రాజు బుక్కరాయల ఆస్థాన కవి నాచన సోమన [క్రీ. శ. 1344 ప్రాంతం][30] గ్రంథం ఉత్తర హరివంశంలో హంసడిభకోపాఖ్యానంలో కోలాటం ప్రస్తావన కనబడుతుంది.

శ్రీకృష్ణుడు హంస డిభకులపై దండెత్త నిశ్చయించి పుష్కర సరస్తీరాన చతురంగ సైన్య సమేతంగా విడిసి చేయడానికి నిశ్చయించుకుంటాడు. సేనలతో వెడలుతున్నప్పుడు దృఢ సంరావంతో సకల స్థావరాలు కదిలేటట్లు పాంచజన్యం పూరిస్తాడు. ఆ సందర్భంలోని—

---

28. మహాభారతం, పం. సం., విరాట., 10 అధ్యాయం, 8 శ్లోకం.
29. ఆంధ్ర మహాభారతం, విరాట., 1-239.
30. విజ్ఞాన సర్వస్వం, 3-591.

"వడకు పన్నగరాజు పడగల మీద స
　　ర్వం సహాకాంత పేరణము సూప
నుఱ్ఱూత లూగెడు నుదయాస్త గిరులతో
　　నాకాశలక్ష్మి కోలాటమాడఁ
దెరలెత్తి సప్త సాగరములుఁ బొరలంగ
　　వరుణుండు గొండిలి పరిఢవింప
మొకముల చాయ వేఱొక చందముగ నిల్చి
　　కమలసంభవుడు ప్రేంఖణ మొనర్ప

మంగలములోని పేలాల మాడ్కిఁ జుక్క
లిక్కడక్కడ వడదిక్కు లెనిమిదియును
బగులఁ బాతాళ తలము గుబ్బిటిలఁ జెలగె
శౌరి పూరింప నప్పాంచజన్యరవము"[31] అనే పద్యములో ఉదయాస్త గిరులు ఉర్రూత లూగుతుంటే ఆ గిరులతో ఆకాశమనే లక్ష్మి కోలాటమాడినట్లుం దని వర్ణించబడింది. ఇచ్చట కోలాటం స్త్రీల పరమైన నృత్యంగా కన్పిస్తుంది.

**వినుకొండ వల్లభరాయడు :**

వినుకొండ వల్లభరాయని [క్రీ. శ. 1420][32] క్రీడాభిరామంలో కృతి కర్తృ ప్రశంసలోని పద్యంలో హల్లీసకం అనే పదం కన్పిస్తుంది.

"హల్లీసక నటనోద్భట
పల్లవ హరికృష్ణ కంతవన మూల్యామిళ
ద్గల్లత్ సురుభులు తిప్పయ
వల్లభ రాజ ప్రధాన వాగ్వైభవముల్"[33]

---

31. ఉత్తర హరివంశం, 4-216.
32. విద్యార్థి కల్పతరువు, 2-667.
33. క్రీడాభిరామం, 25వ పద్యం.

**శ్రీనాథుడు :**

శ్రీనాథుడు [క్రీ శ 1380-1460][34] భీమేశ్వర పురాణంలో భీమేశ్వర మహాదేవుడికి ప్రియమైన ద్రాక్షారామ వర్ణన గావించాడు పర్వదినాల్లో భీమేశ్వరుని అలంకరణ, ఉత్సవ సంరంభం తెల్పే సందర్భంలో హల్లీసక, దండలాసకాల ప్రస్తావన కనపడుతుంది.

"పెండియు భీమేశ్వరుండు పండువు పండువు నఖండ విభవంబున నాఖండ లాది విబుధ మండలంబు పరివేష్టింప

జగనొప్ప గండ జగదగోపాల పల్లవాదిత్య పల్లవ త్రినేత్ర కేళాదిరాయ రాయ వేశ్యా భుజంగ బిరుదాభి రామాల్లయ వేమభూపాల రాజ్యభార దురంధరుండౌ బెండపూడన్నయా మాత్యుడు గట్టించిన మొగసాల వాకిట మహోత్సవ మండ పంబు నందుఁ రోలగంబుండి, కుండలీ దండలాసక ప్రేరణీ ప్రేంఖణ సింధు కందుక ధమాళి చేలమతల్లీ హల్లీసకాది నృత్యంబు లవలోకించుచుఁ బంతంబు లవధరించుచు, మేలంబు లాలకించుచుఁ, జంపూచాటు నాటకోదాహరణ జయఘోష చక్రవాళ చతుర్భద్ర చతురాతి ప్రబంధంబు లాకర్ణించుచు వినోదించుచుండు."[35] అనే పై వర్ణనలో దండలాసకం,హల్లీసకం రెండు నృత్యాలు పేర్కొనబడినాయి. పై ప్రయోగాన్ని బట్టి ఇవి శ్రీనాథుని కాలానికి రెండు పోలికలున్న రెండు బిన్నమైన నృత్యాలుగా కొనసాగుతుండేవని భావించవచ్చు. ఇచ్చట ఇవి రెండును స్త్రీల పరంగానే కన్పిస్తున్నాయి.

**ఎడపాటి ఎఱ్ఱన :**

ఎడపాటి ఎఱ్ఱన [క్రీ. శ. 16 వ శతాబ్దం][36] మల్హాణ చరిత్రను రచించాడు. సంస్కృత కవి మల్హాణునికి, పుష్పగంధి అనే వేశ్యకు గల ప్రణయ గాథ ఇందలి ఇతివృత్తం. పుష్పగంధి జాలకుడను నటుని దగ్గర సాము, నాట్య విద్యలన్నీ నేరుస్తుంది. ఆమె నేర్చిన నాట్యవిద్యల్లో కోలాటం ఒకటి.

---

34. విజ్ఞాన సర్వస్వం, 3-596.
35. భీమేశ్వరపురాణం, భీమేశ్వరుని ఉత్సవసంరంభ ఘట్టం.
36. మల్హాణ చరిత్ర, పీఠిక.

"మొగవరి కట్టడ మొనవు కోలాటంబు
చొక్కంపు మురువులు చిక్కిణీలు
దరవు బారబడు బేసి బహుళరూపు
బంధుర గీత ప్రబంధ వితతి
వరుస పద్యదేశి బంగాళంబు కంచి
కొరుతి కట్టడ బిందు కొటియకాడు
పరశురాముడు వీరభద్రుడు కళ్యాణి
చౌ మెకతాళి శబ్దమాది
దేశి శుద్ధాంగముల యందుఁ దీగెబోడి
పటు తరంబుగ నిజపాద కటకయుగళి
కఖిల పాత్రమ్ములును బొమ్మలగుచు వ్రేల
బూన్కి వహియింపఁ బొగడొందెఁ బుష్పగంధి"[37]

అనే పద్యంలో పై విషయం తెలుస్తుంది. ఇచ్చట కోలాటం స్త్రీల నృత్యంగానే చెప్పబడింది.

**తరిగొప్పుల మల్లన :**

తరిగొప్పుల మల్లన (క్రీ. శ. 1570-1625)[38] తన చంద్రభాను చరిత్రలో కోలాటాన్ని పేర్కొనడం కన్పిస్తుంది. శ్రీకృష్ణ సత్యభామల పుత్రుడు చంద్రభానుడు ఇందులో నాయకుడు.

చంద్రభానునికి తుంబురుని స్నేహితుడైన ఒక సిద్ధుడు వచ్చి కుముదిని వృత్తాంతం చెప్పే సందర్భంలోని-

"కేలం బంగరు గచ్చుకోల లమరన్ గీర్వాణ బాలామణుల్
శ్రీ లీలావతిపట్టి కట్టికల వారింబోలి తచ్ఛాస్త్ర వి
ద్యా లాలిత్యము లుగ్గడించి మృదులాలాపంబులం బాడుచుం
గోలాటంబులు వైచిరాయతి తముం గూర్మింగటాక్షింపగన్."[39]

---

37. మల్హణ చరిత్ర, ప్రథమాశ్వాసం.
38. విజ్ఞాన సర్వస్వం, 6-756.
39. చంద్రభాను చరిత్ర, 2-139.

అనే పద్యంలో కోలాటం ప్రస్తావన కన్పిస్తుంది. ఇచ్చట కూడ కోలాటం స్త్రీల పరంగానే చెప్పబడింది.

రాయసం వెంకటపతి :

రాయసం వెంకటపతి [క్రీ. శ. 16 వ శతాబ్ది][40] లక్ష్మీ విలాసంలో కోలాటం ప్రస్తావన ఉంది.

> " మోహనాంగు లపార శృంగారంబులు
> నెఱపుచుఁ గోలాటలాడ "[41]

అని పేర్కొనబడింది. ఇచ్చట కూడా కోలాటం స్త్రీల పరమైన నృత్యంగానే చెప్పబడింది.

రఘునాథరాయలు :

తంజావూరి పాలకుడు [క్రీ. శ. 1600-1631][42] ఐనట్టి రఘునాథ రాయలు తన వాల్మీకి చరిత్రలో దండలాస్యం ప్రస్తావన చేశాడు.

> "పేరణి దండలాస్యమును ప్రేంఖణి కుండలినాఁ జతుర్విధో
> దారములైన నాట్యముల యందపుఁటెల్ల నెఱింగి యందు నిం
> పారుచు నుండు మూడు పది లాయిను నైరగు సంగహారముల్
> రారస భావ దృష్టు లలరన్ నటియించెద మాట లేటికిన్."[43]

అనే పద్యంలో రంభ తాను నేర్చిన తాళాలను తెల్పి, అవి ఊర్వశి చెప్పినట్లయితే తన బిరుదులన్నీ ఇస్తానని సవాలు చేస్తుంది. కోలాటం ఇచ్చట స్త్రీల నృత్యం గానే చెప్పబడింది.

---

40. ఆ.క.త., 11-55.
41. లక్ష్మీ విలాసం, 5-74.
42. వాల్మీక చరిత్ర, పీఠిక, పు. 1.
43. పైది, 1-194.

### సురభి మాధవరాయలు

అళియ రామరాయలవల్ల పెదప్రోలు సంస్థానాన్ని బహుమానంగా పొందిన[44] సురభి మాధవరాయల [క్రీ. శ. 16 శతాబ్ది చివర] కావ్యం చంద్రికా పరిణయంలో కోలాటం ప్రస్తావన గోచరిస్తుంది. కథానాయకుడు హేమకూట పర్వతం మీదుగా పయనిస్తూ ఒక కోనలో గంధర్వులు ఆడే కోలాటాన్ని తిలకిస్తాడు. ఆ సందర్భంలోని—

"కట్టెండ పెడఁద కాఁకఁగలంగి ప్రవహించు
జవ్వాది డిగ్గియ చాలలోయఁ
బడుచుఁ జొక్కపుఁ గ్రొత్తపటికంపుఁ జడెపజ్జ
బాగైన కెంపురాపలుకువాలుఁ
పొదరుఁ బొన్నల రాలు పుప్పొడి యిసుముపైఁ
బగిలి యొప్పెడు వేరుపనస వంటి
నీటి కాల్వలఁ బోచి పాటించు జేజేల
మ్రాకు తీవలఁ జుట్టి రాగసలరు
దాక పందిలి క్రింద నిద్దంపు వేడ్క
దవిలి కోలాటమాడు గంధర్వసతుల
చారు సౌవర్ణ కటక సింజానినాద
కుల ఘుమ ఘుమా మానమౌ కోనఁగనియె"[45]

అనే పద్యంలో కోలాటం పేర్కొనబడింది. ఇక్కడ కూడా కోలాటం స్త్రీల నృత్యంగా చెప్పబడింది.

### నుదురుపాటి వెంకన

నుదురుపాటి వెంకన [క్రీ.శ. 1730-1770] [46] పుదుక్కోట నేలిన రాయరఘునాథతొండమానుని [క్రీ. శ. 1767 - 1789][47] కాలంవాడు.

---

44. విజ్ఞాన సర్వస్వం, 4-976.
45. చంద్రికా పరిణయం, 2-20.
46. విజ్ఞాన సర్వస్వం, 6-381.
47. ఆ. ప. త., 14-47.

ఈతని రచనల్లో ఒకటైన ఆంధ్రభాషార్ణవంలో కోలాటం ప్రస్తావన ఉంది.

"కోలాటమనగ హల్లీసకంబలరుచుండు "[48]

అని చెప్పబడింది. ఇందులో కోలాటం అంటే హల్లీసకం అని పేర్కొన్నాడు.

**కంకంటి పాపరాజు :**

కంకంటి పాపరాజు [క్రీ.శ 1660][49] కావ్యం ఉత్తర రామాయణంలో కోలాటం ప్రస్తావన కన్పిస్తుంది. ఇందులో కార్తవీర్యార్జునుడు రావణుని చెరబెట్టిన ఘట్టంలోని—

"దశకంఠ దర్పవేదండ కంఠీరవ
జయ జయ యని వందిజనులు పొగడ
రోదసీ కుహరంబు భేదిల్ల
సేనా ముఖంబునఁ దూర్యఘోషంబు లెసఁగ
జంభారి ప్రోల నచ్చరలట్లు
గణికాంబుజాస్యలు దండలాస్యంబులు సలుప
ఫలముఖోపాయనంబులు దీవనలు నిచ్చి
యెడనెడ బ్రాహ్మణు లెదురుకొనగ
నఖిల శృంగారములు మించునాత్మనగర
మంచిదైశ్వర్యమునఁ బ్రవేశించి సౌధ
చారణ స్త్రీలు ముత్యాలఁజల్లుచుండఁ
గొలువునకు నేఁగె జననాథ కుంజరుండు"[50]

అనే పద్యంలో దండలాస్యం ప్రస్తావన ఉంది. ఇప్పుడు కూడా కోలాటం స్త్రీల నృత్యంగా చెప్పబడింది.

**కనుపర్తి అబ్బయామాత్యుడు :**

కనుపర్తి అబ్బయామాత్యుని (క్రీ.శ. 1730-1780)[51] కావ్యమైన కవి రాజమనోరంజనంలో దండలాసకం ప్రస్తావన కన్పిస్తుంది. ఆ కావ్యానికే పురూరవ చరిత్ర అనే పేరు కూడా ఉంది. అందులో-

48. ఆంధ్రభాషార్ణవం, 1-130. 49. ఆ.క.త., 12-73.
50. ఉత్తర రామాయణం, 3-256. 51. విజ్ఞాన సర్వస్వం, 6-382.

సీ॥ కుంచరీ ప్రేరణీ దండలాసక
ముఖ్య నృత్యంబు లచ్చరల్ నెరపుచుండ "[52]

అని దండలాసకం స్త్రీల నృత్యంగానే కన్పిస్తుంది.

**అయ్యలరాజు నారాయణామాత్యుడు**

క్రీ.శ. 18 శతాబ్ది[53] వాడైన అయ్యలరాజు నారాయణామాత్యుని హంస వింశతిలో-

" దూచియు జాబిల్లి బూచ కన్నుల కచ్చి
గుడుగుడు గుంచాలు కుందెనగిలె చికటి
మొదికెళ్ళు చెండు కట్టిన చొదిపులియాటలును
జిబ్లిపొట్లకాయ ..
కోలాటములు పిల్లగ్రోవులు గుమ్మడ క్రోవికూతలు
నూచ క్రోవులొడ్డు
తాటియాకుల చిలుకలు తాళ్ళపాములకు
మగచాట్ల పోతునై యాడుకొనుచు
వయసుపై సంధ్యపైనాస్థ చాలలేక
పొంది యారీతి నేప్రొద్దుపుచ్చుచుండు"[54]

అనే సీసమాలికలో ఎన్నో ఆటలు పేర్కొన్నాడు. అందులో కోలాటం కూడా ఒకటి. ఇచ్చట కోలాటం పురుషులు ఆడినట్లుంది. పైన పేర్కొన్న వారంతా కోలాటాన్ని స్త్రీలపరంగా పేర్కొన్నారు. మరొకచోట ఒకపద్యంలో దండలాసకం, కోలాటం రెండూ కన్పిస్తాయి.

''చారుదండమును శుద్ధపద్ధతి బహురూప
లక్షణంబును దండలాసకంబు
ప్రేంఖణ పద్ధతి ప్రేరణపద్ధతి
కుంచరి నృత్తంబు ఛాండికంబు

52. కవిరాజ మనోరంజనం, 1-194.
53. ఆ. క. చ., 18-219.
54. హంసవింశతి, 2-147.

రాసకాఖ్యయు నాట్యరాసకంబును
చిత్రపద్ధతియును దేశ్యపద్ధతియును
జర్చరి కందుక చానరి కోలాటములు
నాఁగఁదగు పేర్లు గలిగినట్టి
షోడశవిధ నృత్తంబుల చొరవవెలిగిఁ
సరవిఁజంచత్పుటంబుఁ బ్రాంచత్పుటంబు
ధ్రువము మర్యము రూపక త్రిపుట జంపె
యేక తాళాట తాళాదు లెల్లఁదెలిసి''[55]

అనే పద్యంలో కన్పించే దండలాసకం, కోలాటాలను రెండింటినికూడా షోడశవిధ నృత్తాల్లో పేర్కొన్నాడు. అంటే ఇచ్చట భిన్ననృత్యాలుగా పేర్కొనడం కన్పిస్తుంది.

ఇట్లు తెలుగు సాహిత్యంలో కన్పించే కావ్యాలు, నిఘంటువుల్లో కోలాటం దాని పర్యాయవాచకాలైన దండరాసకం, దండలాసకం, దండలాస్యం, హల్లీసకం అనేవి కన్పిస్తున్నాయి. సాహిత్యపరంగా పరిశీలిస్తే పన్నెండో శతాబ్దికే కోలాటానికి అస్తిత్వం ఉందని చెప్పవచ్చు. సాహిత్యంలో కోలాటం ప్రసక్తి నామమాత్ర నిర్దేశంతో ముగిసిందేకాని దానిరూపురేఖలు, తీరుతెన్నులు కొంతగానైన ప్రస్ఫుటం కాలేదు. ఈ నృత్యాన్ని వివరించడానికి ఏ కవి పూనుకోలేదు సాహిత్యంలో ఎచ్చట పరికించినా ఈ కోలాటం గంధర్వకన్యలో, కిన్నెరకన్యలో, ఇతర నాట్యగత్తెలో ఆడినట్లు వివరించబడింది. హంసవింశతిలో మాత్రం కోలాటం పురుషులు ఆడినట్లుగా కన్పిస్తుంది అంటే ఆ కాలానికి ఈ క్రీడను పురుషులు ఆడడం నేర్చారని చెప్పవచ్చు. కోలాటాన్ని సాహిత్యపరంగా చూస్తే ప్రాచీనకాలంలోకూడా దీనికి ప్రచారం ప్రచురంగా ఉన్నట్లు ఊహించవచ్చు.

చారిత్రకుల ఉద్ధరణలు :

కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగరరాజులు మొదలయిన రాజుల కాలాల్లోని ప్రజల సాంఘిక స్థితిగతులు వివరిస్తూ చరిత్రకారులు కోలాటాన్ని ప్రస్తావించారు.

---

55. పైది, 5-126

**కాకతీయులు :**

కాకతీయుల కాలంలో స్త్రీలు ఆడిన క్రీడల్లో కోలాటం ఒకటని తగిన సాక్ష్యాలతో సురవరం ప్రతాపరెడ్డిగారు వివరించారు.[56]

**రెడ్డిరాజులు :**

రెడ్డిరాజుల పాలనలో ప్రజలు తమ సాంఘిక కళల్లో కోలాటాన్ని కూడా ఆడేవారని రెడ్డిగారు పేర్కొన్నారు.[57] రెడ్డిరాజుల కాలంలో వసంతోత్సవాలు జరిగేవి. ఇవి వసంతకాలంలో మన్మథుని గూర్చి చేసేవి. ఫాల్గుణ శుక్లపక్షంలో జరిగే ఈ వసంత మహోత్సవాలు రెడ్డిప్రభువుల కాలంలో అనవేమారెడ్డితో మొదలయ్యాయి. ఈ మహోత్సవంలో కవులు, గాయకులు, పురజనులంతా ఎంతో ఆనందోత్సాహంతో పాల్గొంటారు.[58] ఈ వసంతోత్సవాల్లో అన్నిరకాల ప్రదర్శనలతోపాటు కోలాట ప్రదర్శనలు కూడా పాల్గొనేవి.

**విజయనగర రాజులు .**

రెడ్డిరాజుల తర్వాత ఆంధ్రదేశాన్ని పాలించిన విజయనగరరాజులు వసంతోత్సవాల వంటివే అయిన మహానవమి ఉత్సవాలు జరిపేవారు. విదేశయాత్రికుడు పయాస్ (**Paes**) అనునతడు క్రీ.శ. 1510 నుంచి 1529 దాకా పాలించిన కృష్ణదేవరాయల కాలంలో జరిగే మహానవమి ఉత్సవాన్ని కన్నులార చూసినట్లు చెప్పుకున్నాడు. ఈతడు అందించిన సమాచారం ప్రకారం రాయల రాజ్యంలో రెండు ఉత్సవాలు మహావైభవంగా జరిగేవి.[59] అందులో తొమ్మిది రోజులు జరుపుకునే మహానవమి ఉత్సవం ఒకటి. నూతన సంవత్సరోత్సవం రెండోది. మహానవమి ఉత్సవం సెప్టెంబరులోను, నూతన సంవత్సరోత్సవం అక్టోబరులోను జరిగేవి. మహానవమి ఉత్సవాల్లో కవులు, కళాకారులు, ప్రజలు చిత్రవిచిత్ర ప్రదర్శనలతో తమ తమ కళలను ప్రదర్శిస్తారు. ఈ కళల్లో కోలాటం కూడా ఒకటి. హంపీలో ఇప్పటికీ కన్పించే మహానవమి దిబ్బ మీది శిల్పాల్లో కోలాటం శిల్పం ఉంది.

ఇట్లు పురావస్తు నిర్మాణాలు, సంస్కృత సాహిత్యం, తెలుగు సాహిత్యం, చరిత్రకారుల ఉద్ధరణలు మొదలయిన ప్రాచీన ఆధారాల్లో కోలాటం ప్రసక్తి కన్పిస్తుంది.

---

56. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పు. 59.
57. పైది, 172.
58. విజ్ఞాన సర్వస్వం, 4-1068.
59. **The Forgotten Empire, p. 137.**

# ఇతర సమూల కళారూపాలు : తులనాత్మక పరిశీలన

కోలాటం అన్నది ఒక అర్థంలో విశ్వవ్యాపకమైంది. కోలాటం ఆంధ్ర ప్రదేశంలోని అన్ని ప్రాంతాల్లోను ప్రచారంలో ఉంది. ఇంచుమించు ఇదేపేరుతో ఆటలో కొద్దిపాటి భేదాలతో ఆంధ్రేతర రాష్ట్రాలయిన కర్నాటక, తమిళనాడు, కేరళలలో విశేషప్రచారంలో ఉంది. అందువల్ల దీన్ని ద్రావిడకళ అనవచ్చని మళళి వసంతకుమార్ గారు నుడివారు.[1] ఈ రాష్ట్రాల్లో ఉన్న ఎన్నో జానపద నృత్యాల్లో కోలాటానికి ఒక ప్రత్యేకస్థానం ఉంది. తెలుగుదేశంలో ప్రచుర ప్రచారంలో ఉన్న కోలాటానికి ప్రక్రియలో కొద్ది గొప్ప తేడాలతో తుల్యాలైన అనేక కళారూపాలు గుజరాతు, మహారాష్ట్ర, రాజస్థాన్, సౌరాష్ట్ర, పంజాబు, బెంగాలు మొదలయిన ప్రాంతాల్లోను కన్పిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం ప్రస్తుతం కోలాటం పురుషుల క్రీడగా ఎక్కువ వాడుకలో ఉంది.ఇందెన్నోరకాలూ, రీతులూ ఉన్నప్ప టికీ వలయాకారంలో చేసే నృత్యం ప్రధానమైంది. ఉత్తరభారతరాష్ట్రాల్లో ఆయా భాషలకు అనువైన పదాలతో కోలాటం కన్పిస్తుంది. ఆడేవిధానంలో తేడాలు కొద్దిగా కన్పిస్తాయి.

యూరపులోని కొన్నిప్రాంతాల్లో దీనికి పిరనృత్యపు మన్నన ఉంది.[2] బ్రిటను, ఫ్రాన్సు, స్పెయిను, పోర్చుగల్, ఆస్ట్రియా, దక్షిణ అమెరికా దేశాలలో కన్పించే మొర్రిస్ నృత్యంలోని కొన్ని రీతుల్లో మన కోలాటం పోలికలు ఉన్నాయి.

కోలాటల పోలికలు కన్పించే కుమ్మి, జట్టిజాము, గర్బా, దండారియా నృత్యం, రాసనృత్యాలు, దండియారాస, లెజిమ్, మోరియా, భాంగ్రా, కనేనృత్యం, మొర్రిస్‌నృత్యం మొదలైనవి అన్నీ విపులంగా పరిశీలిస్తే కొద్దికొద్ది ప్రాంతీయ బేధాలుతప్ప ఒకేవిధంగా ఉన్నట్లు నిర్ధారించవచ్చు.

ముందుగా తెలుగుదేశంలోని సదృశరూపాలను గూర్చి పరిశీలనచేద్దాం.

---

1. కోలుపదగళు, పు. 12.
2. పైది, పు. 12.

## ఆంధ్రప్రదేశ్

తెలుగుదేశపు కోలాటం రకాలను గురించి కొంతలో కొంత పరిశీలించి అనువర్ణించిన పరిశోధకుల్లో మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు ఆద్యులుగా కన్పిస్తున్నారు వారి విభజనలో పెద్దల కోలాటం, పిల్లల కోలాటం, డప్పు కోలాటం అన్న మూడు రకాలు[3] కన్పిస్తున్నాయి

**పెద్దల కోలాటం:**

కోలాటం కంటె భిన్నంగా ఏమీ కన్పట్టదు. పెద్దవాళ్ళు వేస్తారు కాబట్టి పెద్దల కోలాటమనీ, అట్లే పిల్లలు వేసే కోలాటానికి పిల్లల కోలాటమనీ పేర్లు పెట్టి ఉంటారు.

**డప్పు కోలాటం :**

దప్పుమీద పుల్లలతో కొడుతూ ఆడుతూ ఉంటారు కాబట్టి డప్పు కోలాటం అని చెప్పుకోవచ్చు "డప్పుల వాద్యాన్నే తప్పెట్ల వాద్యమంటారు. వీటినే రాయలసీమ ప్రాంతంలో వనక తప్పెట్లు అంటారు." ఈ వాద్యాన్ని మాదిగ కులస్థులు ఎక్కువగా వాయిస్తూ ఉండారు.

ఈ నాటికీ ప్రతి పల్లెలోనూ ఏదేని కార్యక్రమాన్నిగాని, విశేషాన్నిగాని ప్రజలందరికీ తెలియజెప్పాలంటే ఒక దప్పుతో ఊరంతా ఎటువంటి విషయాన్న యినా చాటిస్తారు. వివాహాలకూ, అమ్మవారి జాతర్లకూ, వీరుళ్ళ పూజలకూ ఈ వాద్యాన్ని ఎక్కువగా ఉపయోగిస్తూ ఉంటారు. వాద్యం చాలా ఉద్రేకపూరితంగా ఉంటుంది. ఈ డప్పులను వేప చెక్కలతోను, చంద్రపు చెక్కలతోను చక్రంగా తయారుచేసి, గేదె దూడ చర్మాన్ని ఒక పక్క మూసి నిప్పు వేడి మీద కాచి వాయిస్తే కణకణమని శబ్దం వస్తుంది. ఈ డప్పులతో వలయాకారంగా నిలబడి—

"నీలాలారా నిమ్మాలారా—
నీళ్ళకుబోయే కన్యాలారా
రేపేపైనామాని చెప్పండోయ్
మేలన్నాలారా ॥నీలా॥

3. ఆంధ్ర నాటకరంగ చరిత్ర, పు. 296-301.

కోటా దుమికే పేటా దుమికే—
కోటలో గజనిమ్మ దుమికే
నిమ్మా ముల్లూ రొమ్ముా నాటేనూ
మేలన్నాలారా ॥నీలా॥

వెలివాలి త్తే గడియా కొత్తూనూ
సద్దీతిన్నా బావికాడా-సాబానాల బావికాడా
జోడుంగరాలు - మరచి పోతీసే
మామయ్యగారు
వెలివాలి త్తే గడియా కొత్తూను"

అంటూ డప్పులను వాయిస్తూ కోలాటం వేస్తారు. మామూలు కోలాటంలో అందరూ చిరుతలు ఉపయోగిస్తే ఈ కోలాటంలో అందరూ డప్పులను చంకల్లో ధరిస్తారు. దప్పులు ప్రయోగించే పుల్లలతో మధ్య ఒకరికొకరు కోలాటంవేస్తూ, ఎగిరెగిరి గజ్జల కాళ్ళతో నృత్యంచేస్తూ, అద్భుతంగా కోలాటం వేస్తారు. ఈ కనకతప్పెట్లు చాలా ఉత్తేజాన్ని కలుగజేస్తాయి. సామాన్య వరుసలతో ప్రారంభమైన జానపదుల ఈ డప్పుల వాద్యం ఈనాడు ఒక శాస్త్రీయ వాద్యంగా రూపొందింది.[4]

ఈ డప్పు కోలాటాన్ని పరికిస్తే డప్పు వాద్యాలతో కొందరు కలసి ఆడే దానికి డప్పు కోలాటం అని పేరు పెట్టినట్టు కన్పిస్తుంది. వలయంగా ఏర్పడడం, అడుగులు వేయడం, మధ్యలో లయ సరిదిద్దడం, డప్పులు వాయించడం వీటివల్ల మాత్రమే డప్పుల కోలాటం అనడం కంటే వీటన్నిటితోపాటు నడుమ నడుమ డప్పులను వాయించే పుల్లలను ఒకరిపుల్లలను మరొకరిపుల్లలతో తాకిస్తూ వెయ్యడం ఉంది కాబట్టి ఒకరకంగా దీన్ని డప్పుకోలాటం అని వ్యవహరించవచ్చు.

**జట్టి జాము :**

ఇది కోలాటాన్ని పోలి ఉంది. ఆంధ్రదేశంలో కొన్ని ప్రాంతాల్లో ప్రచారంలో ఉంది. దీనినిగూర్చి విపులంగా చర్చిస్తూ[5] కొన్ని ఊళ్ళలో దీన్నికోలాటం,

---

4. పైది, పు. 279-280.
5. జానపద కళా సంపద, పు. 187.

కోలన్న అంటారనీ, మొదట జట్టి జాము కోలాటంలోవలె చేతి కోలలతో ఆడే ఆట అనీ, కాలక్రమాన ఉత్త చేతులతో ఆడే ఆటగా మిగిలి ఉండవచ్చునని తూమాటి దొణప్పగారు నుడివారు జట్టిజాము వేసేవారు కాలు కదపకుండా వేయ వచ్చు. స్త్రీలు వలయంగా ఏర్పడి ఉభయ పార్శ్వాల్లో ఉండే ఉద్దేశకర్తలతో ఒక సారి కుడివైపుకి మరొకసారి ఎడమవైపుకి ఓరగా తిరిగి ప్రక్కవారి అరచేతులతో తన అరచేతులు తట్టుతూ పాటలు పాడుతూ ఆడే ఆట ఇది. కోలాటంలో పలు రకాల కోపుల్లో ఆయా పద్ధతుల ననుసరించి తిరగడం ఉంటుంది. కాని జట్టి జాములో తిరిగే పనిలేదు పైగా కోలలు లేవు ఇది స్త్రీలకే పరిమితం. పురుషులు చూడడానికి మాత్రమే వస్తారు. అయితే దీనిలో తొలుత కోలలు వాడినట్లు ఊహి స్తున్నారు[6] కాబట్టి కోలాటానికి దీనికి జన్య జనక సంబంధాన్ని ఊహించవచ్చు.

దండారియా నృత్యం :-

ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన జాతుల్లో గోండులకి ప్రత్యేకించదగ్గ పెద్ద తెగ. ఆంధ్ర దేశంలో ముఖ్యంగా ఆదిలాబాద్ జిల్లాలోని గిరిజన ప్రాంతంలోను, బస్తరు, సిరుపంచ, చాందాలోను గోండులు ఇప్పటికీ ఎక్కువగా ఉన్నారు[7]. వీరు దసరా అనంతరం రెండు వారాలపాటు ఉత్సవాలు జరుపుకుంటారు. ఆ ఉత్సవాల్లో ఆడే దండారియా నృత్యం కోలాటాన్ని పోలి ఉంది. దీనిలో ఇరుగు పొరుగు గ్రామాలవారు ఆ వూరివారు ఈ వూరికీ, ఈ వూరివారు ఆవూరికి వెళ తారు. వచ్చిన వాళ్ళకు స్థానికులు అతిథి సత్కారాలు చేస్తారు. ఎడమనుంచి కుడివైపుకి తిరుగుతూ చేతుల్లోని కర్రలను ఒకదానిపై ఒకటి కొట్టి తాళం వేస్తూ నృత్యం చేస్తారు. వీళ్ళను దండారియా నర్తకులు లంటారు.

అనుశ్రుతి గాథలను బట్టి పంచపాండవ జాతిలో ప్రసిద్ధుడూ, పూర్వీ కుడూ అయిన 'దండారియా' అనే వీరుడు ఈ ఆచారాన్ని సృష్టించినట్లు చెప్పు కుంటారు దండారియా నృత్యంలో పురుషులే పాల్గొంటారు. నర్తకులు అందె లతో, నగలతో, మంచి దుస్తులతో అలంకరించుకుంటారు. వీళ్ళను గాయకులు,

6. పైది, పు. 187-193.

7. నృత్యజ్యోతి, పు. 138.



జట్టి జాము



కోలాటం, కర్నాటక

డోలు, కప్పెటలు వాయించేవారు అనుసరిస్తారు. వలయంగా ఏర్పడటం, కర్రలు చేత పట్టుకోవడం, లయబద్ధంగా అడుగులు వేస్తూ ఎడమనుంచి కుడికి కదలడం, పక్కకు జరుగుతున్నప్పుడు కాస్త ఒకదాని పక్కన ఒకటి కర్రలు తాగా పెట్టడం-ఇవన్నీ కొద్దికొద్దిగ కోలాటంలో పోలికలు అయితే కోలాటంలో వలెగాక ఇందులో వాడే కర్రలు కొంచెం పెద్దవై ఉంటాయి[8]

ఇక ఇతర రాష్ట్రాల్లో విశేష ప్రచారంలో ఉన్న కోలాటపు తుల్య రూపాలను పరికిద్దాం.

## కర్ణాటక

**కోలాటం :**

ఆంధ్రప్రదేశ్‌లోని కోలాటానికి కర్ణాటకలో వేసే కోలాటానికి తేడా కన్పించదు. కర్ణాటకలో కోలాటాన్ని గురించి "కోలుపదగళు"అనే పుస్తకంలో మళలి వసంతకుమార్‌గారు చక్కగా వివరించారు.[9] ఈ పుస్తకం కన్నడంలో ఉంది. దీనిలో నిరూపించబడ్డ ఆటగాళ్ళు, జట్టు నాయకుడు, గజ్జెలు, తమ్మడి, తాళాలు, కర్రలు (కోలు), వేషధారణ, రకరకాలైన కోపులు, కోలాటం వేసే సమయాలు ఇత్యాద్యనేక సూక్ష్మాంశాలు అచ్చంగా తెలుగువారి కోలాటానికి ప్రతిబింబంగా కన్పిస్తాయి. కొయ్యతాలు[10] తప్ప తక్కినవాటిలో మనకు వారికి భేదం కన్పించదు. తమ్మడి మన ఆటలో కన్పించే కప్పెట మాత్రమే ఆదే విధానంలో లయ-తాళాలు సరిదిద్దడంలో, కాలు కదపడంలో, పుల్లలు కలపడంలో, పాటలు పాడడంలో, ఎత్తుగడ-ముక్తాయింపుల్లో కర్ణాటకలోని ఆట ఆంధ్రప్రదేశ్‌లోని ఆటను సూటికి నూరుపాళ్ళు సమ్మ సరిపోతుంది. గతిలో ప్రాంతీయ భేదాలుంటాయి.

---

8. Traditions of Folk dance, p. 227-228.
9. కోలుపదగళు. పు 13-44.
10. దీనినే తెలుగులో మరగాలు అనికూడా అంటారు.

## తమిళనాడు

**పిన్నల్ కోలాట్టం :**

తమిళనాడులో కూడా కోలాటం ప్రచుర ప్రచారంలో ఉంది. దీనిని వారు కోలాట్టం అని అంటారు. ఇందులో కొన్ని రకాలు ఉన్నాయి.[11] వీటిలో ఆంధ్ర ప్రదేశ్, కేరళ, కర్నాటకల్లోని కోలాటం ఆటలతో పోలికలు ఉన్నాయి. అందులో పిన్నల్ కోలాట్టం ఒకటి. రకరకాల నూలి దారాలతో పేనిన తాళ్ళు ఒక చెక్కకు కట్టి చెక్కను ఇంటి రప్పుకుగాని లేదా ఎత్తైన చెట్టుకుగాని కడతారు. ప్రతి నర్తకుడు ఒక చేతిలో తాడు, రెండో చేతిలో కోలాట కర్రలు రెండూ పట్టుకుంటాడు. కోలాటం వేస్తూ లయాన్వితంగా ఒరుగుతూవుంటే ఆ తాడు జడగా అల్లుకుంటుంది. జడ పూర్తిగా పడ్డ తర్వాత కోలాట మాడుతూనే జడను ఊడదీస్తారు. ఈ పిన్నల్ కోలాట్టం వేసేటప్పుడు పాటలు పాడుతారు.

ఈ పిన్నల్ కోలాట్టం మన జడకోపుకంటె వేరుగాదు.

## ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళ

**కుమ్మి :**

కుమ్మి ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళల్లో ప్రచారంలో ఉంది. కుమ్మి నృత్యం కోలాటంలో పోలిక ఉన్న నృత్యం ఈ నృత్యం తమిళనాడు, కేరళ రాష్ట్రాల్లో ప్రచురంగా ప్రచారంలో ఉంది [12] దీనిని స్త్రీలు చేస్తారు. కుమ్మి నృత్యాల్లో వేర్వేరు రీతులున్నాయి ఒక్కొక్కరకం నృత్యానికి ఒక్కొక్క

---

11. In Tamil Nadu, the Koollaatams are of many types and varieties; each of these has its counterparts in the adjoining feature of the dances is the ropes, ribbons or strings which are tied to a central wooden block and hung from the top and the sticks which are held in one hand of the dances.

Traditions of Folk Dances - p. 240-241.

12. Traditions of Folk Dance, p. 239-241.

రకం పాట పాడుతుంటారు. కుమ్మిలో ఎక్కువగా ఇంటిపనులు వర్ణించబడుతాయి. ఇందులోని పాట ఒక అమ్మాయి నీళ్ళు తోడుతున్నట్లు, పాత్రలు తోముతున్నట్లు, అన్నం వండుతున్నట్లు, పిండి విసరుతున్నట్లు వర్ణిస్తుంది. ఏ పాటలు పాడుతూ చేసినా వలయాకృతిగా ఏర్పడడం పరిపాటిగా కన్పిస్తుంది. గుజరాతులోని గర్బా, రాజస్థాన్‌లోని ఘుమర్‌లతో దీనికి పోలికలు ఉన్నాయి. సౌరాష్ట్ర రాసనృత్యాల్లో వలెనే ఈ కుమ్మి నృత్యాల్లో కూడ వలయంలో వలయాలుగా ఏర్పడడం ఉంది. ఈ కుమ్మి నృత్యాలన్నింటిలోను ఒక స్త్రీ పాట ఎత్తుకొని పాడుతూ ఉంటే తక్కినవారు దాన్ని అందుకొని పాడుతుంటారు. తర్వాత ఒక్కొక్కరు ఒక్కొక్క చరణం ఒకరి తర్వాత ఒకరు పాడుతారు. నృత్యం చేసే వాళ్ళంతా అలసిపోగానే ఆట ఆగిపోతుంది.

## కేరళ

**కోలాటం :**

కేరళలో విశేషంగా ప్రచారంలో వున్న కోలాటం ఆంధ్రప్రదేశ్, కర్నాటక,తమిళనాడుల్లోని కోలాటంకంటే భిన్నంకాదు.

**కోల్‌కలి మోపిల్ల పట్టు :**

కేరళలో కోలాటంతోపాటు ముస్లిమ్ (మోప్లా) లలో విశేష ప్రచారంలో ఉన్న నృత్యం కోల్కలి లేక మోప్లాకలి. చిరుగంటలు బిగించిన కర్రముక్కలతో తాళం కొడుతూ, నర్తకులు సంక్లిష్టమైన రీతుల్లో ఏర్పడుతూ నృత్యం చేస్తారు.[13] ఇందులో వలయాలుగా ఏర్పడడం, చేతులు చరచడం అనే అంశాల్లో కుమ్మి, కోలాటాలను పోలి ఉంటుంది.

## గుజరాత్-మహారాష్ట్ర-రాజస్థాన్

**గర్బా :**

గుజరాత్ జానపద నృత్యాల్లోకెల్లా విలక్షణమైంది గర్బా నృత్యం. ఇది మొదట ఆటవికులు వేటాడి చంపిన మృగం చుట్టూ తిరుగుతూ చేసే నృత్యం. క్రమంగా వ్యవసాయదారుల ఆచారనృత్యంగా మారింది. ఆ తర్వాత సమాజంలోని

13. Ibid, p.253, 254.

అన్ని తెగలవారి ఆశ్రయంలో సామాన్యమైన సాంఘిక నృత్యంగా పరిణమించింది. కుల మత భేదాలు లేకుండా అందరూ పాల్గొనే ఒక జానపద నృత్యంగా స్థిరపడిపోయింది. నవరాత్రి పండుగ సందర్భంగా గర్బా ఉత్సవం చేస్తారు. ఆ ఉత్సవంలో వివిధ గర్బానృత్యాలు చేస్తారు. సౌరాష్ట్రలో పలురకాల రాస నృత్యాలు ఉన్నట్లుగానే గుజరాతులో గర్బా నృత్యాలు కూడా పలు రకాలు ఉన్నాయి.

ఖంజరీ గర్బా, మండారీ గర్బా, తాలి గర్బా, టిప్రీ గర్బా మొదలయిన వాటిని తెల్పి, తాలీగర్బా తెలుగువారి జట్టిజామును పోలివుంటే టిప్రీ అంటే మరాఠీలో కోలాటకట్టె అని అర్థం తెలుపుతూ గర్బా భేదాల్ని చూపించారు తూమాటి దోణప్పగారు.[14] గర్బా గుజరాతులోనేగాక మహారాష్ట్రలోను, రాజస్థాన్‌లోనూ, మధ్యభారతంలోనూ కూడా ప్రచారంలో ఉందని తెలుపుతూ గర్బాను గూర్చి విపులంగా వివరించారు కపిలా వాత్స్యాయన్‌గారు.[15] గర్బా నృత్యాల్లో కనిపించే సుందరాభినయాలు కనులవిందుగా ఉంటాయి [16]

## సౌ రా ష్ట్ర

**దండియారాస :**

మణిపూర్ రాసనృత్యాల్లో స్త్రీలు పాల్గొంటారు. కాని సౌరాష్ట్ర రాస నృత్యాల్లో పురుషులే పాల్గొంటారు. సౌరాష్ట్ర రాసనృత్యాల్లో కెల్లా ప్రసిద్ధమైంది దండియా రాసనృత్యం. ఇందులో నర్తకులు మువ్వలు కట్టిన చిరుకర్రలు పట్టుకొని చేతుల్లోని కర్రలతో ఎదుటివారి కర్రలను కొడుతూ నృత్యం చేస్తారు. ఆ కర్రలకు గజ్జెలుకడతారు సంకీర్ణమైన లయరీతి, ఘల్లు ఘల్లుమనే గజ్జల శబ్దం ఆటకు ఆకర్షణీయాలు. మన కోలాటంలోవలె ఇందులో గూడ మొదట నెమ్మదిగాను, ఆ తర్వాత హెచ్చు వేగంతోను నృత్యం చేస్తారు. ఈ నృత్యవలయంలో ప్రతి వ్యక్తి తనంతలాను నృత్యం చేయడమే కాకుండా, తనకు ఇరువైపులా, అభిముఖంగాను ఉన్న నర్తకులతో కలసి నృత్యం చేస్తాడు. ఈ వలయం

14. జానపద కళా సంపద, పు. 192.

15. **Traditions of Folk Donce, p. 202-205**

16. **Encyclopedia of India, p. 185.**

ఒక్కొక్కసారి రెండు వలయాలుగా ఏర్పడడం మరొక్కసారి మూడు వలయాలుగా ఏర్పడడం, ఇంకొకసారి నాల్గు వలయాలుగా ఏర్పడడం, కూడా ఉంది. మన కోలాటంలో దాదాపు అన్ని కోపులకు రెండు వలయాలుగా ఏర్పడడం ఉంది. ప్రార్థన కోపులో ఒకే వలయంలో ఉండి ఆడుతారు. బజారు కోపులో మూడు వలయాలుగా ఏర్పడడం, చదరంగం కోపులో నాల్గు వలయాలు లేక నాల్గు వరుసలుగా ఏర్పడడం అనేవి పై వాటితో పోల్చవచ్చు. మన కోలాటంలో వలె నిల్చుండి, కూర్చుండి పరుండి కూడా కర్రలతో ఆట ఆడడం ఉంది. అంతే కాకుండా పరుండి చేతులు పైకెత్తి పక్కవారి కర్రలతో కొట్టడం ఉంది. పరుండి చేతులకు బదులు కర్రలను కాళ్ళతో కూడా పట్టుకొని ఆట ఆడుతారు. ఇది నూటికి నూరుపాళ్ళు కోలాటంతో పోలిక ఉన్న నృత్యం.[17]

## మ హా రా ష్ట్ర

**లెజిమ్ (Lexim):**

మహారాష్ట్ర జానపద నృత్యాలన్నింటిలోకి ముఖ్యమైందీ, దక్షిణ భారతదేశపు కోలాటాన్ని పోలిందీ లెజిమ్ నృత్యం. దీనిలోని బృంద సంవిధానం అనేక రీతులుగా ఉంటుంది. ఇందులో దూకడం, ఎగరడం, కూర్చోవడం, వంగడం ఉంది. లెజిమ్ అంటే చిన్న కొయ్య గూటం. ప్రతిగతీ లెజిం ధ్వనుల లయకు ఏమాత్రం తప్పిపోకుండా చేస్తారు. నాల్గు లేక ఎనిమిది గణణాల ప్రకారం లెజిమ్ ఊపుతారు. ఇందులో అన్నీ కోలాట పద్ధతులే. అయితే ఒక్క కర్రతో మాత్రమే ఊపుతారు.[18] మహారాష్ట్రలోనే కాకుండా ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణాజిల్లా ప్రాంతంలో కూడా పాఠశాల్లో వ్యాయామ క్రీడగా నేర్పుతున్నారు.

**టిప్రి మరియు గోప్ (Tipri & Goph) :**

మహారాష్ట్ర పాఠశాలల్లో వ్యాయామక్రీడగా వృద్ధి చెందిన నృత్యాలు టిప్రి మరియు గోప్ అనేవి. టిప్రి అంటే చిన్నకర్ర. గోప్ అంటే తాడు లేక రిబ్బను.

---

17. Traditions of Folk Dance, p. 202-204.
18. Ibid, p. 214, 215.

వలయంగా ఏర్పడ్డ నర్తకుల దంపైన ఎత్తుగా ఉన్న ప్రదేశాన్నుంచి తాళ్ళు లేక రిబ్బన్లు కడతారు. ప్రతి నర్తకుడు ఒక చేతితో ఒక రిబ్బను చొప్పున పట్టుకుంటాడు. మరొక చేతిలో ప్రేప్రీ ఉంటుంది. ఈ ప్రేప్రీలతో పక్కవారి ప్రేప్రీలను కొడుతూ తిరుగుతుంటారు నిర్ణీత స్థలాలకు ఆటగాళ్ళు చేరేటప్పటికి చేతుల్లో పట్టుకున్న రిబ్బన్లు జడగా అల్లుకుంటాయి. మరలా తిరిగిన మార్గానే వెనుకకు తిరిగి జడను ఊడదీస్తారు. ఇందులో తిరిగే గతిలో జాగ్రత్త, ఓర్పు అవసరం. తప్పటడుగువేస్తే జడ అల్లుకోదు. ఇది మన జడకొపు. తమిళనాడులోని పిన్నల్ కోలాట్టాలను నూటికి నూరు పాళ్లు పోలి ఉంది.[19]

## రాజస్థాన్

ఘోరియా నృత్యం :

ఇది రాజస్థాన్ భిల్లులు చేసే నృత్యం. ఘోరియా అంటే కొయ్యకర్ర అని అర్థం ఈ నృత్యంలో వలయాలుగా ఏర్పడతారు. దీనిని కోలాటానికి సామ్యంగా చెప్పవచ్చు. దీనితో డోలు, సన్నాయి, నగారా మొదలయిన వాద్యాలు వాడుతారు. వీటి ధ్వనులకు అనుగుణంగా ఆడుతారు. ఇందులో గూడ కోలాటంలోవలె రెండు వలయాలు ఏర్పడతారు అయితే ఒక వలయం పురుషులు, మరొక వలయం స్త్రీలు ఏర్పడతారు.[20] ఈ నృత్యం ఆడేటప్పుడు **"Linking arms, they dance in a circle with simple steps some times standing, some times bending, some times sitting down"**[21] మొదలయిన విధంగా ఉండి చాలా అందంగా ఉంటుంది. చాలా రకాలుగా తిరిగే ఈ నృత్య వలయాన్ని తిలకిస్తే మన కోలాటంలోని రకరకాల కోపులు గుర్తుకు వస్తాయి.

## పంజాబు

భాంగ్రా :

పంజాబు జానపద నృత్యాల్లో అత్యంత ప్రజాదరణ పొందింది భాంగ్రా నృత్యం. భాంగ్రా ఋతువు గోధుమ విత్తడంతో ఆరంభమై, పంట కోతలతో అయి

---

19. **Ibid, p. 214, 215**
20. **Ibid, p. 192, 193.**
21. **Encyclopedia of India, p. 264.**

పోతుంది. దీసినే బైశాఖి కోత పండుగ అంటారు. ఈ మధ్యకాలంలో ఆడే ఈ నృత్యంలో కోలాటంలోవలె కర్రలు ఆడించడం. వలయాలుగా తిరగడం, అడుగులు వేయడం కన్పిస్తుంది, డోలు వాద్యగాడు ఆట తీవ్రతనుపెంచే సంజ్ఞలిస్తాడు. అపుడు అత్యంత పారవశ్యంతో "హోయ్ హోయ్ – అప్ అప్" అని అరుస్తూ గిరుగిరున తిరుగుతూ నృత్యం చేస్తారు.[22]

## బెంగాలు

**కథీ నృత్యం :- (Kathi or Karthi) :**

ఇది బెంగాలులో పేరుగాంచిన నృత్యం. మన కోలాటంలోవలె కర్రలు ఉంటాయి. పాదగతులకు కర్రలమోతకు అనుసరణలో క్రమం తప్పదు. కోలాటంలోవలె వలయంగా ఏర్పడడం ఉంది. వలయాకారంగా జరుగుతూ విడిపోయి ఎన్నో నమూనాలుగా ఏర్పడడం ఉంది.[23] ఇది మన కోలాటంలోని కోపులను గుర్తుచేస్తుంది. ఒకరు ఆటమధ్యకు చొచ్చుకొనివస్తారు. మన కోలాటంలో తిరిగే జట్టు నాయకునివలె ఇతడు వలయం మధ్యలో ఆడుతూ పాడుతూ తిరుగుతుండడం కన్పిస్తుంది. అయితే ఇతడు కథీనృత్యంలో జట్టు నాయకుడుకాడు. ఆ నర్తకుడు ఆ తెగవారి క్రోధానికి గురైనవాడుగా భావించబడతాడు. అతడు మధ్యకు వచ్చి కోలాటం కర్రలను కొడుతూ పాదాలతో తాళంవేస్తూ, చుట్టూ తిరుగుతూ నృత్యం చేస్తాడు.[24] కర్రదెబ్బలు, తాళం మొదలయినవి మన కోలాటాన్ని పోలిఉంటాయి

## ఇంగ్లండు

**మోరిస్ (మొర్రిస్) నృత్యం (Morris dance) :**

పాశ్చాత్యదేశాల్లో ముఖ్యంగా ఇంగ్లండులో ఆడే నృత్యం మోరిస్నృత్యం. ఈ మోరిస్ నృత్యానికి మన కోలాటానికి అభేదత్వం చెప్పబడింది.[25] ఇందులో

---

22. Ibid, p. 52,
23. Ibid, p. 287.
24. Traditons of Folk Dance, p. 127.
25. Sankaranarayana Telugu - English Dictionary p. 353

చాలా రీతులు ఉన్నాయి. అవన్నీ ఎక్కువగా ఇంగ్లండులో ప్రచారంలోఉన్నాయి.[26] పాశ్చాత్యదేశాలయిన ఫ్రాన్సు, స్పెయిన్, పోర్చుగల్, ఆస్ట్రియా మరియు దక్షిణ అమెరికా మొదలయిన దేశాల్లో కన్పిస్తుందీ మొర్రిస్ నృత్యం.

కోలాటంతో అభేదత్వాన్ని అంగీకరించకపోయినా ఇందలి వస్త్రధారణ, అలంకరణ, వాడేపరికరాలనుబట్టిచూస్తే కోలాటంతో కొద్దిపాటి సామ్యం ఉందని చెప్పవచ్చు.

ఇట్లా కోలాటం ఒక ఆంధ్రప్రదేశ్‌లోనే కాక ఆంధ్రేతర సీమల్లో సహితం ఉంది. అంటే పొరుగు రాష్ట్రాలయిన దక్షిణాది రాష్ట్రాల్లో కోలాటం కొద్దిపాటి తేడాల్తోను, ఉత్తర భారతీయ రాష్ట్రాల్లో కోలాటం తుల్యరూపాలతోను కన్పిస్తుంది. పాశ్చాత్య దేశాల్లో సహితం కొన్ని తుల్యరూపాలు ఉన్నాయి. దక్షిణాది రాష్ట్రాల్లో కోలాటం పేరుతోనే ఉంది. అంతేకాకుండా కోలాటానికి ఈషద్భిన్నంగా మరికొన్ని ఆటలు ఉన్నాయి కోలాటాన్ని పోలిన క్రీడల్లో కొన్నింటిలో కర్రలు వాడితే, కొన్నింటిలో కర్రలు వాడరు. జట్టిజాము, కుమ్మి, గర్బాల్లోని కొన్ని రకాల్లో కర్రలు ఉపయోగించరు. అయితే వలయంగా ఏర్పడడం, అనేక రీతులుగా తిరుగుతూ ఆడడం వీటిలో పోలికలుగా తీసుకోవచ్చు. ఉత్తర భారతదేశంలో ఆయా సీమల భాషా పదాల్లో కోలాటం అనే అర్థాన్నిచ్చే పదాలతో ఈ ఆట కన్పిస్తుంది. సౌరాష్ట్ర, మహారాష్ట్ర, గుజరాతు, రాజస్థాన్‌ల్లోని రాసనృత్యాలు ముఖ్యంగా సౌరాష్ట్రలోని దండియారాస, మహారాష్ట్రలోని లెజిమ్, రాజస్థాన్‌లోని ఘోరియా, పంజాబులోని భాంగ్రా, బెంగాలులోని కథీ నృత్యాలకు కోలాటంతో పోలికలు ఉన్నాయి.

పాశ్చాత్య దేశాలు ముఖ్యంగా బ్రిటను, ఫ్రాన్సు, స్పెయిను, పోర్చుగల్లు, ఆస్ట్రియా, దక్షిణ అమెరికా దేశాల్లో కన్పించే మొర్రిస్ నృత్యంలోని కొన్ని రీతుల్లో మన కోలాటంతో పోలికలు ఉన్నాయి. కోలాటం, దాని తుల్యాలు విశాల ప్రపంచంలో అచ్చటచ్చటా కన్పించడాన్నిబట్టి అది విశేష ప్రచారంలో ఉన్నట్లు చెప్పవచ్చు. ఇంత విస్తృత పరిధిలో కన్పించే ఈ కోలాటాన్ని, విశ్వజనీనమైన సార్వకాలికమైన క్రీడగా పేర్కొనవచ్చు.

---

26. **Children's Britanica, Vol 6, p 503.**

# జానపద విజ్ఞానంలో కోలాటస్థానం

నోటితో పాట, చేతి కోలలతో ఆట ఈ రెండింటి సమాహారమే కోలాటం. జానపద విజ్ఞానంలో పాట ఒక విభాగానికి చెందితే, ఆట మరొక విభాగానికి చెందుతుంది. జానపద విజ్ఞానాన్ని వాక్సహిత కళలు (Verbal arts), వాగ్రహిత కళలు (Non Verbal arts), మిశ్ర కళలు (Mixed arts) అని విభజించవచ్చు. అపుడు కోలాటం ఆటపాటల మిశ్రరూపం కాబట్టి మిశ్ర కళా విభాగానికి చెందుతుంది.

'జనానామ్ పదమ్ జనపదమ్'. జనపదం అనేది సంస్కృత శబ్దం. విశేష్యం. దీనికి 'పల్లె, గ్రామము', 'దేశము, జనులుండు తావు' అనే అర్థాలున్నాయి.[1] జనపదంలో ఉండేవారిని జానపదులు అంటారు. జానపదుడు అంటే 'జనుడు, మనుష్యుడు', 'గ్రామవాసి, పల్లెయందుండు' వాడు అని అర్థాలున్నాయి.[2] "జానేన పద్యతే జానపదః అని వ్యుత్పత్తి."[3] జనపద సంబంధమైనది జానపదం. జనపదం నుంచి వచ్చింది లేక జనపదం నుంచి పుట్టిందని భావం. దీనినే జానపదికం అని కూడా అనవచ్చు.

జానపద వాఙ్మయం అనే పదానికి బదులుగా తొలుత కొందరు తెలుగు పరిశోధకులు ప్రయోగించిన ప్రజా వాఙ్మయం, పద వాఙ్మయం, అనాదృత వాఙ్మయం, గేయరచనలు, మధురకవితలు, దేశి సారస్వతం, మహాజన గానం మొదలయిన పలుకుబళ్ళను స్వీకరించి రామరాజుగారు విపులంగా పరిశీలించి చివరకు జానపద వాఙ్మయ మన్న పదమే స్థిరీకరించబడిందని నిరూపించారు.[4] జాన

---

1. సూ. ని, 3-339.
2. పైది, 3-384.
3. ఆ. శ. ర., 1-1169.
4. తెలుగు జానపద గేయ సాహిత్యము, పు. 1-3.

పదులకు సంబంధించిన వాఙ్మయాన్ని జానపద వాఙ్మయం అనీ, జానపదుల నృత్యాల్ని జానపద నృత్యాలనీ, జానపదుల కళల్ని జానపద కళలనీ అంటారు. ఇట్లే జానపదులకు సంబంధించిన అన్నిరకాల కార్యకలాపాల్ని కలిపి జానపద విజ్ఞానం అంటారు జానపద విజ్ఞానం అనే పదం ఇంగ్లీషులోని Folk lore అనే పదానికి సమానార్ధకంగా వాడుతున్నారు. Folk, lore అనే రెండు శబ్దాల కలయిక వల్ల ఏర్పడింది పదం. ఈ పదాన్ని ఇంగ్లీషు భాషలో మొట్టమొదట William John Thoms అనునాతడు క్రీ.శ. 1846 లో Athenaeum అను పత్రికకు రాసిన జాబులో సూచించినట్లు పరిశోధకుల నిర్ధారణ.[5] ఇది Volks Kunde అనే జర్మను పదానికి అనువాదం అని అంటున్నారు.[6] అంతకుముందు Popular antiquities, popular literature అనే మాటలు వాడుకలో ఉండేవి. Folk అంటే నిరక్షరకుక్షులైన రైతులు, Lore అంటే విజ్ఞానం. Folklore అంటే అక్షరజ్ఞానం లేని పల్లెప్రజల సాంప్రదాయక విజ్ఞానం అని Tohms గారి దృష్టిని విపులీకరించారు తంగిరాల వేంకటసుబ్బారావుగారు.[7] "జానపదులు కేవలం గ్రామవాసులే కానక్కరలేదనీ, నగరంలో కూడా అలాంటి మనస్తత్వం ఉన్నవారు ఉండవచ్చుననీ, 'Folk'ను నిర్వచిస్తూ 'సమానధర్మాలు కలిగిన ఏ జన సమూహాన్నయినా జానపదులనవచ్చు' నన్న అలన్ డండెస్ (Alan Dundes) గారి మాటలు' ఎత్తిచూపుతూ 'జానపద మనస్తత్వం కల్గిన వారు సృష్టించింగి జానపద విజ్ఞానం అవుతుందనీ అంతేకాకుండా ఈ జానపద చిత్తవృత్తి ఫలితంగా అవతరించిన విషయాలు సంప్రదాయాన్ని గడించుకొంటేనే అది జానపద విజ్ఞానం అవుతుందని"[8] సుందరంగారు జానపద విజ్ఞానాన్ని విపులంగా చర్చిస్తూ పేర్కొన్నారు.

---

5. Folklore Museum, p. 1.
6. (According to some scholars, however, the term folk lore is itself, a translation of the German word 'volks Kunde' which came into usage as early as 1806)

   Folk lore Museum, p. 4.
7. కాటమరాజు కథలు, పీఠిక, పు. i-iv.
8. తెలుగు- కన్నడ జానపదగేయాలు, పు. 3.

Folk lore అనే దానికి చాలా మంది శాస్త్రవేత్తలు నిర్వచనాలు పేర్కొన్నారు. William Bascom అను నాతడు "Folklore means folk learning; it comprehends all knowledge that is transmitted by word of mouth and all crafts and techniques that are learned by imitation or example as well as the products of these crafts-" అని నిర్వచించాడు.[9]

Darwin of Folk lore అనబడే Sir James Frazer అను నాతని దృష్టిలోని Folk lore ను గురించి "Folk lore was accepted as a science of survivals. It contained 1) narratives i.e. folk tales, heroic tales, ballads and songs and local legends. 2) Customs and traditions i.e. local traditions, festivals, rituals, traditional games etc. 3) Superstitions i.e. witch-craft, fortune-telling, popular assumption, Customs, Popular sayings, proverbs, popular nomenclature, riddles, nonsense rhymes etc."[10] అని Durga bhagwat గారు వివరించారు.

Young Students Encyclopedia లో "People in every country have traditions and beliefs that have been passed down from generation to genaration, usually by word of mouth. These traditions and beliefs are called folk lore- the knowledge, or lore of the people, or Folk" అని వివరించ బడింది.[11] T. H. Gaster అను నాతని "Folk lore is the repository of popular traditions, consciously or unconsciously preserving beliefs, tales etc. of the people, by the people and for the

9. International Encyclopedia of Social Sciences, Vol-V, p. 497.
10. An out line of Indian Folk lore, p. 10.
11. Young Students Encyclopedia, Vol-8, p. 1149.

people. It is a formal art and literature'' అన్న దృష్టిని, ఇంకా B. A. Botkin, Jones Balys, M. Barbean, A. M. Espinosa, G. M. Foster, M. Harman, M. J. Hersho Vits, G. Her Zog, R. D. Jameson, G. P. Kurath, M. Leach, K. Luonale, J. L. Mish, C. F. Potter, M W. Smith, A. Taylor, S. Thompson, E. W. Vaegelin and A H. Krappe మొదలయిన ఇరవై మంది జానపద విజ్ఞాన శాస్త్రవేత్తల దృష్టిలోని Folklore నిర్వచనాలను చర్చించి, వాటితోపాటు 'Folk tales of Bengal' అనే అంశంపై శ్రమించిన Arun Ray అనే ఇటీవలి జానపద విజ్ఞాన శాస్త్రవేత్త దృష్టిలోని "Folklore is the elemental ingredient which forms the basis of super structure, created, processed and fostered collectively unanimous people at the dawn of civilization, flowing through class divided societies towards a higher super structure of the future unanimous people, re-modelling and re-shaping it with new experiences and contributing at every stage of development of societies etc.'' అనే నిర్వచనాన్ని గురించి Shyamchand Mukherjee గారు తమ Folklore Museum అనే గ్రంథంలో విపులంగా చర్చించారు.[12]

పై నిర్వచనాలన్నీ విపులంగా పరిశీలిస్తే మొత్తం మీద జానపద విజ్ఞానం అంటే జానపదుల ఆచార వ్యవహారాలకే పరిమితం కాక జానపదుల సమస్త విషయాలు జానపద విజ్ఞానంలో చేరుతాయని చెప్పవచ్చు.[13]

---

12. Folklore Museum, p 13-25.
13. "Folklore includes folk art, folk crafts, folk tools, folk costume, folk belief, folk custom, folk medicine, folk recipes, folk music, folk dance, folk games, folk gestures and folk speech, as well as those verbal forms of expression which have been called folk literature

జానపద విజ్ఞానంలోని ప్రతి అంశంలో దాదాపు ఒకే రకమైన లక్షణాలు కన్పిస్తాయి. అవి :

1. అవిజ్ఞాత కర్తృత్వం,
2. రచనాకాలం తెలియకపోవడం,
3. అప్రయత్న రచన,
4. అనుశ్రుత ప్రచార లక్షణం,
5. పాఠాంతరాలు కల్గి ఉండడం,
6. నియమిత స్వరూపం లేకపోవడం,
7. నిత్య నూతనత్వాన్ని కల్గి ఉండడం,
8. పునరావృత్తి కల్గి ఉండడం,
9. జనసామాన్య పరిచిత వస్తువై ఉండడం,
10. సరళత్వాన్ని కల్గి ఉండడం.

బిరుదురాజు రామరాజుగారు, ఆర్. వి. యస్. సుందరంగారు తమ తమ సిద్ధాంత వ్యాసాల్లో జానపద గేయాలకు లక్షణాల్ని వివరిస్తూ విపులంగా చర్చించారు.

చాలా మంది శాస్త్రజ్ఞులు ఈ జానపద విజ్ఞానాన్ని అంతటిని ముఖ్యంగా 1. శాబ్దిక కళలు (Verbal arts), 2. శాబ్దికేతర కళలు (Non-Verbal arts) అని రెండు భాగాలుగా విభజించారు. అంటే జానపద సాహిత్యం శాబ్దిక కళా

---

but which are better described as verbal art. Verbal art which includes such forms as folk tales, legends, myths, proverbs, riddles and poetry has been the primary concern of folk lorists from both the humanities and social sciences since the beginings of folklore as a field of study.''

International Encyclopedia of Social Sciences, Vol. 5, p. 497.

విభాగానికి, జానపదుల మిగిలిన అన్ని కళలు శాబ్దికేతర (Non-Verbal) కళా విభాగానికి చెందుతాయి.కాని విషయ సౌలభ్యంకోసం జానపద విజ్ఞానాన్ని ముఖ్యంగా మూడు విభాలుగా విభజించవచ్చు. వాక్సంబంధమైన అన్ని ప్రక్రియలు కలిపి శబ్ద సహిత కళలు లేక వాక్సహిత కళలు (Verbal arts) అనీ, వాక్సంబంధం ఏ మాత్రమూ లేని శిల్పం - చిత్రం మొదలయినవి శబ్ద రహిత కళలు లేక వాగ్రహిత కళలు (Non-Verbal arts) అనీ, వాక్సంబంధంతోపాటు చేష్టాను రూపమైన కళా రూపాల్ని మిశ్ర కళలు (Mixed arts) అనీ విభజించవచ్చు. మరలా ఈ మూటిలో వేరు వేరు విభాగాల క్రింద చేరే అంశాల్ని కలిపి వేరు వేరు వర్గాలుగా సూక్ష్మాతిసూక్ష్మంగా వర్గీకరించవచ్చు. బాగ్స్ వర్గీకరణ పద్ధతిలో ఆర్. వి. యస్. సుందరంగారు చూపిన సూక్ష్మాతి సూక్ష్మాంశ వివరణ పద్ధతి గమనించదగింది.[14]

కథాసహిత గేయాలల్లో వీరగాథా గేయాలు, అద్భుతగాథా గేయాలు, మత గాథా గేయాలు, చారిత్రకగాథా గేయాలు, స్త్రీసంబంధిగాథా గేయాలు, వ్రత గాథా గేయాలు, గ్రామదేవతగాథా గేయాలు అనేవిగా చెప్పవచ్చు.

కథారహిత గేయాల్లో వలపుపాటలు, కన్నీటిపాటలు, పిల్లలపాటలు. స్త్రీల పాటలు. వేడుకపాటలు, శ్రామిక గేయాలు, హాస్యగేయాలు, తాత్త్వికగేయాలు, పారమార్థిక గేయాలు, బాంధవ్య గేయాలు, జోల పాటలు మొదలయినవన్నీ చేరుతాయి.

వచన విభాగాన్ని నీతికథలు, వీరగాథలు, పురాకథలు, పురాకల్పిత కథలు, కల్పిత కథలు, జానపద కథలు అనేవిగా విభజించవచ్చు.

పొడుపు కథలను మనిషో జంతువో స్పష్టంగా తెలియని ప్రాణితో పోలిక చెప్పే పొడుపు కథలు, జంతువుతో పోలికచెప్పే పొడుపు కథలు, మనుషులతో పోలికచెప్పే పొడుపు కథలు, చెట్లతో పోలికచెప్పే పొడుపు కథలు, ఇతర వస్తువులతో పోలిక చెప్పే పొడుపు కథలు అనే భేదాలుగా విభజించవచ్చు.[15]

---

14. తెలుగు-కన్నడ జానపద గేయాలు, పు. 16-18.
15. కాటమరాజు కథలు, పీఠిక. పు, vii

సామెతలు లేక లోకోక్తులు అనే వాటిని గూఢ వస్తుమయం, ఉక్తివైచిత్రీ విలసితం, బుద్ధికుశలతా నికషోపలం, ఆలోచనాలోచనం మొదలయిన భాగాలుగా విభజించవచ్చు.[16]

జానపదభాష అనే విభాగంలో వ్యక్తుల పేర్లు, గ్రామాల పేర్లు, మాండలిక భాష, జానపద రూప నిష్పత్తి, నుడికారం, తిట్లు, ఒట్లు మొదలయినవి చేరుతాయి.

## II. శబ్దరహితకళలు లేక వాగ్రహిత కళలు
(Non - Verbalarts)

ఈ విభాగంలో జానపదుల చేతిపనులు, నాటు వైద్యాలు. వంటకాలు, శకునాలు, మంత్ర తంత్రాలు, ఆచారవ్యవహారాలు, సైగలు, బైరాగి చిట్కాలు, నైవేద్యాలు, బలులు, సమాధులు, యంత్రాలు, మందులు, సంతర్పణలు, దానధర్మాలు, మొక్కుబడులు, ఆటలు, తీర్థాలు, విభూతి, కుంకాలు, శిల్పకళలు, చిత్రకళలు, నగ-నట్ర, దుస్తులు, ప్రసాధన సామగ్రి, వంట సామగ్రి, వాస్తు నిర్మాణ వస్తుసామగ్రి, వ్యవసాయపద్ధతులు, వస్తు వాహనాలు, వేషభూషణాలు, ముగ్గులు మొదలగునవి చేరుతాయి.

## III. మిశ్రకళలు
[Mixed Arts]

మిశ్రకళా విభాగంలో గాత్ర సంగీతం, గేయ సహితనృత్యం, నాటకం, యక్షగానం, వీధిభాగవతం, కోలాటం, భజనలు, పగటి వేషాలు, తోలుబొమ్మలాట, చెక్కబొమ్మలాటలు గారడివిద్యలు, కాటిపాపల విద్యలు, విప్రవినోదాలు, విచిత్రవేషాలు, చిలుకజోస్యాలు, పూజా పునస్కారాలు, సోదె, జాతరలు, కొలువులు, వీరాచారాలు, పూనకాలు, కాలజ్ఞానాలు మొదలయినవి చేరుతాయి.

---

16. జానపద గేయసాహిత్యం, పు, 16.

# జానపద విజ్ఞాన వర్గీకరణ




పై వర్గీకరణననుసరించి కోలాటం మిశ్ర కళావిభాగానికి చెందుతుంది. ఇందులో చేష్టానురూపమైన ఆట ఉంటుంది. ఆ ఆటలో వాగ్రూపమైన పాటలు జోడించబడిఉంటాయి. ఇది ఆట పాటల సమాహార రూపకళ. ఈ కోలాటం జానపద విజ్ఞానానికి కన్పించే లక్షణాల్ని ఎంతవరకు పుణికిపుచ్చుకుందో పరిశీలిద్దాం.

## 1. అవిజ్ఞాత కర్తృత్వం :

జానపద గేయాల్లో కోలాటం పాటలు వేడుకపాటల విభాగంలో చేరుతాయి. కోలాటం పాటల్లో మతపరమైనవి, రసపరమైనవి, వివిధ సంఘటనలకు సంబంధించినవి, ఇంకా అనేక సాంఘిక విషయాలకు సంబంధించినవి ఉన్నాయి. అన్ని పాటలు ఆయా విషయాలకు సంబంధించిన పూర్తి వివరణలు ఇస్తున్నాయి. పాటల్లోని కొన్ని పాఠాంతరాలను పరిశీలించినట్లయితే అనేకమైన పదబంధాలు, పదాలు పాతవాటి స్థానంలో చోటుచేసుకున్నట్లు కన్పిస్తుంది. దీనికి కారణం పాడేవారి అభి

రుచులు మారడమే. ఉదాహరణకు సుంట్లపమ్మపాటలో చాల నరసింహదాసు ''ఆహా యింద్రాపయింద్రులు పట్నంలో నినుపిలువ యిస్టంలేదని యెల్లినావా''[17]అని పాడితే, బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు ''ఇంద్రాప యింద్రులు యిస్టముతొ పొగడంగ యిస్టములేదని యెల్లినావా''అని పాడాడు 'పట్నంలో నిను బిలవ' అనే పదబంధానికి బదులు 'యిస్టముతొ పొగడంగ' అని పాఠాంతరం కన్పిస్తుంది. ''కలువరాయ ఉదయ వన్నెల''[18] అనే మరొక పాటలో నరసింహదాసు "సరసిజాచ్చ నిన్ను జూడ-మనసు గల్గెరా మోహన" అని పాడితే, చెప్పాల చెన్నయ్య ''సరసిజాచ్చ సిన్ని కిష్నా-మమ్ము బోవరా కిష్నా' అనీ, కొంపం వెంకటనర్సయ్య 'సరసిజాచ్చ సిన్ని కిష్నా-కరున బోవరా' అనీ పాడారు. ఇందులో 'మనసు గల్గెరా' అనే పద బంధానికి బదులు 'మమ్ము బోవరా' అనీ, 'కరున బోవరా' అనీ పాఠాంతరాలు కన్పిస్తున్నాయి. ''కోలు కోలన్న కోలు కోలో నాసామి''[19] అనే వేరొకపాటలో నరసింహదాసు ''కరమంచి కరబాయి నీళ్లో నాసామి - కడవనిండాపొయ్యబోతే'' అని పాడితే, నెమలి రామలింగారెడ్డి 'కామంచి కడబాయి నీళ్లో నాసామి - కడవ నిండా ముంచుకోని' అనీ, చెప్పాల చెన్నయ్య 'కానొచ్చె కడబాయి నీళ్లో నాసామి-కడవనిండా ముంచుకోని' అని పాడారు. ఇందులో 'కరమంచ' అనే పదానికి బదులుగా 'కామంచి', 'కానొచ్చె' అనే పదాలూ, 'పొయ్యబోతే' అనే పదానికి బదులు 'ముంచుకోని' అనే పదం పాఠాంతరాలుగా కన్పిస్తున్నాయి.

ఒక తరం నుంచి మరొక తరానికి, ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి తరలి వెళ్ళుతూ ఉండే వీటన్నిటికి కర్త ఎవరో తెలియదు. కొందరు ఈ పాటలు పాడుతూ పాటల చివర వారే కర్తలన్నట్లు వారి పేర్లు పెట్టుకుంటారు. ఉదాహరణకు జూపల్లి పొట్టెయ్య పాడిన 'ఎమిర కిట్నా'[20] అనే పాటలోని—

'కలికిర యినగదవే-కర్నాట లచ్చుమయ్యా
అనంత మెలుకులతొ వేయించినవాడు
కులుకుల కోలన్నా సైసై'

---

17. అను., పా. 17.
18. అను., పా. 34.
19. అను., పా. 38.
20. అను , పా 41.

అనే చరణాలలో పిర్నాటి లక్ష్మయ్య అనే పేరు కన్పిస్తుంది. చౌల నరసింహ దాసు పాడిన ''వోలలాడిరి సకులు''[21] అనే పాటలోని 'హైద్రాబాదు దాటి సికింద్రాబాదు సూటి, కోలాలాకు మేటీ కోటయ్య పంతులు సూటీ' అనే చరణాల్లో కోటయ్య అనే పేరు కన్పిస్తుంది. ఈయన ముడిమాల కోటయ్య అనే పేరు బడ్డి కోలాటం జట్టు నాయకుడనీ, ప్రాచీనుడనీ, నేటి జట్టు నాయకులు చెప్తున్నారు. ''కోలూకోలే ఆఁ కోలన్నా కోలే''[22]అనే మరొక పాటలో ముద్దురంగయ్యా మోహనా రంగయ్యా అనే చరణంలో రంగయ్య పేరు కన్పిస్తుంది. "సెల్లివి నీవే''[23] అనే పాటలో 'నీ మీద ప్రెమసేత-కొండమెంకటనర్సయ్య కయి రాసెను సెల్లెలా' అనీ, "అంద్రమడ రావయ్య పోట్ల బూదెయ్య"[24] అనే పాటలో 'నీదు కోర్కె-దీర్చనేమో-కొండ మెంకట నర్సయ్యగారు కయిజేసినారు నాయనా' అనీ, "మందయ్యానో వో మందయ్యానా"[25] అనే పాటలో 'బామరో యినగదవే - కొండమెంకట నర్సయ్యా-కయూ జేసినాడెూ గదవే-కలికినందానా సైసై' అనీ కొండంవెంకటనర్సయ్య పేరు కన్పిస్తుంది. అయితే పై రెండు పాటలు వెంకట నర్సయ్య ఒక్కడు పాడితే, 'మందయ్యాన' అనే పాటను నెమలి రామలింగారెడ్డి, కొండం వెంకట నర్సయ్య, బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు అనే ముగ్గురు జట్టు నాయకులు పాడారు. అయితే ఒకే పాటను పది మందినుంచి సేకరిస్తే ఆ పాటలో చివర పది మంది పేర్లు కన్పించవచ్చు. లేదా కొందరి పేర్లు మాత్రమే కన్పించ వచ్చు. అసలు ఏ పేరూ కన్పించకపోవచ్చు. అయితే పాటలో చివర పేరు కన్పించిన వీరు ఈ పాటలకు కర్తలు కాకపోవచ్చు. ఈ పాటలను ఎవరు రచించారో, ఏ ప్రాంతం నుంచి వచ్చాయో, ఎంత కాలం నుంచి ఉన్నవో వీరెవరికీ తెలియకపోవచ్చు.

ఇట్లే ఆటలో కులుకుల కోలాటం, కుప్పెకట్టె కోలాటం, గోల్కొండ కోలాటం, గుజరాతు కోలాటం, మురళి కోలాటం, దసరా కోలాటం, నాటు

21. అను., పా. 31.
22. అను., పా. 41.
23. అను., పా. 53.
24. అను., పా. 12.
25. అను., పా. 87.

కోలాటం, చీలకర్ర కోలాటం మొదలయిన రకాలు వెలశాయి. వీటన్నిటికీ కర్త లెవరో ఎవరికి తెలియదు. అంతేకాదు. ఈ ఆటలో కన్పించే కొత్త కొత్త గతులకు, రీతులకు, కోలాటం దెబ్బలకు, వలయాలుగా ఏర్పడే పద్ధతులకు ఎవరు కర్తలో ఎరుగరాదు. పరంపరగా ఒక తరం నుంచి మరొక తరానికి ఇవి సంక్రమింపజేస్తూ, పాతను కొంత విడనాడుతూ, కొత్తను కొంత సంతరించుకుంటూ పాత కొత్తల మేలు కలయికగా ఈ కళ వెలుగొందుతుంది.

**2.** రచనా కాలం తెలియక పోవడం :

కోలాటం పాటలు ఏవోకొన్ని వ్యక్తి పరమైనవో లేదా స్థానిక సంఘటనల పరమైనవో తప్ప తక్కినవన్నీ ఫలానా కాలానికి చెందినవని చెప్పలేం. ఉదాహరణకు నాగార్జున సాగర్ ప్రాజెక్టును గురించిన "నందికొండావచ్చెనురో"[26] అనే పాటకు కాలాన్ని ఊహించవచ్చు. కాని "గుండ్లకమ్మనదిని"[27] గురించిన పాటకు కాలనిర్ణయం చేయలేము. దాదాపు అన్ని పాటలకు ఇంతే. వీటికి కర్త లేడు కాబట్టి అధిక చరణాలున్నప్పటికీ వీటిలో కాలం గురించిన ప్రస్తావన కన్పించదు కాబట్టి కాల నిర్ణయం చేయలేము.

అంటే ఆట ఎప్పుడు, ఎక్కడ, ఎట్లు పుట్టిందో తెలియదు. కర్తలేడు కాబట్టి కాలం తెలియదు.

**3.** అప్రయత్న రచన :

కోలాటం పాటలు జానపదగేయాలు కాబట్టి ఇవి కూడా ఆశురచనలో వెలసినవే. ఆశువంటే వేగం. ఆలోచించకుండా చెప్పే కవిత్వాన్ని ఆశుకవిత్వం అంటారు. అటువంటి అప్రయత్న సృష్టియే ఈ కోలాటం పాటలు గూడ. లయకోసం పదాలు విరిచి తగ్గించడం, పొట్టివానిని దీర్ఘాలు చేయడం కన్పిస్తుంది. బాగుంది, బాగులేదనే ఆలోచన ఈ సృష్టిలో కనుపించదు.

26. అను., పా. 65
27. అను , పా. 17.

ఆట మాత్రం కొంచెం ప్రయత్న పూర్వకంగానే తయారవుతుంది. ఎందుచేతనంటే ఎంతో శిక్షణమీద వచ్చేది కోలాటం. అటువంటిది ఒక కోపు సృష్టించాలంటే కొంచెం ప్రయాసతో కూడినపని. అనుభవంగల జట్టు నాయకుడు కొంచెం సులువుగానే, కొద్ది ప్రయత్నంతోటే కోపు సృష్టిస్తాడు.

మొత్తం మీద అప్రయత్నరచన అనే జానపద విజ్ఞాన లక్షణం ఇచ్చట సరిపోతుంది.

**4. అనుశ్రుత ప్రచార లక్షణం :**

కోలాటం పాటలకు ప్రాయికంగా గ్రంథరూపం లేదు. వాగ్రూపమే ప్రచురం. సామాన్యంగా కోలాటం పాటలను ఒక జట్టు నాయకుని అధీనంలో ఆటతోపాటు నేర్చుకుంటారు. చాలమంది వినికిడివల్ల, అవిచ్ఛిన్నమైన మననంవల్ల ఆయా పాటలను కంఠోపాఠం చేస్తారు. వీరు మరే చోటయినా పాడినా లేదా వీరిలో మరెవరైనా జట్టు నాయకులుగా తయారయినా వీరి ద్వారా మరొకరు నేర్చుకున్నప్పుడు అవి ప్రచారాన్ని పొందినట్లే, ఇతర జానపద గేయాలన్నింటి వలె కాక కోలాటం పాటలకు ప్రచారం ఎక్కువగా జరిగే అవకాశం ఉంది. పనిగట్టుకొని కోలాటం నేర్చుకుంటారు కాబట్టి, నేర్చుకునే జట్టులో చాలా మంది ఉంటారు కాబట్టి ఒక్కసారిగా వీరంతా నేర్చుకునే అవకాశం ఉంది. ఈ నేర్చిన వారిలో కొందరు జట్టునాయకులయితే, వీరు మరొక జట్టుకు కోలాటం నేర్పితే అపుడు పాటల ప్రచారం విస్తృత స్థాయిలో జరిగినట్లే. ఇట్లాగే ఇవి పరంపరగా వ్యాప్తి చెందుతాయి. ఆటలో లయతో కలిపి పాడే పాటలు నేర్చడానికి ఉత్సాహంగా కూడా ఉంటాయి.

కోలాటం కూడా చూచి నేర్చుతున్న ఆటే. పాటలు మౌఖికంగా ప్రసారాన్ని పొందితే, ఆట అభ్యాసం వల్ల ప్రచారాన్ని పొందుతుంది. ఒక జట్టు నాయకుని ఆధీనంలో కొంత శిక్షణ పొందిన తర్వాత మాత్రమే ఆట పూర్తిగా వస్తుంది. ఒక జట్టు నాయకుని వద్ద నేర్చిన జట్టులోని ఆటగాళ్ళలో కొందరు తాము జట్టు నాయకులై తాము చేర్చిన దానిని మరికొందరకు శిక్షణ ఇవ్వడంవల్ల అధిక ప్రచారాన్ని పొందుతుంది. లేదా ఒకే జట్టు నాయకుడు వివిధ ప్రాంతాలలో పలు జట్టులకు శిక్షణ ఇవ్వడంవల్ల ఈ ఆట ప్రచారాన్ని పొందుతుంది.

ఇట్లా కోలాటం పాటలు మౌఖిక ప్రసారంవల్ల, ఆ ఆభ్యాస ప్రసార వల్ల విస్తృత ప్రచారం పొందుతూ జానపద విజ్ఞాన లక్షణమైన అనుక్రమ ప్రచార లక్షణాన్ని నూటికి నూరుపాళ్ళు కలిగి ఉన్నాయి.

**5. పాఠాంతరాలు కల్గి ఉండడం :**

పాటలకు విస్తృత ప్రచారం లభించడంవల్ల పాటలో ఒక పదానికి బదుల మరొక పదం, ఒక చరణానికి బదులు మరొక చరణం లేదా ఒక చరణంలో కొన్ని పదాలకు బదులు వేరే పదాలు రావడం కన్పిస్తుంది. పాటలు ఎంత ఎక్కువగా ప్రచారాన్ని పొందితే అంత ఎక్కువగా పాఠాంతరాలు తయారవు తాయి. ఒక జట్టు నాయకుడు శిక్షణ ఇచ్చేటప్పుడు జట్టులో అందరూ ఒకేసారి నేర్చుకున్నప్పటికీ ఆయా ఆటగాళ్ళ సాంస్కృతిక నేపథ్యం, గ్రహణశక్తి ఉచ్చారణ వైశిష్ట్యం ఇత్యాద్యంశాల ననుసరించీ, నూతన పదాలను చొప్పించ డంలోగల మోజువల్లనూ పాఠాంతరాలు కోకొల్లలుగా ఏర్పడతాయి. ఈ ఆట గాళ్ళలో కొందరు జట్టు నాయకులై వేరే మరికొందరికి కోలాటం నేర్పినపుడు వీరివద్ద నేర్చుకున్న వారిలో ప్రచారం పొందే పాటల్లో పదాలు, పదబంధాలు, పాదాలకు పాదాలు మారిపోవచ్చు. "సింతమాను సిలకలార గవరమేటిగ్గేను లార"[28] అనే పాటలో 'గవరమేటి గ్గేనులార' అనే పదానికి బదులు 'జవరమేటి జానలార' అనే పదాలు పాఠాంతరాలుగా కన్పిస్తాయి. "కోలుకోలన్న కోలు కోలో నాసామి"[29] అనే పాటలో 'కరమంచి కడబాయి నీళ్ళో నాసామి-కడవ నిండాబొయ్యబోతే' అనే దానికి బదులుగా 'కామంచి కడబాయి నీళ్ళోనాసామి-కడవనిండా ముంచుకోని' అనే చరణం, 'కానొచ్చె కడబాయి నీళ్ళో నాసామి-కడవనిండా ముంచుకోని' అనే చరణం పాఠాంతరాలుగా కన్పిస్తాయి. ఇటువంటి పాఠాంతరాలు దాదాపు అన్ని పాటల్లో కన్పిస్తాయి.

ఆటకు గూడా విస్తృత ప్రచారం ఉంది. దీనివల్ల ఒక ప్రాంతంలో ఒక కోపులో ఒక్క పుల్లతో గొడితే, మరొక ప్రాంతంలో రెండు పుల్లలతో గొడతారు. ఒక్కొక్క ప్రాంతంలో ఒక కోపులో రెండుపుల్లలు గలిపి కొడితే

---

28. అను,. పా. 50.
29. అను., పా. 38.

వేరొక ప్రాంతంలో అదే కోపులో పుల్లలను విడివిడిగా కొడతారు. అట్లే కోపులో వలయాలు చేసేపద్ధతిలో మార్పు ఉంటుంది. ఉదాహరణకు చదరంగం కోపులో కొన్ని ప్రాంతాల్లో నాల్గు వరుసలుగా నిలబెడతారు. కొన్ని ప్రాంతాల్లో నాల్గు వలయాలుగా ఏర్పాటు చేస్తారు. ఇట్లే గరిడి ఏర్పాటు చేయడంలోను, దట్టీ కట్టడంలోను, గతులు మారేటప్పుడు అభినయంలోను, పుల్లలు కొట్టేటప్పుడు అభినయంలోను, అలంకరణలోను, ఎత్తుగడ - ముక్తాయింపులలోను ప్రాంతానికి ప్రాంతానికి తేడాలుంటాయి. ఇవన్నీ రూపాంతరాలుగా పరిగణించవచ్చు కొందరు ఒక కోపును చూసి గతిలో ఏదో కొంత మార్పుతో మరొక కోపును సృష్టించడం అలంకరణలో అదనపు మార్పులు చేయడం మొదలయినవన్నీ అదనంగా కన్పిస్తాయి. ఇంకా కోపుల్లో అభినయాలు మార్చడం, కొత్త అభినయాలు సృష్టించడం, సంఘంలో ఉండే వస్తువులకు తగిన భావం వచ్చేట్లు అభినయిస్తూ ఆయా వస్తువుల పేర్లు కోపులకు పెట్టడం, పురాణ పురుషుల పేర్లు కోపులకు పెట్టడం మొదలయినవికన్పిస్తాయి. చిన్న కత్తెర కోపు, పెద్ద కత్తెర కోపు, చిన్న చెలియకోపు, పెద్ద చెలియ కోపు, జడకోపు, చెలియ జడకోపు, ఉయ్యాల కోపు, జంజెం కోపు, కృష్ణ కోపు, కంస కోపు మొదలయినవన్నీ ఇట్లా వెలసినవే.

ఇట్లు కోలాటం పాట, ఆట విస్తృత ప్రచారం పొందడంవల్ల పాఠాంతరాలు, రూపాంతరాలు అనే జానపద విజ్ఞాన లక్షణాన్ని పూర్తిగా కల్గి ఉన్నాయి.

**6. నియమిత స్వరూపం లేకపోవడం :**

శిష్ట సాహిత్యానికి కర్త ఉంటాడు. కాబట్టి అదొక నియమిత స్వరూపం కల్గి ఉంటుంది. దాన్ని తగ్గించడానికి, పెంచడానికి వీలుండదు. కాని జానపద గేయాలు అవిజ్ఞాత కర్తృత్వంలో వెలువడుతాయి. ఈ పాటలు విస్తృత ప్రచారాన్ని పొందినపుడు పాఠాంతరాలు, అధిక చరణాలు కోకొల్లలుగా చేరుతాయి. ఒక పాటలో ఒక ప్రాంతంలో పది చరణాలేఉంటే వేరొక ప్రాంతంలో అంతకంటే ఎక్కువ చరణాలు ఉండవచ్చు. లేదా ఉన్న చరణాల్లో కొన్ని తగ్గవచ్చు. ఇది అసలు స్వరూపం అని దేన్నీ తేల్చి చెప్పలేము. ఉదాహరణకు "కోలు కోలన్న కోలు కోలో నాసామి - కొమ్మలిద్దరు మంచి జోడో"[30], "శీకార పలనాటిసీమలో

30. అను., పా. 38.

నెలకొన్న సితిని యుప్పలపాటి సిన్నదీ"[31] అనే పాటల్లో రూపాంతరాలు, పాఠాంతరాలు, అధిక చరణాలు కోకొల్లలుగా కన్పిస్తాయి. ఒక్కొక్క పాటలో పాతను విడనాడి కొత్తను చేర్చవచ్చు. అప్పుడవి పాత కొత్తల మేలు కలయికగా తయారవవచ్చు. కాబట్టి పాటల్లో ఏది నియమిత స్వరూపమో లేక ఏది పరిణత స్వరూపమో చెప్పడానికి వీలుపడదు.

ఆటలోగూడ కొందరికి ఏడెమిది కోపులు వస్తే, మరి కొందరికి పది పన్నెండు కోపులు వస్తాయి. మరికొందరికి అంతకంటె ఎక్కువ కోపులు వస్తాయి. చౌల నరసింహదాసు అనే జట్టు నాయకునకు ముప్పై కోపులు వస్తాయి. ఒకరు భారత కోలాటమనీ, మరొకరు గుజరాతు కోలాటమనీ, ఇంకొకరు గోల్కొండ కోలాటమనీ, వేరొకరు బజారు కోలాటమనీ, ఇంకా కొందరు కులుకుల కోలాట మనీ చెప్తారు. వీటిలో ఫలానా కోలాటంలో ఫలానా కోపులు ఉండాలనే నిర్ధారణ లేదు. ఒక కోలాటంలో ఒకచోట కొన్ని కోపులు ఉంటే, వేరొకచోట మరికొన్ని కోపులు అదనంగా ఉండొచ్చు. ఒక కోలాటంలో ఒక ప్రాంతంలో ఒక పుల్లతో కొడితే అదే కోలాటంలో మరొక ప్రాంతంలో రెండు పుల్లలతో కొట్టవచ్చు. ఇంకా ఆటగాళ్ళ అలంకరణలోను, కర్రలు కొట్టడంలోను, కర్రలు-గరిడీ అలంకరణ ల్లోను, అభినయాల్లోను, జట్టు నాయకుని అలంకరణ-అభినయాల్లోను ప్రాంతా నికి ప్రాంతానికి తేడా ఉంటుంది. విస్తృత ప్రచారం పొందడం వల్లా, ఎవరి అభి రుచి కొద్దీ వారు కొత్త పద్ధతులు ప్రవేశపెట్టడం వల్లా, ఇది దేశీయమైంది కాబట్టీ, ఈ కోలాటానికి నియమిత స్వరూపం గాని, పరిణత స్వరూపం గాని లేదు అనే జానపద విజ్ఞాన లక్షణం నూటికి నూరుపాళ్ళు తగి ఉంది.

**7. నిత్య నూతనత్వాన్ని కల్గి ఉండటం :**

కోలాటం పాటలు ఒక ప్రాంతం నుంచి వేరొక ప్రాంతానికి శీఘ్రగతిని ప్రచారం పొందే లక్షణం కలవి కాబట్టి వీటిలో పాఠాంతరాలు, అధిక పాఠాలు కోకొల్లలుగా చేరుతాయి. అందువల్ల పాతను వదలడం, కొత్తను చేర్చడం అనేది ఆయా ప్రజల మత పరంగా, కులాల పరంగా, వర్గ పరంగా, విశ్వాసాల పరంగా, ఆచార పరంగా, భావ పరంగా, అభిరుచుల కనుగుణంగాను జరుగు

31. అను., పా. 114.

తుంది. కళాభిలాషులైన ఆటగాళ్ళు తమకు అనుగుణంగా మలచుకొంటూ, కొత్త దనాన్ని సంక్రమింప జేస్తుంటారు. కాబట్టి ఈ పాటలు నిత్య నూతనాలు.

ఆటలో గూడా తమకు అభిరుచి గల్లవీ, అనుగుణమైనవీ, అనుకూలమైనవీ అయిన కొత్త పద్ధతులను ప్రవేశ పెడుతుంటారు. కులుకుల కోలాటంలో కర్రలు తగిలీ తగలనట్లు కొడతారు. ఒక్కొక్కసారి శబ్దం కూడా వినిపించనంత నెమ్మదిగా కొడతారు. మద్దెల, హార్మోనియం మొదలైన వాద్యాల శబ్దమే విని పిస్తుంది. కాని భారత కోలాటంలో కానీ, తదితర కోలాటాల్లో కానీ కర్రలు పెద్ద శబ్దాన్నిస్తాయి. వాద్యాల్లో మద్దెల, హార్మోనియం, తాళాలు ఎక్కువగా కన్పిస్తాయి. తప్పెట, ఫ్లూట్ వంటి వాద్యాలు మైక్ మొదలయినవి అదనంగా కన్పిస్తున్నాయి. తాళాలు అక్కడక్కడ కన్పించడం లేదు. పూర్వ కాలంలో గరిడీకి వెలుతురు కోసం కాగడాలు వాడేవారు. ఇప్పుడు పెట్రోమాక్స్ లైట్లు, క్రొన్నిచోట్ల విద్యుద్దీపాలు ఏర్పాటు చేస్తున్నారు. గరిడీ అలంకరణకు పూర్వ కాలంలో రంగు కాగితాల దండలో లేక పూలదండలో కట్టేవారు. ప్రస్తుతం గరిడీ అలంకరణకు రంగులతో కూడిన విద్యుద్దీపాలు కూడా వాడుతున్నారు. ఆటగాళ్ళ అలంకరణలో పూర్వం శిగకు ముడి, ముడిపై పూలు, మెడలో కంటె, చేతులకు మురుగులు, దట్టీలు కట్టడం కన్పించేవి. కాని ప్రస్తుతం అవన్నీ కను మరుగైనాయి. నేటి నాగరక ప్రపంచంలో చొక్కాలకు బదులు రంగు రంగుల బనియన్లు వాడుతున్నారు. చేతి రుమాలలు వాడుతున్నారు. ఇట్లా ఆటలోను ప్రతి చిన్న విషయంలో మార్పులు జరుగుతూ, పాతను విడుస్తూ, కొత్తను చేరుస్తూ ఉంటారు. కాబట్టి నిత్య నూతనత్వం అనే జానపద విజ్ఞాన లక్షణం కోలాటంలో కన్పిస్తుంది.

### 8. పునరావృత్తి కల్గి ఉండడం :

జానపద గేయాల్లోని అన్ని రకాల గేయాలకు వలె కోలాటం పాటల్లో కూడ పునరావృత్తి కన్పిస్తుంది. ఈ పునరావృత్తి పల్లవితో తుల్యమైన చరణాలు. ఈ పునరావృత్తి అనేది ఒక పదం కావచ్చు, లేదా ఒక చరణం కావచ్చు. ఒక ఉచ్ఛారణ భాగం పునరావృత్తి పొందుతుంది. ఉదాహరణకు-

"సందమామ సందమామా సందమామా రాజు
సంది దెలిపే గ్గేనులెవరే సందమామా రాజూ"[32]

అనే పాటలో ప్రతి పాదం చివర 'సందమామా రాజూ' అనే పదం పునరావృత్తి అవుతుంది. అట్లే "కోలు కోలన్న కోలు కోలో నాసామి– కొమ్మలిద్దరు మంచి జోడూ",[33] "కోలూ కోలన కోలూ కోలే – కోలూ — కోలు కోలనా కోలూ కోలే",[34] "తందానా తందాన తందాన తందనానా",[35] "నందికొండా వచ్చెను రోరన్నా రైతన్నా – నీ కట్టమంతా తీరును రోరన్నా కూలన్నా"[36] మొదలయిన చరణాల పునరావృత్తిలో కన్పిస్తాయి. ఈ పునరావృత్తి పదం గాని, చరణంగాని పాటలోని మొదటి చరణం నుంచే ఉండాలనిగాని, మొదటి చరణంలోనిదే అయి ఉంటుందనిగాని నియమం లేదు. ఉదాహరణకు "నమ్మి వచ్చితి నయ్య నాపాలి దయివమో రమ్మని పిలవరా బ్రెమ్మమో యారా బ్రెమ్మము"[37] అనే పాటలో 'బ్రెమ్మమో యారా బ్రెమ్మము' అనే పదమూ, "ఎయ్యార కోలాటం యా అయ్యల పోరాటం-నియ్యాతు లేదని తెలిసిందే కద నీతుల కోలాటం సైసై"[38] అనే పాటలో 'కోలాటం సైసై' అనే పదమూ పాట మధ్యలో పునరావృత్తిగా కన్పిస్తాయి. అట్లే "అనంత రంగం శ్రీవైకుంటం"[39] అనే పాటలో 'ఏమిర నరుడా జాగము సేసెవు - నవ్వులు గాదిది రాంభజనా' అనే చరణమూ, 'శ్రీ యెంకటేశ్వరుని సిరిమల్లె తోటలో"[40] అనే పాటలో 'ఆత్మగురుడా మనకు

---

32. అను., పా. 49.
33. అను., పా. 38.
34. అను., పా. 40.
35. అను., పా. 56.
36. అను., పా. 65.
37. అను., పా. 67.
38. అను , పా. 108.
39. అను., పా. 2.
40. అను,. పా. 119.

అందెవ్వరున్నారు పరమాత్మ నేలుకుందామా' అనే చరణమూ పాట మధ్యలో పునరావృత్తిలో కన్పిస్తాయి. ఈ పునరావృత్తి పాటలో బాహ్యంగాను (external refrain) ఉండొచ్చు, లేదా అంతరంగాను (internal refrain) ఉండొచ్చు, లేదా మిశ్రంగాను (mixed refrain) ఉండొచ్చు.[41]

కోలాటం ఆట దెబ్బలకు పాటలోని కుదింపు చరణాలలో లేదా దీర్ఘచరణాలలో ఉండే వ్యత్యాసాన్ని తొలగించి ఆటగతి తప్పకుండా ఆటక్రమాన్ని కాపాడుతుంది. ఒక పాటలో ఒక పునరావృత్తికంటే ఎక్కువకూడా ఉండవచ్చు.

కోలాటం కోపుల్లో పునరావృత్తి వంటిదే ఉసెత్తు ఉంటుంది. ఈ ఉసెత్తు ప్రతికోపులోను, అన్ని కోలాటాల్లోను ఉంటుంది. పాట ఎత్తుకునేటప్పుడు ఆటలోని అభినయం, గతులు నెమ్మది నెమ్మదిగా ఉండి ఉసెత్తులో వేగం పెరుగుతుంది. ఈ ఉసెత్తు కోపులో చివర మాత్రమే ఉంటుంది. ఉసెత్తువేసిన తర్వాత ఆట ఆపి వేస్తారు. ప్రతి కోపుకి ఉసెత్తు చివరిదన్నమాట.

**9. జనసామాన్య పరిచిత వస్తువై ఉండడం :**

కోలాటం పాటల్లోని "బలిరే కమ్మంపాడు,"[42] "బలిరే టంగుటూరు",[43] "ఆహా నిండీ పారీటీవి,"[44] "నందికొండా వచ్చెనురో,"[45] "ద్రుగ్గి కాపూరస్తుడు"[46] మొదలయిన స్థలవిషయాలు తెల్పే పాటలూ; "ఏయోన గురిసె

41. తెలుగు కన్నడ జానపదగేయాలు, పు. 8
42. అను., పా. 82.
43. అను., పా. 83.
44. అను., పా. 17.
45. అను., పా. 65.
46. అను., పా. 62.

నయ్యో"[47], "అస్తమించె గాంది దేముడు,"[48] "అంద్రుడ రావయ్య పోట్ల బూదెయ్యా,"[49] "సామిరార పొట్టి శీరామ"[50] మొదలయిన హరాత్సంఘటనలు తెల్పేపాటలూ; "సుబ్బదాసునిగాంచుమురో,"[51] "వైదగటమూ కాంతయ్యగారి కయిత్తమేనండీ"[52] మొదలయిన వ్యక్తులకు సంబంధించిన పాటలూ; "ద్రుగ్గి కాపూరస్తుడు,"[53] "శ్రీగిరిపాటిలోన"[54] మొదలయిన స్థానిక గ్రామ దేవతలకు సంబంధించిన పాటలూ; "గొల్లవారిమమ్మా,"[55] "యె గిరా సైయ్యోగిరా"[56] మొదలయిన కులాలను తెలిపే పాటలు ఇంకా తినుబండారాలు, వాడుకవస్తువులు, శృంగార విషయాలు, చెట్లు - చేమలు. ఆచార - వ్యవహారాలు, కట్టుబొట్టు మొదలయినవన్నీ చోటు చేసుకున్నాయి.

కోలాటంలోని కోపులకు ఉయ్యాల, జంజెం, జడ, కత్తెర, పొడమల్లె, బజారు, చదరంగం, రాంబాణం మొదలయిన పేర్లు కన్పిస్తాయి. కోలాటానికి వాడే కర్రలు, అలంకరణ సామగ్రి మొదలయిన వాటిలో పరిచితాలైన పేర్లు కన్పిస్తాయి.

## 10. సరళత్వం కల్గి ఉండడం :

కోలాటం పాటలు అనుకరించడానికి చాలా సరళంగా ఉంటాయి. అందుకు పునరుక్తులు చాలా ఉపకరిస్తాయి. జన సామాన్య పరిచిత విషయాలవడం

47. అను., పా. 26.
48. అను., పా. 9.
49. అను., పా. 12.
50. అను., పా. 121.
51. అను., పా. 124.
52. అను., పా. 64.
53. అను., పా. 62.
54. అను., పా. 116.
55. అను., పా. 44.
56. అను., పా. 95.

మరొక కారణం. ప్రాంతీయత, జాతీయతలే కాకుండా పరిచిత వస్తువు కావడం వల్ల అనుసరణ యోగ్యంగా ఉంటుంది. అంటే సరళత్వం దీని కుపకరిస్తుంది. అందువల్ల విస్తృత ప్రచారాన్ని పొందుతుంది.

ఆట చూడడానికి చాలా సులువుగా కన్పించినప్పటికీ ఆకాలంటే శిక్షణ అవసరం, అయితే ఆటలో చాలా సరళత గోచరిస్తుంది.

ఇట్లు జానపద విజ్ఞానంలో కన్పించే లక్షణాలన్నీ జానపద విజ్ఞానంలో మిశ్రకళా (Mixed Arts) విభాగానికి చెందిన కోలాటానికి సమ్మ సరిపోతాయి. జానపద విజ్ఞానంలోని ఏ అంశానికైనా దాని అభివృద్ధి దాని లక్షణాలన్నిటిపైనా ఆధారపడి ఉంటుంది. అట్లే కోలాటం ప్రచారం, అభివృద్ధి కూడా దాని లక్షణాలన్నిటిపైనా ఆధారపడి ఉంటుంది.

# పల్నాటిసీమ నైసర్గిక స్థితి

ప్రకృత పరిశోధనకు పల్నాటిసీమ వ్యవహారంలో ప్రచలితంగా ఉంటున్న కోలాటం-పాటలు మూలాధారం కాబట్టి ఆ సీమ నైసర్గిక పరిస్థితిని స్థూలంగా పర్యాలోచించడం అవసరమయింది. ఆంధ్రప్రదేశ్, గుంటూరు జిల్లాలోని నేటి గురజాల, మాచర్ల తాలూకాల్లో చేరిన భూభాగం చరిత్ర ప్రసిద్ధి చెందిన పల్నాటిసీమ.

ప్రాచీన కాలంలో పల్నాటిసీమకు హద్దులు ఇట్లా ఉన్నాయి :

"సల్లంగొండయు నాగరి
కల్లును ధరణిస్థలిం బ్రగల్భ స్థలముల్
పల్లేఱు నాగులేఱును
పల్లెక్ష్మాకాంత యెల్ల ప్రారంభంబుల్"[1]

అని కన్పిస్తాయి. ఇచ్చట సల్లగొండ అంటే కారెంపూడి, మేళ్ళవాగుల మధ్యన ఉన్నకొండ. ఈ నల్లగొండను గూర్చి పల్నాటి వీరచరిత్రలో-

"కురువకు నేతెంచె గురుశౌర్య మమర
ఎక్కెనా నలగొండ యెదురేమిలేక"
"నలగొండ శిఖరంబు నన్నిల్చి చూచి"

అని కన్పిస్తున్నాయి.[2] పైన చెప్పిన కురువకు నాయకురాలి కనుమ అనే పేరుంది. ఈ కనుమ గుండా నాగులేరు ప్రవహిస్తుంది. ఈ కనుమ, నాగులేరు రెండును కారెంపూడి-మేళ్లవాగుల మధ్యన ఉన్నాయి. నాగరికల్లు అంటే ప్రస్తుత

1. క్రీడాభిరామము, ప. 121.
2. పల్నాటి వీర చరిత్ర (పాదాలు. 77, 78, 84), పు. 82, 83.

నరసరావుపేట తాలూకాలోని నకరికల్లు ఇది తూర్పుహద్దుగా చెప్పవచ్చు. ధరణీ స్థలి అంటే ధరణికోట. ఈధరణికోట పల్నాటికి ఈశాన్యమూలనఉంది. పద్యంలో కన్పించేనాగులేరు అంటే కారెంపూడి-మేళ్లవాగుల మధ్యన నాగులేరు పుట్టిన కొండలు అని చెప్పవచ్చు. ఈ నాగులేరు, నల్లగొండలను దక్షిణహద్దులుగా చెప్పవచ్చు. పల్లేరు అంటే కృష్ణానది అయిఉండాలి. పల్నాటిలోని పల్లెలన్నిటికి అది ఒక్కటే పెద్ద ఏరు కాబట్టి, ఈ ప్రాంతానికి పశ్చిమోత్తరాలుగా సుమారు 100 కి. మీ. దాకా పారుతుంది కాబట్టి దీన్ని పల్లేరు అని వాడివుండవచ్చు. ఇప్పటికీ పల్నాటిసీమలో తొలకరి రోజుల్లో కృష్ణానదికి నిండుగ నీరు రావడాన్ని 'ఏరు వచ్చింది' అనీ, కృష్ణానదిని రేవులవద్ద దాటడాన్ని 'ఏరు దాటడం' అనీ, నిందావాక్యాలుగా "ఏట్లో దూకు, ఏట్లో పడు, ఏటికి పోపు" మొదలయిన విధంగా కృష్ణానదికి 'ఏరు' అని వ్యవహారంలో ఉంది. ఈ కృష్ణానదిని పశ్చిమోత్తరహద్దుగా చెప్పవచ్చు; ఇవన్నీ క్రీడాభిరామకర్త పేర్కొన్న హద్దులు. అప్పటికి ఈ పల్నాటి సీమ ఎన్నిగ్రామాల పరిమితమో తెలియదు.

> "గీ॥ పల్లెనాటను నూట తొంబదియు నాల్గు
> గ్రామముల నీడుగానక కాకునూరి
> వెంగనార్యుడు వేద వేదాంగములను
> బ్రస్తుతికి నెక్కె మాఱట బ్రహ్మయనఁగ"[3]

అనే పద్యాన్ని బట్టి అప్పకవి కాలానికి పల్నాటిలో నూట తొంబైనాల్గు గ్రామా లున్నట్లు తెలుస్తుంది.

**అంతస్సీమలు :**

ప్రాచీన కాలంలో పల్నాటి సీమలో అంతస్సీమలుగా బెల్లంకొండ, నాగార్జునకొండ, తంగెడు సీమలు ఉన్నాయి.

**బెల్లంకొండ :**

ఇది ప్రస్తుతం గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో చేరింది. ఇది బలిష్ఠమైన గిరి దుర్గంగా ఉండేది. శ్రీ కృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయ యాత్రలో సాధించిన కోటల్లో ఇది ఒకటి.

3. అప్పకవీయము, పీఠిక, ప. 82.

క్రీ. శ. 1600-1660 ప్రాంతం వాడైనరి కాకునూరి అప్పకవి తంగెడు సీమ ఉనికిని గూర్చి—

" .భరత వర్షంబున భరత ఖండంబున
మంగళోర్విని గర్మమహిత భూమి
మలయ వింధ్యాచల మధ్యమంబున(గృష్ణ
యామ్యతీరమున బ్రహ్మాశ్రమమున
దండకాటవి నంధ్రాభిధాన పుణ్య
దేశమున శ్రీగిరీశాస్యదిశను గొండ
వీటి పడమటం దంగెడు విషయమునను....

అనీ, ఇంకా-

తంగెడ సీమను నిర్జర
గంగాసమ నాగ నిమ్నగా పూర్వము నం
బింగళిపుర దక్షిణమున
రంగుగ నెలకొన్న గోపరత్నంబునకున్ '[9]

అనీ పేర్కొన్నాడు.

**నాగార్జున కొండ :**

తత్త్వ రసాయన వైద్యశాస్త్రాల్లో పండితుడైన ఆచార్య నాగార్జునుడు విశ్వవిద్యాలయం స్థాపించిన ప్రదేశం నాగార్జునకొండ. కృష్ణదేవరాయలు జయించిన సీమల్లో ఒకటిగా రాయల శాసనాలవల్ల తెలుస్తుంది.[10] ఇది మాచర్లకు పడమర దిశగా ఇరవై కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇది అమరావతి తర్వాత ప్రాచీనాంధ్ర బౌద్ధ క్షేత్రాల్లో ప్రసిద్ధి చెందింది. ఇచ్చట పరిశోధనలను జరిపి ప్రాచీన కాలపు ప్రాకృత శాసనాలను, బౌద్ధ శిల్పాలను కనుగొన్నారు. ఇచ్చట

---

8. ఆంధ్ర కవి తరంగిణి, సం. 12, పు. 109.
9. అప్పకవీయము, పీఠిక, ప. 34, 101.
10. తిరుపతి దేవస్థాన శాసన సంపుటములు, సం. 3, పు. 178, 179.

ఒక పురావస్తు ప్రదర్శనశాలం కూడా ఏర్పాటు చేశారు[11] ఈ నాగార్జునకొండలోని రామడుకె గ్రామాన్ని మాచర్లలోని చెన్నకేశవస్వామికి దానం చేసినట్లు రామడుకె గ్రామంలోని 'కన్నడ-తెలుగు' భాషా మిశ్రమంలో ఉన్న ఒకశాసనంవల్ల తెలుస్తుంది.[12] మరొక శాసనంవల్ల ఘంట ధర్మరాయనింగారు నాగార్జునకొండ సీమలోని కోలగుట్లలో కొంత భూమిని ఒక బ్రాహ్మణునకు (శ స. 1519) దానం ఇచ్చినట్లు తెలుస్తుంది[13]

పల్నాడు - పర్యాయపదాలు - వ్యాప్తి :

పల్నాడు అనే పదానికి పలనాడు, పల్లనాడు, పల్లవబొగ్గ, పల్లవభాగ, పల్లవభోగం, పలినాడు, పల్లినాడు, పల్లిదేశము, పల్లిరాష్ట్రము, పల్లెనాడు, పల్లె విషయము మొదలయినవి రూపాంతరాలుగా కన్పిస్తున్నాయి.

కులోత్తుంగ గొంకరాజు కొదమగూడలోనిశాసనం,[14] ద్రోణాదులశాసనం,[15] దుర్గిశాసనం,[16] మార్కాపురం తాలూకా త్రిపురాంతకంలోని శాసనం,[17] దుర్గిలోని కాకతి రుద్రమదేవి శాసనాల్లో[18] కన్పించే'పల్లినాండు' అనేది; భృగుబండశాసనం[19] లోని 'పల్లినాడు' అనేది; చాగి బేతరాజు మాచర్ల శాసనం[20] లోని పల్లిదేశము అనేది

11. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 108.
12. M.E R. 1929 - 30, No. 84.
13. M.E.R. 1929 - 30, No. 88.
14. S.I.I. Vol. X. No. 119 (శా. శ. 1069).
15. S.I I. Vol. X. No. 233.
16. S I I. Vol. X. No. 334 (శా.శ. 1173).
17. S.I.I. Vol. X. No. 370 (శా.శ. 1181)
18. S.I.I. Vol. X. No. 422 (శా.శ. 1191).
19. M.E.R. 1932 - 33, No. 263 (శా.శ. 1040).
20. S I.I. Vol. X. No. 66 (శా.శ. 1033).

పూర్వ చాళుక్య ప్రభువైన రెండో విష్ణువర్ధనుని కోనెకి శాసనం (క్రీ.శ. 669)[2] లోని 'పల్లిరాష్ట్ర' అనేది శాసనాల్లో కన్పిస్తున్నాయి.

> ''ప్రథమకారణములు పల్నాటియేకాంగ
> వీరపురుష సంప్రహారమునకు''[22] లోను,
>
> ''రసికుఁడు పోవఁడు పల్నాడు''[23] లోను

"పన్నుగఁ ఒల్నాటి సీమ ప్రజలందఱకున్"[24]లోను కన్పించే 'పల్నాడు అనే పదం; "పలనాటి వీరుల భాగవతంబు"[25] లోను, ''లలింబలినాటనుఁ బాకి నాటనుం విలసిల్లు పలనాటి వీరుల చరిత్ర''[26] లోను కన్పించే 'పలనాడు' అనే పదం; మహావంశమనే బౌద్ధ గ్రంథంలో కన్పించే 'పల్లవబొగ్గ', 'పల్లవభాగ'[27] 'పల్లవభోగం'[28] అనే పదాలు; ''విప్రుఁడీక్షించెఁ బలినాటి వీరపురుష''[29] లోను, ''కారెమపూడి పట్టణము కాశిగదా పలినాటి వారికిన్''[30] లోను, ''పలినాటికి మాటికిఁబోవ నేటికిన్''[31] లోను కన్పించే 'పలినాడు' అనే పదం; ''పల్లెనాటి వీర బాంధవులకు''[32] లోను, ''పల్లెనాటి సీమ పల్లెటూళ్లు''[33] లోను,

---

21. E.I Vol, XXXI. No. 12. Paras 15 and 16 of M.E.R, 1939 - '40 to 1942 - '43.
22. క్రీడాభిరామం, ప. 119.
23. చాటుపద్య మణిమంజరి, పు. 125.
24. పైదే, పు. 125.
25. పల్నాటి వీర చరిత్ర [పాదాలు 53, 58], పు. 2.
26. ప్రభావతీ ప్రద్యుమ్నము.
27. ప్రాచీన దక్షిణ భారత చరిత్ర, పు. 119.
28. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర, పు. 47.
29. క్రీడాభిరామం, ప. 115.
30. చాటుపద్య మణిమంజరి, పు. 125.
31. పైదే, పు. 125.
32. క్రీడాభిరామం, ప. 118.
33. చాటుపద్య మణిమంజరి, పు. 125.

''పల్లెనాటను నూట తొంబదియు నాల్గు''[34] లోను కన్పించే 'పల్లెనాడు' అనే పదం. ''అచట నచట జనప పెద్దలు పల్లెదేశమ్ములందు''[35] లో కన్పించే 'పల్లెదేశము' అనే పదం; ''పల్లెవిషయంబున కా మహిమంబు చెల్లె''[36] లో కన్పించే 'పల్లె విషయము' అనే పదం సాహిత్యంలో కన్పిస్తున్నాయి.

ఇంకా పల్లునాడు, పలునాడు, పాలనాడు మొదలయిన పదాల్ని కూడా 'పల్నాడు' పదానికి పర్యాయ పదాలుగా కొందరు చూపించారు. వాటికి కొన్ని ఆధారాలు చూపి ఈ పదాలే పల్నాడైనాయని వాదించారు. కాని ఆ ఆధారాలు అంగీకార యోగ్యంగా కన్పించవు. పల్లవమార్గ, పల్లవభాగ అనే పదాలకువలె 'పల్లవనాడు' అనేది కూడా కన్పిస్తుంది.

పద వ్యుత్పత్తి :-

'పల్నాడు' పద వ్యుత్పత్తిని చాల మంది పరామర్శించారు. అందులో చిలుకూరి వీరభద్రరావుగారు, అక్కిరాజు ఉమాకాంతంగారు, కుందూరి ఈశ్వర దత్తుగారు ముఖ్యులు. వారి వాదాలు ఇట్లా ఉన్నాయి:

చిలుకూరి వీరభద్రరావు గారు :-

"ఆంధ్ర రాజధానీ నగరమగు ధాన్యకటకమునకు దక్షిణ భాగమున జైన, బౌద్ధ, శైవమతములు అవలంభించిన పహ్లావాదులు వేనవేలు నివసించుచు క్రమముగా నాంధ్రులలో కలిసిపోయి యాంధ్ర పహ్లావు లనంబడుచుండిరి. ఈ యాంధ్ర పహ్లావులే పల్లవులైరి. ఈ పల్లవులు నివసించు ప్రదేశమే పల్లవనాడను పేరం బిలువబడుచుండెను. ఈ పల్లవనాడే నేడు పల్నాడని పిలువబడుచు గుంటూరు మండలములో నున్నది"[37] అన్న చిలుకూరి వారి వాదాన్ని కుందూరి ఈశ్వరదత్తు గారు ఎత్తి చూపారు.

---

34. అప్పకవీయం, పీఠిక, ప. 82.
35. క్రీడాభిరామం, ప. 122.
36. పైదే, ప. 123.
37. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 205.

అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు :-

"చిన్న చిన్న పల్లెలు గల దేశముగాన బల్లెనాడని పేరు వచ్చిం"ద వాదాన్ని,

**"A more poetical derivation of Palnad is 'Milk Land from the light cream-coloured marble that abounds there.**

"పాలరాయి విశేషముగా నుండుటవలన పాలనాడని పేరు వచ్చినదనియు పాంనాడే పల్నాడయినదను"[38] వాదాన్ని ఖండిస్తూ "పలునాడని యొకచో గాన బడియెడు. నానావిధ భూములు కలవియని దీని కర్థము చెప్పుచున్నారు. నాడనగ దేశము కాని భూమి కాదు. ఈ సీమ యున్నతములయిన కొండలచే జుట్టు నావరింపబడి నడుమ బల్లముగా నుండుటవలన "పల్లునాడు" నా బేరొంది "పల్లనాడు" పల్లు, విల్లు, ముల్లు శబ్దంబులంబోలె జడ్డకు లోపంబు రాగా "పలునాడు"గ మాఱి 'పలునాడు' కొద్ది మాఱ్పుచెంది పలనాడై, పలనాడు పల్నాడై "పలనాడు" "పల్నాడు" అను రెండు రూపములు మాత్రము వ్యవహరింపబడుచు వచ్చెనని నా యభిప్రాయము. పూర్వ గ్రంథములయందును శిలా శాసనముల యందును పలనాడు, పల్నాడను రెండు రూపములే సాధారణముగా నుపయోగింపబడియున్నవి శ్రీనాథుడు వీరచరిత్ర యందెచ్చట బల్లెనాడని ప్రయోగింపలేదు" అని తెలుపుతూ పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నములోని "రంగుగ గౌతమీ .. .లలిం బల్నాటనుబాకనాటను "అనేదాన్ని, "పలనాటిగొల్లల పాటజాతి" అనే గణపవరపు వేంకటకవి పద్యాన్ని, కులోత్తుంగ చోడ గొంకమహేశ్వర పదారాధకుండునైన కొమ్మనాయకుని శాసనాన్ని; కారెంపూడి వీరాలయంలోని తూర్పువైపు బండమీది నల్లాంచక్రవర్తుల శాసనాన్ని పేర్కొని వీటిలోని 'పలనాడు' అనే పదాన్ని తన వాదానికి బలంగా చూపిస్తూ "వీటన్నింటినిబట్టి చూడ 'పలునాడు' అనునది యదార్థ నామమనియు 'పలనాడు', 'పల్నాడు' అను రూపములు వ్యవహారమున రూఢములైనవనియు స్పష్టమగుచున్నది"[39] అని పేర్కొన్నారు.

---

38. పల్నాటి వీరచరిత్ర, ప్రథమ భూమిక, పు. 7.
39. పల్నాటి వీరచరిత్ర, ప్రథమ భూమిక, పు. 8, 9.

కుందూరి ఈశ్వర దత్తుగారు :-

ఉమాకాంతంగారి తర్వాత ఈ నామ నిర్దేశాన్ని విపులంగా పరిశీలించినవారు కుందూరి ఈశ్వరదత్తుగారు. అందుకుగాను వారు శాసన, సాహిత్య ప్రయోగాల్ని చూపించారు.

పూర్వ చాళుక్యప్రభువు రెండవ విష్ణువర్ధనుని కోనెకి శాసనం (క్రీ.శ. 669) లోని 'పల్లిరాష్ట్ర' అనే పదాన్ని, చాగి బేతరాజు మాచర్ల శాసనం (శా. శ. 1033) లోని 'పల్లిదేశ' అనే పదాన్ని, పృగబండ శాసనం (శా.శ. 1040) లోని 'పల్లి నాండు' అనే పదాన్ని, కులోత్తుంగ గొంకరాజు కొదమగూప శాసనం(శా.శ.1069) లోని 'పల్లినాండు' అనే పదాన్ని; ద్రోణాదుల శాసనం, దుర్గిశాసనం (శా.శ. 1173) త్రిపురాంతకం శాసనం (శా. శ. 1181), కాకతి రుద్రమదేవి దుర్గిశాసనాల (శా.శ. 1191) లోని 'పల్లినాండు' అనే పదాన్ని శాసన ఆధారాలుగా చూపించారు.

తెలుగు సాహిత్యంలో కన్పించే పదాలైన పల్నాడు, పలనాడు, పలినాడు, పల్లెనాడు, పల్లెదేశము, పల్లెవిషయము మొదలయినవి చూపించి వీటిలో 'పల్లి' శబ్ద సంబంధాన్ని పేర్కొన్నారు. ఈ 'పల్నాడు' అనేది 'పల్లి', 'నాడు' అనే శబ్దాల కలయికవల్ల ఏర్పడిందనీ, పల్లి అంటే బౌద్ధ లేక జైన నివాస స్థలమనే అర్థమనీ, ప్రాచీనకాలంలో బౌద్ధమత వ్యాప్తికి స్థానమై, సుప్రసిద్ధుడైన నాగార్జునా చార్య బౌద్ధ సంఘారామానికి నిలయమయి, బౌద్ధనివాసాలకు ఆటపట్టయినందున ఇది 'పల్లెనాడై' తర్వాత 'పల్నాడ'యిందనీ తన వాదాన్ని పేర్కొన్నారు.[40]

ఈ'పల్నాడు'పదంలోని 'నాడు'శబ్దాన్ని గూడ కుందూరివారు వివరించారు. ఆంధ్రదేశంలో ప్రాచీన రాజకీయ విభాగాలలో ప్రసిద్ధమూ, బహువ్యాప్తిగాంచిన దేశవాచకం'నాడు.' ఈ'నాడు'అనేది 1) మండలాన అంతర్భాగమనీ 2) సామ్రాజ్య కాలాన 'రాజ్యం'లో అంతర్భాగమనీ 3) కొట్టములోను, వలనాటులోను అంతర్భాగ మనీ[41] వారు ఆధారాలు చూపారు.




40. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. [illegible]-206.
41. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. [illegible]

మహావంశమనే బౌద్ధ గ్రంథంనుంచి నండూరి రామకృష్ణమాచార్య,[42] ఏటుకూరి బలరామమూర్తి[43]గారు సేకరించి వివరించిన విషయాల సాక్ష్యంగా పల్లవబొగ్గ, పల్లవభాగ, పల్లవభోగం అనే పదాలు కన్పిస్తున్నాయి. ప్రాచీనకాలాన పహ్లావులు శాతవాహన రాజ్యకాలాన 'పల్లవబొగ్గ'లో వాసస్థానమేర్పరచుకొన్నారు. దానివల్ల 'పల్లవనాడు' అనే పదంకూడా వ్యవహారంలో ఉండవచ్చు.

ఇట్లు పల్నాటిశబ్ద పూర్వరూపాలనుగూర్చి వారు చర్చ చేశారు. విస్తృత మైన పై పర్యాలోచనం పరిశీలించిన తర్వాత చారిత్రకులలో వ్యుత్పత్తిపరంగా మూడు వాదాలున్నట్లు స్పష్టపడుతుంది.

1 విదేశీయులైన పహ్లావ అన్న రాజవంశీయుల పాలనలోనిది కాబట్టి రాజ వంశపరంగా పహ్లావ శబ్దం పల్లవగా మారిందన్నది చిలుకూరి వీరభద్రరావుగారి అభిప్రాయం. మహావంశాది బౌద్ధగ్రంథాలలో ఈ సీమను నిర్దేశిస్తూ వాడుకచేసిన పల్లవబొగ్గ, పల్లవభాగ, పల్లవభోగం అన్న రూపావళి వీరభద్రరావుగారి వాదానికి అదనపు సాధకాలు.

2. పల్నాటిసీమ నైసర్గిక స్థితి కనుగుణంగా స్థిరపరచినవాదం. 'పల్లు' అన్న పదం తెలుగులో 'పల్లమ్' అన్న పదానికి రూపాంతరం. ఎన్నెన్నో కొండ గుట్టలమధ్య పల్లంగా ఉన్న నాడు కాబట్టి పల్లునాడు క్రమంగా పల్నాడు అయి ఉండవచ్చని అక్కిరాజు ఉమాకాంతంగారి వాదం.

3. జైన, బౌద్ధమత సంబంధంగా సమన్వయించబడ్డది. జైన, బౌద్ధ ఆవాసాలైన పల్లీ సముదాయం ఎక్కువగా ఉన్న నాడు కాబట్టి పల్లినాడే మౌలికరూప మనీ, అదే పల్నాడు అయిందనీ కుందూరి ఈశ్వరదత్తుగారి నిర్ధారణ.

పై వాదాలను కూలంకషంగా పరిశీలిస్తే 'పల్లినాడు' పల్నాడుగా మారిందనడానికి కొంత ఆధారం కన్పిస్తుంది. దానికి శ్రీకుందూరి ఈశ్వరదత్తుగారు 'పల్లిరాష్ట్ర', 'పల్లిదేశ' 'పల్లినాడు'లకు చూపించిన శాసన ప్రయోగాలూ; 'పల్లి' అంటే బౌద్ధ లేక జైన నివాస స్థలమనీ ప్రాచీనకాలంలో బౌద్ధమత వ్యాప్తికి స్థానమై,

---

42. ప్రాచీన దక్షిణభారత చరిత్ర, పు. 119.
43. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర, పు. 47.

సుప్రసిద్ధుడైన నాగార్జునాచార్యు బౌద్ధ సంఘారామానికి నిలయమయి, బౌద్ధ నివాసాలకు ఆటపట్టయినందువల్ల ఈ ప్రాంతం 'పల్లినాడై', ఈ పల్లినాడు 'పల్లెనాడై 'ఆతర్వాత 'పల్నాడు'గా మారిందన్నవాదం సమర్థనీయంగా కన్పిస్తుంది.

## పల్నాడు - ఉనికి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గుంటూరు జిల్లాలోని నేటి గురజాల, మాచర్ల తాలూకాల్లోచేరిన భూభాగం చరిత్రప్రసిద్ధమైన పల్నాటిసీమగా చెప్పవచ్చు. ఇది ఉత్తరఅక్షాంశంలో 16° 10' - 16°.44' ల మధ్యనూ, తూర్పురేఖాంశంలో 79°. 14' - 80° ల మధ్యనూ వ్యాపించి ఉంది.[44] దీని విస్తీర్ణం 2696.2 చదరపు కిలోమీటర్లు. (1041.0 చ మై). ఇందులో మొత్తం 95 గ్రామాలున్నాయి. జనావాసాలు 90. బేచిరాగ్ గ్రామాలు (జనావాసాలు కానివి) 5. ఈ సీమకు పశ్చిమోత్తర దిశలో కృష్ణానది దాదాపు 100 కి.మీ. సరిహద్దుగా ఉంది. అంటే ఈ సీమకు పశ్చిమ దిశలోని శ్రీగిరిపాడు, గంగలకుంటలకు పశ్చిమాన ఉన్నఅడవుల గుండా ప్రవేశించి ఉత్తరాన వేమవరం, తంగెడలవద్ద పల్నాటి సీమను దాటుతుంది. తూర్పు ఈశాన్య ప్రాంతం హద్దుగా గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా, ఆగ్నేయ ప్రాంతం హద్దుగా గుంటూరు జిల్లా నర్సరావుపేట తాలూకా,దక్షిణ హద్దుగా గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా మరియు ప్రకాశం జిల్లా గిద్దలూరు తాలూకా హద్దులుగా ఉన్నాయి.

### పెద్దకొండలు :

పల్నాటికి పశ్చిమ హద్దుగా ఉన్న కృష్ణానది అవతలివైపున నల్లమల కొండలు, ఇవతలి వైపున శ్రీగిరిపాటి కొండలు ఉన్నాయి. ఇంకా కారెంపూడికి తూర్పున 20 కి మీ. దూరంలో ఉన్న గుత్తికొండవద్ద, గుండ్లపల్లివద్ద, కారెంపూడి మేళ్ళవాగుల మధ్య, మించాలపాడు - కాకిరాల - అనే గ్రామాల మధ్య, ఎత్తిపోతలవద్ద, తుమ్మకోట వద్ద కొండలు ఉన్నాయి.

### మైదానాలు :

పల్నాటిలో ప్రత్యేకంగా మైదానాలంటూ ఏమీ లేవు.

---

44. The Imperial Gazetteer of India, Vol. XIX, p. 371.




పల్నాడు తాలూకా

చిట్టడవులు :

నాగార్జునకొండకు తూర్పున 5 కి.మీ. దూరంలో ఉన్న సుబ్బారెడ్డిపాలెం-నాగులవరాల మధ్య, నాగార్జునకొండవద్ద, ఎత్తిపోతలవద్ద, పశ్యామలవద్ద, గుత్తికొండ - గుండ్లపల్లులవద్ద బెల్లంకొండవద్ద, మించాలపాడు - కాకిరాల-ముటుకూరు - కోలగుట్లల మధ్య, శ్రీగిరిపాడు - గంగలకుంటల మధ్య మండాదివద్ద, తుమ్మ్రకోటవద్ద, కారెంపూడి - మేళ్ళవాగుం మధ్య చిట్టడవులు, ఉన్నాయి.

గనులు :-

పల్నాటిలో పలు రకాల రాళ్ళ గనులు ఉన్నాయి. నల్లనాపరాయి, తెల్ల నాపరాయి, ఎర్రనాపరాయి, సుద్దరాయి, గులకరాయి, ఇసుకరాయి మొదలయిన పలురకాల రాళ్ళు లభిస్తున్నాయి. నాపరాళ్ళు సిమెంటు కర్మాగారానికి ముడి సరుకుగా వాడుతున్నారు. మాచర్లలో రెండు సిమెంటు ఫ్యాక్టరీలు ఉన్నాయి. తాడేపల్లి వద్దనున్న సిమెంటు ఫ్యాక్టరీకి పిడుగురాల నుంచి రాతిని ఎగుమతి చేస్తు న్నారు. మాచర్ల, మండాది, శెట్టిపాలెం, కంభంపాడు, ఆత్మకూరు, పోలేపల్లి, రాయవరం, గోలి, రచ్చమల పాడు మొదలయిన చోట్ల తెల్ల, నల్ల నాపరాళ్ళ గనులు ఉన్నాయి రాయవరం, కంభం పాడు, మాచర్లల వద్ద ఎర్ర నాపరాళ్ళ గనులు ఉన్నాయి. సుద్దరాళ్ళు ఆత్మకూరు, దుర్గి, కోలగుట్ల, ధర్మవరాల వద్ద లభిస్తున్నాయి. వీటితో శిల్పాలు చెక్కుతారు. దుర్గిలో ప్రభుత్వ శిల్పకళాభివృద్ధి కేంద్రం ఉంది. కాకిరాల, మించాలపాడుల వద్ద, పోలేపల్లి, ఆత్మకూరుల వద్ద రంగుల బోళ్ళు ఉన్నాయి ఈ బోళ్ళలో రంగు సుద్దలు లభిస్తున్నాయి.

రాళ్లగనులే కాకుండా పల్నాటిలో ప్రాచీన కాలంలో లోహపు గనులు ఉన్నట్లు ప్రతీతి. **"I may mention that lead is found in considerable quantities near Karempudi in the Palnad, but the mines are not now worked. Copper is found both in the Palnad and Vinukonda Taluqs"**[45] అనే బాస్వెలు రిపోర్టువల్ల రాగి, సీసం దొరుకుతుందనీ, ఇంకా—

---

45. పల్నాటి వీరచరిత్ర, ప్రథమ భూమిక, పు. 5, 6.

"Along the eastern edge of the Tumrukota Range, there are traces of old diamond workings, more decidedly around Mallavaram on the right bank of the krishna, where the lime stones lapping round the base of the hill have been regularly undermined to get at the quartzite beneath them containing diamonds. Here there certainly seems good proof of the existence of a set of diamond bearing beds perfectly distinguishable from the quartzites of which the rest of the Range is mainly made, for the debris and other evidence of the old workings are strictly confined to the edge of the limestones . These works date from the Moghul rule" అనేదాన్నిబట్టి పల్నాటిలోని తుమ్మకోట, మల్లవరాలవద్ద వజ్రపు గనులున్నట్లు వాటిలో మొగలాయిల కాలంలో త్రవ్వకం పనులు కొంత కాలం సాగినట్లు తెలుస్తుందని అక్కిరాజు ఉమాకాంతంగారు నుడివారు.[46]

ఉష్ణోగ్రత :

పల్నాడు ఎక్కువగా రాతి ప్రదేశం. ఆంధ్రప్రదేశ్‌లో అత్యధిక ఉష్ణోగ్రతకు స్థానం పల్నాటిలోని రెంటచింతల రెంటచింతల్లో ఉష్ణోగ్రత నమోదుచేసే కేంద్రం ఉంది. ఇచ్చట అత్యధిక ఉష్ణోగ్రత 51°C అత్యల్ప ఉష్ణోగ్రత 11.7°C. దైనిక సగటు గరిష్ఠ ఉష్ణోగ్రత 35°C. అట్లే దైనిక సగటు కనిష్ఠ ఉష్ణోగ్రత 23.3°Cగా నమోదు అవుతుంది[47]

వర్షపాతం :

పల్నాటిలో కొండలు ఎక్కువగా ఉన్నాయి. అత్యల్ప వర్షపాతాన్ని పొందే ప్రాంతం ఇది. నైఋతి ఋతుపవనంవల్ల జూన్, జూలైల్లోను, ఈశాన్య ఋతుపవనంవల్ల అక్టోబరు, నవంబరుల్లోను వర్షాలు పడతాయి. పల్నాటిలో

---

46. పల్నాటి వీర చరిత్ర, ప్రథమ భూమిక, పు. 6.
47. ఆంధ్రప్రదేశ్ దర్శిని, పు. 1043.

675.6 మి.మీ. వర్షం మాత్రమే కురుస్తుంది. వర్షాలు లేకపోవడంవల్ల తరచ కరువు ప్రాంతంగా ప్రకటించబడుతుంది.

నదులు :

దక్షిణ భారతదేశపు నదుల్లో గోదావరి తర్వాత చెప్పదగిన కృష్ణానద పల్నాటిగుండా ప్రవహిస్తుంది.

కృష్ణానది :

కృష్ణానది పల్నాటిలో దాదాపు 100 కి మీ. ప్రవహిస్తుంది. దీనికి కుడి వైపున నాల్గు, ఎడమవైపున పదిహేను ఉపనదులు ఉన్నాయి. కుడివైపున చేరే వాటిలో పల్నాటిసీమకు చెందిన చంద్రవంక, నాగులేరు, పిల్లేరు మొదలయినవి చెప్పుకోదగ్గవి ఈ మూడు ఉపనదులు పల్నాటిలో పుట్టి, పల్నాటిలో ప్రవహించి, పల్నాటిలోనే కృష్ణానదిలో కలుస్తున్నాయి. ఈ మూడు ఉపనదులు దక్షిణంనుంచి ఉత్తర దిక్కుగా పారుతున్నాయి. కృష్ణానదిపై పల్నాటిలోని నాగార్జున సాగర్ వద్ద ఆనకట్ట (ప్రాజెక్టు) కట్టబడింది. దీని కుడి కాలువకు, నాగార్జున సాగర్‌కు తూర్పున 20 కి.మీ. దూరంలో ఉన్న మంచికల్లువద్దజలాశయం (రిజర్వాయర్) ఏర్పాటు చేశారు.

చంద్రవంక :

పల్నాటిలో పుట్టి పల్నాటి వరకే ప్రవహిస్తున్న ఒక నది చంద్రవంక. చాగి బేతరాజు మాచర్ల (మహాదేవి తటాకము) శాసనం[48] (శ.స. 1033) లోని "స ఏవ మహాదేవి తటాకే చంద్రభాగానదీ ప్రదేశ ఆతుకూరిమార్గ సమీపే దశ నివర్తన పరిమితాం ప్రాదాన్" అనేదాన్ని బట్టి, ఇంకా—

"చంద్రభాగానది సదృశ శైవలిని
కలుగదు పలునాటి గడ్డయందెల్ల
కృష్ణకు సమమిది కీర్తనీయంబ

48. S.I.I. Vol. X, No. 66.

ఎడమ భాగమ్మున నెనయు చెన్నునికి
దాపుగ బారు ఉత్తరముఖంబుగను''49

అనేదాన్నిబట్టి చంద్రవంక నదికి చంద్రభాగానది అనే నామాంతరం ఉన్నట్లు తెలుస్తుంది. ఈ చంద్రవంక పుట్టుకను కొంచెం పరిశీలిద్దాం.

చినచెరువు వాగు, కానవాగు అనే రెండు పెద్ద వాగుల కలయికే చంద్ర వంక పుట్టుక. 1) ఉప్పలపాటి చెరువు పొంగిన నీరు, దాని ఊట కలసి 'మడ వాగు' అనే పేరుతో ఒక పెద్ద వాగు కంచరగుంట దగ్గరగా పారి ఆత్మకూరు చెరువు చేరుతుంది పర్లపాయ నుంచి వచ్చిన వెల్లువ పిల్లవాగుల్ని కలుపుకొని ముటుకూరు, కంచర గుంటల మధ్యగా పారుతూ రాళ్ళవాగు అనే పేరుతో ఆత్మకూరు చెరువు చేరుతుంది. మించాలపాడు అడవుల్లోని నీరు కోలగుట్లకు పడ మట పైపుగా పారుతూ 'దంతెలవాగు' పేరుతో ఆత్మకూరు చెరువును చేరుతుంది. మడవాగు, రాళ్ళవాగు, దంతెలవాగుల నీరు ఆత్మకూరు చెరువులో కూటమి అవు తుంది. ఈ ఆత్మకూరు చెరువునే 'చిన చెరువు' అంటారు. ఈ చెరువు పొంగు, ఊటలు కలిసి ఆత్మకూరి వెల్లువ పోలేపల్లి, రాయవరాల వెల్లువల్ని కలుపుకొని పెద్ద వాగుగా ప్రవహిస్తుంది. ఇదే చినచెఱువు వాగు.

2) గంగలకుంట చెరువు పొంగు, రచ్చమలపాటి చెరువు పొంగు, ఊటలు కలసి మండాడి వెల్లువతో కలవడం వల్ల ఒక వాగు ఏర్పడుతుంది. ఈ వాగును తేరాల చెరువు పొంగు, ఊటలు కలుస్తాయి. తేరాల చెరువును పెద్ద చెరువు అంటారు. ఈ నాల్గు చెరువుల నుంచి వచ్చిన పొంగు, ఊటలు కలసి ఏర్పడ్డ వాగును కానవాగు అంటారు. దీనినే పెదచెఱువువాగు అని కూడా అంటారు. పూర్వం ఈ వాగులో కానుగ చెట్లు ఎక్కువగా పెరిగేవని ప్రతీతి. రాయవరం మీదుగా వచ్చే చిన చెఱువు ఊటల వాగు రాయవరానికి సుమారు $\frac{1}{2}$ కి. మీ. దూరంలో కానవాగుతో కలుస్తుంది. ఇచ్చట నుంచి ప్రవహించే ఈ రెండు వాగుల కలయిక అయిన పెద్దవాగే చంద్ర వంకగా పిలువబడుతుంది. అచటి నుంచి మాచర్లలోని రైలు స్టేషనుకు తూర్పు దిశలో సుమారు 300 మీటర్ల దూరంలో దక్షిణం నుంచి ఉత్తర దిశగా ప్రవ

49. పల్నాటి వీరచరిత్ర, (పాదాలు 46–51), పు. 54.

హిస్తూ లింగాపురం, అమీన్ జమ్మలమడకల వద్ద నుంచి ప్రవహించి పశ్యామల 'జౌకువాగు' ను కలుపుకొని మాచర్లకు ఉత్తర దిశలో 10 కి. మీ. దూరాన ఉన్న ఎత్తిపోతల్లో పడుతుంది. ఇదే ఎత్తిపోతల జలపాతంగా చెప్పబడుతుంది. ఎత్తిపోతల నుంచి 3 కి. మీ. కొండల గుండా ప్రవహించి కృష్ణా నదిలో కలుస్తుంది. ఇది ఎటు చూసినా అర్థ చంద్రాకారపు వంకలు కలిగి ఉండడం వల్ల దీనికి చంద్రవంక అని పేరు పడి ఉండవచ్చు.

**నాగులేరు :**

పల్నాటిలో పుట్టి, పల్నాటిలో ప్రవహించి పల్నాటిలోనే కృష్ణా నదిలో కలుస్తున్న మరొక ఉపనది నాగులేరు.

> "తంగెడ సీమను నిర్జర
> గంగాసమ నాగ నిమ్నగా పూర్వమునం
> బింగళిపుర దక్షిణమున
> రంగుగ నెలకొన్న గోపరత్నంబునకున్"

అనే పద్యం వల్ల నాగులేటికి నాగానది అనే నామాంతరం ఉన్నట్లు తెలుస్తుంది [50]

వాగి బేతరాజు మాచర్ల శాసనం (మహాదేవి తటాకము, శ స. 1033)[51]లో కన్పించే "పశ్చిమేశ శతత్రయా స్తర్వర్తినాగేశ్వరనదీ ప్రాగ్భాగస్థిత సబ్బేయ పల్యాం రాజమాన నివర్తన శతద్వయ పరిమితాం భూమిం ప్రాదాత్" అన్నదాని వల్ల నాగులేటికి నాగేశ్వర నది అని మరొక నామాంతరం ఉన్నట్లు తెలుస్తుంది.

నాగులేరు వినుకొండ తాలూకాలోని రేమిడిచర్లవద్ద కొండల్లో పుట్టి నాయకురాలి కనుమ గుండా ప్రవహిస్తుంది. నాయకురాలి కనుమదాటి కారెంపూడి, చింత

---

50. అప్పకవీయము, పీఠిక, ప. 101.
51. S. I. I. Vol. X. No. 88

పల్లి, కొదమగుళ్ల, కేశనపల్లి, దాచేపల్లి, గామాలపాడు, పొందుగల, ధర్ముపాలెం మొదలయిన గ్రామాల మీదుగ పొందుగల రేవువద్ద కృష్ణానదిలో కలుస్తుంది.

"పాలేటి ఉరుముచే పగిలి భూధరము
నాగాధిపతి ప్రాణ నాశంబు చేసి
నడుముగా పారిన నాగులేరాయె"[52]

అనే పద్యాన్నిబట్టి ఒక గొప్ప నాగుబాము ప్రాణం తీసి మధ్యగా పారడం వల్ల దీనికి నాగులేరు అని పేరు వచ్చినట్లు కొందరు ఊహిస్తున్నారు కాని అక్కిరాజు ఉమాకాంతంగారు 'నాగులు' అనే ఒక జాతివారు ఈ దేశంలో ఉన్నారనీ, ఆ జాతి వారికి ప్రియమైంది కాబట్టి దీనికి నాగులేరను పేరు వచ్చి ఉండవచ్చు[53] నని ఊహించారు.

**పిల్లేరు :**

ఇది ఒక పెద్ద వాగుగానే వ్యవహార ప్రసిద్ధి. బీర్లసాని, బీర్లపాయ అనే పేర్లతో పిల్వబడే వాగు సత్తెనపల్లి దగ్గర నుంచి కోట నెమలిపురి, పిడుగురాల, పిల్లుట్ల, కోనంగి (గొల్లల మాసారం), కేతవరం మొదలయిన గ్రామాల మీదుగా వెళ్ళి సత్తెనపల్లి తాలూకా బోదనంవద్ద కృష్ణానదిలో కలుస్తుంది.

**గుట్టలు :**

గుట్టలనే కొన్ని ప్రాంతాల్లో బోడులు అంటారు. పల్నాటిలో ఇట్లాంటి బోళ్లు చాలా ఉన్నాయి.

1) పొసరపోలయ్యబోడు పొలేపల్లివద్ద ఉంది. దీనిలో ద్రావిడ సమాధులు, రాక్షసగుళ్ళు (కైరన్లు)[54] ఉన్నాయి.

---

52. పల్నాటి వీర చరిత్ర (పాదాలు 57-60), పు. 86.
53. పల్నాటి వీర చరిత్ర, ప్రథమ భూమిక, పు. 3.
54. అతి ప్రాచీన ప్రజల సమాధులను రాక్షసగుళ్ళు (కైరన్లు) అంటారు. వాటికి వాడిన పెద్దపెద్దరాళ్ళు మాత్రమే కన్పిస్తాయి.

2) తేరాలబోడు :- ఇది తేరాలవద్ద ఉంది. ఇచ్చట కూడ రాక్షస బండలు (రాక్షసగుళ్ళు), ప్రాచీన సమాధులు ఉన్నాయి.

3) పాలువాయి, గన్నారాలమధ్య బోడు ఉంది. ఇచ్చట కూడ ప్రాచీన సమాధులు ఉన్నాయి

4) సుబ్బారెడ్డిపాలెం, గుబ్బలగూడుతండ, పశ్యామల మధ్య ఉన్న బోడుల్లో కైరన్లు, ద్రావిడ సమాధులు ఉన్నాయి.

5) పశ్యామల - మాడుగులల మధ్య ఉన్న బోటివద్ద జైన బసదులు, కైరన్లు ఉన్నాయి.

6) గుత్తికొండ, గుండ్లపల్లులవద్ద బోడులు ఉన్నాయి.

7) మించాలపాడు, కాకిరాల, ముటుకూరు, కోలగుట్ల మొదలైన నాల్గు గ్రామాల మధ్యన ఉన్న అడవుల్లో బోడులు చాలా ఉన్నాయి. అందులో తురకోడికుంట బోడు పచ్చిక బయలుకు పేరు గాంచింది.

జలాధారాలు :

కృష్ణానది, చంద్రవంక, నాగులేరు, పిల్లేరులేకాక పెద్దపెద్దవాగులు కూడా పల్నాటిలో ఉన్నాయి. పల్నాటిలో పూర్వకాలంలో కొన్ని గ్రామాల్లో చెరువుల కింద వ్యవసాయం చేస్తుండేవారు. కొన్ని గ్రామాల్లో బావుల కింద మోటతో సేద్యం చేస్తుండేవారు. కొన్ని గ్రామాల్లో వర్షాధారంతోనే వ్యవసాయం చేస్తుండే వారు. త్రాగేనీరు బావుల్లో చాలా లోతులో ఉంటుంది బావుల్లో నుంచి నీరుతీసే సాధనం చేంతాడు. కొండవీటి చేంతాడు అనే నానుడి ఇచ్చట సార్థకాన్ని పొందు తుంది. ఆ తాడు ఒక మనిషి మోసే బరువు ఉంటుంది. ప్రస్తుతం నాగార్జున సాగర్ ప్రాజెక్టువల్ల చాల వరకు సాగుకు వచ్చింది. అయితే ఇంకా 40 గ్రామాలు కాలువల మట్టానికి ఎగువన ఉన్నాయి కాబట్టి నీరు పారడంలేదు. అవన్నీ వర్షం మీదనే ఆధారపడి ఉన్నాయి. జలాధారాలుగా పైవేగాక ఇంకా వాగులు, జలపాతాలు, జలాశయాలు, చెరువులు, కుంటలు, బుగ్గలు ఎన్నో ఉన్నాయి.

వాగులు :

అడవులు ఎక్కువగా ఉండడంవల్లనూ, అడవి వెల్లువ, గ్రామాల వెల్లువలు కలసి పెద్దవాగుగా ఏర్పడడం అనేది దాదాపు అన్ని గ్రామాల పక్కన కన్పిస్తుంది.

వీటిలో ఎక్కువ వెల్లువలు కలసి నదులుగా మారాయి. చంద్రవంక, నాగులేరు, పిల్లేరు అట్లాంటివే. సరాసరిగా గాని, మరొక వెల్లువలో కలసిగాని ప్రతి వాగు నీరు కృష్ణానదిలో కలుస్తుంది. ప్రతి గ్రామానికి దాదాపు రెండు వైపుల వాగులు వుంటాయి.

**జలపాతాలు :**

పల్నాటిలో భారత దేశంలో ప్రసిద్ధిచెందిన ఎత్తిపోతల జలపాతం ఉంది. ఇది చాలా లోతైన జలపాతం. ఇచ్చట జలపాతానికి పశ్చిమ మూలన రెండు గుహాలు ఉన్నాయి. ఒక గుహపక్కన రంగనాయకులుస్వామి దేవాలయంవుంది. మహాశివరాత్రికి, తొలి ఏకాదశికి ఇచ్చట ఉత్సవం జరుగుతుంది. ఆ యా చుట్టు పక్కల ఉండే లంబాడీవారు ఇచ్చట వివాహాది శుభకార్యాలు జరుపుకుంటారు. తల నీలాలు ఇవ్వడం కూడా కన్పిస్తుంది. చంద్రవంక నది నీరు తాళ్ళపల్లికి ఉత్తర దిశన 3 కి.మీ. దూరంలో ఈ జలపాతంలో పడుతుంది. ఈ జలపాతం దిగువన గల జలాశయంలో ప్రస్తుతం మొసళ్ళు పెంచుతున్నారు.

**జలాశయాలు :**

నాగార్జునసాగర్ వద్ద కృష్ణానదికి పెద్ద ఆనకట్ట కట్టబడింది. భారత దేశంలో ప్రసిద్ధిచెందిన ఆనకట్ట ఇది. ఇచ్చటి నీటిని వ్యవసాయానికి వినియోగి స్తున్నారు. ఆంధ్రప్రాంతంలో పారే దీని కుడికాలువకు పల్నాటిసీమలోని మంచి కల్లువద్ద జలాశయం ఏర్పాటు చేశారు. ఇది చాలా పెద్ద జలాశయం. ఇచ్చట నుంచి కుడికాలువకు నీరు వదులుతున్నారు.

**చెరువులు :**

పల్నాటిలో చెరువులు ఎక్కువగా ఉన్నాయి. ప్రాచీనకాలానికి చెందిన వీటిక్రింద వ్యవసాయం ఎక్కువగా సాగుబడిలో ఉండేది. సాగర్ నీరు వచ్చిన తర్వాత ఆ నీరు పారే ప్రదేశాల్లో చెరువులమీద ఆధారపడవలసిన అవసరం తగ్గి పోయింది. పల్నాటి సీమలో దాదాపు 30 చెరువులు ఉన్నాయి.

**1) సింగభూపతి చెరువు :** జూలకల్లు, సన్నెగళ్ల, కారెంపూడి అనే మూడు గ్రామాల మధ్యన ఉంది.

2) మహాదేవి చెరువు : ఇది మాచర్లలో ఉంది ప్రస్తుతం సిమెంటు ఫ్యాక్టరీవారు ఆక్రమించి రాళ్లగనిగా వాడుతున్నారు

3) పెద్ద చెరువు : ఇది తేరాలవద్ద ఉంది దీనినుంచి మహాదేవి చెరువుకు కాల్వ వుంది దీనిని బ్రహ్మనాయుడు త్రవ్వించినట్లు లోకవ్యవహారం ఉంది

4) దూబ చెరువు :- గురజాల రైల్వేస్టేషనుకు, ఊరికి మధ్యనూ, గురజాలకు దక్షిణ దిశగాను ఈ చెరువు ఉంది [55] దీనిని నాగమ్మ త్రవ్వించినట్లు వాడుక ఉంది.

5) రేవ చెరువు :- ఇది చెర్ల గుడిపాడు వద్ద ఉంది ఇది పల్నాటి వీరుల కాలానికే ఉన్నట్లు ప్రతీతి.

6) చిన చెరువు - ఇది ఆత్మకూరువద్ద ఉన్న చెరువు. దాదాపు క్రీ.శ. 1900 సం॥లో బ్రిటిషు పాలనా కాలంలో వేయించింది. వైశాల్యం సుమారు పదకొండొందల ఎకరాలు.

7) బద్ది చెరువు .- ఇది సరమాలపాడువద్ద ఉంది. ఈ గ్రామానికి నామాలపాడని పేరుంది.

8) మంత్రాలమ్మ చెరువు :- ఇది నాయకురాలు కనుమలో ఉంది. అంటే కారెంపూడి, వేళ్ళవాగుల మధ్యన ఉంది. ఆ కనుమను రక్షించే మంత్రాలమ్మ అనే ఒక దేవత కూడా అక్కడ ఉంది.

9) ధర్మవరం వద్ద రెడ్డిరాజుల కాలంలో త్రవ్వించినట్లుగా చెప్పబడు తున్న ఒక చెరువు ఉంది.

10) పట్లవీటి వద్ద ఒక చెరువు ఉంది.

11) ఉప్పలపాడువద్ద చెరువు ఉంది. దీని పొంగు పట్లవీటి చెరువుకూ, పట్లవీటి చెరువుపొంగు తేరాల చెరువుకూ వస్తుంది

---

55. "నగరంబు వెల్వడి నలగామరాజు
దక్షిణ దిశయందుఁ దనరెడు బయల
దూబ చెర్వనెడు నుత్తుంగ భూస్థలిని
నిలిపించె గజమును నిండిన వేడ్క."
పల్నాటి వీరచరిత్ర (పాదాలు. 185-188), పు. 31.

12) **తుమ్మల చెరువు :-** ప్రాచీన కాలంలో చెరువు ఉండేది. ఇప్పుడు తుమ్మల చెరువు అనే పేరుతోనే ఒక గ్రామం ఏర్పడింది.

13) ముల్యాలంపాడువద్ద చెరువు ఉంది. ఆ గ్రామ ప్రజలు ఇప్పటికీ నీటి అవసరాలకు ఆ చెరువుమీద ఆధారపడి ఉన్నారు. ఇంకా శ్రీగిరిపాడు, గంగలకుంట, పిడుగురాల, అడిగొప్పుల, మిరియాల, పశ్యామల, కానపాడు, గంగారం, గుండ్లపల్లి, చింతపల్లి, జంగమహేశ్వరపురం, తాళ్ళపల్లి ఒప్పిచర్ల, రచ్చమలపాడు, నాగులవరం, మాడుగుల మొదలయిన గ్రామాలవద్ద చెరువులు ఉన్నాయి.

**కుంటలు :-** ప్రతి గ్రామానికి ముందుగాని, లేదా గ్రామం వెనుకగాని కుంటలు ఉంటాయి కొన్ని పొలాలమధ్యన, బోడులలోను ఉంటాయి. పొలాల్లో ఉండే ఈ కుంటల్లోని నీరు పశువులకు, మనుష్యులకు తాగడానికి వాడుతారు నీటి పారుదల లేని గ్రామాల్లో ఇవి ఎంతో ఎక్కువగా ఉపయోగపడుతున్నాయి. ఇంకా మిర్చి, పొగాకులవంటి వాణిజ్య పంటలు, వంగ, టొమాటోల వంటి కూరగాయల నారు నాటేటప్పుడు ఈ కుంటల్లోని నీటిని వాడుతారు.

**బుగ్గలు :-** తేరాల, ఉప్పలపాడు, మండాది, దుర్గి, పిల్లుట్ల మొదలయిన గ్రామాల వద్ద బుగ్గలు ఉన్నాయి. ఉప్పలపాటి బుగ్గవద్ద ఒక దేవాలయం ఉంది. దీనికి బుగ్గమల్లేశ్వరాలయం అని పేరు. శివరాత్రికి అచ్చట ఉత్సవం జరుపుతారు. భక్తులు ప్రభలు కట్టుకొని వస్తారు వందలాది భక్తులు అచటి కోనేటిలో స్నానం చేస్తారు. తేరాల బుగ్గ వద్ద సిద్ధేశ్వరాలయం ఉంది ఇచ్చట గూడ శివరాత్రికి ఉత్సవం చేస్తారు మండాది వద్ద పెద్ద బుగ్గ ఉంది. ఈ నీటిని వ్యవసాయానికి ఉపయోగించుకుంటున్నారు. వేసవి కాలంలో ఈ గ్రామవాసులు ఈ బుగ్గ ఆధారంగా కూరగాయలు పండించి ఎక్కువ ధనార్జన చేస్తున్నారు దుర్గి వద్ద ఉన్న బుగ్గ దగ్గర మల్లేశ్వరాలయం ఉండేది. శివరాత్రికి ఉత్సవాలు జరిగేవి. కాని సాగర్ కాల్వకు మంచికల్లు వద్ద జలాశయం ఏర్పాటుచేయడంవల్ల ప్రస్తుతం ఆ దేవాలయం, బుగ్గ రెండూ కూడ జలాశయంలో మునిగిపోయాయి.

**భూములు :-** నల్లరేగడి, ఎర్రభూమి, ఇసుకపర్రలు, చవిటి నేలలు, మొరసనేలలు, నాపబండలతో ఉన్న భూములు, గులక చట్టులతో ఉన్న భూములు ఉన్నాయి.

**పంటలు :**

"జొన్న కలి జొన్న యంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నుగఁ బల్నాటి సీమ ప్రజలందఱకున్"[56]

అనే పద్యంవల్లగాని, ''సజ్జ జొన్న కూళ్ళు సర్పంబులును తేళ్లు'' అనే దాన్నిబట్టిగాని, ''కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్'' అనే దాన్ని బట్టిగాని, ''అంగడి ఊరలేదు'' మొదలయిన చాటుపద్య పాదాల్ని బట్టిగాని, స్థానిక వృద్ధుల కథనాన్నిబట్టిగాని, ఇతర ఆధారాల్నిబట్టిగాని ప్రాచీనులు వరి పండించినట్లు ఎచ్చటా కన్పించదు. దాదాపు మెట్టపంటలన్నీ పండించినట్లు మాత్రం తెలుస్తుంది. జొన్న (పల్నాటిలో పచ్చజొన్న, ఎర్రజొన్న, తెల్లజొన్న, పైరజొన్న మొదలయిన రకాలు పండించారు) సజ్జ, రాగి, కొర్ర, వరిగ, ఆరిక, ప్రత్తి, కంది, పెసర, నువ్వులు పండించేవారు ప్రస్తుతం పొగాకు, మిర్చి, మినుము, ప్రత్తి, శనగలాంటి పైర్లు పండిస్తున్నారు సాగర్ నీటి పారుదల వచ్చిన తర్వాత వరి, వేరుశనగ ఎక్కువగా పండిస్తున్నారు. చెరకు, పసుపు, అరటి పైర్లకు ఇప్పుడిప్పుడే దిగుతున్నారు.

**దేవాలయాలు :**

''చిన్నచిన్న రాళ్లు చిల్లర దేవుళ్లు''[57] అన్న శ్రీనాధునిదిగా చెప్పబడుతున్న చాటు పద్యం పల్నాటిలోని దేవాలయాల్ని గుర్తుచేస్తుంది ఎందరో దేవుళ్లు. అంతే కాదు, ఎందరో వీరులు, మహత్తుగల మహాత్ములు వున్నారు అందరూ దేవతలుగానే కొలుపులందుకొంటున్నారు. జాతరలు జరిపించుకుంటున్నారు.

ఆదిత్యేశ్వరాలయం, రామేశ్వరాలయం, ఇష్ట కామేశ్వరి గుడి, వీరభద్రాలయం, చెన్నకేశవాలయం, పాటేశ్వరమ్మ ఆలయం, ఆంజనేయస్వామి ఆలయాలు, సిద్ధేశ్వరాలయం, రూపులమ్మ ఆలయం, పుట్టురంగనాయకులు, రంగనాయకులు, శివాలయాలు, దత్తాత్రేయ ఆలయం, చౌడమ్మ గుడి, పోలేరమ్మ గుడి, అంకాళమ్మగుడి, ఓంకేశ్వరాలయం, మహాలక్ష్మి ఆలయం, బ్రహ్మంగారి

56. చాటు పద్య మణిమంజరి, పు. 125.
57. చాటుపద్య మణిమంజరి. పు. 125.

ఆలయం,దుర్గదేవమ్మ, కనకదుర్గమ్మగుడి, వేణుగోపాలస్వామిఆలయం, వినాయక ఆలయం, బుగ్గమల్లేశ్వరాలయం, పెద్దముత్యాలమ్మ గుడి, ఎల్లమ్మదేవర గుడి, విష్ణుగుడి, జంగమేశ్వర మహాదేవుడు, సురేశ్వరాలయం, కపోతేశ్వరాలయం మొదలగునవి ఎన్నో దేవాలయాలు ఉన్నాయి. ఈ మధ్యనే అడిగొప్పలవద్ద ఒక అమ్మవారు వెలసింది. ఇంకా తిరుపతమ్మ (ఆత్మకూరు). లక్ష్మమ్మ (ధర్మవరం), సుబ్బదాసు (చిరుమామిళ్ళ సుబ్రహ్మణ్యంగారు, ధర్మవరం), తాతగారు (గన్నారం) మొదలయిన వాళ్ళెందరో దేవుళ్ళుగా కొలువబడుతున్నారు

**రాకపోకలు - రహదారులు :**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ రోడ్డు రవాణా సంస్థవారు మాచర్లలో వాహనాల కేంద్రాన్ని (Bus Depot) ఏర్పాటు చేశారు. ఇచ్చట నుంచి పల్నాటిసీమలోని అన్ని గ్రామాలకు బస్సు సౌకర్యాలు ఉన్నాయి. అన్ని గ్రామాలకు రోడ్లు వేశారు. గుంటూరు నుంచి సత్తెనపల్లి, పిడుగురాల, నడకుడి, గురజాలల మీదుగా మాచర్లకు రైలు మార్గం ఉంది. ఇది మీటరుగేజ్ మార్గం. రైలు రోజుకు మూడుమార్లు గుంటూరు నుంచి మాచర్లకు తిరుగుతుంది.

పరిశ్రమలు, చేతివృత్తులు :- మాచర్లలో రెండు సిమెంటు కర్మాగారాలు, పాలరాయి ముక్కలుచేసే పరిశ్రమలు ఉన్నాయి ఓబులేశునిపల్లెవద్ద, మాచర్లవద్ద ఇటుకలు తయారుచేస్తున్నారు.

**అభివృద్ధి పథకాలు :-** గురజాలవద్ద పంచదార కర్మాగారం ఏర్పాటు చేస్తున్నారు.

**విద్య :-** మాచర్లలో డిగ్రీకాలేజి, గురజాలలో జూనియర్ కాలేజి ఉన్నాయి.

## పల్నాటి ప్రాచీనత

పల్లవబొగ్గను నాగులు పాలించిన నాటినుంచి ఆధారాలు కన్పిస్తున్నాయి. ఈ నాగులు ఆదిమనివాసుల్లో ఒక జాతియని వినికిడి. బౌద్ధుల కథలవల్ల, బుద్ధ ధాతువులతో నాగరాజులను ముడిపెట్టే కథలవల్ల, అమరావతీ స్థూపమందలి నాగ రాజు చిత్రాలవల్ల వారు బౌద్ధం స్వీకరించినట్లు చెప్పవచ్చు. అమరావతి, నాగార్జున కొండ స్థూపాల్లో బుద్ధధాతువులు నిక్షిప్తమయ్యాయి. ఇద్దరు మనుష్యులు బుద్ధుని అస్థికలను పట్టుకొని పడవపైనుంచి తీరాన దిగుతున్నప్పుడు నాగరాజు స్వాగత

మిస్తున్నట్లున్న చిత్రం అమరావతీ స్థూపంలో ఉంది. తామ్రలిప్తినగరానికి,సింహళ ద్వీపానికి మధ్యనఉన్న వజ్రాలదిన్నె (ధాన్యకటకం - అమరావతి) బౌద్ధకథలు బుద్ధుని అస్థికలకు మూడిపెడుతున్నాయి. ఈ సమాచారాన్నిబట్టి బౌద్ధమతాన్ని స్వీకరించడానికి పూర్వం ఇచ్చటి ఆదిమవాసులు 'నాగులు' అనిగాని, నాగమతావలంబులు అనిగాని నిర్వచించవచ్చు అంటే పల్లవులరాజ్యం పల్లవరోగ్గ నాగుల ప్రాచీనావాసం టోలమీ బస్సరానాగుల్ని గూర్చి పేర్కొన్నట్లు రామకృష్ణమాచార్యగారు వివరించారు [58] ఒక ఐతిహ్యాన్నిబట్టి పల్లవుడు అశ్వత్థామకు, నాగకన్యకు జన్మించినట్లుంది. "పల్లవులు నాగకన్యలను వివాహమాడి,నాగమండలాన రాజ్యాన్ని స్థాపించారు వేలూరుపాలెయం తామ్రశాసనం (9 వ శతాబ్ది) వీరకూర్చుడు నాగకన్యను వివాహమాడి రాజ్యాన్ని సంపాదించినట్లు చెప్తుంది ఈ పల్లవులే గౌతమీపుత్రశాతకర్ణినాటి విదేశీయులైన పహ్లావులు అనుట ఊహమాత్రమైనా సత్యదూరం కాదు. యవనులు, పల్లవులు, ఇక్ష్వాకులు, శాతవాహనులు-వీరికి అన్యోన్య వివాహబంధాలు కన్పిస్తున్నాయి. ప్రాచీన పల్లవచరిత్ర గుంటూరు, నెల్లూరు, బళ్లారిమండలాల్లోను, మైదవోలు, కందుకూరు, హిరహడగళ్ళి తామ్రశాసనాలవల్ల లభిస్తుంది ''[59] సింహవిష్ణుని ప్రాచీన శాసనాలు గుంటూరు మండలంలో ఉన్నాయి. క్రీ. శ 6 వ శతాబ్దివరకు పల్లవరాజ్యంలో అధికభాగం కృష్ణానదికి దక్షిణాన ఉన్న తెలుగుదేశమే.అదే పల్లవనాడు. తర్వాత పల్లవరాజులు దాన్ని క్రమక్రమంగా విస్తరింపజేశారు

**పల్నాటిలో నేడు కనిపిస్తున్న ప్రాచీన పట్టణాలు :-**

గురజాల, మాచర్ల, కారెంపూడి అనేవి పల్నాటిలో ప్రాచీనకాలంలోను; నేడూ కన్పించే పట్టణాలు.

కొన్ని గ్రామాలు ప్రాచీన నామాలతోటే పిలువబడుతున్నాయి.

**గురజాల :-**

పలనాటి వీరుల చరిత్రలో ప్రసిద్ధిచెందిన కోట గురజాల గురజాలకు పూర్వం గురివిందల అనీ, మాధవీపురమనీ పేరుంది. మాధవి అంటే గురివింద. గురివింద తీగలు నరికి అచ్చట ఈ ఊరు కట్టారని, గురివిందల అనే పేరు ప్రజావ్యవ

58. ప్రాచీన దక్షిణభారత చరిత్ర, పు. 119-122

59. పైదే, పు. 119-122.

హారంలో గురిజాలగా మారి చివరకు గురజాల అయిందని వాడుక.[60] ప్రస్తుతం పల్నాటి వీరుల కోటల్ని కోటగడ్డలని పిలుస్తున్నారు. పల్నాటి వీరచరిత్రలోని "దూబచెర్వనెడు సుత్తుంగ భూస్థలిని"[61] అనే పాదంలోని 'దూబచెరవు' గుర జాలకు దక్షిణ భాగంలో ఇప్పటికీ ఉంది.

గురజాలలో గంగమ్మ ప్రసిద్ధి చెందిన దేవత. "కులము దైవతంబు గురి జాల గంగాంబ"[62] అనే క్రీడాభిరామం పద్యపాదం వల్లకూడా తెలుస్తుంది. ఈ గంగమ్మ ఏడుగురు ఊరబయట శక్తుల్లో ఒకరు.[63] గురజాలలోని వీరభద్రాలయం నాగమ్మ కట్టించినట్లు ప్రతీతి. ఇంకా చెన్నకేశవాలయం, కోదండ రామాలయం, ముక్కిడిగుడి, పాటిపాటమ్మ (పాటిని రక్షించేది, ముత్యాలమ్మ) గుడి, త్రికూటా లయం, ఇష్టకామేశ్వరి గుడి ఉన్నాయి.

మాచర్ల :-

పల్నాటి వీరుల చరిత్రలో ముఖ్యస్థానాన్ని ఆక్రమించిన కొటల్లో మాచర్ల ఒకటి. చాగి బేతరాజు తవ్వించిన దానికి మహాదేవి చెరువు అని పేరున్నట్లు మనకు శాసనాలవల్ల తెలుస్తుంది. అచట పూర్వం మహాదేవ్యాలయం ఉండేదని ప్రతీతి. మహాదేవి (పార్వతి) చెరువులు పేరు క్రమక్రమంగా మార్పునొంది మాచెరువులై జనవ్యవహారంలో 'మాచర్ల'గా పేరొందిందని చాలమంది అభిప్రాయం.

మాచర్లలో పాత బజారులో ఊరికి వాయవ్యమూలన చెన్నకేశవాలయం ఉంది. ఈ దేవాలయానికి 100 మీటర్ల దూరంలో ఉత్తర దిశగా చంద్రవంక ఉంది. ఈ ఆలయాన్ని బ్రహ్మనాయుడు కట్టించాడని ప్రతీతి. అయితే పూర్వం ఉన్న గుడినే బాగుచేయించి పునరుద్ధరించి ఉంటాడని కొందరి ఊహ. ఈ దేవా లయం శిల్ప చిహ్నాల్నిబట్టి పూర్వం జైనులవేమో అని కొందరి సందేహం.

---

60. పల్నాటి వీరచరిత్ర, పు. 268. (రెగో)
61. పల్నాటి వీరచరిత్ర, (పాదం. 187), పు 31.
62. క్రీడాభిరామం, ప. 118.
63. ఏడుగురు శక్తులు 1. ఎల్లమ్మ (రేణుక లేక ఏకవేణిదేవి) 2. మైసమ్మ (కోటను రక్షించే కోటమైసమ్మ) 3. అంకమ్మ (కాళికఅంశ) 4. సత్తెమ్మ

మాచర్లలో ఆదిత్యేశ్వరాలయం ఉంది. ఆదిత్యుడనే పేరు చోళరాజులకు ఉంది[64] మాచర్లలోని శిల్పం చాళుక్య శిల్పాన్ని పోలిఉందని, బ్రహ్మనాయుడు ఆకాలం వాడు కాబట్టి ఆయనే కట్టించాడనీ కొందరు తేల్చి చెప్పారు.[65] చెన్నకేశవస్వామి గుడి ఆవరణలో దక్షిణంగా వీరభద్రాలయం ఉంది. దీన్ని నాగమ్మ కట్టించిందని కొందరూ, చోళరాజుల కట్టడాన్ని నాగమ్మ పునరుద్ధరించి ఉంటుందని కొందరూ అంటున్నారు మాచర్ల చెన్నునిగూర్చి—

"చిత్తముగూర్చి మాచెరల చెన్నుఁడు శ్రీ గిరి లింగముం గృపా
యత్తతఁ జూడఁబల్లె విషయంబునకా మహిమంబు చెల్లెఁగా
కుత్తరలోన మింట జలముట్టిన మాత్రన నాపదాలలో
విత్తిన యావనాళమభివృద్ధి ఫలించుట యెట్లు చెప్పుమా?"[66]

అనే పద్యం చెన్నని దయార్ద్ర హృదయునిగా, పల్నాటి ప్రజల రక్షకునిగా వర్ణిస్తుంది.

మాచర్లలో పాటేశ్వరమ్మ గుడి, ఆంజనేయాలయం, రామాలయం, శివాలయం, ఇష్టకామేశ్వరి గుడి, మరొక వీరభద్రాలయం ఉన్నాయి. ప్రస్తుతం ఒక సిమెంటు కర్మాగారం, ఎన్నో నాపరాళ్ల గనులు చెప్పుకోదగ్గ విశేషాలు.

**కారెంపూడి :**

పల్నాటి వీరుల చరిత్రతో మరో ప్రసిద్ధి చెందిన పట్టణం కారెంపూడి. ఇది గురజాలకు ఆగ్నేయ దిశగా పదిమైళ్ల దూరంలో ఉంటుంది. కారెంపూడికి తూర్పున నాగులేరు నది దక్షిణం నుంచి ఉత్తరానికి పారుతుంది. నాగులేటి

---

లేక బండి మహాలక్ష్మమ్మ (ఈమెను కొలుపుచేసిన తర్వాత బండితో ప్రతి ఊరిలో సాగనంపుతారు) 5 ఎర్ర పోలమ్మ లేక పోలి ఎర్రమ్మ లేక పోలేరమ్మ (పొలిమేరలు కాచే దేవత) 6 ముత్యాలమ్మ 7. గంగానమ్మ అనేవారిని ఊరి శక్తులుగా ప్రజలు చెప్పుకుంటారు

64. పల్నాటి వీరచరిత్ర (రె. గో.), పు. 268.
65. పల్నాటి వీరచరిత్ర, ప్రథమ భూమిక, పు. 41.
66. క్రీడాభిరామం, ప. 123.

తూర్పు ఒడ్డున పల్నాటి వీరుల రణక్షేత్రం, వీరులగుడి, ఈ గుడికి సమీపాన గంగ విగ్రహం, కాలభైరవ విగ్రహాలున్నాయి. ఇంకా కల్లిపోతరాజు, ఎరుకల శక్తి ఉన్నారు. 'కల్లితోరణం' పక్కన ఆంజనేయ విగ్రహం ఉంది. వీరులు ఆవేశంతో రణరంగంలో ప్రవేశించే ద్వారాన్నే కల్లితోరణం అంటారు [67] 'పటు గంగ ధారనా బరగిన మడుగు' అనే పల్నాటి వీరచరిత్రకారుని వాక్యంవల్ల నాగులేటిలోనిదీ, కారెంపూడి సమీపానఉన్న 'గంగధార మడుగు' ఉనికి తెలుస్తుంది.

కారెంపూడిలో చెన్నకేశవ స్వామి ఆలయం, అంకమ్మగుడి, కన్నమదాసు వేద, బ్రహ్మనాయుని నామాలమంటపం, ఒడిగాళ్ళ బావి, సురేశ్వర దేవాలయం ఉన్నాయి. వెలనాటి చోళుల శాసనం, జన్నిగదేవుని సర్వాధికారి రుద్రమదేవి అధికారి మహిదేవుని శాసనం, మాచయ బ్రహ్మని శాసనం (మాచయ బ్రహ్మ నిధి ఉత్తర హరివంశ కర్త నాచన సోమునికి ఒకప్పుడు పోషణ కర్త అని వినికిడి) ఉన్నాయి. అంతేకాదు, కారెంపూడి పల్నాటికి కాశియట.

> "పొలుపొందు చుండెడు పుణ్య దేశమున
> కాశికి సమమైన కార్యమపూడి" [68]

అనే పద్యంలోనూ,

> ఏరులు దివ్యలింగములు విష్ణువు చెన్నుఁడు కళ్ళిపోతు రా
> జారయఁ గాలభైరవుఁడు నంకమ శక్తియ యన్నపూర్ణయున్
> గేరెడు గంగాధార మడుఁగే మణి కర్ణికగాఁదెలంగు నీ
> కారెమ పూడి పట్టణము కాశిగదా పలినాటి వారికిన్" [69]

అనే చాటువు లోనూ కారెంపూడిని గూర్చి, నాటి దాని వైభవ ప్రాభవాన్ని గూర్చి పేర్కొన్నాడు.

---

67. పల్నాటి వీర చరిత్ర (రెం. గో.), పు. 278.
68. పల్నాటి వీరచరిత్ర (పాదాలు 88, 89), పు. 33.
69. చాటు పద్య మణిమంజరి, పు. 125.

పల్నాటిలో కనిపించే ప్రాచీన గ్రామాలు :

పల్నాటి సీమలో కొన్ని గ్రామాలు ప్రాచీనం నుంచి ఉన్నాయి. అవి నేటికి అదే పేరుతో పిలువబడుతున్నాయి.

దుర్గి :- పల్లవుల కాలంలో దుర్గిలో ఒంకేశ్వరాలయ నిర్మాణం జరిగి ఉండవచ్చునని శాస్త్రిగారి అభిప్రాయం.[70] రుద్రమదేవి నిర్మించిన వేణుగోపాల స్వామి గుడి, దుర్గె దేవమ్మ గుడి చెప్పుకోదగ్గ విశేషాలు.

గోలి :- ఇది కృష్ణా తీరాన ఉంది. ఇచ్చట బౌద్ధ స్థూపం ఉండె. ప్రాచీన శిల్పాలు దొరికాయి.

చేజెర్ల :- పల్లవుల కాలం నాటిదీ, దక్షిణ భారతదేశంలో ఉన్న శివాల యాల్లో ప్రత్యేక శిల్పంతో అలరారుతున్నదీ అయిన కపోతేశ్వరాలయం ఉంది.[71]

పెందోట :- నేటి ధర్మవరం గ్రామమే నాటి పెందోట. విశ్వ బ్రాహ్మ ణులను యాచించే రుంజలవారి ప్రశంసలు ఇచ్చట తెలుస్తాయి.[72] దీని ఆధారంగా ఇది శిల్పుల నివాస భూమి అని అంటారు. దీని పక్కనే ఉన్న దుర్గిలో ప్రస్తుతం శిల్ప కళాభివృద్ధి కేంద్రం నడుపుతున్నారు.

విజయపురి :- నాగార్జునకొండవద్ద లోయలో విజయపురి నిర్మించబడింది. ఆ నగరానికి ఒక వైపు కృష్ణానది, మిగిలిన వైపులు కొండలు సహజ రక్షణను ఇస్తున్నాయి.[73] ప్రస్తుతం నాగార్జునసాగర్ అనే పేరుతో పిలువబడుతుంది. ఇచట కృష్ణానదికి పెద్ద ఆనకట్టకట్టి జలాశయంలో నీటిని నిల్వచేసి దానివల్ల ఎక్కువగా పంటలు పండిస్తున్నారు.

ఇవేగాక ఇంకా పులిపాడు, అడిగొప్పల, నెమలిపురి, వీరమెడపి, చెర్వగుడి పాడు, కంభంపాడు, మండాది, ఒప్పిచర్ల, జూలకల్లు, కొదమగుళ్ల, రెంటాల, మాడుగుల, మంచికల్లు, పేట్లవాగు, గరికపాడు అనే గ్రామాలు ఇప్పటికీ అవే పేర్లతో పిలువబడుతున్నాయి

70. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పు. 194.
71. పైదే, పు. 194.
72. పల్నాటి వీర చరిత్ర, ద్వితీయ భూమిక, పు. 90.
73. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర, పు. 47.

అంతేకాకుండా పల్నాటి వీరుల పేరుల మీదుగా కొన్ని గ్రామాలు వెలిశాయి. అలుగురాజు పేర అలుగురాజుపల్లె, అలరాచమల్లు పేర రచ్చమలపాడు, ఝుట్టిరాజు పేర ఝుట్టిపాలెం, నాయుని పల్లె, నాయకురాలి కనుమ మొదలయినవి పల్నాటిలో ఉన్నాయి.

**పల్నాటి పాలకులు :—**

పల్నాటికి చరిత్ర ప్రసిద్ధి పల్నాటి యుద్ధం నుంచి వచ్చిందనే చెప్పాలి. పల్నాటి యుద్ధం దాదాపు క్రీ.శ. 1176-1182 మధ్యలో జరిగిందని చాలమంది విమర్శకులు నిర్ధారించారు. పల్నాటివీరుల తరువాత పల్నాటిసీమను పద్మనాయకులు, కాకతీయులు, కొండవీటి రెడ్డిరాజులు, విజయనగరరాజులు, గోల్కొండ నవాబులు, ఆర్కాటు నవాబులు పాలించారు. తర్వాత ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనకిందకు వచ్చింది.

ఇట్లు పల్నాడు ప్రాచీన పట్టణాలను, గ్రామాలను, సీమలను, పాలకుల చరిత్రను విపులంగా కల్గి ఉంది.

ప్రజలు :- పల్నాటిలో ప్రస్తుతం హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ మతాలవారు ఉన్నారు. వివిధ కులాలవారు ఉన్నారు

బ్రాహ్మణులు, వైశ్యులు, వెలమవారు, రెడ్లు, కమ్మవారు, కంసాలివారు, సాలెవారు, ఒడబుక్కలవారు, దాసరివారు, దొమ్మరవారు, గంగిరెద్దులవారు, జంగమువారు, కాటిపాపలు, మేదరులు, మంగలివారు, వడ్డెవారు, పాములవారు, పిచ్చుగుంటలు, చాకలివారు, బోయవారు, దూదేకులవారు, గౌండ్లవారు, కుమ్మరవారు, పద్మసాలెవారు, పెరికవారు, తొగటవారు, పట్రాజులు, కళావంతులు, ముతరాసువారు, తెలగవారు, పూసలవారు, సాతానివారు, యాదవులు, మాదిగవారు, మాలవారు, బుడిగిజంగంవారు, మాలదాసులు, సిందోళ్లు (చిందోళ్లు), చెంచువారు, కోయవారు, లంబాడీలు, ఏనాదివారు, ఎరుకలవారు మొదలయిన కులాలవారు ఉన్నారు.

వీరిలో విద్యావంతుల శాతం తక్కువ కార్మికులు, వ్యవసాయ కూలీలు ఎక్కువ. వ్యవసాయదారులు, గనులపై ఆధారపడ్డవారు, పరిశ్రమలపై ఆధాపడ్డ వారు, వాస్తు కర్మాణులు, వ్యాపారస్థులు, ఉద్యోగులు మొదలయిన వృత్తులతో ప్రజలు సంబంధం కల్గిఉన్నారు. వ్యవసాయం మాత్రం ముఖ్య వృత్తి. తక్కినవి ఉప వృత్తులుగా ఎక్కువగా ఉన్నాయి.

శారీరక పరిస్థితులు :- పల్నాటిసీమలో ఎర్రరంగువాళ్లు అధికంగాను, చామనచాయరంగువాళ్లు అల్పంగానూ, నల్లటివాళ్లు చాలా తక్కువ సంఖ్యలోను ఉన్నారు. ఇచ్చటి పురుషుల సగటు ఎత్తు 5.7 అంగుళాలు ఉంటుంది. 1971 జనాభా లెక్కల ప్రకారం ఈ సీమలో 3,00,425 మంది ప్రజలు ఉన్నారు. అందులో 1,52,202 మంది పురుషులు, 1,48,223 మంది స్త్రీలు ఉన్నారు. పురుషుల్లో 45,985 మంది, స్త్రీలలో 15,613 మంది విద్యావంతులు.[74] అంటే దాదాపు 20.5% మంది విద్యావంతులు.

మానసిక పరిస్థితులు :-

ఈ సీమలో ప్రజా వినోదాలు ఎక్కువగానే కన్పిస్తాయి. అందులో వారే పాల్గొనేవి కొన్ని ఉన్నాయి. కొన్ని ఇతర స్థలాలనుంచి ప్రదర్శకులను రప్పించుకొని ప్రదర్శింపజేసేవి ఉన్నాయి. వీధి భాగవతం, తోలుబొమ్మలాటలు, జముడిక కథలు, బుర్రకథలు మొదలయినవి తమ అభిలాషకొద్దీ ఆయా కళలు ప్రదర్శించే వారిని పిలిపించుకొని ప్రదర్శన లిప్పించుకుంటారు. వారే పాల్గొని ప్రదర్శించే కళల్లో భజనలు, కోలాటాలు ముఖ్యమైనవి.

జానపద కళలు :

ప్రజాప్రయోగ కళలను అవలంబిస్తున్న కులాలవారిలో యానాదులు వీధి భాగవతాలు, బొమ్మలాటలు ప్రదర్శిస్తుంటారు. వీధి భాగవతంలో భారతం, రామాయణం, భాగవతాలకు సంబంధించిన నాటకాలు తీస్తుంటారు. తోలుబొమ్మలాటల్లో గూడ భారతం, రామాయణం సంబంధి ప్రదర్శనలే ఇస్తుంటారు

ప్రజా వినోదాలు :

భజనలు, కోలాటాలు, ఎడ్లపందేలు, కోళ్ళపందేలు, బండ ఎత్తడం, బండి ఎత్తడం, తిరునాళ్ళకు ఊరేగింపుల్లో ప్రభలు, డ్యాన్సులు, బుర్రకథలు, పగటి వేషాలు మొదలయినవి వినోదాలుగా కన్పిస్తాయి.

కళా ప్రదర్శకులు రెండు తెగలు. వృత్తిజీవులు కొందరు కాగా, ఉత్సాహపరులు మరికొందరు. కళాప్రదర్శనం ప్రధాన జీవనోపాధిగా కల్గిన తెగల్లో యానాదులు, మాలలు, మాదిగలు, గొల్లలు, గంగిరెద్దులవారు, బుడబుక్కలవారు, ఎరుకలవారు, దొమ్మరివారు మొదలయిన వాళ్ళున్నారు. వృత్తి జీవుల్లో ఆ సీమవారున్నారు. పరసీమనుంచి వచ్చేవారున్నారు. ఈ ప్రదర్శకులు ప్రజలకు తీరికగల

74. **Guntur District Census**, 1971, **p.** 326.

కాలంలోను, పంటలు ఇంటికి వచ్చిన కాలంలోను వస్తుంటారు. ఔత్సాహిక కళా రాధకులు ప్రాయికంగా బ్రాహ్మణ, వైశ్య వర్ణాలవారు తప్ప తక్కిన అన్ని కులాల, అన్ని తెగల ప్రజలు ఔత్సాహిక ప్రదర్శనల్లో పాల్గొంటారు. వీరిలో తెలగ, రెడ్డి, కమ్మ, ముతరాసు, తొగట, పెరిక, చాకలి, మంగలి, కుమ్మరి, విశ్వబ్రాహ్మణ మొదలయిన అన్ని కులాలవారు పాల్గొంటారు.

ప్రకృత పరిశోధనలో పల్నాటి సీమలో కోలాటాన్ని గూర్చి విపులంగా చర్చించడం జరిగింది. కోలాటపు జట్లలో ఒకే కులానికి చెందినవారే ఉండాలన్న నియమం లేదు కొన్నిచోట్ల కొన్ని తెగలవారి ప్రాతినిధ్యం ఎక్కువ ఉంటే ఉండ వచ్చు. మొత్తంమీద ద్విజేతర వర్ణాలకు చెందిన అన్ని కులాలవారు కుల భేదాలను విస్మరించి వీటిలో పాల్గొంటారు కొన్ని కొన్ని చోట్ల ఆటగాళ్ళలో ముస్లింలు, క్రైస్తవులు కూడా లేకపోలేదు ఆ యా జట్లకు కోలాటం నేర్పే జట్టు నాయకుల్లో ఇంచుమించు అన్నికులాలవారున్నారు. ప్రకృత పరిశీలనలో సంప్రదించిన జట్టు నాయకుల్లో అధిక సంఖ్యాకులు రజక కులానికి చెందినవారు, తర్వాత యానాది, తొగట, తెలగ, పెరిక, మాల, రెడ్డి కులాలవారు అల్పసంఖ్యలోను కన్పిస్తారు. దీనినిబట్టి కళారాధనలో, సాధనలో, ప్రయోగంలో కుల మత మర్గ శాఖా భేదాలు అడ్డురావటంలేదని స్పష్టపడుతుంది.

పల్నాటిసీమ విస్తీర్ణం తగ్గించి. కానీ ప్రాముఖ్యం తగ్గలేదు. దాదాపు 80 ప్రాచీనకాలపు చెరువులు ఉన్నాయి. బోళ్ళు వున్నాయి. ఈ బోళ్లలో అచ్చటచ్చట ప్రాచీన సమాధి శిలా శకలాలు (రాక్షసగుళ్లు) కన్పిస్తాయి. రంగుల బోళ్ళు ఉన్నాయని ప్రతీతి లేత పసుపుపచ్చ, ఎర్ర, తెల్లరంగుల సుద్దలు ఇప్పటికే చాలాచోట్ల బయలుపడ్డాయి. ఎన్నోరకాల రాళ్ళగనులు, రాళ్లు ఉన్నాయి. వీటిని పలురకాలుగా వాడుతున్నారు. దేవుళ్లు, వీరులు, మహత్తుగల మహాత్ములు ఎందరో కొలువబడుతున్నారు. రకరకాల పంటలు పండిస్తున్నారు. రకరకాల నేలలున్నాయి. అడవులున్నాయి నిన్న మొన్నటివరకు శ్రీగిరిపాటి అడవుల్లో పెద్దపులులుకూడా కాపురం ఉండేవట. ఈ అడవుల్లో పలురకాల కలప లభిస్తుంది. ఎన్నోరకాల పండ్లు, పలురకాల తేనెలు మొదలగువానిని అడవులద్వారా గ్రహించి, అమ్మడంద్వారా కొందరు జీవితాన్ని గడుపుతున్నారు. నదులు, ఉపనదులు పల్నాటిగుండా పారు తున్నాయి ఎన్నో కుంటలున్నాయి. కిట్టుబొట్టుల్లో కొంత మార్పువచ్చినా విద్యా, వైద్య సదుపాయాలు అంతగా లేవు.

ఇట్లు పల్నాటి నైసర్గికస్థితిలో విలక్షణం కనపడుతుంది.

# పల్నాటి సీమలో
# కోలాటం రకాలు : కోపులు

కోలాటం అనగానే చేతుల్లో కర్రలతో ఆటగాళ్ళు, వాద్యాల వాళ్ళు, ఒట్టి నాయకుడు - వాళ్ల ఆడే ఆటను మాత్రమే పరిగణలోకి తీసుకుంటారు ప్రేక్షకులు. కాని వీటిలో భేదాలున్నట్లు పట్టించుకోరు. ప్రేక్షకులకు అది అనవసరం కూడా. ప్రపంచంలోని ప్రతి దేశానికి, ప్రతి మతానికి, ప్రతి వస్తువుకు చరిత్రలున్నాయి అట్లే ప్రతి ఆటకు, ప్రతి పాటకు చరిత్ర ఉంది. ఆ కోవలోనే కోలాటానికి కొంత చరిత్ర ఉంది. కోలాటం ప్రాచీన రూపాలు ప్రస్తుతం బాగా వెనుకబడిన వివిధ ప్రాంతాల్లో పలు రీతుల్లో కనిపిస్తాయి అనుకరణ మానవ స్వభావం. ప్రతి దానికి అనుకరణలు అనుసరణలు తయారవుతాయి. కోలాటంలో కూడా అంతే. కాలం జరిగిన కొద్దీ మార్పులు సహజమే అయినప్పటికీ ఆ మార్పుల వల్ల పూర్వ స్థితి స్వరూప స్వభావాలు అదృశ్యమౌతాయి. కోలాటం ఏ కాలంలోనూ ఏక రూపంలో లేదు. రుచి భేదాన్ని బట్టి రూప భేదం మారడం సహజం. మార్పులు, చేర్పులు అన్ని ప్రజా కళలకు వలె కోలాటం పట్ల కూడా వర్తిస్తాయి. అయినప్పటికీ ప్రాచీన కాలంలో కోలాటం భేదాల్ని గురించి నిరూపించడానికి నిష్కర్షమైన నిరూపాలు గోచరించవు. కాని ప్రస్తుతం ఇది వివిధ రూప భేదాంతో వివిధ పరిభాషలతో వెలసింది. పల్నాటి సీమలోని కోలాటంలో స్థూలంగా రెండు రకాలు గోచరిస్తాయి. 1. కులుకుల కోలాటం 2. కుప్పెకట్టె కోలాటం (లేక) భారత కోలాటం (లేక) దేశి కోలాటం.

**కులుకుల కోలాటం :—**

కోలలతో చేసే కులుకుతో కూడిన కోలాటం కులుకుల కోలాటం కావచ్చు. ప్రయోగ కాలంలో ఆటగాళ్ళ కులుకు ముఖ్య లక్షణంగా గల కోలాట భేదం కాబట్టి కులుకుల కోలాటం అన్న పేరు ఏర్పడి ఉండవచ్చు. కులుకు అంటే

వయ్యారం, శృంగారపు కదలిక,[1] విలాసం, రీవి అని చెప్పుకోవచ్చు. ఈ కులుకు ఆడవాళ్ల అభినయంలో ప్రస్ఫుటమయ్యే విలాస లక్షణాల సంపుటి. వారు కావించే గమన భంగిమలో లలాట నయన భ్రూవిక్షేపాల్లో కరచరణ కచాదికాల కదలికల్లో ఒకరకమైన కులుకు కన్పిస్తుంది. కాబట్టి కులుకుల కోలాటం అన్న పేరు అన్వర్థం రెండో వర్గానికి చెందిన కోలాటంలో ఈ కులుకు ముఖ్యం కాదు. లలాట నయనభ్రూ విక్షేపాది రూపమయిన అభినయ భేదాలు ఈ కోలాటంలో ప్రధానంగా ఉన్నాయి. ముఖ్యంగా భరత నాట్యాన్ని పోలిన అభినయాలుంటాయి. అడుగులకనుకూలంగానూ, కరచలనానికి అనుగుణంగానూ నేత్ర చలనం ఉంటుంది. కోలాటం ఆడుతూనే చేతులు పైకెత్తడం, చేతులు ఆకాశాన్ని చూస్తున్నట్లుగా ఉంచడం, ఏటవాలుగా పెట్టడం, మరలా కిందకు తిప్పడం - ఈ కరచలనాన్ననుసరించి నేత్ర చలనం ఉండడం ఇందులోని అంశాలు. భరతుడు నిర్దేశించిన లక్షణం ఇందులో గోచరిస్తుంది. చేతుల కదలిక కనుగుణంగా ఒక కాలు ఒక అడుగు ముందుకు వేసి, మరొక కాలు ఒక అడుగు వెనక్కి వేసి చేతుల వేళ్ళు నేలనుచూస్తున్నట్లు ఏటవాలుగా (నాగిని నృత్యంవలె) తిప్పడం ఒక విశేషం. ఒంటిలోని వంపులన్నీ బయటపెట్టాలి ఒక్కొక్క మారు. కులుకుల కోలాటం తాళం "దోం దొద్దోదోం దోం దొద్దొద్దోం అడ్దోం దొద్దొదోం" అనే ధ్వని నిస్తుంది. కులుకుల కోలాటం ప్రయోగం సాధన మీద సాధ్యపడే నర్తనం అందులోను ఉసెత్తులో దీనిని నిర్వహించడం మరింత కష్ట సాధ్యం త్వరితంగా ఎగరడం ఉసెత్తు లక్షణం కాబట్టి ఆ సమయాన కరచరణ నేత్రాభినయాలు ఆట వేగనికి అనుగుణంగా ఉండాలి. చూడడానికి ఎంతో అందంగానూ, ఆలోచించడానికి ఎంతో ఆశ్చర్యంగానూ ఉంటుంది ఉసెత్తులో ఈ కులుకుల కోలాటం. కులకుల కోలాటాన్ని కొందరు ఒక పుల్లతోను, మరికొందరు రెండు పుల్లల తోను వేస్తారు. కులుకుల కోలాటంలో ప్రతి పాట చివర ఆటను ముక్తాయించవలసిందే. మరొక పాటను పాడవలెనంటే మరలా మొదలు పెట్టవలసిందే. అట్లే ప్రతి కోపు చివర ముక్తాయించవలసిందే. మరలా మొదలు పెట్టవలసిందే. పల్నాటి సీమలో కులుకుల కోలాటం పన్నెండు కోపులు వాడుకలో ఉండేవి. ఇందులోని కొన్ని కోపులు అదే పేరుతో భారత కోలాటంలో ఉన్నప్పటికీ అభినయం లేకపోవడం కన్పిస్తుంది.

---

1. శ. ర., 187.

కులుకుల కోలాటం కోపులు :-

1. కొంగపోటు కోపు 2. గొల్లభామ కోపు 3. చిన్నచెలియ కోపు 4. చెట్టుమల్లె కోపు 5 జంజాం కోపు లేక జంజెం కోపు 6 జడకోపు 7. తెల్ల కోపు 8. పక్కముడి చిటికెల కోపు (లేక) పక్కమూడు కోపు 9. పెద్దచెలియ కోపు 10. బిల్లడుగు కోపు (లేక) బిల్లవాణి కోపు 11. లంకె కోపు 12 లాలికోపు.

వీటిలో మరలా కొందరు ఒక్కొక్క కోపుకు మరికొన్ని బేదాలు కని పెట్టారు ఒక్క చిన్న చెలియకోపులోనే ఐదు వేదాలు చెప్తారు. వారివారి తెలివి తేటలను బట్టి, సమయాన్ని బట్టి, సరదాను బట్టి వారు నూతన ప్రక్రియల్ని సృష్టిస్తూ ఉంటారు.

ఇట్లా ఎన్నో అభినయాలు కల్గి కష్టభూయిష్ఠమైన ఈ కోలాటం అక్క డక్కడ నిలిచి ఉంది. దీనికి ప్రాచీనత ఎంత ఉందో వైభవంకూడా అంత ఉంది.

ముఖ్యంగా కులుకుల కోలాటం బాగా నేర్చిన జట్టు నాయకునకుగాని, జట్టుకుగాని స్వాభిమాన గర్వముంటుంది. ఇట్లాంటి ప్రతిష్ఠగల ఈ కోలాటంలోని కోపుల్ని, వాటి గతుల్ని పరిశీలించడానికి వీలులేకుండా పల్నాటిలో ప్రస్తుతం కనుమరుగై పోయాయి. ప్రస్తుతం నామమాత్రంగా మిగిలి ఉన్నాయి ఈ కోపులు. కులుకుల కోలాటం నేర్చినవారు కూడా వృద్ధులయి కొందరు, ఉదర పోషణాన్వేష ణలో ఇతర రీతుల్ని చేపట్టి కొందరు దాన్ని వదలివేశారు. మరలా దాన్ని వృత్తిగా స్వీకరించడానికి దానికి సరైన ఆదరణ లేదు. కష్టతరం కావడమే అందుకు కారణం. అంటే దీన్ని అభ్యసించడం, ప్రయోగించడం కష్టసాధ్యం కాబట్టి నేర్పేవాళ్లు ఉన్నా దీన్ని నేర్చుకునేవాళ్లు కన్పించడం లేదు.

దేశికోలాటం లేక కుప్పెకట్టె కోలాటం లేక భారత కోలాటం :

భరతముని నిర్దేశించిన లలాట నయన భ్రూవిక్షేపాది ఆంగికాభినయానికి ప్రాముఖ్యం లేని కోలాటాన్నే దేశి కోలాటమని ప్రజలూ, ప్రయోక్తలు వ్యవహ రించినట్లుగా ఊహింపవచ్చు. ఈ రీతి కోలాటంలో కర్రలు రెండూ కలిపి కుప్పగా చేసి కోలాటం వెయ్యడం ముఖ్య లక్షణం కాబట్టి కుప్పెకట్టె కోలాటం అన్న పేరు సంక్రమించి ఉండవచ్చు. కర్రకు కట్టె రూపాంతరం. కోలాటం ఆడేటప్పుడు ముందు ఒక చేతి పుల్లతోను, తర్వాత మరొక చేతిపుల్లతోను ఎదుటి వ్యక్తి చేతుల్లోని పుల్లల్ని విడివిడిగా కొట్టి తర్వాత రెండు పుల్లలు కలిపి (ఉత

చేసి) ఒకేసారి ఎదుటి ఆటగాని రెండు పుల్ల (జతచేసిన పుల్ల)ల్ని కొట్టడాన్నే కుప్పె కట్టె కొట్టడం అంటారు. ఈ కోలాటం ఆడినంతసేపు ఇదే పద్ధతిలో వేస్తుంటారు. కాబట్టి దీనికి కుప్పె కట్టె అనే పేరు తగి ఉంది. ఈ దేశి లేక కుప్పె కట్టె కోలాటాన్నే భారత కోలాటమని కూడా అంటారు. కాని భారత కోలాటం నామాన్ని గురించి చరిత్ర అడిగినా చెప్పేవాళ్ళు కన్పించడం లేదు. కొందరికి పేర్ల మీద మోజు. వింటానికి ఇంపుగా ఉన్న పదాల్ని పేర్లుగా పెడతారు. అంతేకాకుండా జాతీయ నామాలు కూడా బాగా వాడుతున్నారు. జాతీయ భావం ప్రబలిన అనంతరం దేశి లేక కుప్పె కట్టె కోలాటానికి భారత కోలాటం అన్న పేరు జాతీయతా భావ సూచకంగా పెట్టి ఉండవచ్చు. అందరికీ ఒక పేరు మీదనే ఇష్టం ఉండకపోవచ్చుగదా! వారివారి ఇష్టాన్ననుసరించి పెట్టిన ఈ పేర్లు వారివారి శిష్యగణాలవల్ల ఎక్కువ ప్రచారం పొందుతాయి.

కులుకుల కోలాటంలో పుల్లలు విడివిడిగా కొట్టడం జరుగుతుంది. రెండు పుల్లలు కలిపి వెయ్యడం లేనేలేదు. భారత కోలాటంలో ఎత్తుగడలో కొంతసేపు విడి పుల్లలతో కొట్టడం ఉంది. ఆ తర్వాత రెండు పుల్లల్ని కలిపి కొట్టడం ఉంది. కులుకుల కోలాటంలో కర్రలు తగిలీ తగలనట్లు కొడతారు. శబ్దం కూడా పెద్దగా రాదు. భారత కోలాటంలో కర్రలు అభిముఖంగా గట్టిగా కొడతారు. పాట కూడా వినపడనంతగా ధ్వని వస్తుంది. భారత కోలాటంలో పాటను పాడి, ఉసెత్తులో ఎగిరించి, తగ్గించి మరొక పాటను కూడా ఒకే కోపులో అందుకోవచ్చు. కాని కులుకుల కోలాటంలో పాటపాటకీ ఆటను ముక్తాయించాలి. భారతకోలాటం చాలా సులభమైనపద్ధతి చూడగానే నేర్చుకోవడానికి వీలయ్యే ఆట కాబట్టి ప్రచారం విరివిగా సాగుతుంది. తీరికవేళల్లో పదిమందికూడి ఏదైనా ఉల్లాసంగా కాలంగడపాలనుకుంటే ముందుగా గుర్తుకు వచ్చేది భారత కోలాటం. అయితే దీని ప్రచార బాహుళ్యాన్ని బట్టి స్వరూపం కొన్ని కొన్ని ప్రాంతాల్లో మారిపోతుంది.

కులుకుల కోలాటంలో పన్నెండు కోపులు ఉన్నట్లు గమనించాం. కాని భారత కోలాటంలో ఆడేవాళ్ళనిబట్టి, వివిధ ప్రాంతాలల్లో పలు రూపాల్ని సంతరించుకుంది. చేతనైనవాళ్ళు, చేవఉన్నవాళ్ళు చేతనైనన్ని కోపులు సృష్టించారు. గతిలో ఏదో కొద్దిమార్పు ఉంటేసరి. అది మరొక కోపై కూర్చుంటుంది. ఇట్లా చేర్చి చేర్చి పల్నాటిసీమలో భారత కోలాటంలో ముప్పైఐదు కోపులు తయారైనాయి. అయితే ఎక్కడా ఏ ఒక్కరు ముప్పై ఐదు కోపులు ఒక ప్రదర్శనలో ఇవ్వరు; ఇవ్వ లేరు. అది సాధ్యంకాదు కూడా. కోలాటం నేర్చిన వాళ్ళలో ఎక్కువ మందికి

పన్నెండులేక పదిహేను కోపులకంటే ఎక్కువరావు. అయితే అందరూ నేర్చిన పన్నెండు లేక పదిహేను ఒకే విధమైన కోపులు మాత్రం కావు. అందరూ ప్రయోగిస్తున్న కోపుల్ని లెక్కిస్తే అనురూపాలుపోను భిన్న రూపాలు ముప్పైఐదు దాకా ఉన్నట్లు లెక్క తేలింది. అయితే వాల నరసింహదాసు అనే జట్టు నాయకునకు మాత్రం ముప్పై కోపులు వస్తాయి. ఈ ముప్పైఐదు కోపులు కోలాట భేదాల్లో ఇమిడిపోతాయి. ఒక్కొక్క కోలాటంలో నాల్గు నుంచి పదిహేను కోపులదాకా ఉండవచ్చు. ఈ కోలాట భేదాలకు గతిభేదంలో కాని, కర్రలు కలిపే విధానంలో కాని తేడా ఏమీ లేదు తాళం కూడా మార్పులేదు. వీటిలో తాళం "తధిమి తక్కచెల్, తధిమి తక్కచెల్, తధిమి తక్కచెల్'' అనే శబ్దాన్ని ఇస్తుంది. భారత కోలాటాన్నే ప్రాంతాల్నిబట్టి వేరు వేరు పరిభాషతో వ్యవహరించడం కద్దు. పల్నాటిలో దీనికి ఏడు పేర్లు కన్పిస్తాయి. అవి 1. గుజరాతు కోలాటం 2 గోల్కొండ కోలాటం 3. చీలకర్ర కోలాటం 4. దసరా కోలాటం. 5. నాటు కోలాటం 6 బజారు కోలాటం 7. మురళి కోలాటం అనేవి. అయితే ఈ కోలాటాల్లో సందర్భాన్ననుసరించి ఏడెనిమిది లేక పదికోపుల కంటె ఎక్కువ ఆడించరు. లేకపోతే పన్నెండు కోపులు చెప్తుంటారు. ఏదో పండుగలకు గాని, తిరునాళ్ళకుగాని ఒక్క ప్రదర్శన ఇచ్చేవారు. ఇంతకంటె ఎక్కువకోపులు ప్రదర్శించలేరు. పదిపన్నెండు కోపులు వేయాలంటే ఐదారు గంటలు పడుతుంది. అప్పటికి ఆటగాళ్లు పూర్తిగా అలసిపోయి, కదల్లేని పరిస్థితిలో ఉంటారు. ఐదారు గంటల్లో ఎక్కువ ఎగరడంవల్ల ఇంక ఏమాత్రం 'హుషారు'లేని పరిస్థితి ఏర్పడుతుంది.

పల్నాటి సీమలో ప్రచారంలో ఉన్న ముప్పైఐదు కోపులు ఇవి.

1. ఉద్ది తిరుగుడు కోపు. 2. ఉయ్యాలకోపు. 3 ఎరుకలకోపు 4. కలువ రాయ కోపు. 5. కంస కోపు. 6. కుందనపు కోపు. 7. కృష్ణ కోపు 8. గారడి కోపు 9. చదరంగం కోపు. 10. చిన్నకత్తెర కోపు. 11. చిన్న చెలియ కోపు. 12. చుక్కల కోపు 13. చుట్టు కోపు. 14. చెలియజడ కోపు. 15. జంజాలకోపు 16. జడకోపు 17. తెల్లకోపు. 18. పెదచెలియ కోపు. 19. పెద్దకత్తెర కోపు. 20. పొదమల్లె కోపు. 21. పొర్లకోపు 22. ప్రార్థన కోపు. 23. బజారు కోపు. 24. బురుజుల కోపు. 25. భామకోపు 26. భారతకోపు. 27. మల్లె పందిరి. 28. మాయబజారు. 29. రాంబాణం. 30. రెడ్డోరి కోపు 31. లలిత కోపు. 32. లాలికోపు. 33. వరగత్తెరకోపు. 34. వాల్మైనడు కోపు. 35. శ్రీకర కోపు- అనేవి. వీటిలో ప్రచురంగా ప్రచారంలో ఉన్నవీ, ముఖ్యమైనవీ పన్నెండు కోపులు.

అవి :

1. ఉజ్జి తిరుగుడు, 2. కంసకోపు, 3. కలువరాయ కోపు, 4. కృష్ణ కోపు, 5 జడకోపు, 6. ప్రార్థనకోపు, 7. బురుజులకోపు, 8. మల్లెపందిరి కోపు, 9. మాయబజార్ కోపు, 10. లలితకోపు, 11. వరగత్తెరకోపు, 12. సమఎత్తు కోపు.

పల్నాటి సీమలో ఏటిని ప్రచారం చేస్తున్న ప్రచారకుల్ని, కోపుల ఉనికిని పట్టికలో గమనించవచ్చు.

| వరుస సంఖ్య | కోపులు | చెప్పాల చెన్నయ్య | చౌల నరసింహదాసు | జక్కుల వెంకయ్య | జాష్టి సీతారామయ్య | తోట హనుమయ్య | బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు | మందపాటి రాములు | మక్కెన బంగారయ్య | మొత్తం ప్రచారకుల సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఉజ్జితిరుగుడు కోపు | √ | √ | √ | √ | √ | √ | X | √ | 7 |
| 2. | కంసకోపు | X | √ | √ | √ | X | X | √ | √ | 5 |
| 3. | కలువరాయ కోపు | √ | √ | X | X | X | X | X | √ | 3 |
| 4. | కృష్ణకోపు | √ | √ | √ | √ | √ | X | √ | X | 6 |
| 5. | జడకోపు | √ | √ | X | √ | √ | X | √ | √ | 6 |
| 6. | ప్రార్థనకోపు | √ | √ | √ | √ | √ | √ | √ | √ | 8 |
| 7. | బురుజుల కోపు | √ | √ | √ | √ | X | X | X | √ | 5 |
| 8. | మల్లెపందిరికోపు | X | √ | √ | √ | √ | √ | X | X | 5 |
| 9. | మాయాబజార్‌కోపు | X | √ | √ | √ | X | X | √ | X | 4 |
| 10 | లలితకోపు | X | √ | √ | √ | X | X | √ | X | 4 |
| 11. | వరగత్తెరకోపు | √ | √ | √ | √ | √ | √ | √ | √ | 8 |
| 12. | సమఎత్తుకోపు | √ | √ | √ | √ | X | X | X | √ | 5 |
| | | ప్ర | | చా | | ర | | కు | | లు |

(ఇందులో '√' ప్రచారంలో ఉన్నందుకూ; 'X' గుర్తు ప్రచారంలో లేనందుకూ గుర్తులుగా తీసుకోబడ్డాయి.)

పైన పేర్కొన్న ముప్పైఐదు కోపుల్లోను, కోపుకీ కోపుకీ చరించే మార్గం లోను, కరచలనంలోను, కర్రల కదలికల్లోను భేదం ఉంటుంది. భారత కోలాటాల నుంచి విడివడ్డ కోలాట బేదాల స్వరూప స్వభావాల గురించి కొంచెం పరిశీలిద్దాం.

**1.** గుజరాతి కోలాటం :

భారత కోలాటానికి ప్రాంతీయమైన ఒక వ్యవహార నామం గుజరాతి కోలాటం. ఇది శ్రీగిరిపాడు, పెల్లుర్తి మొదలయిన గ్రామాల్లో వ్యవహారంలో ఉంది. గుజరాతు అంటే గూర్జర దేశం అని నిఘంటువుల్లో వివరింపబడింది.[2] అంతే కాకుండా గుజరాతి అనేది ఒక నాట్య విశేషంగా కూడా చెప్పబడింది.[3] నాట్య విశేషం అనడానికి—

సీ "కులిశాయుధుని నిండుఁ గొలువులో గుజరాతి
మేలుకోపులఁ గొంతమెప్పువడసి ....
జలకంబు లాడి"[4] అనేదీ

సీ. "నాట్య భేదంబుల నామముల్ దనరు జక్కిణి
గుజరాతి పేరులనంగ "[5]

అనేదీ ఆంధ్ర సాహిత్యాధారాలు. అంతేకాదు, ఈ గుజరాతిలో రెండువిధాలైన నర్తనాలున్నాయి. 1. స్త్రీలు ప్రదర్శించే 'గర్బానాట్యం' 2. పురుషులు ప్రదర్శించే 'దండియారాస.' అయితే దండియారాసను కొన్ని సమయాల్లో గుజరాతుదేశంలో స్త్రీలు, పురుషులు కలిసి ప్రదర్శిస్తారు.[6] దీనికిపేరు మోజుకొద్దీ పెట్టుకున్నట్లుగా ఊహించవచ్చు. ఇందులో 1. ప్రార్థనకోపు 2. చుక్కలకోపు 3. భామకోపు 4. మల్లెపందిరికోపు 5. లలితకోపు 6. లాలికోపు మొదలయిన కోపులు చెప్తారు.

---

2. శ. ర. 239.
3. వా. ని. ద్వి. సం. 227.
4. కంకంటి పాపరాజు, పాపరాజు, ఉ. రా, 4-175.
5. ఆంధ్ర భాషావర్ణం, 130.
6. నటరాజ రామకృష్ణ, నృత్యజ్యోతి, పు. 133.

**2. గోల్కొండ కోలాటం :**

ఉల్లాసంకొద్దీ, ఏదో కొత్త పేరు పెట్టాలన్న ఉబలాటంకొద్దీ, పెట్టిన పేరు మాత్రమే. అంతేతప్ప గోల్కొండ ప్రాంతానికి ఈ కోలాట భేదానికి సంబంధమేమీ ఉన్నట్లు కన్పించదు. పిడుగురాల, పిల్లుట్ల ప్రాంతాల్లోను; శ్రీగిరిపాడు, వెల్దుర్తి ప్రాంతాలలోను ఈ కోలాటం పేరు ప్రచారంలో ఉంది. ఇందులో 1. ఉద్ది తిరుగుడు కోపు. 2. కత్తెరకోపు. 3. గణపతి కోపు 4. భారతకోపు. 5. మల్లె పందిరి కోపు. 6. శ్రీకరకోపు మొదలైన కోపులు చెప్తారు.

**3. చీలకర్ర కోలాటం :**

కుప్పెకట్టె కోలాటం అనే పేరునుబట్టి దానికి భిన్నంగా రెండు కర్రలను జంటనుంచి చీలదీసి విడివిడిగా దెబ్బకొట్టే లక్షణం ప్రముఖంగా కలది కాబట్టి చీల కర్ర లేక విడిపుల్ల కోలాటం అని పేరుపడి ఉండవచ్చు. ఇందులో రెండు చేతుల్లోని కర్రలు విడివిడిగానే కొట్టడం జరుగుతుంది అంటే మొదట ఎడమ చేతి లోని కర్రతో ఎదుటివాని ఎడమచేతిలోని కర్రతో కొట్టాలి. తర్వాత కుడిచేతి కర్రతో ఎదుటివాని కుడిచేతిలోని కర్రతో కొట్టాలి. ఆట ఆడినంతసేపు ఇట్లా విడి విడిగానే కొడుతుంటారు. గాదెవారిపల్లె, పోలేపల్లి మొదలయిన ప్రాంతాల్లో ఇది ప్రచారంలో ఉంది. ఇందులో 1. ఉద్ది తిరుగుడుకోపు, 3 కృష్ణకోపు, 3 చిన్నకత్తెర కోపు, 4. బురుజులకోపు, 5. మల్లెపందిరికోపు 6. వరగత్తెరకోపు మొదలయిన కోపులు చెప్తారు.

**4. దసరా కోలాటం :**

దశరాత్రి పండుగనే దసరా అంటారు:[7] దశరాత్రి పండుగ సందర్భంగా వేసే కోలాటం కాబట్టి దసరాకోలాటం అంటున్నారు. జట్టు నాయకులు దసరా పండుగకు బజార్లవెంట తన జట్టుతో కోలాటం వేయిస్తూ దసరామామూళ్లు (దసరా చందాలు) వసూలుచేసుకుంటారు. తక్కిన ప్రాంతాల్లో దసరా సంద ర్భంలో వసూళ్ళుచేస్తున్న కోలాటాల్ని దసరా కోలాటం అని వ్యవహరించరు.

దసరా కాక ఇతరమైన పండుగ పర్వాల్లో వేసే కోలాటాన్ని కోలాటం అని మాత్రమే వ్యవహరిస్తారు. ఇది పిడుగురాల ప్రాంతంలో ప్రచారంలో ఉంది.

---

7. శ. ర. 385.

ఇందులో బజారు కోలాటంలోని కోపులైన బజారు కోపు, చదరంగం కోపు, మాయబజారు కోపు ఉంటాయి. అన్నింటిలో వలె ఇందులో గూడ ప్రార్థన కోపు ఉంటుంది. సాహిత్యంలో అక్కడక్కడ మార్పులు ఉంటాయి. ఎక్కువగా దసరాకు సంబంధించిన పాటలు పాడుతుంటారు. వాటితోపాటు మామూలు కోలాటం పాటలు కూడా పాడుతుంటారు.

### 5. నాటు కోలాటం :

కులుకుల కోలాటంలో అభినయాలు ఉంటాయి. కాబట్టి దానికి భిన్నంగా తయారైన కోలాటాన్ని నాటు కోలాటం అంటున్నారు. భారత కోలాటానికి దేశి కోలాటం అన్న పేరు ఉన్నట్లు వెనుక గమనించాం. దేశి అన్న సంస్కృత శబ్దానికి తెలుగు మాట 'నాడు'. ఈ'నాడు'కు విశేషణం - అదే పూర్వరూపం నాటు అనేది. నాటు అంటే జానపద ప్రాంతం, గ్రామీణ ప్రాంతం (Rural area) అని అర్థాలు చెప్పవచ్చు అంటే దేశీయమైన లక్షణాలతో కూడినది ఈ నాటు కోలాటం ఇది గుండ్లపాడులో అధిక ప్రచారంలో ఉంది. ఇందులో 1. ఉద్ది తిరుగుడు కోపు. 2. కలువరాయ కోపు. 3. కృష్ణ కోపు. 4. జడ కోపు. 5. తెల్ల కోపు. 6. ప్రార్థన కోపు. 7. బురుజుల కోపు. 8. రాంబాణం కోపు. 9. వరగత్తెర కోపు 10. సమఎత్తు కోపు - అనేవి చెప్తారు.

### 6. బజారు కోలాటం :

బజారుల వెంట తిరుగుతూ వేసే కోలాటాన్ని బజారు కోలాటం అంటారు. బజారుకు పూర్వరూపం బాజార్. ఉర్దు భాషా ముఖంగా తెలుగులో ప్రవేశించిన పారశీక భాషా పదమిది. సంస్కృతంలో ప్రసార శబ్దం పారశీక శబ్దానికి జ్ఞాతి రూపం. వీథుల కూడలిలో కోలాటం వేస్తూ ఒక చోట నుంచి మరొక చోటకు వెళ్ళే సమయాన నాలుగు వరుసలుగా ఏర్పడి రెండు చేతులు పైకెత్తి ఎవరి కర్రలు వారు పాటకనుగుణంగా కొడుతూ వెళ్ళుతుంటారు. ఇది పిడుగురాల ప్రాంతంలో ప్రచారంలో ఉంది. ఈ కోలాటంలో బజారు వెంట తిరుగుతూ వేయడానికి అనుకూలమైన కోపులు ఉంటాయి. 1. చదరంగం కోపు 2. ప్రార్థన కోపు. 3. బజారు కోపు. 4. బురుజుల కోపు. 5. మాయబజారు కోపు మొదలయిన కోపులు చెప్తారు.

7. మురళి కోలాటం :

కృష్ణుని లీలావిలాసాలకు, ఆయన అనుచరుల చేష్టలకు సంబంధించిన కథా వస్తువులు కలిగిన పాటలు పాడే సందర్భంలో వేసే కోలాటం కాబట్టి మురళి కోలాటం అనే పేరు వచ్చి ఉండవచ్చు. ఇతరమయిన పాటలు పాడుతున్నప్పుడు కూడా ఈ పరిభాషనే వాడుక చెయ్యడం కద్దు. ఇది పిడుగురాల, పిల్లుట్ల ప్రాంతాల్లో ప్రచారంలో ఉంది ఇందులో 1. ప్రార్థన కోపు. 2. కంస కోపు. 3. కృష్ణ కోపు 4. గారడి కోపు. 5. చెలియ కోపు 6. జడ కోపు. 7. భామ కోపు మొదలయిన కోపులు చెప్తారు.

ఇట్లా కోలాటం నుంచి విడివడి నూతన నామాన్ని సంతరించుకొన్న భారత కోలాటం ఏడు ప్రాంతీయ నామ బేదాలతో, ముప్పై ఐదు కోపులతో పల్నాటిలో ప్రచారం లోను, విశిష్ట స్థానం లోను ఉంది. ఇందులో గుజరాతి కోలాటం, గోల్కొండ కోలాటం, చీల కర్ర కోలాటం, దసరా కోలాటం, నాటు కోలాటం, బజారు కోలాటం, మురళి కోలాటం అనేవి ప్రాంతీయ కోలాట భేదాలుగా కన్పిస్తున్నాయి. ఎక్కువగా ప్రచారాన్ని పొందడం, ప్రచారం ఎక్కువయినకొద్దీ రూపాంతరాలు ఏర్పడడం అనే జానపదరీతిలోని ముఖ్య లక్షణం[8] ఈ కోలాటంలో కన్పిస్తుంది.

భారత కోలాటంలోని ముప్పైఅయిదు కోపుల్నీ, వాటి గతుల్నీ పూర్తిగా పరిశీలిస్తే తెలుసుకోవడానికి చాలా ఉత్సాహజనకంగా కన్పిస్తాయి. ఈ కోపుల్నీ వాటి గతుల్ని వివరించేముందు ప్రతి కోపులోనూ వచ్చే ముఖ్యవిషయాల్ని చర్చించడం అవసరం. అందులో ముఖ్యంగా ఆటగాళ్ల పేర్లు, ఉద్దులు, వలయాలు, విరామ సమయాలు, స్థానాలు- మొదలయినవి తీసుకోవచ్చు.

ఆటగాళ్ల పేర్లు -

కోలాటంలో గుర్తుకోసం ఆటగాళ్లకు పేర్లు పెడతారు. ఎక్కువచోట్ల సగం మందికి రాముళ్ల (R) నీ, మిగిలిన సగం మందికి లక్ష్మణు (L) లనీ పేర్లు పెడ

---

8. గూ. వ

తారు. దాదాపుగా పల్నాటిలో ప్రతిచోట ఈ పేర్లే వినిపిస్తాయి ఆటలో మొదట ఆటగాళ్లంతా ఒకే వలయంగా నిల్చుంటారు. వలయంలో ఈ పేర్లు ఒకటోస్థానం నుంచి మొదలవుతాయి. బేసి స్థానాల్లో వాళ్లంతా రాముళ్లు, సరిస్థానాల్లో వాళ్లంతా లక్ష్మణులు. అందరూ ఒకే వలయంలో ఉన్నప్పుడు ప్రతి రాముని తరువాత ఒక లక్ష్మణుడు ఉంటాడు కాని ఆట మొదలుపెట్టి ఆటగాళ్లంతా రెండు వలయాలుగా ఏర్పడేటప్పుడు రాముళ్లంతా లోపలి వలయంగాను, లక్ష్మణులంతా వెలుపలి వలయంగాను ఏర్పడతారు. అపుడు లోపలి వలయంలోని రాముళ్లను ఒకటో రాముడు (1.R), రెండో రాముడు (2.R), మూడో రాముడు (3.R) అని వరుసగా పిలుస్తారు అట్లే వెలుపలి వలయంలోని లక్ష్మణులను ఒకటో లక్ష్మణుడు (1.L), రెండో లక్ష్మణుడు (2.L), మూడో లక్ష్మణుడు (3 L) అని వరుసగా పిలుస్తారు. లోపలి వలయంలోని ఒకటో రాముని (1.R) తో వెలుపలి వలయం లోని ఒకటో లక్ష్మణుడు (1. L) కలసి ఉద్దిగా ఏర్పడతారు. అట్లే రెండు, మూడు, నాల్గు రాముళ్లు, రెండు, మూడు, నాల్గు లక్ష్మణులతో కలసి ఉద్దులు. ఇట్లే అందరూ ఏర్పడతారు. ఆటగాళ్లు సామాన్యంగా రాముళ్లు ఒకరకం దుస్తులు, లక్ష్మణులు మరోరంగు దుస్తులు ధరిస్తారు. అయితే దుస్తుల అలంకరణగాని, ఇతర అలంకరణలుగాని ప్రదర్శనరోజు మాత్రమే ఉంటాయి. నేర్చే సమయాల్లో మామూలు దుస్తులే ధరిస్తారు.

ఉద్దులు

ఇద్దరు ఆటగాళ్ళు కలసి ఉద్ది అని పిలువబడుతారు. వీరిలో వెలుపలి వలయంలోని ఆటగాణ్ణి వెలిఉద్దికాడనీ, లోపలి వలయంలోని ఆటగాణ్ణి లోఉద్ది కాడనీ అంటారు. ఆటకు ఉద్దులు ముఖ్యం. ఇద్దరు ఆటగాళ్ళు ఉద్ది కాబట్టి కోలాటంలో ఆటగాళ్ళు సరిసంఖ్యలోనే ఉంటారు.

వలయాలు ·

ప్రార్థనతో ఆటమొదలు పెట్టబడుతుంది. ప్రార్థనకోపులో ఆటగాళ్ళంతా ఒకే వలయంగా ఉంటారు. కాని తర్వాత కోపు నుంచీ ఆట ఆడడం మొదలవుతుంది. అపుడు ఆటగాళ్లు రెండు వలయాలుగా ఏర్పడతారు. వెలుపలి వలయం లేక వెలి వలయం, లోపలి వలయల లేక లో వలయం అని వాటికి పేర్లు. ఆట ఏ గతిలో ఆడుతున్నా వలయం కనపడుతూనే ఉంటుంది. నేర్చే సమయాల్లో

కన్పించే వలయాలకంటే ప్రదర్శనల్లో కన్పించే వలయాలు ప్రత్యేకతను కల్గి ఉంటాయి. అంటే ప్రదర్శనల్లో రాముష్ణ, లక్ష్మణులు వేరువేరు రంగుల దుస్తులు ధరిస్తారు కాబట్టి వెలుపలి వలయం ఒక రంగుతోను, లోపలి వలయం వేరొక రంగుతోను విస్పష్టంగా కన్పిస్తుంది. ఆట ఆడే సమయాల్లో ఆయా రంగులు ఆయా వలయాల్లోనే స్థిరంగా ఉండవు. ఆటగాళ్లు వలయాలు మారుతుంటారు కాబట్టి వలయాల్లో నిర్ణీత గతిననుసరించి రంగులు మారుతుంటాయి.

విరామసమయాలు :

కులుకుల కోలాటంలో పాటకీ పాటకి మధ్యలో విరామం ఉంటుంది. ఒక కోపులోనే రెండు పాటల మధ్యలో ఉండే ఈ విరామ సమయం రెండు నిమిషాల పాటు ఉంటుంది. ఈ విరామ సమయాన్ని తమ అలత తీర్చుకోడానికి వినియోగించుకుంటారు. భారత కోలాటంలో ఒకే కోపులో రెండు పాటల మధ్య విరామ సమయం పెట్టుకోవచ్చు; లేదా విరామ సమయం లేకుండానే కలిపి ఆడవచ్చు. అయితే రెండు కోలాట్లలోను కోపుకీ కోపుకీ మధ్యలో విరామ సమయం ఉంటుంది. అదైనా రెండు నిమిషాలపాటు మాత్రమే. అది అలత తీర్చుకోవడానికే వినియోగిస్తారు. నాలుగైదు కోపులు వేసిన తర్వాత ఒక అరగంటపాటు విరామం తీసుకుంటారు ఈ విరామ సమయంలో చుట్ట, బీడి తాగే అలవాటున్న వాళ్లు అవి తాగుతారు; మంచినీళ్లు తాగుతారు. జట్టువెంట అదనంగా కొందరు ఉంటారు. వారు నీళ్లు, చుట్ట, బీడి మొదలయినవి అందిస్తుంటారు. అవన్నీ వారు ముందుగానే చుట్టుపక్కల ఉన్న దుకాణాల నుంచి గాని, లేదా ఇండ్ల నుంచి కాని సేకరిస్తారు. నీళ్లు తెచ్చిన పాత్రలు ఆట ముగిసిన తర్వాత ఎవరివి వారికిస్తారు. విరామ సమయాల్లో ఆట ఆడేటప్పటి అవకతవకలను గురించి, ఆడవలసిన పద్ధతిలో ఉండే మెలకువలను గురించి చర్చించుకుంటారు. ఆట సరిగా చేతగాని వారిని విరామ సమయాల్లో తొలగించి జట్టువెంట అదనంగా వచ్చిన ఆటగాళ్ళను తీసుకుంటారు. ఆట మధ్యలో ఉత్సాహం తగ్గి ఆట మందకొడిగా ఆడేవారికి, తగిన పద్ధతిలో త్వరితంగా ఆడలేని వారికి తగిన ఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని కల్గించే మాటలు చెప్తుంటారు. శక్తి ఉడిగినా, ఉత్సాహం తగ్గినా, అలసిపోయినా ఈ విరామ సమయాలు ఆటగాళ్ళను ఆదుకొని తగిన శక్తిని ఇచ్చి అలసటను పోగొట్టి, మరలా ఆట ఆడటానికి తగిన ఉత్సాహాన్ని, ప్రోతాహాన్ని కలుగ జేస్తాయి.

స్థానాలు .

కోలాటం ఆడే స్థలాన్ని 'గరిడి' అంటారని లోగడ తెలుసుకున్నాం. ఈ గరిడీలో ఆటగాళ్ళ స్థానాల్ని గుర్తించడం అవసరం. ఈ స్థానాల్ని బేసిస్థానాలు, సరిస్థానాలు అని విభజింపవచ్చు. 1, 3, 5, 7, 9 మొదలయిన బేసి అంకెలకు సరిపోయే స్థానాల్ని బేసిస్థానాలనీ, 2, 4, 6, 8, 10 మొదలయిన సరిఅంకెలకు సరిపోయే స్థానాల్ని సరిస్థానాలనీ అంటారు. ఇవి లోపలి వలయంలోను, వెలుపలి వలయంలోను ఉంటాయి. వెలుపలి వలయంలోని బేసిస్థానంలో ఉన్న ఆటగానికి, ఆ స్థానానికి ఎదురుగా లోపలి వలయంలోని బేసిస్థానంలో ఉన్న ఆటగానితో ఉద్ది. అట్లే వెలుపలి వలయంలోని సరిస్థానంలో ఉన్న ఆటగానికి, అతనికి ఎదురుగా లోపలి వలయంలోని సరిస్థానంలో ఉన్న ఆటగానితో ఉద్ది. ఇట్లు కోలాటంలోని బేసి, సరిస్థానాలు వాటికి తగ్గట్లు ఆటకు తోడ్పడతాయి.

## కోపులు

### 1. ఉద్దితిరుగుడు కోపు.

ప్రార్థనకోపు తర్వాత అన్ని కోలాట భేదాల్లోను ఇది మొట్టమొదటి కోపు. ప్రార్థన ముగిసేదాకా తమతమ నిర్ణీత స్థానాల్లో నిల్చున్న ఆటగాళ్లు ఈ కోపుకు విరుపు మొదలుకాగానే తమ స్థానాలు మార్చుకొని ఉద్దులుద్దులుగా తిరగడం మొదలవుతుంది కాబట్టి దీనిని ఉద్దితిరుగుడు కోపు అంటారు. కొందరు ఈ కోపును ప్రార్థన కోపు కింద చెప్తారు. ఈ కోపులో సామాన్యంగా "భారతదేవిరో నిన్నూ", "రారా ముద్దులగుమ్మాలలనా రాపూరి శెలికాడా'', "పరమపద గోవింద మాదవ", "రామా లాలీ మేగా శ్యామా లాలీ'' అనే పాటలు పాడుతారు.

ఈ కోపులో మొదట బేసిస్థానాల్లోని రాముళ్ళంతా లోపలి వలయంగానూ, సరిస్థానాల్లోని లక్ష్మణులంతా వెలుపలివలయంగానూ ఏర్పడుతారు. ఇట్లా ఏర్పడుతూనే పుల్లలు గలపడం మొదలుపెడతారు.[9] ఆటగాళ్ళు మొత్తం ఇరవై మంది అయినప్పుడు పదిమంది రాముళ్ళు లోపలి వలయానికి, పదిమంది లక్ష్మణులు వెలుపలి వలయానికి వస్తారు. ప్రతి ఆటగాడు మొదట ఉద్దికానితో పుల్ల గలిపి, రెండోదెబ్బ కుడిపక్కకు జరిగి కుడివైపువానిలో కొట్టి, తర్వాత ఎడమ పక్కకు జరిగి మూడోదెబ్బ ఉద్దికానితో కొట్టి మరలా కుడిపక్కకు జరిగి నాల్గోదెబ్బ కొట్టి

---

9. ఒక ఆటగాని కోలాట కర్రలతో మరొక ఆటగాని కోలాట కర్రల్ని కొట్టడాన్ని పుల్ల గలపడం అంటారు. దీనినే దెబ్బకొట్టడం, చిటుకులు వేయడం అని కూడా అంటారు.

చివరగా ఎడమపక్కకు జరిగి ఉద్దికానితో ఐదోదెబ్బ కొట్టి వలయాలుమారుతారు. అంటే వెలుపలి వలయంలోనివారు లోపలి వలయానికి, లోపలి వలయంలోనివారు వెలుపలి వలయానికి వస్తారు. పుల్లగలిపే సమయానికి ఇద్దరు ఆటగాళ్లూ కొద్దిగా ఎదురుగానూ, దగ్గరగాను జరుగుతారు.

అంటే ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి కొంచెం కుడిపక్కకు జరిగి అప్పటికి తనకు ఎదురుగా వచ్చిన పదో లక్ష్మణునితో రెండో దెబ్బ కొట్టి, తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితో గొట్టి, మరలా కొంచెం కుడివైపుకు జరిగి నాల్గోదెబ్బ పదో



లక్ష్మణునితో గొట్టి, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితో గొట్టి లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు ఈ ఐదో దెబ్బ వెలుపలి వలయంలో రామునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి రెండో దెబ్బ అప్పటికి లోపలి వలయంలో చేరి తనకు ఎదురుగా వచ్చిన రెండో లక్ష్మణునితో గొట్టి, తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితో మూడోదెబ్బకొట్టి, తర్వాత మరలా కొంచెం కుడిపక్కకు జరిగి నాల్గోదెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదో దెబ్బ ఉద్దికానితో కొట్టి వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్ళందరూ తమ తమ ఉద్దికాళ్ళతో పుల్లగలిపిన తర్వాత తమ ఉభయ పార్శ్వాల్లో ఉన్న ఎదుటివాళ్ళ కర్రల్ని తాడిస్తూ లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి, వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి తిరుగుతారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఉద్దికాడైన ఒకటో రామునితో గొట్టి, కొంచెం కుడి పక్కకు జరిగి రెండోదెబ్బ రెండో రామునితో గొట్టి, తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడోదెబ్బ ఒకటో రామునితో గొట్టి, మరలా కొంచెం కుడి పక్కకు జరిగి నాల్గో దెబ్బ రెండో రామునితో గొట్టి, చివరగా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రామునితో గొట్టి వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు. ఈ ఐదోదెబ్బ లోపలి వలయంలో ఒకటో లక్ష్మణునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ ఉద్దికానితో గొట్టి, తర్వాత మరలా కొంచెం కుడిపక్కకు జరిగి నాల్గోదెబ్బ పదో రామునితో గొట్టి, తర్వాత మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి ఐదోదెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రామునితో గొట్టి లోపలి వలయం నుంచి మరలా వెలుపలికి వస్తాడు ఇట్లే లక్ష్మణులంతా పుల్లలు కలుపుతూ ఐదోదెబ్బ కొట్టి తమ తమ ఉద్దికాళ్లవద్ద వలయం మారుతారు. ఇట్లే లోపలి వలయంలో చేరిన తర్వాత కూడా ఉభయ పార్శ్వాలు పుల్లలు గలుపుతూ ఐదోదెబ్బకు ఉద్దికానివద్ద పుల్లగొట్టి వలయాలు మారుతారు. పాట అయిపోయేవరకు ఇట్లాగే ఆడుతూ ఉసెత్తులో దీని వేగం పెంచుతారు. దీనినే ఉద్ది తిరుగుడు కోపు అంటారు.

## 2. ఉయ్యాల కోపు

కోలాటం వేస్తూ మధ్యలో ఉయ్యాల ఊపినట్లు చేతులతో అభినయిస్తారు. ఉయ్యాల ఊపులు ఈ కోపులో అభినయిస్తారు కాబట్టి ఈ కోపుకు ఉయ్యాల కోపు అనే పేరు తగి ఉంది. పాట లెగ గొట్టడం, రాముళ్లు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితో గొట్టి కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, మరికొంచెం ఎడమ పక్కకే జరిగి మూడో లక్ష్మణునకు ఎదురుగా రాగానే ఇద్దరు చేతులు ఎదురుగా చాచి ఉయ్యాల ఊగినట్లుగా చేతులు ఊపుతారు. తర్వాత మూడో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు. వెలుపలి వలయానికి వచ్చిన రాముడు మూడో లక్ష్మణునితో ఒకటో దెబ్బ కొట్టి కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, మరికొంచెం ఎడమప్రక్కకు జరిగి తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునకు ఎదురుగా వచ్చి ఇద్దరు కలసి ఉయ్యాల ఊపినట్లుగా చేతులు దగ్గరదగ్గరగా చేర్చి ఊపుతారు. తర్వాత మూడోదెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్ళంతా లోపలి వలయంలో అపసవ్య మార్గంలోను, వెలుపలి వలయంలో సవ్యమార్గంలోను పయనిస్తూ ఆడుతుంటారు. అంటే లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు - నాల్గో లక్ష్మణుని వద్ద, మూడోరాముడు ఐదో లక్ష్మణుని వద్ద, నాల్గో రాముడు ఆరో లక్ష్మణుని వద్ద, ఐదో రాముడు ఏడో లక్ష్మణునివద్ద, ఆరో రాముడు ఎనిమిదో లక్ష్మణుని వద్ద, ఏడో రాముడు తొమ్మిదో లక్ష్మణుని వద్ద, ఎనిమిదో రాముడు పదో లక్ష్మణుని వద్ద, తొమ్మిదో రాముడు ఒకటో లక్ష్మణుని వద్ద, పదో రాముడు రెండో లక్ష్మణుని వద్ద ఉయ్యాల ఊపి పుల్లలు గలిపి మారుతారు. వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు వారివారి ఉద్ది కాళ్ళవద్ద ఉయ్యాల ఊపి, పుల్లలు గలిపి మారుతారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి మరి కొంచెం ఎడమ

పక్కకు జరిగి తొమ్మిదో రామునికి ఎదురుగా వచ్చి ఇద్దరూ కలసి చేతులు చాచి ఉయ్యాల ఊపినట్లుగా చేతులు ఊపి, మూడో దెబ్బ తొమ్మిదో రామునితో పుల్ల గలిపి తర్వాత వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు. లోపలి వలయానికి వచ్చిన లక్ష్మణుడు ఒకటో దెబ్బ తొమ్మిదో రామునితో గొట్టి కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి, మరి కొంచెం ఎడమ పక్కకు జరిగి తన ఉద్దికాడైన ఒకటో రామునికి ఎదురుగా వచ్చి ఇద్దరూ కలసి ఉయ్యాల ఊపినట్లు చేతులు ఊపి తర్వాత మూడో దెబ్బ ఒకటో రాము నితో గొట్టి లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మ




2

ణులు అందరూ వెలుపలి వలయంలో సవ్య మార్గంలోను, లోపలి వలయంలో అపసవ్య మార్గంలోను పయనిస్తూ ఆడుతుంటారు అంటే వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు పదో రాముని వద్ద, మూడో లక్ష్మణుడు ఒకటో రాముని వద్ద, నాల్గో లక్ష్మణుడు రెండో రాముని వద్ద, ఐదో లక్ష్మణుడు మూడో రాముని వద్ద, ఆరో లక్ష్మణుడు నాల్గో రాముని వద్ద, ఏడో లక్ష్మణుడు ఐదో రాముని వద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఆరో రాముని వద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఏడో రాముని వద్ద, పదో లక్ష్మణుడు ఎనిమిదో రాముని వద్ద మారుతారు అట్లే లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్ళవద్ద మారుతారు

ఇట్లు రాముళ్ళు, లక్ష్మణులు వెలుపలి వలయంలో ఎడమ పక్కకు జరుగుతూ సవ్య మార్గంలోను, లోపలి వలయంలో ఎడమ పక్కకే జరుగుతూ అపసవ్య మార్గంలోను చరిస్తూ వలయాలు మారుతూ ఆడుతుంటారు ఇదే పద్ధతిలో ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు. దీనినే ఉయ్యాల కోపు అంటారు.

## 3. ఎరుకల కోపు

'ఎరుకల వారింటా సిన్నదీ' అనే పాట పల్లవిమీద ఏర్పడిందీ కోపు. పాట తెగగొట్టడం, లోపలి వలయానికి రాముళ్ళు, వెలుపలి వలయానికి లక్ష్మణులు రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది ఈ కోపులో గూడ గతి చాలవరకు జంజాలకోపులో ఉన్నట్టు ఉంటుంది.[10]

ఒకటో రాముడు ఒకటో లక్ష్మణునితో పుల్లగలిపి తర్వాత కుడికాలు ఒక అడుగు ముందుకువేసి ముందుకువంగి మోకాలువద్ద తన కర్రలతో తానేకొట్టుకొని తర్వాత వంగిఉండగానే తన రెండు చేతులను కాళ్ళ వెనుకకు పోనిచ్చి (అంటే చేతుల వలయంలో కాళ్ళుంటాయి) కాళ్లవెనుక తన కర్రలతో తానే కొట్టుకొని తర్వాతలేచి ఒకటో లక్ష్మణునితో పుల్లగలిపి లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి వస్తాడు. వెలుపలి వలయంలో రెండో లక్ష్మణునికి ఎదురుగావచ్చి పుల్లగలిపి

10. చూ. పు.,




# 3

తర్వాత మరలా తన కుడికాలు ఒక అడుగు ముందుకువేసి వంగి మోకాలివద్ద తన కర్రలతో తానే కొట్టుకొని, రెండుచేతులు కాళ్ల వెనుకకు పోనిచ్చి కాళ్ళవెనుక తన కర్రలతో తానే కొట్టుకుంటాడు. తర్వాత లేచి ఎడమకాలు ఒక అడుగు ముందుకు వేసి వంగి మోకాలివద్ద తన కర్రలతో తానే కొట్టుకొని, రెండు చేతులను కాళ్ళ వెనుకకు పోనిచ్చి కాళ్లవెనుక కర్రలు కొట్టుకొని లేచి ఎదురుగాఉన్న రెండో లక్ష్మణునితో కొట్టి లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్లందరి చలనం ఉంటుంది. అంతే లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్ది

కాళ్లవద్ద మారురారు. వెలుపలి వలయంనుంచి మరలా లోపలి వలయానికి మారే టప్పుడు రెండో రాముడు మూడో లక్ష్మణునితోను, మూడో రాముడు నాల్గోలక్ష్మ ణునితోను, నాల్గోరాముడు ఐదో లక్ష్మణునితోను, ఐదో రాముడు ఆరో లక్ష్మణుని తోను, ఆరో రాముడు ఏడో లక్ష్మణునితోను, ఏడో రాముడు ఎనిమిదో లక్ష్మణుని తోను, ఎనిమిదో రాముడు తొమ్మిదో లక్ష్మణునితోను, తొమ్మిదో రాముడు పదో లక్ష్మణునితోను, పదో రాముడు ఒకటో లక్ష్మణునితోను పుల్లగలిపి మారుతారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో రామునితో పుల్లగలిపి తన కుడికాలు 'ఒక అడుగు ముందుకువేసి వంగి మోకాళ్లవద్ద తన పుల్లలతో తానే కొట్టుకొని తర్వాత వంగిఉండగానే రెండుచేతులు కాళ్ళవెనుకకు పోనిచ్చి అచట తన కర్ర లతో తానే కొట్టుకొని, లేచి, తర్వాత ఎడమకాలు ముందుకు ఒక అడుగువేసి వంగి మోకాళ్ళవద్ద తన కర్రలలో తానే కొట్టుకొని, తర్వాత వంగిఉండే రెండు చేతులు కాళ్ళవెనుకకు పోనిచ్చి (చేతుల వలయంలో కాళ్ళుంటాయి) కాళ్లవెనుక తన కర్ర లతో తానే కొట్టుకొని లేచి ఒకటో రామునితో పుల్లగలిపి వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి వస్తాడు అపుడు కొంచెం కుడిపక్కకు జరిగి ఎదురుగాఉన్న పదో రామునితో పుల్లగలిపి తన కుడికాలు ఒక అడుగు ముందుకువేసి వంగి మోకాళ్లవద్ద తన కర్రలలో తానే కొట్టుకొని, తర్వాత వంగిఉండగనే తన రెండు చేతులు కాళ్లవెనుకకు పోనిచ్చి (అంటే చేతుల వలయంలోకి కాళ్లను తీసుకొని) కాళ్లవెనుక తన కర్రలతో తానే కొట్టుకొని,లేచి, తర్వాత ఎడమకాలు ఒక అడుగు ముందుకువేసి, వంగి, మోకాలివద్ద తన కర్రలతో తానే కొట్టుకొని,తర్వాత రెండు కాళ్లవెనుకకు రెండు చేతులు పోనిచ్చి (చేతుల వలయంలోకి కాళ్లను తీసికొని) కాళ్లవెనుక తన కర్రలతో తానే కొట్టుకొని, లేచి ఎదుటఉన్న పదో రామునితో పుల్లగలిపి లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే రెండోస్థానం నుంచి పదోస్థానందాకా ఉన్న లక్ష్మణులు, ఒకటో స్థానంనుంచి తొమ్మిదోస్థానం దాకాఉన్న రాములతో పుల్లలుగలిపి వలయాలు మారుతుంటారు. దీన్నే ఎరుకల కోపు అంటారు.

## 4. కలువరాయ కోపు

కలువ అనేది ఒక జల పుష్పం.[11] కలువరాయడు అంటే చంద్రుడు. ఇందులో చంద్రునిలో పోల్చదగిన విషయాలేవి లేవు. ఈ కోపులో పాడే ''కలువ

11. శ.ర., 160.




4

రాయ వుదయ వెన్నెల" అనే పాట పల్లవి ఆధారంగా ఈ కోపు ఏర్పడి ఉండ వచ్చు. పాట తెగ గొట్టడం, రాముళ్లు లోపలి వలయానికి రావడం, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, రామ లక్ష్మణులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో లక్ష్మణునితో ఒకటో దెబ్బ కొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో కొట్టి, తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి మూడో దెబ్బ ఒకటో లక్ష్మణునితో కొట్టి, మరలా ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ రెండో లక్ష్మణునితో కొట్టి, ఇంకా కొంచెం ఎడమ

పక్కకు జరిగి ఐదో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు ఈ అయిదో దెబ్బ ఒకటో రామునికి వెలుపలి వల యంలో ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. వెలుపలి వలయానికి వచ్చిన రాముడు కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి మరలా కొంచెం కుడి పక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి, తర్వాత మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి నాల్గో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, మరికొంచెం ఎడమ పక్కనే జరిగి ఐదో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితో గొట్టి వెలుపలి వలయంనుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్ళంతా ఎడమ, కుడి పక్కలకు జరుగుతూ, పుల్లలు గలుపుతూ ఐదో దెబ్బ కొట్టి లోపలి వలయం నుంచి వెలువలి వలయానికి, అట్లే వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి మారుచూ ఆడుతుంటారు. అంటే లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు నాల్గో లక్ష్మ ణునివద్ద, మూడో రాముడు ఐదో లక్ష్మణునివద్ద, నాల్గోరాముడు ఆరో లక్ష్మణుని వద్ద, ఐదో రాముడు ఏడో లక్ష్మణునివద్ద, ఆరో రాముడు ఎనిమిదో లక్ష్మణుని వద్ద, ఎడో రాముడు తొమ్మిదో లక్ష్మణుని వద్ద, ఎనిమిదో రాముడు పదో లక్ష్మ ణుని వద్ద, తొమ్మిదో రాముడు ఒకటో లక్ష్మణుని వద్ద, పదో రాముడు రెండో లక్ష్మణుని వద్ద మారుతారు. తర్వాత వెలుపలి వలయం నుంచ లోపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్ళవద్ద మారుతారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితోను, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితోను, తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి మూడో దెబ్బ ఒకటో రామునితోను, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ పదో రామునితోను, తర్వాత మరికొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదో దెబ్బ తొమ్మిదో రామునితోను గొట్టి వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి వస్తాడు. ఈ అయిదో దెబ్బ లోపలి వలయంలో ఒకటో లక్ష్మణునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి, తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో రామునితోను, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ పదో రామునితోను, ఇంకొంచెం ఎడమ

పక్కకే జరిగి ఐదో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రామునితోను గొట్టి లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులంతా ఎడమ, కుడి పక్కలకు జరుగుతూ ఐదో దెబ్బ కొట్టి వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి, మరలా లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారుతూ ఆడుతుంటారు. అంటే వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు పదో రాముని వద్ద, మూడో లక్ష్మణుడు ఒకటో రాముని వద్ద, నాల్గో లక్ష్మణుడు రెండో రాముని వద్ద, ఐదో లక్ష్మణుడు మూడో రాముని వద్ద, ఆరో లక్ష్మణుడు నాల్గో రాముని వద్ద, ఏడో లక్ష్మణుడు ఐదో రాముని వద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఆరో రాముని వద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఏడో రాముని వద్ద, పదో లక్ష్మణుడు ఎనిమిదో రాముని వద్ద మారుతారు లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్ల వద్ద మారుతారు.

ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు వెలుపలి వలయంలో ఎడమ పక్కకు జరుగుతూ సవ్యమార్గంలోను, లోపలి వలయంలో ఎడమ పక్కకు జరుగుతూ అపసవ్యమార్గంలోను పయనిస్తూ ఐదోదెబ్బ గొట్టి వలయాలు మారుతూ ఆడుతుంటారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు. దీనినే కలువరాయకోపు అంటారు.

## 5. కంస కోపు

కంసకోపులో పేరుకి కోపుకి సంబంధం కన్పించదు. పాట లెగ గొట్టడం, రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటోదెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో లక్ష్మణునితో రెండో దెబ్బగొట్టి, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి - ఇట్లే కొంచెం కొంచెం ఎడమ పక్కకు జరుగుతూ నాల్గో దెబ్బ నాల్గో లక్ష్మణునితోను, ఐదో దెబ్బ ఐదో లక్ష్మణునితో, ఆరో దెబ్బ ఆరో లక్ష్మణునితోను, ఏడో దెబ్బ ఏడో లక్ష్మణునితోను,




5

ఎనిమిదో దెబ్బ ఎనిమిదో లక్ష్మణునితోను, తొమ్మిదో దెబ్బ తొమ్మిదో లక్ష్మణుని తోను, పదో దెబ్బ పదో లక్ష్మణునితోను గొట్టి పదకొండో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితో గొట్టి లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు. వెలుపలి వలయానికి వచ్చిన ఒకటో రాముడికి ఈ పదకొండో దెబ్బ మరలా ఒకటో దెబ్బగా పరిగణించ బడుతుంది. వెలుపలి వలయంలో కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ లోపలి వలయంలో చేరి అప్పటికి తనకు ఎదురుగా వచ్చిన పదో లక్ష్మణునితోను, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి మూడోదెబ్బ

తొమ్మిదో లక్ష్మణునితోను గొడతాడు. ఇట్లే కొంచెం ఎడమ పక్కకు జరుగుతూ నాల్గో దెబ్బ ఎనిమిదో లక్ష్మణునితోను ఐదో దెబ్బ ఏడో లక్ష్మణునితోను, ఆరో దెబ్బ ఆరో లక్ష్మణునితోను, ఏడో దెబ్బ ఐదో లక్ష్మణునితోను, ఎనిమిదో దెబ్బ నాల్గో లక్ష్మణునితోను, తొమ్మిదో దెబ్బ మూడో లక్ష్మణునితోను, పదో దెబ్బ రెండో లక్ష్మణునితోను, పదకొండో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితోను కొట్టి వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు.

ఇట్లే రాముళ్ళంతా ఎడమ పక్కకు జరుగుతూ మొదట అపసవ్యమార్గం లోను, తర్వాత సవ్యమార్గంలోను పయనిస్తూ వలయాలు మారుతూ ఆడుతుంటారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి కొంచెం కొంచెంగా ఎడమ పక్కకు జరుగుతూ రెండో దెబ్బ పదో రామునితోను, మూడో దెబ్బ తొమ్మిదో రామునితోను, నాల్గోదెబ్బ ఎనిమిదో రామునితోను, ఐదో దెబ్బ ఏడో రామునితోను, ఆరోదెబ్బ ఆరో రామునితోను, ఏడోదెబ్బ ఐదో రామునితోను, ఎనిమిదో దెబ్బ నాల్గో రామునితోను, తొమ్మిదో దెబ్బ మూడో రామునితోను, పదోదెబ్బ రెండో రామునితోను, పదకొండోదెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రాముని తోను కొట్టి వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు ఈ పదకొండో దెబ్బ లోపలి వలయానికి వచ్చిన ఒకటో లక్ష్మణునికి ఒకటో దెబ్బగా పరిగ ణించబడుతుంది. తర్వాత మరలా కొంచెం కొంచెంగా ఎడమ పక్కకు జరుగుతూ రెండో దెబ్బ రెండో రామునితోను, మూడో దెబ్బ మూడో రామునితోను, నాల్గో దెబ్బ నాల్గో రాముని తోను, ఐదో దెబ్బ ఐదో రామునితోను, ఆరో దెబ్బ ఆరో రామునితోను, ఏడో దెబ్బ ఏడో రామునితోను, ఎనిమిదో దెబ్బ ఎనిమిదో రాముని తోను, తొమ్మిదో దెబ్బ తొమ్మిదో రామునితోను, పదో దెబ్బ పదో రామునితోను, పదకొండో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రామునితోను కొట్టి లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులంతా తమ తమ ఎడమ చేతివైపు జరుగుతూ ఎదురుగా వచ్చిన వారితో పుల్లలు గలుపుతూ మొదట సవ్యమార్గంలోను, తర్వాత అపసవ్య మార్గంలోను పయనిస్తూ, వలయాలు మారుతూ ఆడుతుంటారు.

ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు తమ తమ ఎడమ పక్కకు జరుగుతూ వెలు పలి వలయంలో సవ్యమార్గంలోను, లోపలి వలయంలో అపసవ్య మార్గంలోను పయనిస్తూ, ఉద్దికాళ్లవద్ద వలయాలు మారుతూ, ఆడుతుంటారు. ఉసెత్తులో కూడ ఇదే పద్ధతిలో ఆటవేగాన్ని పెంచుతారు. దీనినే కంసకోపు అంటారు.

## 6. కుందనపు కోపు

కుందనం అంటే బంగారం[12] అని అర్థం. పేరు వింటానికి ఇంపుగా ఉంది. ఈ కోపుకీ, కుందనానికి సంబంధం లేదు. పాట తెగగొట్టడం, రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలప డంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో కొట్టి కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ లక్ష్మణునితో కొట్టి, మరి కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితో కొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ నాల్గో లక్ష్మణునితో గొట్టి లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి వస్తాడు. ఈ నాల్గో దెబ్బ వెలుపలి వలయంలో రామునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత వెలుపలి వలయంలోని రాముడు కొంచెం ఎడమ పక్కకు జరిగి, రెండో దెబ్బ లోపలి వలయానికి చేరి తనకు ఎదురుగా వచ్చిన మూడో లక్ష్మణునితోను, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ రెండో లక్ష్మణునితోను, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ ఒకటో లక్ష్మణునితోను కొట్టి వెలుపలి వలయంనుంచి మరలా లోపలి వలయానికి మారుతాడు. ఇట్లే రాముళ్లందరి చలనం ఉంటుంది. అంటే లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు ఐదో లక్ష్మణుని వద్ద, మూడో రాముడు ఆరో లక్ష్మణుని వద్ద, నాల్గో రాముడు ఏడో లక్ష్మణుని వద్ద, ఐదో రాముడు ఎనిమిదో లక్ష్మణుని వద్ద, ఆరో రాముడు తొమ్మిదో లక్ష్మణుని వద్ద, ఏడో రాముడు పదో లక్ష్మణుని వద్ద, ఎనిమిదో రాముడు ఒకటో లక్ష్మణుని వద్ద, తొమ్మిదో రాముడు రెండో లక్ష్మణుని వద్ద, పదో రాముడు మూడో లక్ష్మణుని వద్ద నాల్గో దెబ్బ కొట్టి మారుతారు. అట్లే వెలుపలి వలయంనుంచి మరలా లోపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్ళవద్ద నాల్గో దెబ్బ కొట్టి మారుతారు. ఇట్లు రాముళ్ళు ఎడమ పక్కకు జరుగుతూ మొదట అపసవ్యమార్గంలోను, తర్వాత సవ్యమార్గంలోను పయనిస్తూ ఆడుతుంటారు.

---

12. శ. చ., 340.




# 6

అట్టే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రామునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితోను, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో రామునితోను, మరి కొంచెం ఎడమ పక్కకే జరిగి నాల్గోదెబ్బ ఎనిమిదో రామునితోను గొట్టి వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారుతాడు. ఈ నాల్గో దెబ్బ లోపలి వలయంలో ఒకటో లక్ష్మణునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత లోపలి వలయంలోని ఒకటో లక్ష్మణుడు కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ తొమ్మిదో రామునితోను, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ పదో

రామునితోను, ఇంకా కొంచెం ఎడమ పక్కకే జరిగి నాల్గో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రామునితోను గొట్టి లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణు లందరూ ఎడమ పక్కకు జరుగుతూ మొదట సవ్య మార్గంలోను, తర్వాత అపసవ్య మార్గంలోను పయనిస్తూ ఆడుతుంటారు.

అంటే వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు తొమ్మిదో రాముని వద్ద, మూడో లక్ష్మణుడు పదో రాముని వద్ద, నాల్గో లక్ష్మణుడు ఒకటో రాముని వద్ద, ఐదో లక్ష్మణుడు రెండో రాముని వద్ద, ఆరో లక్ష్మణుడు మూడో రాముని వద్ద, ఏడో లక్ష్మణుడు నాల్గో రాముని వద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఐదో రాముని వద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఆరో రాముని వద్ద, పదో లక్ష్మణుడు ఏడో రాముని వద్ద నాల్గో దెబ్బ కొట్టి మారుతారు. అట్లే లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్ళ వద్ద నాల్గో దెబ్బ కొట్టి మారుతారు.

ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు కొంచెం కొంచెంగా, ఎడమ పక్కకు జరుగుతూ వెలుపలి వలయంలో సవ్య మార్గంలోను, లోపలి వలయంలో అపసవ్య మార్గం లోను పయనిస్తూ, నాల్గో దెబ్బ కొట్టి వలయాలు మారుతూ ఆడుతుంటారు. ఇదే పద్ధతిలో ఉసెత్తుకో ఆట వేగాన్ని తారస్థాయికి పెంచుతారు. దీన్నే కుందనపు కోపు అంటారు.

## 7. కృష్ణకోపు

ఈ కోపులో ఆటగాళ్ల అభినయాలు, కదలికలు కృష్ణుని బాల్యచేష్టల్ని గుర్తుచేసేవిగా ఉంటాయి కాబట్టి కృష్ణకోపు అనే పేరుపడి ఉండవచ్చు. పాట విరవడం, రాముళ్లు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటోదెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండోలక్ష్మణునితో గొట్టి తర్వాత తన కుడికాలు ఎత్తి కాలి కిందుగ పుల్లలతో తానే కొట్టుకొని, అట్లే ఎడమకాలు ఎత్తి కాలికిందుగ తనకు తానే కొట్టుకొని, మూడో దెబ్బ ఎదురుగా ఉన్న రెండో




7

లక్ష్మణునితో గొడతాడు. తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి నాల్గోదెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితో ఎడమ చేతిలోని పుల్లతో రొమ్ములకు సరిఎత్తుగాసూ, కుడిచేతిలోని పుల్లతో వంగి మోకాళ్ల కిందుగాను పుల్లలు గొట్టి లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి వస్తాడు. ఈ నాల్గోదెబ్బ వెలుపలి వలయంలో రామునికి మొదటి దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ లోపలి వలయంలో తనకు ఎదురుగా వచ్చిన పదోలక్ష్మణునితో గొట్టి, తర్వాత కుడికాలు ఎత్తి కాలికిందుగ తనకుతానే పుల్లలు కొట్టుకొని, తర్వాత అట్లే ఎడమకాలు కొంచెం ఎత్తి మోకాలి కిందుగ తనకుతానే

పుల్లలు కొట్టుకొని, మూడోదెబ్బ మరలా పదో లక్ష్మణునితో గొట్టి, తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి నాల్గోదెబ్బ ఒకటో లక్ష్మణునితో మోకాలివద్ద ఒక చేతిలోని పుల్ల (మోకాలికి సరిఎత్తుగా)తోను, రొమ్ములవద్ద మరొక చేతిలోని పుల్లతోను గొట్టె వెలుపలి వలయంనుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్లంతా ఎడమ కుడి పక్కలకు జరుగుతూ నాల్గోదెబ్బ తమతమ ఉద్ది కాళ్ల వద్ద కొట్టి వలయం మారుతూ ఆడుతుంటారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టె కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి తర్వాత తన కుడికాలు ఎత్తి కాలికిందుగ తన కర్రలతో తానే కొట్టుకొని, తర్వాత అట్లే ఎడమకాలు ఎత్తి కాలికిందుగ తనకుతానే పుల్లలు గలుపుకొని మూడోదెబ్బ పదో రామునితో గొట్టి, తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి నాల్గోదెబ్బకు తన ఉద్దికాడైన ఒకటో రామునితో ఎడమ చేతిలోని పుల్లలో రొమ్ములకు సరిఎత్తుగాను, కుడిచేతిలోని పుల్లతో వంగి మోకాళ్లవద్ద పుల్లలుగొట్టి వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు ఈ నాల్గోదెబ్బ లోపలి వలయంలో లక్ష్మణునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ రెండో రామునితో గొట్టి, తర్వాత తన కుడికాలు ఎత్తి కాలికిందుగ తన కర్రలతో తానే గొట్టుకొని, తర్వాత అట్లే ఎడమకాలు ఎత్తి కాలికిందుగ తనకుతానే గొట్టుకొని, మూడోదెబ్బ మరలా రెండో రామునితో గొట్టి, తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి ఉద్దికాడైన ఒకటో రామునితో నాల్గోదెబ్బ ఎడమ చేతిలోని కర్రతో రొమ్ములవద్ద, కుడిచేతిలోని కర్రతో మోకాళ్లవద్ద గొడతాడు తర్వాత లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులంతా ఉద్దికాళ్లతో పుల్లలు గొట్టిన తర్వాత ఎడమ, కుడి పక్కలకు జరుగుతూ నాల్గోదెబ్బ తన ఉద్దికాళ్లతో కొట్టి వలయాలు మారుతూ ఆడుతుంటారు.

ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు ఉద్దికాళ్లతో పుల్లలు గొట్టడం, ఎడమ పక్కకు జరిగి అవతలి వారితో రెండోదెబ్బ కొట్టి, తర్వాత కాళ్ళకిందుగ తమ కర్రలతో తామే కొట్టుకోవడం, తర్వాత అవ్వలి వారితో పుల్లగొట్టి మరలా కుడిపక్కకు జరిగి తమ తమ ఉద్దికాళ్ళతో నాల్గోదెబ్బ కొట్టి వలయాలు మారుతూ ఆడుతుంటారు. ఉసెత్తులో ఇదే పద్ధతిలో ఆట వేగాన్ని తారస్థాయికి పెంచుతారు. దీనినే కృష్ణకోపు అంటారు.

## 8. గారడి కోపు

గారడి అంటే పాములవాడని ఒక అర్థం ఉంది[18] ఈ కోపులో చలనం మెలికలు మెలికలుగా ఉంటుంది కాబట్టి ఈ పేరు కొంతవరకు సరిపోతుంది. పాట విరవడం రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది

ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి వలయం మారి వెలుపలి వలయానికి వస్తాడు. రెండోదెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి మరలా లోపలి వలయానికి వస్తాడు లోపలి వలయంలో మూడో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి, వెలుపలి వలయానికి వచ్చి నాల్గోదెబ్బ నాల్గో లక్ష్మణునితో గొట్టి, మరలా లోపలి వలయానికి వచ్చి ఐదోదెబ్బ ఐదో లక్ష్మణునితో గొట్టి, వెలుపలి వలయానికి వచ్చి ఆరోదెబ్బ ఆరోలక్ష్మణునితోగొట్టి, లోపలి వలయానికి వచ్చి ఏడోదెబ్బ ఏడో లక్ష్మణునితో గొట్టి వెలుపలి వలయానికి వచ్చి ఎనిమిదోదెబ్బ ఎనిమిదో లక్ష్మణునితో గొట్టి, మరలా లోపలి వలయానికి వచ్చి తొమ్మిదోదెబ్బ తొమ్మిదో లక్ష్మణునితో గొట్టి, మరలా వెలుపలి వలయానికి వచ్చి పదో దెబ్బ పదో లక్ష్మణునితో గొడతాడు ఇట్లే వలయాలు మారుతూ వెలుపలి వలయం నుండి రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది, పదో లక్ష్మణుంతో పుల్ల గలుపుతూ, లోపలి వలయం నుంచి ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిదో లక్ష్మణులతో పుల్లలు గలుపుతూ అపసవ్య మార్గంలో పయనిస్తూ ఆడుతుంటారు. అట్లే రాముళ్ళందరూ వలయాలు మారుతూ అపసవ్యమార్గంలో పయనిస్తూ ఆడుతుంటారు. అంటే ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిదో స్థానాలలోని రాముళ్ళు లోపలి వలయంలో ఉన్నప్పుడు ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిదో లక్ష్మణుల తోను, వెలుపలి వలయంలో ఉన్నప్పుడు రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది, పదో లక్ష్మణులతోను పుల్లలు గలుపుతారు. అట్లే రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది, పది స్థానాలలోని రాముళ్ళు లోపలివలయంలో ఉన్నప్పుడు రెండు,నాల్గు, ఆరు, ఎనిమిది పదో లక్ష్మణులతోను, వెలుపలి వలయంలో ఉన్నప్పుడు ఒకటి, మూడు, ఐదు ఏడు, తొమ్మిదో లక్ష్మణులతోను పుల్లలు గలుపుతారు అట్లే ఒకటో లక్ష్మణుడు

---

18. శ.ర., 233.




# 8

ఒకటోదెబ్బ ఒకటో రామునితో గొట్టి లోపలివలయానికి వచ్చి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి, వెలుపలి వలయానికి వచ్చి మూడో దెబ్బ తొమ్మిదో రామునితో గొట్టి, మరలా లోపలివలయానికి వచ్చి నాల్గోదెబ్బ ఎనిమిదో రామునితో గొట్టి, మరలా వెలుపలి వలయానికి వచ్చి ఐదోదెబ్బ ఏడోరామునితో గొట్టి, మరలా లోపలివలయానికి వచ్చి ఆరోదెబ్బ ఆరో రామునితో గొట్టి, వెలుపలి వలయానికి వచ్చి ఏడోదెబ్బ ఐదోరామునితో గొట్టి, లోపలివలయానికివచ్చి ఎనిమిదో దెబ్బ నాల్గోరామునితో గొట్టి, వెలుపలి వలయానికివచ్చి తొమ్మిదోదెబ్బ మూడో రాముని తోను, లోపలి వలయానికి వచ్చి పదోదెబ్బ రెండో రామునితోను గొడరాడు. ఇట్లా సవ్యమార్గంలో తిరుగుతూ ఒక దెబ్బ లోపలి వలయం నుంచి, మరొకదెబ్బ

వెలుపలి వలయంనుండి కొడుతూ ఆడుతుంటాడు ఇట్లే లక్ష్మణులు అందరూ సవ్యమార్గంలో ప్రయనిస్తూ వలయాలు మారుతూ ఆడుతుంటారు. అంటే ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిదో లక్ష్మణులు వెలుపలి వలయంలో ఒకటి,మూడు ఐదు, ఏడు, తొమ్మిదో రాముళ్ళతోను, లోపలి వలయంలో ఉన్నప్పుడు రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది, పదో రాముళ్ళతోను పుల్లలు గలుపుతారు. అట్లే రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది, పదో లక్ష్మణులు వెలుపలి వలయంలో ఉన్నప్పుడు రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది, పదోరాముళ్లతోను, లోపలివలయంలో ఉన్నప్పుడు ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిదో రాముళ్ళతోను, పుల్లలు గలుపుతారు. ఇట్లా పుల్లలు గలుపుతూ సవ్యమార్గంలో ప్రయనిస్తూ ఉంటారు. రాముళ్లు వెలుపలి వలయానికి వచ్చినప్పుడు లక్ష్మణులు లోపలివలయానికి వస్తారు. రాముళ్లు లోపలి వలయానికి వచ్చినపుడు లక్ష్మణులు వెలుపలి వలయానికి వస్తారు. ఇట్లా వల యాలు మారుటూ రాముళ్ళు అపసవ్యమార్గంలో, లక్ష్మణులు సవ్యమార్గంలో పయనిస్తూ ఆడుతుంటారు. ఉసెత్తులో ఆటవేగాన్ని పెంచుతారు. దీనినే గారడి కోపు అంటారు.

## 9. చదరంగం కోపు

చదరంగం అనేది ఒక ఆట. రథ,గజ, తురగ పదాతి దళాలతో కూడింది చతురంగ వ్యూహం అంటారు. ఈ నాల్గురకాల పావులతో తయారుచేసింది చదరంగం. చదరంగం కోపులో గూడ ప్రతిచోట నాల్గు స్థానాలు కలుస్తూ చద రంగా కన్పిస్తుంది. పాట తెగగొట్టడంతో ఆటగాళ్లు నాల్గు వలయాలుగా ఏర్పడ తారు. సామాన్యంగా ఈ కోపులో పదహారుమందిగాని, ముప్పై రెండు మందిగాని ఆడులారు. ఈ కోపులో ఒకే సంఖ్యగలవాళ్లు ఇద్దరుంటారు. ముప్పైరెండు మందిని తీసుకుంటే నాల్గు వలయాల్లో ఒక్కొక్క దానిలో ఎనిమిది స్థానాలు ఉంటాయి. ఒకటో రాముళ్లు ఇద్దరు, రెండోరాముళ్లు ఇద్దరు ఇట్లే ఇద్దరిద్దరు రాముళ్ళు చొప్పున, ఒకటో లక్ష్మణులు ఇద్దరు, రెండో లక్ష్మణులు ఇద్దరు ఇట్లె ఇద్ద రిద్దరు లక్ష్మణుల చొప్పున సరి సంఖ్యగల రామలక్ష్మణులు ఉంటారు. పాట తెగగొట్టగనే ఒకటి, మూడు వలయాలలోకి రాముళ్లు, రెండు, నాల్గు వలయాల లోకి లక్ష్మణులు చేరుతారు. గుర్తుకోసం పేర్కొను ఒకటో వలయం ఒకటో రాముడు, రెండో వలయం ఒకటో లక్ష్మణుడు,మూడో వలయం ఒకటో రాముడు,




# 9

నాల్గో వలయం ఒకటో లక్ష్మణుడు అనీ, ఒకటో వలయం రెండో రాముడు, రెండో వలయం రెండో లక్ష్మణుడు, మూడో వలయం రెండో రాముడు, నాల్గో వలయం రెండో లక్ష్మణుడు మొదలయినవిధంగా చెప్పవచ్చు. ఒకటో వలయం రాముళ్లు రెండో వలయం లక్ష్మణులతోనూ; మూడో వలయం రాముళ్లు నాల్గో వలయం లక్ష్మణులతోను పుల్లలు గలపడంతో ఆట మొదలవుతుంది. ఒకటో వలయం ఒకటో రాముడు రెండో వలయం ఒకటో లక్ష్మణునితో పుల్ల గలిపి ఒకటో వలయం నుంచి రెండో వలయానికి వస్తాడు. రెండో వలయంలోని ఒకటో లక్ష్మణుడు ఒకటో వలయానికి వస్తాడు. అట్లే మూడో వలయం ఒకటో రాముడు

నాల్గో వలయం ఒకటో లక్ష్మణునితో పుల్ల గలిపి తర్వాత నాల్గో వలయానికి వెళతాడు. నాల్గో వలయం ఒకటో లక్ష్మణుడు మూడో వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్లు, లక్ష్మణులు వలయాలు మారుతారు. రెండో వలయానికి చేరిన ఒకటో వలయం ఒకటో రాముడు రెండో వలయందాటి, మూడో వలయం నాల్గో వలయాలలో ఒకటో స్థానాల గుండా పయనించి, కొంచెం కుడిపక్కకు జరిగి నాల్గో వలయం రెండో స్థానానికి చేరుతాడు. తర్వాత మూడో వలయం, రెండో వలయం, ఒకటో వలయాలలో రెండో స్థానాల గుండా పయనించి ఒకటో వలయం మూడో స్థానానికి చేరుతాడు. అచటి నుంచి రెండో వలయం, మూడో వలయం, నాల్గో వలయాలలో మూడో స్థానాలలో పయనిస్తూ నాల్గో వలయం నాల్గో స్థానానికి చేరుతాడు. తర్వాత మూడో వలయం, రెండో వలయం, ఒకటో వలయాలలో నాల్గో స్థానాలలో పయనిస్తాడు. అప్పటిదాకా ఒకటో రాముని చలనం అపసవ్యమార్గంలో ఉంటుంది. అచ్చట నుంచి వెనుదిరిగి మరలా రెండో వలయం, మూడో వలయం, నాల్గో వలయాలలో నాల్గో స్థానాల గుండా పయనించి, సవ్యమార్గంలో చరిస్తూ నాల్గో వలయం మూడో స్థానానికి చేరుతాడు, అచట నుంచి మూడో వలయం, రెండో వలయం, ఒకటో వలయాలలో మూడో స్థానాలలో పయనించి ఒకటో వలయంలో రెండో స్థానం చేరుతాడు. అచ్చట నుంచి రెండో వలయం, మూడో వలయం, నాల్గో వలయాలలో రెండో స్థానాల గుండా పయనించి నాల్గో వలయం ఒకటో స్థానం చేరుతాడు. అచట నుంచి మూడో వలయం, రెండో వలయాలలో ఒకటో స్థానాల గుండా పయనించి తన స్థానమైన ఒకటో వలయం ఒకటో స్థానం చేరుతాడు. అప్పటికి తన ఉద్దికాడైన రెండో వలయం ఒకటో లక్ష్మణుడు నాల్గు వలయాలలో ఇట్లే పయనించి తిరిగి అచటికి చేరుతాడు. మూడో వలయం ఒకటో రాముడు కూడా ఇదే పద్ధతిలో ఇదే మార్గంలో పయనించి తన స్వస్థానం చేరుతాడు. ఒకటి, మూడు వలయాలలోని బేసి స్థానాల రాముళ్ళు అంటే ఒకటి, మూడు, ఐదు, ఏడు స్థానాల రాముళ్ళు మొదట అపసవ్య మార్గంలోను తర్వాత సవ్యమార్గంలోను పయనిస్తూ తమతమ స్థానాలు చేరుతారు.

కాని రెండో స్థానం రాముళ్ళు మొదట సవ్య మార్గంలోను, తర్వాత అప సవ్యమార్గంలోను పయనించి తమ స్థానాలు చేరుతారు. అంటే ఒకటో వలయం రెండో రాముడు రెండోవలయం రెండో లక్ష్మణునితో పుల్లగలిపి అచట నుంచి రెండోవలయం, మూడోవలయం, నాల్గోవలయాలలో రెండో స్థానాలగుండా పయనించి అచటనుంచి సవ్యమార్గంలో పయనించి నాల్గోవలయం ఒకటో స్థానానికి చేరుతాడు. అచట నుంచి మూడో వలయం, రెండో వలయం, ఒకటో వలయాలలో ఒకటో స్థానాలగుండా పయనించి ఒకటో వలయంలో ఎనిమిదో స్థానం చేరుతాడు. అచటి నుంచి రెండోవలయం, మూడోవలయం, నాల్గో వలయాలలో ఎనిమిదో స్థానాలలో పయనించి నాల్గో వలయంలో ఏడో స్థానానికి చేరుతాడు. అచటి నుంచి మూడోవలయం, రెండో వలయాలలో ఏడో స్థానాలలో పయనించి ఒకటో వలయం ఏడో స్థానం చేరుతాడు అచ్చటినుంచి వెనుకకు తిరుగుతాడు. అంటే రెండో వలయం, మూడో వలయాలలో ఏడో స్థానాలలో మరలా పయనించి నాల్గోవలయం ఏడో స్థానం చేరుతాడు. అచటి నుంచి అపసవ్య మార్గంలో పయనిస్తాడు. అంటే మరలా నాల్గో వలయం ఎనిమిదో స్థానం చేరుతాడు. అచటి నుంచి మూడోవలయం, రెండోవలయం, ఒకటో వలయాలలో ఎనిమిదో స్థానాలగుండా పయనించి, ఒకటో వలయం ఒకటో స్థానం చేరుతాడు. అచటి నుంచి రెండో వలయం, మూడోవలయం, నాల్గో వలయాలలో ఒకటో స్థానాలలో పయనించి నాల్గోవలయం రెండో స్థానానికి చేరుతాడు. అచటినుంచి మూడోవలయం, రెండో వలయాలలో రెండో స్థానాలగుండా పయనించి తన స్వస్థానమైన ఒకటో వలయం రెండో స్థానానికి చేరుతాడు ఇట్లే మూడో వలయం రెండో రాముని చలనం ఉంటుంది ఇట్లు సరిసంఖ్యగల స్థానాలలోని రాముళ్ళు అంటే రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది స్థానాల రాముళ్ళు మొదట సవ్యమార్గంలోను, తర్వాత అపసవ్య మార్గంలోను పయనిస్తారు. ప్రతిచోట ఎదురుగా వచ్చిన లక్ష్మణులతో పుల్లలు గలుపుతారు. నాల్గు వలయాలలో పదహారు స్థానాలు తిరుగుతారు. రాముళ్ళ చలనం వెలుపలి వలయాల వైపుకు ఉంటుంది.

అట్లే రెండో వలయం ఒకటో లక్ష్మణుడు ఒకటో వలయం ఒకటో రాముడితో పుల్ల గలిపి ఒకటో వలయానికి చేరుతాడు. అచటి నుంచి సవ్య మార్గంలో పయనిస్తూ ఒకటో వలయం ఎనిమిదో స్థానం చేరుతాడు అచ్చటి నుంచి రెండో

వలయం, మూడో వలయం, నాల్గో వలయాలలో ఎనిమిదో స్థానాల గుండా పయనించి నాల్గో వలయం ఏడో స్థానానికి చేరుతాడు. అచటి నుంచి మూడో వలయం, రెండో వలయం, ఒకటో వలయాలలో ఏడో స్థానాల గుండా పయనించి, ఒకటో వలయం ఆరో స్థానం చేరుతాడు. అచటి నుంచి రెండు, మూడు వలయాలలో ఆరో స్థానాల గుండా పయనించి నాల్గో వలయం ఆరో స్థానానికి చేరుతాడు. అచ్చటి నుంచి వెనుకకు తిరిగి అప్పటిదాకా తాను పయనించిన స్థానాల గుండా వెళ్ళి తన స్వస్థానం చేరుతాడు. అంటే నాల్గో వలయం ఆరో స్థానం నుంచి మరలా మూడో వలయం, రెండో వలయం, ఒకటో వలయాలలో ఆరో స్థానాల గుండా అపసవ్య మార్గంలో పయనించి ఒకటో వలయం ఏడో స్థానం చేరుతాడు. అచటి నుంచి రెండో వలయం, మూడో వలయం, నాల్గో వలయాలలో ఏడో స్థానాల గుండా పయనించి నాల్గో వలయం ఎనిమిదో స్థానం చేరుతాడు. అచటి నుంచి మూడో వలయం, రెండో వలయం, ఒకటో వలయాలలో ఎనిమిదో స్థానాలలో పయనించి ఒకటో వలయం ఒకటో స్థానంగుండా తన స్వస్థానమైన రెండో వలయం ఒకటో స్థానం చేరుతాడు. ఇట్లే రెండు, నాల్గు వలయాలలోని బేసి స్థానాల లక్ష్మణులు అంటే ఒకటి, మూడు, ఐదు, ఏడు స్థానాలలోని లక్ష్మణులు మొదట సవ్యమార్గం లోను, తర్వాత అపసవ్యమార్గంలోను పయనిస్తూ పదహారు స్థానాల దాకా వెళ్ళి తిరికి స్వస్థానం చేరుతారు అన్ని స్థానాల వద్ద ఎదురుగా వచ్చిన రాముళ్ళతో పుల్లలు గలుపుతూ చరిస్తుంటారు. కాని రెండో స్థానం లక్ష్మణుడు మొదట అప సవ్యమార్గంలోను, తర్వాత సవ్యమార్గంలోను పయనిస్తాడు. అంటే రెండో వలయం నుంచి ఒకటో వలయానికి చేరి అచటినుంచి అపసవ్యమార్గంలో పయనిస్తూ ఒకటో వలయం మూడో స్థానం చేరుతాడు. అచట నుంచి రెండో వలయం, మూడో వలయం, నాల్గో వలయాలలో మూడో స్థానాల గుండా నాల్గో వలయం నాల్గో స్థానానికి చేరి, అచటినుంచి మూడు, రెండు, ఒకటో వలయాలలో నాల్గో స్థానాల గుండా పయనిస్తూ ఒకటో వలయం ఐదో స్థానానికి చేరుతాడు. అచటినుంచి రెండు మూడు వలయాలలో ఐదో స్థానాల గుండా పయనించి నాల్గో వలయం ఐదో స్థానం చేరుతాడు. అచటి నుంచి వెనుకకు తిరుగుతాడు. అప్పటి వరకు తాను చరించిన మార్గంలోనే తిరిగి పయనిస్తాడు. అంటే మరలా మూడు, రెండు, ఒకటో వలయాలలో ఐదో స్థానాల గుండా పయనించి ఒకటో వలయం నాల్గో స్థానం చేరుతాడు. అచటినుంచి రెండో వలయం,

మూడో వలయం, నాల్గో వలయాలలో నాల్గో స్థానాం గుండా పయనించి నాల్గోవలయం మూడో స్థానానికి చేరుతాడు. అచటనుంచి మూడో వలయం, రెండో వలయం, ఒకటో వలయాలలో మూడో స్థానాలగుండా పయనించి, ఒకటో వలయం రెండో స్థానానికి చేరి, అచటనుంచి తన స్థానానికి చేరుతాడు. ఇట్లే సరి స్థానాలైన రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది స్థానాలలోని లక్ష్మణులు మొదట అపసవ్యమార్గంలోను, తర్వాత సవ్యమార్గంలోను పయనిస్తూ ఆడుతుంటారు. పదారు స్థానాలదాకా వెళ్ళుతూ మధ్యలో రాముళ్లతో పుల్లలు గలుపుతూ తిరిగి అదే మార్గంలో వెనుదిరిగి పయనిస్తూ తమ స్థానాలు చేరుతారు.

ఇట్లు మొదట బేసి స్థానాలలోని రాముళ్ళు అపసవ్యమార్గంలోను, తర్వాత సవ్యమార్గంలోను, లక్ష్మణులు మొదట సవ్యమార్గంలోను, తర్వాత అపసవ్య మార్గంలోను పయనిస్తుంటారు. అట్లే సరి స్థానాలలోని రాముళ్లు మొదట సవ్య మార్గంలోను, తర్వాత అపసవ్యమార్గంలోను, లక్ష్మణులు మొదట అపసవ్య మార్గంలోను తర్వాత సవ్యమార్గంలోను పయనిస్తూ నాల్గు వలయాలలో వలయా నికి నాల్గు స్థానాల చొప్పున దాటుతూ వెళ్లి తిరిగి స్వస్థానం చేరుతారు. ఈ నాల్గు వలయాలు, పదారు స్థానాలు చదరంగాన్ని గుర్తుచేస్తాయి. ఈ కోపు చాలా కష్టంతో కూడుకుంది. దీనికి జడకోపువలె శిక్షణ ఎక్కువ అవసరం. శిక్షణ చాలకపోయినా కోపు వేయడం కష్టంగా ఉంటుంది. ఉసెత్తులో వేగాన్ని పెంచి ఇదే పద్ధతిలో ఆడుతారు. దీనినే చదరంగం కోపు అంటారు.

## 10. చిన్న కత్తెర కోపు

కత్తెర అనేది కత్తిరించడానికి ఉపయోగించే ఒక వస్తువు, కత్తెర కోపులో ఆటగాళ్లు వెనుకకు ముందుకు జరగడంవల్ల ఏర్పడే గతి కత్తెరను పోలిఉంటుంది కాబట్టి ఈ పేరు తగి ఉంది. పాట ఎగగొట్టడం, రాముళ్లు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఒడ్డులు పుల్లలు గలపడంలో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచం ఎడమ పక్కకు జరిగి రెండోదెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, మరలా కొంచెం

అట్లే లక్ష్మణుల చలనంకూడా ఉంటుంది అంటే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి పదో రామునితో పుల్లగలిపి, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి మూడోదెబ్బ తొమ్మిదో రామునితో గొడతాడు. తర్వాత కుడిపక్కకుజరిగి పదోరామునితోను, మరికొంచెం కుడిపక్కకు జరిగి తన ఉద్దికాడైన ఒకటో రామునితోను పుల్లలు గలిపి, మరలా మొదటి వలెనే ఎడమ పక్కకు చరిస్తాడు. ఇట్లా లక్ష్మణుడు ఎడమ, కుడిపక్కలకు జరుగుతూ మూడో దెబ్బ కొట్టి మరలా వెనుకకు జరుగుతూ ఆడుతుంటాడు. లక్ష్మణులంతా ఇట్లే ఆడుతుంటారు. ఉసెత్తులో ఆటవేగాన్ని పెంచుతారు. దీనినే చిన్న కత్తెర కోపు అంటారు.

## 11. చిన్న చెలియ కోపు

కోలాటంలో శృంగారంతో కూడిన పాటలు ఎక్కువగా ఉంటాయి. స్త్రీ పురుషుల పరంగా ఏవో కొన్ని పేర్లతో కొన్ని కోపులు వెలశాయి. అలాంటిదే చిన్న చెలియ కోపు. దీనికే 'సమఎత్తు కోపు' అనే పేరుంది. పాట తెగగొట్టడం, రాముళ్లు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు. ఈ మూడో దెబ్బ వెలుపలి వలయంలో ఒకటో రామునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితో గొట్టి వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్లందరూ ఎడమ పక్కకు జరుగుతూ మూడో ఆటగాని వద్ద వలయం మారుతారు. అంటే లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు నాల్గో లక్ష్మణునివద్ద, మూడో రాముడు ఐదో లక్ష్మణుని వద్ద, నాల్గో రాముడు ఆరో లక్ష్మణుని వద్ద, ఐదో రాముడు ఏడో లక్ష్మణుని వద్ద, ఆరో రాముడు




**11**

ఎనిమిదో లక్ష్మణుని వద్ద, ఏడో రాముడు తొమ్మిదో లక్ష్మణునివద్ద, ఎనిమిదో రాముడు పదో లక్ష్మణునివద్ద, తొమ్మిదో రాముడు ఒకటో లక్ష్మణుని వద్ద, పదో రాముడు రెండో లక్ష్మణునివద్ద మారుతారు. వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి మారేటప్పుడు వారి వారి ఉద్దికాళ్ల వద్ద మారుతారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండోదెబ్బ పదోరామునితో గొట్టి, ఇంకాకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో రామునితో గొట్టి వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి వస్తాడు. ఈ మూడోదెబ్బ లోపలి వలయంలో లక్ష్మణునికి

ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ పదో రామునితో గొట్టి, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడోదెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రామునితో గొట్టి లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు ఇట్లే లక్ష్మణులంతా తమ తమ ఎడమ పక్కకు జరుగుతూ మూడో దెబ్బగొట్టి వలయాలు మారుతుంటారు అంటే వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు పదో రామునివద్ద, మూడో లక్ష్మణుడు ఒకటోరామునివద్ద, నాల్గో లక్ష్మణుడు రెండో రామునివద్ద, ఐదో లక్షణుడు మూడో రామునివద్ద, ఆరో లక్ష్మణుడు నాల్గో రామునివద్ద, ఏడో లక్ష్మణుడు ఐదోరామునివద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఆరో రామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఏడో రామునివద్ద, పదోలక్ష్మణుడు ఎనిమిదో రామునివద్ద మారుతారు. ఇట్లే లోపలి వలయంనుంచి మరలా వెలుపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్లవద్ద మారుతారు.

ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు వెలుపలి వలయంలో తమ ఎడమ పక్కకు జరుగుతూ సవ్యమార్గంలోను, లోపలి వలయంలో తమ ఎడమ పక్కకు జరుగుతూ అపసవ్యమార్గంలోనూ పయనిస్తూ మూడోదెబ్బ కొట్టి వలయాలు మారుతుంటారు. ఈ సెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు. దీనినే చిన్న చెలియకోపు అంటారు.

## 12. చుక్కల కోపు

కోలాటం వేస్తూ చుక్కలను చూస్తున్నట్లు ఆకాశం వైపు చూడడం ఈ కోపులోని విశేషం. కాబట్టి చుక్కల కోపు అనే పేరు స్థిరపడి ఉండవచ్చు. పాట తెగగొట్టడం, రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం; ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, ఆతనికి ఎదురుగా నిలబడి ఎడమ చేయి నడుముకు ఆనించి కుడిచేతిలోని కర్రతో కుడి కాలుపై మోకాలి వద్ద, నడుము వద్ద, తలకిపైన తాళానికి అనువుగా కర్రను ఊరకే ఊపుతాడు. తలపైన ఊపినపుడు కర్రల కొనలు చుక్కల వైపుకు చూపిస్తుంటాడు. తర్వాత ఎడమ చేతి కర్రతో గూడ ఎడమ కాలిపైన, మోకాలి




**12**

వద్ద, నడుము వద్ద, తలకి పైన ఊపుతాడు. ఆ సమయంలో కుడి చేయిని నడుముకు ఆనించి ఉంచుతాడు. తర్వాత ఒకటో లక్ష్మణునితో రెండో దెబ్బ కొట్టి వెలపలి వలయానికి వస్తాడు. తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి రెండో లక్ష్మణునికి ఎదురుగా వచ్చి మరలా ఎడమ చేయి నడుముకు ఆనించి కుడి చేతిలోని కర్రతో కుడికాలు మీద, మోకాలి వద్ద, నడుము వద్ద, తలకి పైన తాళాని కనువుగా కర్రను ఊరకే ఊపుతాడు. తర్వాత కుడి చేతిని నడుముకు ఆనించి ఎడమ చేతిలోని కర్రతో ఎడమ కాలిమీద, మోకాలి వద్ద, నడుము వద్ద, తలకి పైన తాళాని కనువుగా కర్రను ఊపుతాడు. తర్వాత రెండో లక్ష్మణునితో పుల్ల

గొట్టి వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాము ళ్లందరి అభినయం, చలనం ఉంటుంది. అంటే లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రాముళ్లంతా తమ తమ ఉద్ది కాళ్ళ వద్ద మారుతారు. వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు మూడో లక్ష్మణుని వద్ద, మూడో రాముడు నాల్గో లక్ష్మణుని వద్ద, నాల్గో రాముడు ఐదో లక్ష్మణుని వద్ద, ఐదో రాముడు ఆరో లక్ష్మణుని వద్ద, ఆరో రాముడు ఏడో లక్ష్మణుని వద్ద, ఏడో రాముడు ఎనిమిదో లక్ష్మణుని వద్ద, ఎనిమిదో రాముడు తొమ్మిదో లక్ష్మణుని వద్ద, తొమ్మిదో రాముడు పదో లక్ష్మణుని వద్ద, పదో రాముడు ఒకటో లక్ష్మణుని వద్ద మారుతారు.

అట్లే లక్ష్మణుల చలనం గూడ ఉంటుంది. అంటే ఒకటో లక్ష్మణుడు ఒకటో రామునితో పుల్లగలిపి, తర్వాత ఎడమచేతిని నడుముకు ఆనించి కుడిచేతి లోని కర్రను కుడికాలుమీద, మోకాలివద్ద, నడుమువద్ద, తలకి పైన ఊరకే ఊపుతాడు. తర్వాత కుడిచేయి నడుముకు ఆనించి ఎడమచేతిలోని కర్రను ఎడమకాలు మీద, మోకాలివద్ద, నడుమువద్ద, తలకిపైన పూరకే ఊపుతాడు. ఈ కర్ర కొన తలపైన ఊపేటప్పుడు ఆకాశంవైపు చూపిస్తాడు తర్వాత ఒకటో రామునితో పుల్లగలిపి వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు. లోపలి వలయంలో కొంచెం కుడిపక్కకు జరిగి పదోరామునికి ఎదురుగా నిల్చొండి ఎడమచేతిని నడుముకు ఆనించి, కుడిచేతిలోని కర్రను కుడికాలిపై మోకాలిమీద, నడుమువద్ద, తలకిపైన కర్ర ఊపుతాడు. తర్వాత కుడిచేతిని నడుముకు ఆనించి ఎడమచేతిలోని కర్రను ఎడమకాలిపై మోకాలివద్ద, నడుమువద్ద, తలకిపైన ఊపుతాడు తర్వాత పదోరామునితో పుల్లగలిపి లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు ఇట్లే లక్ష్మణులంతా చరిస్తుంటారు. అంటే వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి మారేటప్పుడు లక్ష్మణులంతా తమ తమ ఉద్దికాళ్ల వద్ద మారుతారు. లోపలి వలయంనుంచి మరలా వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు ఒకటో రామునివద్ద, మూడో లక్ష్మణుడు రెండో రామునివద్ద, నాల్గో లక్ష్మణుడు మూడో రామునివద్ద, ఐదో లక్ష్మణుడు నాల్గో రామునివద్ద, ఆరో లక్ష్మణుడు ఐదో రామునివద్ద, ఏడో లక్ష్మణుడు ఆరో రామునివద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఏడో రామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఎనిమిదో రామునివద్ద, పదో లక్ష్మణుడు తొమ్మిదో రామునివద్ద మారుతారు.

ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు మొదట ఎడమచేతిని నడుముకు ఆనించి కుడి చేతిలోని కర్రను కుడికాలిపై మోకాలివద్ద, నడుమువద్ద, తలకిపైన పూరకే ఊపుతారు. తర్వాత కుడిచేతిని నడుముకు ఆనించి, ఎడమ చేతిలోని కర్రను ఎడమ కాలిపై మోకాలివద్ద, నడుమువద్ద, తలకిపైన ఊపుతారు. తలకిపైన కర్ర ఊపేటప్పుడు కర్ర మొనలు ఆకాశంవైపు చూపిస్తారు తర్వాత వలయం మారుతారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు. దీనినే చుక్కలకోపు అంటారు.

## 13. చుట్టుకోపు

ఈ కోపులో ఆటగాళ్ళు వలయంచుట్టూ తిరుగుతారు. కాబట్టి చుట్టుకోపు అనేపేరు తగివుంది. పాట తెగగొట్టడం, లోపలి వలయానికి రాముళ్ళు, వెలుపలి వలయానికి లక్ష్మణులు రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటోదెబ్బ ఒకటో లక్ష్మణునితోగొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండోదెబ్బ రెండో లక్ష్మణునితో గొడతాడు. ఇట్లె కొంచెం కొంచెం ఎడమపక్కకు జరుగుచూ మూడోదెబ్బ మూడో లక్ష్మణునితోను, నాల్గోదెబ్బ నాల్గో లక్ష్మణునితోను, ఐదోదెబ్బ ఐదో లక్ష్మణునితోను, ఆరోదెబ్బ ఆరో లక్ష్మణునితోను, ఏడోదెబ్బ ఏడో లక్ష్మణునితోను, ఎనిమిదోదెబ్బ ఎనిమిదో లక్ష్మణునితోను తొమ్మిదోదెబ్బ తొమ్మిదో లక్ష్మణునితోను, పదోదెబ్బ పదో లక్ష్మణునితోను, పదకొండోదెబ్బ మరలా తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితోను గొడతాడు. ఇట్లే మరలా ఎడమవైపుకు జరుగుతూ, ఎదురుగా వచ్చిన లక్ష్మణులతో పుల్లలు గలుపుతూ ఆడుతుంటాడు. ఇట్లే రాముళ్లందరు ఎడమపక్కకు జరుగుతూ ఎదురుగా వచ్చిన లక్ష్మణులతో పుల్లలుగొడుతూ అపసవ్యమార్గంలో పయనిస్తూ ఆడుకుంటారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటోదెబ్బ ఒకటో రామునితోగొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ పదోరామునితో గొట్టి, కొంచెం కొంచెం ఎడమ పక్కకు జరుగుతూ మూడోదెబ్బ తొమ్మిదో రామునితోను, నాల్గోదెబ్బ ఎనిమిదో రామునితోను, ఐదోదెబ్బ ఏడో రామునితోను, ఆరోదెబ్బ ఆరో రామునితోను, ఏడో




13

దెబ్బ ఐదో రామునితోను, ఎనిమిదోదెబ్బ నాల్గో రామునితోను, తొమ్మిదోదెబ్బ మూడో రామునితోను, పదోదెబ్బ రెండో రామునితోను పదకొండోదెబ్బ మరలా ఒకటో రామునితోను గొడతాడు ఇట్లే కొంచెం కొంచెం ఎడమపక్కకు జరుగుతూ ఎదురుగా వచ్చిన రాముళ్లతో పుల్లలుగలుపుతూ ఆడుతుంటాడు. ఇట్లే లక్ష్మణు లంతా సవ్యమార్గంలో తమ ఎడమపక్కకు జరుగుతూ ఎదురుగా వచ్చిన రాముళ్లతో పుల్లలు గలుపుతూ ఆడుతుంటారు.

ఇట్లు రాముళ్ళు లోపలి వలయంలోను, లక్ష్మణులు వెలుపలి వలయంలోను తమ తమ ఎడమపక్కకు జరుగుతూ ఎదురుగా వచ్చిన ఆటగానితో పుల్లలు గలుపుతూ రాముళ్ళు అపసవ్యమార్గంలోను, లక్ష్మణులు సవ్యమార్గంలోను పయనిస్తూ ఆడుతుంటారు. ఉసెత్తులో ఆటవేగాన్ని పెంచుతారు దీనినే చుట్టుకోపు అంటారు.

## 14. చెలియ జడకోపు

జట్టు నాయకులలో తెలివైనవాళ్లు జడకోపులో భేదం సృష్టించారు.[14] ఈ భేదానికి చెలియ జడకోపు అని పేరు పెట్టారు ఈ కోపులో 12, 18, 24, 30 సంఖ్యల్లో మాత్రమే ఆటగాళ్లు ఉండాలి. బేసి సంఖ్య అసలే పనికిరాదు. ఇవిగాక ఇతర సరిసంఖ్య లయిన 10, 14, 16, 20 మొదలయినవి కూడా పనికిరావు. ఎందుచేతనంటే ప్రతి ఒక్క ఆటగాడు రెండేసి స్థానాల చొప్పున దాటుతూ చివరకు తన స్థానం చేరాలి. అట్లాంటప్పుడు సరిగ్గా తన స్థానం చేరడానికి వీలయ్యే సంఖ్య కావాలి ఉదాహరణకు పన్నెండు మంది ఆటగాళ్ళను తీసుకుందాం. అపుడు జడ వేయడానికి చెక్కకు కట్టిన తాళ్ళు పదమూడు ఉండాలి, చెక్క కట్టడంలోను, తాళ్ళు కట్టడంలోను, గరిడి ఏర్పాటులోను జడకోపులో మాదిరిగానే ఉంటుంది. ఆటగాళ్ళంతా ఒకే వలయంగా ఏర్పడతారు బేసి స్థానాలయిన ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిది, పదకొండు స్థానాలలో రాముళ్ళు; సరి స్థానాలయిన రెండు, నాల్గు, ఆరు, ఎనిమిగి, పది, పన్నెండు స్థానాలలో లక్ష్మణులు చేరుతారు. 1—12, 11—10, 9—8, 7—6, 5—4, 3—2 స్థానాల ఆటగాళ్ళు పుల్లలు గలపడంతో ఆట మొదలవుతుంది ఇది మొదటిదెబ్బ. తర్వాత 1—2, 3—4, 5—6, 7—8, 9—10, 11—12 స్థానాల ఆటగాళ్ళు పుల్లలు గలుపుతారు దీనిని రెండో దెబ్బగా పరిగణించాలి ఈ దెబ్బనుంచి జడ వేయడం మొదలవుతుంది. ఒకటో రాముడు రెండో స్థానం దాటి కొంచెం కుడిపక్కకు జరిగి మూడోదెబ్బ మూడో స్థానంలో చేరిన లక్ష్మణునితో గొట్టి లోపలివైపుగాను, కుడిచేతిమీదుగాను పయనించి నాల్గో స్థానానికి చేరుతాడు తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి నాల్గోదెబ్బ ఐదో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, తర్వాత ఐదో స్థానం దాటివెళ్ళి ఇంకొంచెం కుడిపక్కకు జరిగి ఏదోదెబ్బ ఆరో స్థానంలో చేరిన లక్ష్మణునితోను కొట్టి కుడి

14. చూ., జడకోపు.




**14**

పక్కకే పయనిస్తూ ఆరోస్థానం దాటి ఏడో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి ఎనిమిదో దెబ్బ ఎనిమిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, మరలా ఎడమ పక్కకు జరిగి తొమ్మిదో దెబ్బ ఆరో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, తర్వాత మరలా కొంచెం కుడిపక్కకు జరిగి పదో దెబ్బ ఎనిమిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, ఎనిమిదో స్థానం దాటి కుడిపక్కకు జరిగి పదకొండో దెబ్బ తొమ్మిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోను గొట్టి కుడివైపుకే పయనిస్తూ తొమ్మిదో స్థానందాటి పదోస్థానానికి చేరుతాడు తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి పన్నెండో దెబ్బ పదకొండో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి పదమూడో దెబ్బ తొమ్మిదో స్థానంలో

చేరిన లక్ష్మణునితోను, తర్వాత మరలా కొంచెం కుడిపక్కకు జరిగి పద్దానుగో దెబ్బ పదకొండో స్థానంలోచేరిన లక్ష్మణునితోను, తర్వాత కుడిపక్కకు జరుగుతూ పదకొండో స్థానం దాటి పదిహేనోదెబ్బ పన్నెండో స్థానంలో చేరిన లక్ష్మణునితోను గొట్టి, తర్వాత కుడివైపుకే పయనిస్తూ పన్నెండో స్థానం దాటి వెళ్ళి తన స్థానమైన ఒకటో స్థానానికి చేరుతాడు అప్పటివరకు పయనించిన మార్గంలో ఇక్కడనుంచి తిరుగు పయనం సాగిస్తాడు. అంటే తన స్థానంలో చేరిన ఒకటో స్థానం రాముడు కొంచెం కుడిపక్కకు జరిగి పదహారో దెబ్బ రెండోస్థానం లక్ష్మణునితోను, మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి పదిహేడోదెబ్బ పన్నెండో లక్ష్మణునితోను, పన్నెండో స్థానం దాటి తర్వాత మరికొంచెం ఎడమ పక్కకు జరిగి పద్దెనిమిదోదెబ్బ పదకొండో లక్ష్మణునితోను గొట్టి, ఎడమ పక్కనే పయనిస్తూ పదకొండో స్థానం దాటి పదో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి పందొమ్మిదో దెబ్బ తొమ్మిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, మరలా కొంచెం కుడిపక్కకు జరిగి ఇరవయ్యోదెబ్బ పదకొండో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, తర్వాత మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి ఇరవయ్యొకటో దెబ్బ తొమ్మిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోను గొట్టి తొమ్మిదో స్థానం దాటి ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై రెండోదెబ్బ ఎనిమిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోగొట్టి, ఎడమ పక్కకే పయనిస్తూ ఎనిమిదో స్థానందాటి ఏడో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమపక్కకు జరిగి ఇరవై మూడోదెబ్బ ఆరో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, మరలా కొంచెం కుడివైపుకు జరిగి ఇరవైనాల్గో దెబ్బ ఎనిమిదోస్థానంలో చేరిన లక్ష్మణునితోను, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై ఐదో దెబ్బ ఆరో స్థానంలో చేరిన లక్ష్మణునితోను గొట్టి, ఆరోస్థానం దాటి ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై ఆరోదెబ్బ ఐదో స్థానంలోని లక్ష్మణునితోను గొట్టి ఐదోస్థానాన్ని దాటి నాల్గో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై ఏడోదెబ్బ మూడో స్థానంలోని లక్ష్మణునితోను, మరలా కొంచెం కుడిపక్కకు జరిగి ఇరవై ఎనిమిదో దెబ్బ ఐదో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై తొమ్మిదో దెబ్బ మూడోస్థానంలో చేరిన లక్ష్మణునితోను గొట్టి, మూడోస్థానం దాటి, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి ముప్పయోదెబ్బ రెండో స్థానంలో చేరిన లక్ష్మణునితో గొట్టి, ఎడమ పక్కకు జరిగి రెండో స్థానందాటి తన స్థానమైన ఒకటో స్థానానికి చేరుతాడు ఇట్లె రాముళ్ళందరూ కుడి, ఎడమలకు

జరుగుతూ, పుల్లలు గొడుతూ మొదట తమ కుడిపక్కకు పయనిస్తూ రెండురెండు స్థానాలుదాటి, తర్వాత స్థానం చేరుతూ పదహేనో దెబ్బకొట్టి తమ తమ స్థానాలు చేరి, తర్వాత మరలా వారు అప్పటివరకు పయనించిన మార్గంలో తిరుగు పయనం చేస్తూ ఎడమ పక్కకు పయనిస్తూ ముప్పయ్యో దెబ్బకొట్టి తమ తమ స్థానాలు రుతారు.

అట్లే రెండోస్థానం లక్ష్మణుడు ఒకటో దెబ్బ మూడోస్థానం రాముడితోను, తర్వాత కొంచెం ఎడమ పక్కకుజరిగి రెండోదెబ్బ ఒకటో స్థానం రామునితోను, తర్వాత ఒకటో స్థానందాటి కొంచెం ఎడమపక్కకుజరిగి మూడోదెబ్బ పన్నెండో స్థానంలోచేరిన రామునితోను గొట్టి పన్నెండో స్థానందాటి ఎడమ పక్కనే పయనిస్తూ పదకొండో స్థానాన్ని చేరుతాడు తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గోదెబ్బ పదోస్థానంలోచేరిన రామునితోను, మరలాకొంచెం కుడిపక్కకుజరిగి ఐదోదెబ్బ పన్నెండో స్థానంలో చేరిన రామునితోను, తర్వాత మరలాకొంచెం ఎడమపక్కకు జరిగి ఆరోదెబ్బ పదో స్థానంలో చేరిన రామునితోను, పదోస్థానందాటి, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి ఏడో దెబ్బ తొమ్మిదో స్థానంలోని రామునితోను గొట్టి, తొమ్మిదో స్థానందాటి, ఎడమ పక్కనే పయనిస్తూ ఎనిమిదో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి ఎనిదోదెబ్బ ఏడోస్థానంలో చేరిన రాముని తోను, మరలా కొంచెం కుడిపక్కకుజరిగి తొమ్మిదో స్థానంలోచేరిన రామునితోను తర్వాత మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి పదోదెబ్బ ఏడో స్థానంలో చేరిన రామునితోను గొట్టి, ఏడోస్థానందాటి ఇంకొంచెం ఎడమపక్కకు జరిగి పదకొండో దెబ్బ ఆరోస్థానంలోచేరిన రామునితో గొట్టి, ఆరోస్థానందాటి ఎడమ పక్కనే పయనిస్తూ ఐదోస్థానం చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమ పక్కకుజరిగి పన్నెండో దెబ్బ నాల్గో స్థానంలో చేరిన రామునితోను, మరలా కొంచెం కుడపక్కకు జరిగి పదమూడో దెబ్బ ఆరోస్థానంలో చేరిన రామునితోను, తర్వాత మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి పద్నాలుగోదెబ్బ నాల్గో స్థానంలోచేరిన రామునితోను గొట్టి, నాల్గో స్థానందాటి ఎడమ పక్కకుజరిగి పదిహేనో దెబ్బ మూడో స్థానంలోచేరిన రామునితో గొట్టి, మూడో స్థానాన్నిదాటి ఎడమ పక్కకు పయనిస్తూ తన స్థానమైన రెండో స్థానంచేరుతాడు. తర్వాత తాను అప్పటివరకు పయనించిన మార్గంలో తిరుగు పయనం సాగిస్తాడు. అంతే తన స్థానంలోచేరి తర్వాత కొంచెం ఎడమ పక్కకు

జరిగి పదహారోదెబ్బ ఒకటో స్థానం రామునితోను, మరలా కొంచెం కుడివైపుకు జరిగి పదిహేడోదెబ్బ మూడోస్థానం రామునితోను గొట్టి, మూడో స్థానం దాటి కొంచెం కుడిపక్కకు జరిగి పద్దెనిమిదోదెబ్బ నాల్గో స్థానంలో చేరిన రామునితోను గొట్టి, నాల్గో స్థానందాటి కుడిపక్కకు పయనిస్తూ ఐదోస్థానం చేరుతాడు. తర్వాత కొంచం కుడిపక్కకు జరిగి పందొమ్మిదో దెబ్బ ఆరోస్థానంలో చేరిన రామునితోను మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవయ్యో దెబ్బ నాల్గో స్థానంలో చేరిన రామునితోను, తర్వాత మరలా కొంచెం కుడి పక్కకు జరిగి ఇరవయ్యొకటో దెబ్బ ఆరో స్థానంలో చేరిన రామునితోను గొట్టి, ఆరో స్థానం దాటి, ఇంకొంచెం కుడిపక్కకు జరిగి ఇరవై రెండో దెబ్బ ఏడో స్థానంలో చేరిన రామునితో గొట్టి, ఏడోస్థానం దాటి కుడిపక్కకే పయనిస్తూ ఎనిమిదో స్థానం చేరుతాడు తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి ఇరవైమూడో దెబ్బ తొమ్మిదో స్థానంలో చేరిన రామునితోను, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవైనాల్గో దెబ్బ ఏడో స్థానంలో చేరిన రామునితోను, తర్వాత మరలా కొంచెం కుడిపక్కకు జరిగి ఇరవై ఐదో దెబ్బ తొమ్మిదో స్థానంలో చేరిన రామునితోను గొట్టి, తొమ్మిదో స్థానందాటి ఇంకొంచెం కుడిపక్కకు జరిగి ఇరవై ఆరో దెబ్బ పదో స్థానంలోచేరిన రామునితో గొట్టి, పదోస్థానం దాటి కుడిపక్కకు పయనిస్తూ పదకొండో స్థానం చేరుతాడు. తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి ఇరవై ఏడోదెబ్బ పన్నెండో స్థానంలో చేరిన రామునితోను, మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి ఇరవై ఎనిమిదో దెబ్బ పదో స్థానంలో చేరిన రామునితోను, తర్వాత మరలా కొంచెం కుడిపక్కకు జరిగి ఇరవై తొమ్మిదో దెబ్బ పెన్నెండో స్థానంలో చేరిన రామునితోను గొట్టి, పన్నెండో స్థానం దాటి, ఇంకొంచెం కుడిపక్కకు జరిగి ముప్పయ్యోదెబ్బ ఒకటో స్థానం రామునితో గొట్టి, ఒకటో స్థానం దాటి కుడిపక్కకే పయనిస్తూ తన స్థానమైన రెండో స్థానం చేరుతాడు. ఇట్లే లక్ష్మణులందరూ కుడి, ఎడమ పక్కలకు జరుగుతూ, పుల్లలు గొడుతూ మొదట ఎడమ పక్కకు పయనిస్తూ రెండు రెండు స్థానాలు దాటి, తర్వాతి స్థానం చేరుతూ పదిహేనో దెబ్బ కొట్టి వారి వారి స్థానాలు చేరి, తర్వాత మరలా వారు పయనించిన మార్గంలో తిరుగు పయనం చేస్తూ కుడి పక్కకు పయనిస్తూ ముప్పయ్యో దెబ్బ కొట్టి వారి వారి స్థానాలు చేరుతారు.

ఇట్లు రాముళ్ళు మొదట కుడిపక్కకు జరుగుతూ అపసవ్య మార్గంలోను, లక్ష్మణులు మొదట ఎడమ పక్కకు జరుగుతూ సవ్యమార్గంలోను పయనిస్తూ పదిహేనో దెబ్బ కొట్టి తమతమ స్థానాలు చేరి, తర్వాత రాముళ్ళు ఎడమ పక్కకు జరుగుతూ సవ్యమార్గంలోను, లక్ష్మణులూ కుడి పక్కకు జరుగుతూ అపసవ్యమార్గంలోను పయనిస్తూ ముప్పయ్యో దెబ్బకొట్టి తమతమ స్థానాలు చేరుతారు. రాముళ్ళు, లక్ష్మణులు తమతమ స్థానాల నుంచి బయలుదేరింది మొదలు రెండు స్థానాలుదాటి ఒక స్థానంలో నిలుస్తూ పయనిస్తుంటారు వీరంతా నిల్చిన స్థానం నుంచి రెండు స్థానాలు దాటి మరొక స్థానానికి చేరేటప్పటికి వీరి చేతులలోని తాళ్ళు మెలిక పడతాయి. మొత్తం పన్నెండు మంది ఆటగాళ్ళు నాల్గు స్థానాలలో మజిలీలు వేస్తారు. ఒక స్థానం నుంచి మరొక స్థానం చేరినప్పుడల్లా ఒక మెలికపడుతుంది ఈ మెలికనే ముడి అనికూడా అంటారు. మొత్తం నాల్గు మెలికలు పడతాయి. ఆటగాళ్ళు ఇంకా ఎక్కువ సంఖ్యలో ఉంటే మెలికలు ఎక్కువే ఉంటాయి. ప్రతివాడు రెండు స్థానాలు దాటి మూడో స్థానం చేరు తున్నాడు. కాబట్టి మూడుతో నిశ్శేషంగా భాగించడానికి వీలయ్యే ఏ సంఖ్య అయినా బాగుంటుంది. అయితే భాగఫలంగా వచ్చిన సంఖ్య, జడలోని ముడుల సంఖ్య ఒకటే. పదిహేనో దెబ్బకు అందరూ తమతమ స్థానాలు చేరేటప్పటికి నాల్గు మెలికలతోను, ఒక్కొక్క మెలిక రెండు అడ్డుమెలికలతోను జడ పూర్తిగా పడుతుంది. అచ్చటి నుంచి తిరుగు పయనంలో జడను ఊడదీయడం జరుగు తుంది. ఈ తిరుగు పయనంలో ఆటను ఉసెత్తులో ఆడుతారు ముప్పయ్యోదెబ్బ కొట్టి రాముళ్ళు, లక్ష్మణులు అంతా తమతమ స్థానాలు చేరేటప్పటికి జడ పూర్తిగా ఊడిపోతుంది. ఈ కోపులో "జడ నీకు యెవరేశారె" అనే పాటను పాడుతారు. దీనినే చెలియ జడకోపు అంటారు.

## 15. జంజాల కోపు

జందెం అనేదానికి రూపాంతరాలు జంద్యం, జంజెం.* ఈ కోపులో జంద్యం వేసినట్లు అభినయిస్తారు కాబట్టి పేరుకు తగిటుంది. పాట తెగగొట్టడం, రాముళ్లు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో ఆట మొదలవుతుంది.

---

* జందెం, జన్నిదం <సం. యజ్ఞోపవీత -




**15**

రామలక్ష్మణులు అంతా కుడికాలు ఒక అడుగు ముందుకు వేసి, వంగి మోకాల వద్ద ఎవరి కఱ్ఱలతో వారే కొట్టుకొని, తర్వాత రెండు చేతులు రెండుకాళ్ల వెనుకకు పోనిచ్చి కాళ్లవెనుక ఎవరి కఱ్ఱలతో వారే కొట్టుకుంటారు. తర్వాత లేచి ఎడమ-కాలు ఒక అడుగు ముందుకు వేసి, మోకాలి వద్ద ఎవరి కఱ్ఱలతో వారే కొట్టుకొని, తర్వాత రెండుకాళ్ల వెనుకకు రెండు చేతులు పోనిచ్చి కాళ్ల పెనుక ఎపరి కఱ్ఱలతో వారే కఱ్ఱలు కొట్టుకొని, లేచి రాముళ్లు లక్ష్మణులకు జంటెం వేస్తారు. అంటే రాముడు తన రెండు బాహువులలోకి తీసికొని లక్ష్మణుని వెపు

వెనుక తన కర్రలతో తానే కొడతాడు. అట్లే లక్ష్మణుడు తన రెండు బాహువుల లోకి రాముని తీసికొని రాముని వీపువెనుక తన కర్రలతో తానే కొడతాడు ఇట్లా వీపుల వెనుక పుల్లలు కలపడం అనేది చూడడానికి జంతెం వేసినట్లు ఉంటుంది.

ఇట్లు బాహువులలోకి తీసుకుని ఒకరి వీపుల వెనుక మరొకరు పుల్లలు గలిపిన తర్వాత రాముడ్లు, లక్ష్మణులు లేచి ఉద్దులుద్దులుగా పుల్లలు గలుపుతారు. తర్వాత మరలా మొదట ఆడినట్లుగా ఆడ జంతెం వేస్తారు ఇట్లే మరలా మరలా ఆడుతుంటారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు దీనినే జంజాల కోపు అంటారు.

## 16. జడకోపు

కులుకుల కోలాటంలోను, భారత కోలాటంలోను, భారత కోలాటంనుంచి విడివడిన తక్కిన కోలాటాలలోను జడకోపు పద్ధతి ఒక్కటే. అయితే కులుకుల కోలాటంలో అభినయం ఉంటుంది. భారత తదితర కోలాటాలలో అభినయం ఉండదు. అన్ని కోలాటాలలోను జడను ఒకేవిధంగా వేస్తారు. అందుకే జడకోపుకు కోలాటంలో ఒక విశిష్టస్థానం ఉంది. జడ అంటే ఒకదానితో ఒకటి అల్లుకొనిఉన్న వెంట్రుకల పాయలు.[15] అంటే వెంట్రుకల పాయలతో ఏర్పడిన జడవలె కోలాట మాడుచూ తాళ్లలో జడను అల్లడం జరుగుతుంది కాబట్టి జడకోపు అనేపేరు తగి ఉంది.

ఇందుకు ముఖ్యంగా మూడడుగుల వ్యాసంగల గుండ్రటి చెక్కగాని లేక అంతేపొడవు, వెడల్పుగల చతురస్రాకారపు చెక్కగాని అవసరం. ఈ చెక్కకు ఆటగాళ్ళసంఖ్య కంటే ఒక రంధ్రం అధికంగా చేయబడి ఉంటుంది. అంటే ఆట గాళ్ళకు సరిపడేట్లు చెక్కచుట్టూ రంధ్రాలేగాక చెక్కకు మధ్యలో ఒక రంధ్రం ఉంటుంది. రంధ్రాలన్నింటికి తాళ్లుగట్టాలి ఈ చెక్కనే'బిళ్ళ'అనికూడా అంటారు. ఈ చెక్కను ఒక చెట్టుకుగల అడ్డుకొమ్మకు గట్టాలి. ఇది కట్టడానికి తాడి,కొబ్బరి లాంటి చెట్లు పనికిరావు. బాగా విస్తరించిన అడ్డుకొమ్మలుఉండే చింత, వేప,మామిడి

15. శ. ర., 507.




16

మఱ్ఱి, జువ్వి మొదలయినవానిలో ఏదోఒక చెట్టుకొమ్మకింద గరిడీ ఏర్పాటు చేస్తారు. అంటే కోలాటానికి గరిడీ ఎచట ఏర్పాటుచేసినప్పటికీ జడకోపుకు మాత్రం సాధారణంగా చెట్టుకిందనే ఏర్పాటు చేయాలి. లేదా ఎత్తుగా చెక్క కట్టడానికి వీలుగా కర్రలుపాతి వాటికి చెక్కను కట్టాలి. జడకోపుకు ఏర్పాటుచేసిన గరిడీలో ఇతర కోపులుకూడా వేస్తుంటారు ఒక్కొక్కమారు ప్రార్థన కోపువేసి జడకోపుతోటే సరిపెట్టుకుంటారు. జడకోపు వేయడానికి ఎనిమిదిగాని, పదిగాని, పన్నెండుగాని, పద్నాలుగుగాని, పదారుగాని, పద్దెనిమిదిగాని సంఖ్యలలో ఆటగాళ్ళుండాలి. అంతకంటే ఎక్కువ అనవసరం. ఈ కోపు ఎక్కువమందితో ఆడితే జడ తప్పుపడే అవకాశం ఉంటుంది.

ఆటగాళ్లు పది మంది అనుకుందాం అప్పుడు చెక్కకు పదకొండు రంధ్రాలు చేసి, పదకొండు తాళ్లు కట్టాలి. పది మంది చుట్టూ ఉన్న తాళ్లు తమ తమ ఎడమచేతిలోని కర్రతో కలిపి పట్టుకుంటారు. పదకొండో వ్యక్తి చెక్క మధ్య రంధ్రానికి కట్టిన తాటిని పట్టుకొని గరిడి మధ్యలో కూర్చుంటాడు. ఈ తాటివల్ల కోలాటం వేసే సమయాన చెట్టుకొమ్మకు కట్టిన చెక్కకు అటూయిటూ కదలకుండా ఉంటుంది ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిది మొదలైన బేసి స్థానాలను రాముళ్లూ; రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది, పది మొదలైన సరి స్థానాలను లక్ష్మణులూ ఆక్రమిస్తారు. ఈ కోపులో జట్టూ ఎప్పుడూ ఒకే వలయంగా నిల్చుంటుంది. కాబట్టి ఒకటో స్థానం ఆటగానికి పదో స్థానం ఆటగాడు ఎడమ పక్కన, రెండో స్థానం ఆటగాడు కుడిపక్కన ఉంటారు. ఆటగాళ్లంతా కర్రతో పాటు తాటిని కూడా ఎడమ చేతితో పట్టుకుంటారు. కుడిచేతిలో కర్ర మాత్రమే ఉంటుంది. ప్రార్థన పాట కాగానే "ఇట్టియ్యకు, ఇట్టియ్యకు, ఇట్టియ్యకు తాద్ధిమి" అనే ఎత్తుగడ మాటతో ఆట మొదలుపెడతారు. 1-10, 9-8, 7-6, 5-4, 3-2 స్థానాల ఆటగాళ్లు పుల్లలు గలుపుతారు. ఇది ఒకటో దెబ్బ తర్వాత 2-1, 10-9, 8-7, 6-5, 4-3 స్థానాల ఆటగాళ్ళు పుల్లలు గలుపుతారు అంటే ఒకటో స్థానం రాముడు రెండో స్థానం లక్ష్మణునితో రెండో దెబ్బకొట్టి కుడిచేతి మీదుగాను లోపలిగాను తన కుడిపక్కకు పయనిస్తూ రెండో స్థానాన్ని దాటి మూడో స్థానం చేరుతాడు. తర్వాత కొంచెం కుడివైపుకు జరిగి మూడో దెబ్బ నాల్గో స్థానంలో చేరిన లక్ష్మణునితోనూ, మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి నాల్గో దెబ్బ రెండో స్థానంలోని లక్ష్మణునితోనూ, తర్వాత మరలా కొంచెం కుడి పక్కకు జరిగి ఐదో దెబ్బ నాల్గో స్థానంలో చేరిన లక్ష్మణునితోనూ గొట్టి కుడి పక్కకే పయనిస్తూ నాల్గో స్థానం దాటి ఐదో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి ఆరో దెబ్బ ఆరో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఏడో దెబ్బ నాల్గో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, తర్వాత మరలా కుడిపక్కకు జరిగి ఎనిమిదో దెబ్బ ఆరో స్థానంలో చేరిన లక్ష్మణునితోను గొట్టి కుడి పక్కనే పయనిస్తూ ఆరో స్థానం దాటి ఏడో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి తొమ్మిదో దెబ్బ ఎనిమిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోనూ, మరలా ఎడమ పక్కకు జరిగి పదోదెబ్బ ఆరోస్థానంలో చేరిన లక్ష్మణునితోనూ, తర్వాత

మరలా కొంచెం కుడి పక్కకు జరిగి పదకొండో దెబ్బ ఎనిమిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోనూ గొట్టి కుడి పక్కకే పయనిస్తూ ఎనిమిదో స్థానం దాటి తొమ్మిదో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి పన్నెండో దెబ్బ పదో స్థానంలో చేరిన లక్ష్మణునితోనూ, మరలా ఎడమపక్కకు జరిగి పదమూడో దెబ్బ ఎనిమిదో చేరిన లక్ష్మణునితోను, తర్వాత మరలా కొంచెం కుడి పక్కకు జరిగి పద్నాలుగో దెబ్బ పదో స్థానంలో చేరిన లక్ష్మణునితోను గొట్టి కుడి పక్కకే పయనిస్తూ పదో స్థానం దాటి తన స్థానమైన ఒకటో స్థానానికి చేరుతాడు. అచ్చట నుంచి అప్పటి వరకు తాను తిరిగి వచ్చిన స్థానాల గుండా తిరుగు పయనం సాగిస్తాడు. అంటే కొంచెం కుడి పక్కకు జరిగి పదిహేనో దెబ్బ రెండో స్థానం లక్ష్మణునితోను, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి పదహారో దెబ్బ పదో స్థానం లక్ష్మణునితోనూ గొట్టి, ఎడమ పక్కకు పయనిస్తూ పదో స్థానం దాటి తొమ్మిదో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి పదిహేడో దెబ్బ ఎనిమిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోను, మరలా కొంచెం కుడి పక్కకు జరిగి పద్దెనిమిదో దెబ్బ పదో స్థానం లక్ష్మణునితోను, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి పందొమ్మిదో దెబ్బ ఎనిమిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోనూ గొట్టి ఎడమ పక్కకే పయనిస్తూ ఎనిమిదో స్థానం దాటి ఏడో స్థానానికి చేరుతాడు తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవయ్యో దెబ్బ ఆరో స్థానంలో చేరిన లక్ష్మణునితోనూ, మరలా కొంచెం కుడిపక్కకు జరిగి ఇరవయ్యొకటో దెబ్బ ఎనిమిదో స్థానంలో చేరిన లక్ష్మణునితోనూ, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై రెండోదెబ్బ ఆరో స్థానంలో చేరిన లక్ష్మణుని తోనూ గొట్టి ఎడమ పక్కకే పయనిస్తూ ఆరోస్థానం దాటి ఐదోస్థానం చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమపక్కకు జరిగి ఇరవైమూడో దెబ్బ నాల్గో స్థానంలో చేరిన లక్ష్మణునితోనూ,మరలాకొంచెం కుడిపక్కకుజరిగి ఇరవైనాల్గోదెబ్బ ఆరోస్థానంలో చేరిన లక్ష్మణునితోను, తర్వాత మరలకొంచెం ఎడమ పక్కకుజరిగి ఇరవై ఐదో దెబ్బ నాల్గో స్థానంలోచేరిన లక్ష్మణునితోను గొట్టి ఎడమ పక్కకే పయనిస్తూ నాల్గోస్థానం దాటి మూడోస్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై ఆరోదెబ్బ రెండోస్థానంలో చేరిన లక్ష్మణునితోనూ, మరలా కొంచెం కుడిపక్కకు జరిగి ఇరవై ఏడోదెబ్బ నాల్గో స్థానంలో చేరిన లక్ష్మణునితోనూ, తర్వాత మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి ఇరవైఎనిమిదోదెబ్బ రెండోస్థానం

లక్ష్మణునితోను గొట్టి, ఎడమ పక్కకే పయనించి రెండోస్థానందాటి తన స్థాన మైన ఒకటో స్థానానికి చేరుతాడు. ఇట్లే రాముళ్ళందరూ కుడి, ఎడమలకు జరుగుతూ, పుల్లలు గొడుతూ మొదట కుడిపక్కకు పయనిస్తూ, సరిస్థానాలు దాటుతూ బేసిస్థానాలు చేరుతూ పద్దానుగో దెబ్బకొట్టి వారివారి స్థానాలుచేరి తర్వాత మరలా వారు పయనించిన మార్గంలో తిరుగుపయనంలో ఎడమపక్కకు పయనిస్తూ ఇరవై ఎనిమిదోదెబ్బకొట్టి వారివారిస్థానాలు చేరుతారు. అంటే మూడోస్థానం రాముడు కుడి పక్కకు పయనిస్తూ ఐదు, ఏడు, తొమ్మిది, ఒకటోస్థానాలగుండా తన స్థానంచేరి తర్వాత ఎడమ పక్కకు పయనిస్తూ ఒకటి, తొమ్మిది, ఏడు, ఐదు స్థానాలగుండా తన స్థానం చేరుతాడు. ఐదోస్థానం రాముడు మొదట కుడి పక్కకు పయనిస్తూ ఏడు, తొమ్మిది, ఒకటి, మూడు స్థానాలగుండా తన స్థానం చేరి, తర్వాత ఎడమ పక్కకు పయనిస్తూ మూడు, ఒకటి, తొమ్మిది, ఏడు స్థానాల గుండా తన స్థానం చేరుతాడు. ఏడోస్థానం రాముడు మొదట కుడిపక్కకు పయనిస్తూ తొమ్మిది,ఒకటి, మూడు, ఐదు స్థానాలగుండా తన స్థానంచేరి, తర్వాత ఎడమ పక్కకు పయనిస్తూ ఐదు, మూడు, ఒకటి, తొమ్మిది స్థానాలగుండా ఏడోస్థానం చేరుతాడు. తొమ్మిదో స్థానం రాముడు మొదట కుడిపక్కకు పయనిస్తూ ఒకటి,మూడు,ఐదు,ఏడుస్థానాల గుండా తన స్థానంచేరి, తర్వాత ఏడు, ఐదు, మూడు, ఒకటి స్థానాలగుండా తన స్థానం చేరుతాడు. ఇట్లు రాముళ్లు మొదట అపసవ్యమార్గంలోను, తర్వాత సవ్య మార్గంలోను పయనిస్తారు.

అట్లే రెండోస్థానం లక్ష్మణుడు ఒకటో దెబ్బ మూడో స్థానం రామునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ ఒకటో స్థానం రామునితోగొట్టి ఎడమ పక్కకే పయనిస్తూ ఒకటో స్థానం దాటి పదో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో స్థానంలో చేరిన రామునితోను, మరలా కొంచెం కుడిపక్కకు జరిగి నాల్గోదెబ్బ ఒకటో స్థానంలో చేరిన రామునితోనూ, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదో దెబ్బ తొమ్మిదో స్థానంలో చేరిన రామునితోను గొట్టి, ఎడమ పక్కనే పయనిస్తూ తొమ్మిదో సాన దాటి ఎనిమిదో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి ఆరోదెబ్బ ఏడో స్థానంలో చేరిన రామునితోను, మరలా కొంచెం కుడిపక్కకు జరిగి ఏడోదెబ్బ తొమ్మిదో స్థానంలో చేరిన రామునితోను, తర్వాత

మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఎనిమిదో దెబ్బ ఏడో స్థానంలో చేరిన రామునితోను గొట్టి, ఎడమ పక్కనే పయనిస్తూ, ఏడో స్థానం దాటి ఆరో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి తొమ్మిదో దెబ్బ ఐదో స్థానంలో చేరిన రామునితోను, మరలా కొంచెం కుడిపక్కకు జరిగి పదో దెబ్బ ఏడో స్థానంలో చేరిన రామునితోను, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి పదకొండో దెబ్బ ఐదో స్థానంలో చేరిన రామునితోను గొట్టి, ఎడమ పక్కనే పయనిస్తూ ఐదో స్థానం దాటి నాల్గో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి పన్నెండో దెబ్బ మూడో స్థానంలో చేరిన రాముని తోను, మరలా కుడిపక్కకు జరిగి పదమూడో దెబ్బ ఐదో స్థానంలో చేరిన రాముని తోను, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి పద్నాలుగో దెబ్బ మూడో స్థానంలో చేరిన రామునితోను గొట్టి, ఎడమ పక్కకే పయనించి మూడో స్థానం దాటి తన స్థానమైన రెండో స్థానానికి చేరుతాడు. తర్వాత తాను అప్పటి వరకు పయనించిన మార్గంలో తిరుగు పయనం సాగిస్తాడు. అంటే తన స్థానం చేరిన తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి పదిహేనోదెబ్బ ఒకటో స్థానం రాముని తోను, మరలా కొంచెం కుడిపక్కకు జరిగి పదహారో దెబ్బ మూడో స్థానం రామునితోను గొట్టి, కుడి పక్కకు పయనించి మూడో స్థానం దాటి నాల్గో స్థానానికి చేరుతాడు. తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి పదిహేడో దెబ్బ ఐదో స్థానంలో చేరిన రామునితోను, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి పద్దెనిమిదో దెబ్బ మూడో స్థానంలో చేరిన రామునితోను, తర్వాత మరలా కొంచెం కుడిపక్కకు జరిగి పందొమ్మిదో దెబ్బ ఐదో స్థానంలో చేరిన రామునితోను గొట్టి, కుడిపక్కకే పయనిస్తూ ఐదో స్థానం దాటి ఆరోస్థానం చేరుతాడు. తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి ఇరవయ్యో దెబ్బ ఏడో స్థానంలో చేరిన రామునితోను, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవయ్యొకటో దెబ్బ ఐదో స్థానంలో చేరిన రామునితోను తర్వాత మరలా కొంచెం కుడి పక్కకు జరిగి ఇరవై రెండో దెబ్బ ఏడో స్థానంలో చేరిన రాముని తోను గొట్టి, కుడి పక్కకే పయనిస్తూ ఏడో స్థానం దాటి ఎనిమిదో స్థానానికి చేరుతాడు తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి ఇరవై మూడో దెబ్బ తొమ్మిదో స్థానంలో చేరిన రామునితోను, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై నాల్గో దెబ్బ ఏడో స్థానంలో చేరిన రాముని తోను, తర్వాత మరలా కొంచెం కుడిపక్కకు జరిగి ఇరవై ఐదో దెబ్బ తొమ్మిదో

ానంలో చేరిన రామునితోను కొట్టి కుడి పక్కకే పయనిస్తూ తొమ్మిదో స్థానం
ంటి పదో స్థానం చేరుతాడు తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి ఇరవై ఆరో
బ్బ ఒకటో స్థానంలో చేరిన రామునితోను, మరలా కొంచెం ఎడమ పక్కకు
రిగి ఇరవై ఏడో దెబ్బ తొమ్మిదో స్థానంలో చేరిన రామునితోను, తర్వాత
ంరలా కొంచెం కుడి పక్కకు జరిగి ఇరవై ఎనిమిదో దెబ్బ ఒకటో స్థానంలో
ేరిన రామునితోను గొట్టి, కుడి పక్కకే పయనించి ఒకటో స్థానం దాటి తన
ానమైన రెండో స్థానానికి చేరుతాడు. ఇట్లే లక్ష్మణులందరూ కుడి, ఎడమ
ఁక్కలకు జరుగుతూ, పుల్లలు గొడుతూ, మొదట ఎడమ పక్కకు పయనిస్తూ
ేసి స్థానాలు దాటుతూ, సరి స్థానాలు చేరుతూ పద్దానుగో దెబ్బ కొట్టి, వారి వారి
్థానాలు చేరి, తర్వాత మరలా వారు పయనించిన మార్గంలో తిరుగు పయనం
ేస్తూ, కుడి పక్కకు పయనిస్తూ ఇరవై ఎనిమిదో దెబ్బ కొట్టి వారి వారి స్థానాలు
ేరుతారు. అంటే నాల్గో స్థానం లక్ష్మణుడు మొదట ఎడమ పైపుకు పయనిస్తూ
ెండు, పది, ఎనిమిది, ఆరు స్థానాల గుండా తన స్థానం చేరి, తర్వాత కుడి
పైపుకు పయనిస్తూ ఆరు, ఎనిమిది, పది, రెండు స్థానాల గుండా తన స్థానం చేరు
తాడు. ఆరో స్థానం లక్ష్మణుడు మొదట ఎడమ పైపుకు పయనిస్తూ నాల్గు, రెండు,
పది, ఎనిమిది స్థానాల గుండా తన స్థానం చేరి, తర్వాత కుడి పైపుకు పయనిస్తూ
ఎనిమిది, పది, రెండు, నాల్గు స్థానాల గుండా తన స్థానం చేరుతాడు. ఎనిమిదో
స్థానం లక్ష్మణుడు మొదట ఎడమ పైపుకు పయనిస్తూ ఆరు, నాల్గు, రెండు, పది
స్థానాల గుండా తన స్థానం చేరి, తర్వాత కుడి పైపుకు పయనిస్తూ పది, రెండు,
నాల్గు, ఆరు స్థానాల గుండా తన స్థానం చేరుతాడు పదో స్థానం లక్ష్మణుడు
మొదట ఎడమ పైపుకు పయనిస్తూ ఎనిమిది, ఆరు, నాల్గు, రెండు స్థానాల గుండా
తన స్థానం చేరి, తర్వాత కుడి పైపుకు పయనిస్తూ రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది
స్థానాల గుండా తన స్థానం చేరుతాడు. ఇట్లు లక్ష్మణులు మొదట సవ్యమార్గం
లోను, తర్వాత అపసవ్య మార్గంలోను పయనిస్తారు.

ఇట్లు రాముళ్లు మొదట కుడి పక్కకు జరుగుతూ అపసవ్య మార్గంలోను, లక్ష్మణులు మొదట ఎడమ పక్కకు జరుగుతూ సవ్య మార్గంలోను పయనిస్తూ పద్దానుగో దెబ్బ కొట్టి తమ తమ స్థానాలు చేరి, తర్వాత రాముళ్ళు ఎడమ పక్కకు జరుగుతూ సవ్య మార్గంలోను, లక్ష్మణులు కుడి పక్కకు జరుగుతూ

అపసవ్య మార్గంలోను పయనిస్తూ ఇరవై ఎనిమిదో దెబ్బ కొట్టి తమ తమ స్థానాలు చేరుతారు రాముళ్ళు, లక్ష్మణులు తమ తమ స్థానాల నుంచి బయలుదేరింది మొదలు ఒక స్థానం దాటుతూ, ఒక స్థానంలో నిలుస్తూ పయనిస్తుంటారు. వీరంతా ఒక స్థానం దాటినపుడల్లా వీరి చేతులలోని తాళ్ళలో ఒక మెలిక పడుతుంది! మొత్తం పది మంది ఆటగాళ్ళు ఐదు స్థానాలలో మజిలీలు వేస్తారు. వీరి తాళ్ళు ఒక్కో మజిలీకి ఒక్కొక్క మెలిక పడుతుంది. మొత్తం ఐదు మెలికలు పడ తాయి. ఈ మెలికనే ముడి అంటారు. పద్దానుగో దెబ్బకు అందరూ తమ తమ స్థానాలు చేరేటప్పటికి ఐదు మెలికలతో జడ పూర్తిగా పడుతుంది అచ్చటినుంచి తిరుగు పయనంలో జడను ఊడదీయడం జరుగుతుంది. ఈ తిరుగు పయనంలో జడను ఊడదీసేటప్పుడు ఆటను ఉసెత్తులో ఆడుతారు. ఇరవై ఎనిమిదో దెబ్బ కొట్టి రాముళ్ళు, లక్ష్మణులు అంతా తమ తమ స్థానాలు చేరేటప్పటికి జడపూర్తిగా ఊడిపోతుంది. ఈ కోపులో ఎక్కువ చోట్ల "జడ నీకు యెవరేశారే" అనే పాటను పాడుతారు.

తమిళనాడులో మన జడకోపునుబోలిన కోలాటపుకోపును 'పిన్నల్ కోలాటం' అంటారు. ఈ పిన్నల్ కోలాటంలో నర్తకులు ఒకచేతిలో తాడుపట్టుకొని, రెండో చేతితో కోలాటపుకర్రలు రెండూ పట్టుకుంటారు. మన జడకోపులో తాళ్లను చెక్కకు కట్టి చెక్కను చెట్టుకు కడతారు. కాని 'పిన్నల్ కోలాటం'లో రకరకాల రంగు ధారాలను ఇంటికప్పుకు కడతారు. నర్తకులు లయాన్వితంగా జరుగుతూఉంటే ఆ దారాలు చెరిసగం పొడవునుంచి జడగా అల్లుకుంటాయి. పిమ్మట ఈ అల్లకాన్ని అడుగులు వేస్తూనే ఊడదీస్తారు. మరల కొత్త నమూనాలు అల్లుతారు. పాటలు పాడుతూ పిన్నల్ కోలాటం వేస్తారు. ఈ పాటలకు ఒక పల్లవి, ఒక అనుపల్లవి, అనుచరణం ఉంటాయి. అయితే దక్షిణ భారతదేశంలో వేర్వేరు రకాల పిన్నల్ కోలాటాలు ప్రచారంలో ఉన్నాయి.[16]

సామాన్యంగా పల్లెటూళ్లలో కోటలాం నేరుస్తున్నారగానే ముందు 'జట్టునాయకునికి జడకోపు వచ్చునా' అని అడుగుతారు. జడకోపు వచ్చినవాడే కోలాటం నేర్పడానికి అర్హుడు అనేట్టుంటుంది వారి భావన. అంటే జడకోపు వచ్చిఉంటే జట్టు

16. భారతీయ జానపద నృత్యాలు, ప్ర. భా., 158, 159.

నాయకుని సామర్థ్యాన్ని ఊహిస్తారు ఇది కోలాటంమాసే ప్రతి ఒక్కరి తీర్పు. కోలాటంలోని తక్కిన కోపులకంటే జనులు జడకోపును చూడడానికి తండోప తండాలుగా వస్తారు. జడకోపును చూడడం ఒక ఉల్లాసం. కాని ప్రస్తుతం ఆట గాళ్లు జడకోపువంటి కష్టమైన కోపుల జోలికి వెళ్లడం లేదు ఏదో నాల్గు కోపులు నేర్చి, తిరుణాలకు ఆర్కెస్ట్రా తెప్పించుకొని జట్టునాయకుడు పాడుతుంటే కోలాటం వేయడంతో మొక్కుబడి చెల్లించుకుంటున్నారు. ఐనా అచ్చటచ్చట జడకోపువాసన తేకపోలేదు.

## 17. తెల్ల కోపు

పేరుకు కోపులో ఆడే తీరుకు సంబంధం లేకపోయినప్పటికీ పేరు వింటా నికి ఇంపుగా ఉంది పాట తెగ గొట్టడం, రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మ ణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, మరి కొంచెం ఎడమపక్కకు జరిగి మూడోదెబ్బ మూడో లక్ష్మణునితోను, ఇట్లే కొంచెం కొంచెం ఎడమ పక్కకు జరుగుతూ నాల్గో దెబ్బ నాల్గో లక్ష్మణునితోను, ఐదో దెబ్బ ఐదో లక్ష్మణునితోను, ఆరో దెబ్బ ఆరో లక్ష్మణునితోను, ఏడో దెబ్బ ఏడో లక్ష్మణుని తోను, ఎనిమిదో దెబ్బ ఎనిమిదో లక్ష్మణుతోను, తొమ్మిదో దెబ్బ తొమ్మిదో లక్ష్మణునితోను, పదో దెబ్బ పదో లక్ష్మణునితోను, పదకొండో దెబ్బ మరలా ఒకటో లక్ష్మణునితోను పుల్ల గలుపుతాడు ఇట్లే రాముడు తన ఎడమ పక్కకు కొంచెం కొంచెం జరుగుతూ వెలుపలి వలయంలో స్థిరంగా నిల్చున్న లక్ష్మణునకు ఎదురుగా వెళ్ళి పుల్లగలుపుతూ, అపసవ్యమార్గంలో తిరుగుతూ ఆడు తుంటాడు. ఇట్లే రాముళ్ళంతా కొంచెం కొంచెం ఎడమ పక్కకు జరుగుతూ వెలుపలి వలయంలో స్థిరంగా నిల్చున్న లక్ష్మణులకు ఎదురుగా వెళ్ళి పుల్లగలుపుతూ అపసవ్య మార్గంలో పయనిస్తూ ఆడుతుంటారు. లక్ష్మణులు వెలుపలి వలయంలో స్థిరంగా నిల్చుండి ఎదురుగా వచ్చిన రాముళ్ళతో పుల్లలు గలుపుతుంటారు. అంటే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితోను, రెండో దెబ్బ రెండో రామునితోను, మూడో దెబ్బ మూడో రామునితోను, నాల్గో దెబ్బ నాల్గో రామునితోను, ఐదో దెబ్బ ఐదో రామునితోను, ఆరో దెబ్బ ఆరో రామునితోను,




**17**

ఏడో దెబ్బ ఏడో రామునితోను, ఎనిమిదోదెబ్బ ఎనిమిదో రామునితోను, తొమ్మిదో దెబ్బ తొమ్మిదొ రామునితోను, పదోదెబ్బ పదో రామునితోను, పదకొండో దెబ్బ మరలా ఒకటో రామునితోను కొడుతుంటాడు లక్ష్మణులు అంతా ఇట్లే స్థిరంగా నిల్చుండి ఆడుతుంటారు. ఉసెత్తులో ఆవేగాన్ని పెంచుతారు. దీనినే ఎల్ల కోపు అంటారు.

# 18. పెద్ద కత్తెర కోపు

కోపు గతిని బట్టి ఏర్పడిందీ పేరు[17] పాట తెగగొట్టడం, రాముళ్లు లోపలి వలయంగాను, లక్ష్మణులు వెలుపలి వలయంగాను ఏర్పడడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది, ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో కొట్టి, మరి కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితో ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ నాల్గో లక్ష్మణునితో కొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదోదెబ్బ ఐదో లక్ష్మణునితో కొట్టి, తర్వాత మరి కొంచెం ఎడమ పక్కకు జరిగి ఆరోదెబ్బ ఆరో లక్ష్మణునితో కొట్టి, లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు. ఈ ఆరో దెబ్బ వెలుపలి వలయంలో ఒకటో రామునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది వెలుపలి వలయానికి వచ్చిన ఒకటో రాముడు కొంచెం కొంచెంగా ఎడమ పక్కకు జరుగుతూ రెండోదెబ్బ ఐదో లక్ష్మణునితోను, మూడో దెబ్బ నాల్గో లక్ష్మణుని తోను, నాల్గో దెబ్బ మూడో లక్ష్మణునితోను, ఐదో దెబ్బ రెండో లక్ష్మణునితోను, ఆరో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితోనుగొట్టి వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్ళందరి చలనం ఉంటుంది. అంటే లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు ఏడో లక్ష్మణునివద్ద, మూడో రాముడు ఎనిమిదో లక్ష్మణునివద్ద, నాల్గో రాముడు తొమ్మిదో లక్ష్మణునివద్ద, ఐదో రాముడు పదో లక్ష్మణునివద్ద, ఆరో రాముడు ఒకటో లక్ష్మణునివద్ద, ఏడో రాముడు రెండో లక్ష్మణునివద్ద, ఎనిమిదో రాముడు మూడో లక్ష్మణునివద్ద, తొమ్మిదో రాముడు నాల్గో లక్ష్మణునివద్ద, పదో రాముడు ఐదో లక్ష్మణునివద్ద మారుతారు. తర్వాత వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి మారేటప్పుడు తమతమ ఉద్దికాళ్ళవద్ద మారుతారు. రాముళ్ళంతా మొదట అపసవ్యమార్గంలోను, తర్వాత సవ్య మార్గంలోను పయనిస్తారు. అట్లే లక్ష్మణులు గూడ ఎడమ పక్కకు జరుగుతూ ఆడుతుంటారు. అంటే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో పుల్లగొట్టి కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి, మరికొంచెం ఎడమ

17. చూ చిన్న కత్తెర కోపు.




18

పక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో రామునితో గొట్టి, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ ఎనిమిదో రామునితోగొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదో దెబ్బ ఏడో రామునితోగొట్టి, తర్వాత మరికొంచెం ఎడమ పక్కకు జరిగి ఆరోదెబ్బ ఆరో రామునితో గొట్టి వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు. లోపలి వలయానికి వచ్చిన ఒకటో లక్ష్మణునకు ఈ ఆరో దెబ్బ ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత లోపలి వలయంలో చేరిన ఒకటో లక్ష్మణుడు కొంచెం కొంచెంగా ఎడమ పక్కకు జరుగుతూ రెండో దెబ్బ ఏడో రామునితోను, మూడో దెబ్బ ఎనిమిదో రామునితోను, నాల్గో దెబ్బ తొమ్మిదో

రామునితోను, ఐదో దెబ్బ పదో రామునితోను, ఆరో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రామునితోనుగొట్టి లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులంతా తమతమ ఎడమ పక్కకు జరుగుతూ వలయాలు మారుతూ ఆడుతుంటారు. అంటే వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు ఏడో రామునివద్ద, మూడో లక్ష్మణుడు ఎని మిదో రాముని వద్ద, నాల్గో లక్ష్మణుడు తొమ్మిదో రామునివద్ద, ఐదో లక్ష్మణుడు పదో రామునివద్ద, ఆరో లక్ష్మణుడు ఒకటో రామునివద్ద, ఏడో లక్ష్మణుడు రెండో రామునివద్ద, ఎనిమిదో లక్ష్మణుడు మూడో రామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు నాల్గో రామునివద్ద, పదో లక్ష్మణుడు ఐదో రామునివద్ద మారుతారు లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి మారేటప్పుడు తమతమ ఉద్దికాళ్ళవద్ద ఆరో దెబ్బ కొట్టి మారుతారు. లక్ష్మణులంతా మొదట సవ్య మార్గంలోను, తర్వాత అపసవ్య మార్గంలోను పయనిస్తారు.

ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు వెలుపలి వలయంలో ఎడమ పక్కకు జరుగుతూ సవ్యమార్గంలోను, లోపలి వలయంలో ఎడమ పక్కకు జరుగుతూ అపసవ్యమార్గంలోను పయనిస్తూ, ఎదురుగా వచ్చిన ఆటగాళ్ళతో కర్రలు కలుపుతూ, ఆరోదెబ్బకొట్టి వలయాలు మారుతూ ఆడుతుంటారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు దీనినే పెద్దకత్తెర కోపు అంటారు.

## 19. పెద్ద చెలియ కోపు

కోలాటం అనేది లాస్య నృత్యం. కోలాటంలో శృంగార పరంగా అభి నయం ఎక్కువగా ఉంటుంది. కాబట్టి చెలియ (స్త్రీ) పేరు మీదుగ ఈ కోపు పేరు తగి ఉంది. పాట తెగగొట్టడం, రాముళ్లు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది. ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ రెండో లక్ష్మణునితోగొట్టి, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి, తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి నాల్గో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, తర్వాత తన తలపై కర్రలు ఒకదానిని మరొక దానిలో కొట్టుకుంటాడు. అంటే కుడిచేతికర్రతో ఎడమచేతికర్ర నొకసారి, తర్వాత




19

ఎడమచేతి కఱ్ఱతో కుడిచేతి కఱ్ఱ నొకసారి కొట్టుకొని ఐదో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి వెలుపలి వలయానికి వస్తాడు అయితే ఈ ఐదో దెబ్బ వెలుపలి వలయంలో రామునికి ఒకటో దెబ్బగా పరిగణించబడదు. తర్వాత వెలుపలి వలయంలోని రాముడు కొంచెం కుడి పక్కకు జరిగి ఒకటో దెబ్బ మూడో లక్ష్మణునితోను, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితోను, మరి కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, మరలా కొంచెం కుడి పక్కకు జరిగి నాల్గో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, తర్వాత తన తలపై ఒక చేతికఱ్ఱతో మరొక చేతికఱ్ఱను కొట్టుకుంటాడు. అంటే మొదట కుడిచేతి కఱ్ఱతో ఎడమచేతి కఱ్ఱపై,

తర్వాత ఎడమచేతి కర్రతో కుడిచేతి కర్రపై కొట్టుకుంటాడు. తర్వాత ఐదో దెబ్బ మరలా రెండో లక్ష్మణునితో గొట్టి వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్లందరి చలనం ఉంటుంది. అంటే రెండో రాముడు మూడో లక్ష్మణుని వద్ద, మూడో రాముడు నాల్గో లక్ష్మణుని వద్ద, నాల్గో రాముడు ఐదో లక్ష్మణుని వద్ద, ఐదో రాముడు ఆరో లక్ష్మణునివద్ద, ఆరో రాముడు ఏడో లక్ష్మణునివద్ద, ఏడో రాముడు ఎనిమిదో లక్ష్మణునివద్ద, ఎనిమిదో రాముడు తొమ్మిదో లక్ష్మణునివద్ద, తొమ్మిదో రాముడు పదో లక్ష్మణునివద్ద, పదో రాముడు ఒకటో లక్ష్మణునివద్ద లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి, వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి ఐదో దెబ్బ కొట్టిన తర్వాత మారుతుంటారు

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితోగొట్టి, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి మూడోదెబ్బ తొమ్మిదోరామునితో గొట్టి, తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి నాలుగో దెబ్బ పదో రామునితో గొట్టి తర్వాత తన తలపై తన కర్రలను ఒకదానిని మరొకదానితో కొట్టుకొంటాడు తర్వాత ఐదో దెబ్బ పదో రామునితోగొట్టి వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి వస్తాడు. తర్వాత లోపలి వలయంలో కొంచెం కుడిపక్కకు జరిగి ఒకటో దెబ్బ తొమ్మిదో రాముని తోను, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ పదో రామునితోను, మరికొంచెం ఎడమపక్కకు జరిగి మూడో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటోరామునితోను, తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి నాల్గోదెబ్బ పదో రామునితోను గొడతాడు. తర్వాత తన తలపై తన కుడిచేతి కర్రతో ఎడమచేతి కర్రపైన, తర్వాత ఎడమచేతి కర్రతో కుడిచేతి కర్రపైన తనకు తానే కొట్టుకుంటాడు. తర్వాత ఐదో దెబ్బ పదో రామునితో గొట్టి వెలుపలి వలయంనుండి లోపలివలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులందరి చలనం ఉంటుంది. అంటే కుడి, ఎడమలకు జరుగుతూ ఎదురుగా వచ్చిన రాముళ్ళతో పుల్లలు గొడుతూ ఐదో దెబ్బకొట్టి రెండో లక్ష్మణుడు ఒకటో రామునివద్ద, మూడో లక్ష్మణుడు రెండో రామునివద్ద, నాల్గో లక్ష్మణుడు మూడో రామునివద్ద, ఐదో లక్ష్మణుడు నాల్గో రామునివద్ద, ఆరో లక్ష్మణుడు ఐదో రామునివద్ద, ఏడో లక్ష్మణుడు ఆరో రామునివద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఏడో

రామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఎనిమిదో రామునివద్ద, పదో లక్ష్మణుడు తొమ్మిదో రామునివద్ద వలయాలు మారుతుంటారు నాల్గోదెబ్బ కొట్టిన తర్వాత ఎవరితలపై వారే వారి కుడిచేతి కర్రతో ఎడమచేతి కర్రపైన, ఎడమచేతికర్రతో కుడిచేతి కర్రపైన కొట్టుకుంటారు ఉసెత్తులో ఆటవేగాన్ని పెంచుతారు. దీనినే పెద్ద చెలియ కోపు అంటారు

## 20. పొడమల్లె కోపు

మల్లె అనేది ఒక పూల తీగె ఇందులో చాల రకాలున్నాయి. వాటిలో పొడమల్లె పేరుతో వెలసింది పొడమల్లె కోపు. పాట తెగగొట్టడం, రాముళ్ళందరూ లోపలి వలయానికి రావడం, లక్ష్మణులందరూ వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది. ఒకటోరాముడు ఒకటోదెబ్బ ఒకటో లక్ష్మణునితో ఒకచేతి కర్రతో (కుడిచేతి కర్రతో) గొట్టి కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండోదెబ్బ రెండోలక్ష్మణునితో గొట్టి, మరికొంచెం ఎడమపక్కకు జరిగి మూడోదెబ్బ మూడోలక్ష్మణునితోగొట్టి, మరలా కుడిపక్కకు కొంచెం జరిగి నాల్గోదెబ్బ రెండో లక్ష్మణునితోగొట్టి, మరికొంచెం కుడిపక్కకు జరిగి ఐదో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొడతాడు తర్వాత ఒకటో లక్ష్మణునకు ఎదురుగా ఉండి కుడిచేతిలోని కర్రతో ఆరో దెబ్బ తన వెనుకగా రెండో లక్ష్మణునితో గొడతాడు. రెండో లక్ష్మణుడు రెండో రామునకు ఎదురుగా ఉండి తన వెనుకగా ఒకటో రామునితో పుల్లగొడతాడు తర్వాత ఏడోదెబ్బ ఒకటోలక్ష్మణునితోగొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి ఎనిమిదో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి తొమ్మిదో దెబ్బ మూడోలక్ష్మణునితోగొట్టి లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు ఈ తొమ్మిదో దెబ్బ వెలుపలి వలయంలో ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది వెలుపలి వలయంలో రాముడు కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి మూడోదెబ్బ ఒకటో లక్ష్మణునితోగొట్టి. కొంచెం కుడిపక్కకుజరిగి నాల్గోదెబ్బ రెండో లక్ష్మణునితోగొట్టి, మరికొంచెం కుడిపక్కకు జరిగి ఐదో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి, తర్వాత మూడో లక్ష్మణునకు ఎదురుగా నిల్చుండి ఆరో దెబ్బ తనవెనుకగా కుడిచేతిలోని కర్రతో రెండోలక్ష్మణునితో గొడతాడు. రెండో లక్ష్మణుడు రెండో రామునకు ఎదురుగా ఉండి తన వెనకగా ఒకటో రామునితో పుల్ల




20

గలుపుతాడు. తర్వాత ఏడో దెబ్బ ఎదురుగా ఉన్న మూడో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి ఎనిమిదోదెబ్బ రెండో లక్ష్మణునితో కొట్టి, ఇంకా కొంచెం ఎడమ ప్రక్కకు జరిగి తొమ్మిదో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి వెలుపలి వలయంనుంచి మరలా లోపలివలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్లందరూ కుడి, ఎడమ లకు జరుగుతూ పక్కవారితో పుల్లగొడుతూ, తొమ్మిదోదెబ్బ కొట్టి వలయాలు మారు తుంటారు. అంటే లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు తొమ్మిదో దెబ్బకొట్టి రెండో రాముడు నాల్గో లక్ష్మణునివద్ద, మూడోరాముడు ఐదో లక్ష్మణునివద్ద, నాల్గోరాముడు ఆరో లక్ష్మణునివద్ద, ఐదోరాముడు ఏడో లక్ష్మణుని వద్ద, ఆరోరాముడు ఎనిమిదో లక్ష్మణుని వద్ద, ఏడోరాముడు తొమ్మిదో లక్ష్మణుని

వద్ద, ఎనిమిదోరాముడు పదోలక్ష్మణునివద్ద, తొమ్మిదోరాముడు ఒకటోలక్ష్మణుని వద్ద, పదోరాముడు రెండోలక్ష్మణునివద్ద మారుతారు. అట్లే వెలుపలి వలయంనుంచి మరలా లోపలి వలయానికి మారేటప్పుడు తొమ్మిదోదెబ్బ కొట్టి తమతమ ఉద్దికాళ్ల వద్ద మారుతారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ పదోరామునితోగొట్టి, మరికొంచెం ఎడమపక్కకు జరిగి మూడోదెబ్బ తొమ్మిదోరామునితోగొట్టి, తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి నాల్గోదెబ్బ పదోరామునితోగొట్టి, ఇంకొంచెం కుడిపక్కకు జరిగి ఐదోదెబ్బ ఒకటో రామునితోగొట్టి, తర్వాత ఒకటో రామునకు ఎదురుగా ఉండి తనకుడిచేతి కర్రతో తన వెనుకగా పదోరామునితో ఆరోదెబ్బ కొడతాడు. అపుడు పదో రాముడు పదో లక్ష్మణునకు ఎదురుగా నిలబడి తన వెనుకగా ఒకటో లక్ష్మణునితో పుల్ల గలుపు తాడు తర్వాత ఏడోదెబ్బ ఒకటోరామునితోగొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి ఎనిమిదోదెబ్బ పదోరామునితోగొట్టి, ఇంకాకొంచెం ఎడమపక్కకు జరిగి తొమ్మిదో దెబ్బ తొమ్మిదో రామునితో గొట్టి, వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు ఈ తొమ్మిదోదెబ్బ లోపలి వలయంలో ఒకటోదెబ్బగా పరిగణించబడు తుంది తర్వాత లోపలి వలయంలో లక్ష్మణుడు కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండోదెబ్బ వెలుపలి వలయంలో తనకు ఎదురుగా వచ్చిన పదో రామునితో గొట్టి, ఇంకొంచెం ఎడమపక్కకు జరిగి మూడో దెబ్బ ఒకటో రామునితో గొట్టి, తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి నాల్గోదెబ్బ పదో రామునితో గొట్టి, మరికొంచెం కుడి పక్కకు జరిగి ఐదోదెబ్బ తొమ్మిదోరామునితో గొడతాడు తొమ్మిదో రామునకు ఎదురుగా నిల్చుండి కుడిచేతిలోని కర్రతో తనవెనుకగా ఆరోదెబ్బ పదోరామునితో గొడతాడు. తర్వాత తొమ్మిదోరామునితో ఏడోదెబ్బకొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి ఎనిమిదో దెబ్బ పదోరామునితో కొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి తొమ్మిదోదెబ్బ ఒకటోరామునితోగొట్టి వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మ ణులంతా ఎడమ, కుడిపక్కలకు జరుగుతూ, పుల్లలు గలుపుతూ తొమ్మిదో దెబ్బ కొట్టి వలయాలు మారుతుంటారు. అంటే వెలుపలి వలయం నుంచి లోపలి వల యానికి మారేటప్పుడు తొమ్మిదోదెబ్బ కొట్టి రెండో లక్ష్మణుడు పదోరాముని వద్ద, మూడోలక్ష్మణుడు ఒకటోరామునివద్ద, నాల్గోలక్ష్మణుడు రెండోరామునివద్ద, ఐదో

లక్ష్మణుడు మూడోరాముని వద్ద, ఆరో లక్ష్మణుడు నాల్గోరాముని వద్ద, ఏడోలక్ష్మణుడు ఐదోరామునివద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఆరో రామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఏడోరామునివద్ద, పదోలక్ష్మణుడు ఎనిమిదోరామునివద్ద మారుతూ అట్లే లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్లవద్ద తొమ్మిదో దెబ్బ కొట్టి మారుతారు

ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు తమ తమ ఎడమ, కుడి పక్కలకు జరుగుతూ ఎదురుగా వచ్చిన ఆటగాళ్లతో పుల్లలు గొడుతూ, ఆరోదెబ్బ కుడిచేతిలోని కర్రతో తమవెనుకగా పక్కవారితో కొడుతూ, తొమ్మిదోదెబ్బ కొట్టి వలయాలు మారుతూ ఆడుతుంటారు. ఈ కోపులో ఆటగాళ్లంతా కుడి చేతిలోని కర్రతో మాత్రమే ఆడుతారు. ఎడమచేతిలోని కర్ర ఊరకే ఉంటుంది, చేయి దించే ఉంచుతారు. ఉపెస్తులో ఆట వేగాన్ని పెంచుతారు. దీనినే పొడమట్టె కోపు అంటారు

# 21. పొర్లు కోపు

పొర్లు అనే పదానికి పొర్లడం అనే అర్థం ఉంది. అంటే పొర్లు కోపులో అటు ఇటు జరుగుతూ ఉండే విధానం పొర్లినట్లుంటుంది కాబట్టి 'పొర్లు కోపు' అన్న పేరును సమర్థించవచ్చు. పాట తెగగొట్టడం, రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది. లోపలి వలయంలోని రాముళ్ళు మాత్రమే వలిస్తూ ఉంటారు వెలుపలి వలయంలోని లక్ష్మణులు స్థిరంగా ఉండి తమకు ఎదురుగా వచ్చిన రాముళ్ళకు పుల్లలు అందిస్తుంటారు ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితోగొట్టి, తర్వాత కొంచెం వెనుకకు (అంటే వలయం మధ్యకు), అడుగువేసి కొంచెం కుడి పక్కకు జరిగి కుడిచేతి మీదుగా తన చుట్టు తానే తిరిగి తర్వాత నాల్గో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదో దెబ్బ మూడో లక్ష్మణునితోకొట్టి, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి ఆరో దెబ్బ నాల్గో లక్ష్మణునితోగొట్టి, మరలా ఒకడుగు వెనుకకు వేసి కుడిచేతిమీదుగా తన చుట్టూ తానే తిరిగి, కొంచెం కుడి పక్కకు జరిగి ఏడో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి, మరలా ఎడమ పక్కకు జరిగి ఎనిమిదో దెబ్బ




21

నాల్గో లక్ష్మణునితోగొట్టి, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి తొమ్మిదో దెబ్బ ఐదో లక్ష్మణునితో గొడతాడు. తర్వాత ఒకడుగు వెనుకకు వేసి, తన కుడిచేతి మీదుగ తన చుట్టు తానే తిరిగి కొంచెం కుడి పక్కకు జరిగి పదోదెబ్బ నాల్గో లక్ష్మణునితోను, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి పదకొండో దెబ్బ ఐదో లక్ష్మణునితోను, పన్నెండో దెబ్బ ఆరో లక్ష్మణునితోను గొట్టి, తర్వాత మరలా ఒకడుగు వెనుకకు వేసి కుడిచేతి మీదుగా తన చుట్టు తానే తిరిగి కుడివైపు కొంచెం జరిగి పదమూడో దెబ్బ ఐదో లక్ష్మణునితో గొట్టి, తర్వాత మరలా

కొంచెం ఎడమ పక్కకు జరిగి పదునాల్గో దెబ్బ ఆరో లక్ష్మణునితో గొట్టి, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి పదిహేనో దెబ్బ ఏడో లక్ష్మణునితో గొడ తాడు. తర్వాత మరలా ఒకడుగు వెనక్కివేసి తన కుడి చేతి మీదుగ తనచుట్టు తానే తిరిగి కొంచెం కుడి పక్కకు జరిగి పదహారో దెబ్బ ఆరో లక్ష్మణునితో గొట్టి, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి పదిహేడో దెబ్బ ఏడో లక్ష్మణునితోను, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి పద్దెనిమిదో దెబ్బ ఎనిమిదో లక్ష్మణునితోను గొడతాడు. తర్వాత మరలా ఒకడుగు వెనక్కివేసి తన కుడి చేతి మీదుగ తన చుట్టు తానే తిరిగి కొంచెం కుడి పక్కకు జరిగి పందొమ్మిదో దెబ్బ ఏడో లక్ష్మణునితో గొట్టి, తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవయ్యో దెబ్బ ఎనిమిదో లక్ష్మణునితో గొట్టి, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై ఒకటో దెబ్బ తొమ్మిదో లక్ష్మణునితో గొడతాడు. తర్వాత మరలా ఒకడుగు వెనక్కివేసి తన కుడి చేతి మీదుగ తన చుట్టు తానే తిరిగి కొంచెం కుడిపక్కకు జరిగి ఇరవై రెండో దెబ్బ ఎనిమిదో లక్ష్మణునితోను, తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై మూడో దెబ్బ తొమ్మిదో లక్ష్మణునితోను, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై నాల్గో దెబ్బ పదో లక్ష్మణునితోను గొడతాడు. తర్వాత మరలా ఒకడుగు వెనక్కివేసి తన కుడిచేతి మీదుగ తన చుట్టు తానే తిరిగి కొంచెం కుడి పక్కకు జరిగి ఇరవై ఐదో దెబ్బ తొమ్మిదో లక్ష్మణునితోను, తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై ఆరో దెబ్బ పదో లక్ష్మణునితోను, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై ఏడో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొడతాడు. తర్వాత మరలా ఒకడుగు వెనక్కివేసి తన కుడిచేతి మీదుగ తన చుట్టు తానే తిరిగి కొంచెం కుడి పక్కకు జరిగి ఇరవై ఎనిమిదో దెబ్బ పదో లక్ష్మణునితోగొట్టి, తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి ఇరవై తొమ్మిదో దెబ్బ ఒకటో లక్ష్మణునితోను, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి ముప్పయ్యో దెబ్బ రెండో లక్ష్మణునితోను గొడతాడు ఇట్లు ఒక వలయంచుట్టూ తిరిగి తన ఉద్దికాని వద్దకు వచ్చేటప్పటికి ఇరవై ఎనిమిది దెబ్బలు కొడతాడు. ఇట్లు అప సవ్య మార్గంలో తిరుగుతూ, ఎడమ పక్కలకు జరుగుతూ వెలుపలి వలయంలో స్థిరంగా నిల్చున్న లక్ష్మణునకు ఎదురుగా వెళ్ళి పుల్లలు గలుపుతూ కుడివైపుకు జరిగేముందు తన కుడిచేతి మీదుగ తనచుట్టు తానే తిరుగుతూ, కుడికి జరిగి అచ్చటి లక్ష్మణునితో పుల్ల గలుపుతూ మరలా ఎడమకు జరుగుతూ ఆడుతుంటాడు.

రాముళ్ళందరి చలనం ఇట్లే తమ ఎడమ పక్కకు జరుగుతూ మూడు దెబ్బలు కొట్టిన తర్వాత తమచుట్టు తామే తమ కుడిచేతి మీదుగ తిరుగుతూ, కొంచెం కుడికి జరిగి ఒక దెబ్బ కొడుతూ, అచటి నుంచి మరలా మూడు అడుగులు ముందుకు (ఎడమ పక్కకు) వేస్తూ, మూడు దెబ్బలు కొడుతూ, అపసవ్యమార్గంలో పయనిస్తూ ఆడుతుంటారు లక్ష్మణులు మాత్రం కదలకుండా స్థిరంగా ఉండి తమకు ఎదురుగా వచ్చిన రాముళ్ళకు కర్రలు అందిస్తుంటారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు. దీనినే పొర్లు కోపు అంటారు.

## 22. ప్రార్థన కోపు

దీనికే ఎదురు చక్రం కోపు, గణపతి కోపు అనే పేర్లు ఉన్నాయి. కోలాటంలో ఆట మొదలుపెట్టే ముందు ప్రార్థన ఉంటుంది. ఈ విధంగా ప్రార్థన చేసే కోపును ప్రార్థన కోపు అంటారు. సామాన్యంగా ఇష్టదేవతాస్తుతిలో ఎక్కువగా వినాయకుణ్ణే కొలుస్తారు పనికి విఘ్నం కలుగకుండా వినాయకుని కొలవడం ఎక్కువగా కనిపిస్తుంది. కోలాటంలో మొట్టమొదట వేసే ఈ కోపులో ఎక్కువ మంది జట్టునాయకులు "పరమపద గోవింద మాధవ పద్మనాభ జనార్దనా" అనే పాటను పాడతారు కొందరు "శరణు శరణు వైకుంఠనాయకా" అనే పాటను; కొందరు "శివశివ మూర్తివి గణనాదా", "నమోనమో నటరాజ" అనే పాటలను; మరికొందరు "ఏ గజారాజవదనం భజే" అనే పాటను; ఇంకొందరు తెలుగునాట నాటకారంభంలో పాడే ''పరాబ్రహ్మ పరామేశా'' అనే పాటను; మరికొందరు గురుభక్తి ప్రదర్శిస్తు ''శ్రీగురుపదములు మదిలోనెప్పుడు చింతన జేయుము రోరన్నా "అనే పాటనూ పాడుతుంటారు. జట్టునాయకుడు పీక ఊదగానే ఆటగాళ్లంతా ముందు వలయంగా ఏర్పడతారు ముందుగా వలయంలో వారివారి స్థానాల్ని స్థానాల మధ్య సుమారు రెండడుగుల దూరాన్ని చూసుకుని నిల్చుంటారు. బేసి స్థానాల్లో రాముళ్ళు, సరిస్థానాల్లో లక్ష్మణులు చేరుతారు. తర్వాత జట్టునాయకుడు మరొకమారు పీక ఊదగానే జట్టులోని ఆటగాళ్ళంతా ఇద్దరిద్దరు చొప్పున [illegible] బడతారు. అంటే బేసిస్థానంలోని ఆటగానికి అభిముఖంగా సరిస్థానంలోని ఆటగాడు నిల్చుంటాడు. బేసి స్థానాల్లో ఉన్న రాముళ్ళంతా తమతమ రెండుకర్రలను కలిపి




**22**

ముందువైపుకు చాపి ఒక కొన కిందకి జార్చి ఉంచిన కుడిచేతితో పట్టుకుంటారు. ఎదురుగా నిల్చున్న సరిస్థానాల్లోని లక్ష్మణులు రాముళ్ళ వలెనే వారి ఎడమచేతులతో రాముళ్ల కర్రల రెండోకొన పట్టుకుంటారు. లక్ష్మణులు వారి కర్రలు రెండూ కలిపి కుడిచేతితో పట్టుకుంటారు. రాముళ్లు, లక్ష్మణులు కలిపి పట్టుకున్న రాముళ్ల కర్రల మీద లక్ష్మణులు వారి కుడిచేతిలో పట్టుకున్న వారి కర్రలతో తాళాని కనుకూలంగా కొడుతుంటారు. జట్టు నాయకుడు చెప్పే పాటను ఆటగాళ్లంతా పాడతారు. ఇట్లా ప్రార్థన పాటను పూర్తిగా పాడిన తర్వాత జట్టు నాయకుడు "ఇట్టయ్యకు తద్ధిమిత్త" అని సంజ్ఞ ఇస్తాడు. దీనినే పాట విరవడం అంటారు. పాట విరవడంతోటే ప్రార్థన కోపు అయిపోతుంది. తర్వాత ఆటను మరొక కోపుతో మొదలుపెడతారు

## 23. బజారు కోపు

బజారుకోపు చదరంగం కోపును పోలిఉంటుంది. దానివలె క్లిష్టమైంది కూడా. ఇది దసరా కోలాటం, బజారు కోలాటం మొదలయిన వాటిలో వేస్తారు ఇందులోకూడ రామలక్ష్మణులని పేర్లు ఉంటాయి. ఆటకు ముప్పైమందిని తీసు కుంటే పాట తెగగొట్టగనే ముప్పైమంది వలయానికి పదిమంది చొప్పున మూడు వలయాలుగా ఏర్పడతారు. అయితే ఇందులో రాముడు, లక్ష్మణుడు ఉన్నట్లు కాదు ఇవి గుర్తుకోసం పెట్టుకున్న పేర్లు మూడు వలయాల్లోను బేసి స్థానాలైన ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిది స్థానాల్లో రాముళ్లు, సరిస్థానాలైన రెండు, నాలుగు, ఆరు, ఎనిమిది, పది స్థానాల్లో లక్ష్మణులు చేరుతారు. చదరంగంకోపులో నాల్గు వలయాల్లో పదారు స్థానాలు తిరుగుతారు. బజారుకోపులో మూడు వలయాలే ఉంటాయి కాబట్టి తొమ్మిది స్థానాలే తిరుగుతారు. తొమ్మిది స్థానాలదాకా వెళ్ళి మరలా అదే మార్గంలో వెనుదిరిగి పయనించి స్వస్థానం చేరుతారు.

ఒకటో వలయం ఒకటో రాముడు రెండో వలయం ఒకటో రామునితో పుల్లగలుపుతాడు. అపుడు మూడో వలయం ఒకటో రాముడు మూడో వలయం పదో లక్ష్మణునితో పుల్లగలుపుతాడు. తర్వాత ఒకటో వలయం ఒకటో రాముడు రెండో వలయం ఒకటో స్థానానికి చేరుతాడు. అప్పటికి రెండో వలయం ఒకటో రాముడు మూడో వలయం చేరుతాడు మూడో వలయం ఒకటో రాముడు సవ్య మార్గంలో పయనించి మూడో వలయంలో పదో స్థానానికి చేరుతాడు. రెండో వల యానికి చేరిన ఒకటో వలయం ఒకటో రాముడు మూడో వలయం ఒకటో స్థానానికి చేరిన రెండో వలయం ఒకటో రామునితో పుల్లగలిపి మూడో వలయాన్ని చేరుతాడు. తర్వాత సవ్యమార్గంలో పయనించి మూడో వలయం పదో స్థానానికి చేరుతాడు. అచటినుంచి ఒక్కొక్క స్థానాన్ని దాటుతూ రెండు, ఒకటి వలయాల పదోస్థానాల గుండా పయనించి ఒకటో వలయం తొమ్మిదో స్థానానికి చేరుతాడు. అచటినుంచి రెండో వలయంలోని తొమ్మిదోస్థానంగుండా పయనించి మూడోవలయం తొమ్మిదో స్థానం చేరుతాడు. అచటినుంచి వెనుకకు తిరిగి అదే మార్గంలో పయనించి తన స్థానం చేరుతాడు. అంటే మూడోవలయం తొమ్మిదోస్థానంనుంచి రెండు, ఒకటి వలయాలలో తొమ్మిదో స్థానాలగుండా పయనించి, అచటినుంచి అపసవ్యమార్గంలో చరిస్తూ ఒకటో వలయం పదోస్థానానికి చేరుతాడు. అచటినుంచి రెండు, మూడు

వలయాలలో పదోస్థానాలగుండా పయనించి మూడో వలయం ఒకటోస్థానం చేరు రాడు అచటినుంచి రెండో వలయం ఒకటో స్థానం గుండా తన స్థానం చేరుతాడు. అప్పటికి తొమ్మిది స్థానాలదాకావెళ్ళి తిరిగివస్తాడు. ఇట్లే ఒకటో వలయం, రెండో వలయం, మూడో వలయాలలోని బేసిస్థానాలైన ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిది స్థానాలలోని రాముళ్లు (బేసి స్థానాలలోనివాళ్ళంతా రాముళ్లే) మొదట సవ్యమార్గంలో పయనిస్తూ వరుసగా తొమ్మిదోస్థానందాకాచేరి తిరిగి అదేమార్గంలో అంటే అపసవ్యమార్గంలో పయనించి తమ తమ స్థానాలు చేరుతారు ప్రతిచోట ఈ పయనంలో ఎదురుగా వచ్చిన ఆటగాళ్ళతో పుల్లలు గలుపుతారు. ఈ కోపులో పిడ్డలుగా ఏర్పడడం కన్పించదు.




23

అట్లే ఒకటో వలయంలో రెండో స్థానంలో ఉన్న లక్ష్మణుడు రెండు, మూడు వలయాల రెండో స్థానాలు దాటి అపసవ్య మార్గంలో పయనించి మూడో వలయం మూడో స్థానానికి చేరుతాడు అచ్చటినుంచి రెండు, ఒకటి వలయాలలో మూడో స్థానాలగుండా పయనించి ఒకటో వలయం నాల్గో స్థానం చేరి, రెండో వలయం నాల్గో స్థానం గుండా పయనించి మూడో వలయం నాల్గో స్థానానికి చేరుతాడు. అచ్చటినుంచి వెనుకకు తిరిగి, తన స్థానానికి చేరుతాడు. అంటే మూడో వలయం నాల్గో స్థానం నుంచి రెండు, ఒకటి వలయాలలో నాల్గో స్థానాలగుండా పయనించి అచ్చటి నుంచి సవ్యమార్గంలో చరిస్తూ ఒకటో వలయం మూడో స్థానానికి చేరుతాడు అచ్చటినుంచి రెండు, మూడు వలయాలలో మూడో స్థానాల గుండా పయనించి మూడో వలయం రెండో స్థానం చేరుతాడు. అచ్చటి నుంచి రెండో వలయం రెండో స్థానంగుండా పయనించి తన స్థానమైన ఒకటో వలయం రెండో స్థానం చేరుతాడు అట్లే మూడు వలయాలలోని సరి స్థానాలలో ఉన్న లక్ష్మణులు మొదట అపసవ్య మార్గంలో వరుసగా తొమ్మిది స్థానాలదాకా వెళ్ళి, తర్వాత సవ్యమార్గంలో వారు పయనించిన స్థానాలగుండానే చరిస్తూ తమ స్థానాలు చేరుతారు. ఈ కోపులో రాముళ్లు, లక్ష్మణులు అందరు కూడ లోపలి వలయం నుంచి వెలుపలి వలయం వైపుకే పయనిస్తారు. కాని చదరంగం కోపులో రాముళ్లు లోపలి వలయాలనుంచి వెలుపలి వలయాలకు, లక్ష్మణులు వెలుపలి వలయాల నుంచి లోపలి వలయాలకు పయనిస్తారు.

ఇట్లు రాముళ్ళు మొదట సవ్యమార్గంలో పయనించి, తిరుగు ప్రయాణంలో అపసవ్య మార్గంలో పయనిస్తారు. అట్లే మొదట అపసవ్య మార్గంలో పయనించి, తిరుగు ప్రయాణంలో సవ్యమార్గంలో పయనిస్తారు. ఇట్లా తిరుగుతూ కోలాట మాడుతారు. చదరంగం కోపు తర్వాత కష్టమైన కోపుగా దీన్ని చెప్తారు ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు దీనినే బజారుకోపు అంటారు

## 24. బురుజుల కోపు

కోట బురుజులవలె దీని గతి చుట్టూ ఉండడంవల్ల దీన్ని బురుజుల కోపు అనడం సమర్థనీయంగా ఉంది. పాట లెగ గొట్టడం, రామలక్ష్మణులు లోపలి, వెలుపలి వలయాలకు రావడం, ఉద్దులు పుల్లలు గంపడంతో కోపు మొదలవు తుంది. ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితోగొట్టి ఒకటి, రెండు

లక్ష్మణుడు మధ్యగా వెలుపలి వలయానికి వస్తాడు ఒకటో లక్ష్మణుడు ఒకటో రామునితో పుల్లగలిపిన తర్వాత రెండో స్థానంలో ఉన్న రామ లక్ష్మణుల మధ్యగా పయనించి లోపలి వలయానికి చేరుతాడు. ఈ రామ లక్ష్మణుల పయనం అపసవ్య మార్గంతో ఉంటుంది. వెలుపలి వలయానికి వచ్చిన ఒకటో రాముడు, లోపలి వలయానికి వచ్చిన ఒకటో లక్ష్మణుడు అచ్చట పుల్లగలిపి మరలా వలయాలు మారుతారు. ఈసారి ఒకటో రాముడు అప్పటికి ఎడమ పక్కనే ఉన్న నాల్గో స్థానంలో ఉన్న రామలక్ష్మణుల మధ్యగా పయనించి వెలుపలి వలయంనుంచి లోపలివలయానికి వస్తాడు. ఒకటో లక్ష్మణుడు వెలుపలి వలయంలో ఉన్న ఒకటి,




24

నాల్గు స్థానాల రాముళ్ళ మధ్యగా పయనించి వెలుపలి వలయానికి చేరుతాడు ఇట్లే పుల్ల గలుపుతూ వెలుపలి వలయంలో ఉన్నవాళ్ళు ఎదుటి ఉద్ది మధ్యగాను, లోపలి వలయంలో ఉన్నవాళ్ళు తన ఉద్దికానికి, వాళ్ళకి ఎడమ పక్కన ఉన్న వెలుపలి వలయం ఆటగానికి మధ్యగాను పయనిస్తూ వలయాలు మారుతూ ఆడుతుంటారు. ఇట్లే మూడు, ఐదు, ఏడు, తొమ్మిది మొదలయిన బేసి సంఖ్యల స్థానాల ఉద్దులు అపసవ్యమార్గంలో పయనిస్తాయి అట్లే రెండో రాముడు రెండో లక్ష్మణునితో పుల్లగలిపి సవ్యమార్గంలో రెండు, పది లక్ష్మణుల మధ్యగా పయనించి వెలుపలి వలయానికి వస్తాడు. అట్లే రెండో లక్ష్మణుడు రెండో రామునితో పుల్లగలిపి ఒకటో ఉద్ది రామలక్ష్మణుల మధ్యగా సవ్యమార్గంలో పయనించి లోపలి వలయానికి చేరుతాడు. తర్వాత వెలుపలి వలయానికి వచ్చిన రెండో రాముడు లోపలి వలయానికి వచ్చిన రెండో లక్ష్మణునితో పుల్ల గొట్టి పక్కనే ఉన్న తొమ్మిదో ఉద్ది రామలక్ష్మణులకు మధ్యగా పయనించి మరలా లోపలి వలయానికి వస్తాడు. అట్లే రెండో లక్ష్మణుడు రెండో రామునితో పుల్లకలిపి పక్కనేవున్న తొమ్మిదో రామునకు, తన ఉద్దికాడైన రెండో రామునకు మధ్యగా పయనించి వెలుపలి వలయానికి వస్తాడు ఇట్లు రెండో ఉద్ది రామలక్ష్మణులు వెలుపలి వలయంలోని వాళ్ళు పక్కనే ఉన్న ఉద్దికాళ్ళ మధ్యగా పయనించి, లోపలి వలయానికి, లోపలి వలయంలోని వాళ్ళు పక్క ఉద్దిలో వెలుపలి వలయం ఆటగానికి, తన ఉద్దికానికి మధ్యగా పయనించి వెలుపలి వలయానికి మారుతూ, పుల్లలు గలుపుతూ సవ్యమార్గంలో పయనిస్తుంటారు ఇట్లే నాల్గు, ఆరు, ఎనిమిది, పది స్థానాలలోని ఉద్ది కాళ్ళు సవ్యమార్గంలో పయనిస్తుంటారు. ఉసెత్తులో ఆటవేగాన్ని పెంచుతారు. దీనినే బురుజుల కోపు అంటారు.

## 25. భామ కోపు

ఇంపైన పదాల్లో భామపదం ఒకటి. ఆ పేరుమీద వెలసింది భామకోపు. పాటలిరవడం, రాముళ్లు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది. ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, మరి కొంచెం ఎడమపక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి వస్తాడు.

ఈ మూడో దెబ్బ వెలుపలి వలయానికివచ్చిన ఒకటో రామునికి మొదటి దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితోను, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ ఒకటో లక్ష్మణునితోను గొట్టి వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లా లోపలి వలయంలో ఎడమపక్కకు జరుగుతూ మూడు దెబ్బలు ముగ్గురు లక్ష్మణులతో గొడుతూ అపసవ్యమార్గంలో పయనించి వలయం మారి వెలుపలి వలయంలో కూడ ఎడమపక్కకే జరుగుతూ సవ్యమార్గంలో పయనిస్తూ తన ఉద్ది కాని వద్ద వలయం మారుతాడు. ఇట్లే రాముళ్లందరూ మొదట అపసవ్య మార్గం




25

లోను, తర్వాత సవ్యమార్గంలోను పయనిస్తూ మూడోదెబ్బ కొట్టి అచటి లక్ష్మణుని వద్ద వలయం మారుతుంటారు. అంటే లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు నాల్గో లక్ష్మణుని వద్ద, మూడో రాముడు ఐదో లక్ష్మణుని వద్ద, నాల్గో రాముడు ఆరో లక్ష్మణుని వద్ద, ఐదో రాముడు ఏడో లక్ష్మణునివద్ద, ఆరో రాముడు ఎనిమిదో లక్ష్మణునివద్ద, ఏడో రాముడు తొమ్మిదో లక్ష్మణునివద్ద, ఎనిమిదో రాముడు పదో లక్ష్మణుని వద్ద, తొమ్మిదో రాముడు ఒకటో లక్ష్మణుని వద్ద, పదోరాముడు రెండో లక్ష్మణునివద్ద మారుతారు. మరలా వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్ల వద్ద మారుతారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి, మరి కొంచెం ఎడమపక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో రామునితో గొట్టి వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు. ఈ మూడో దెబ్బ లోపలి వలయానికి వచ్చిన లక్ష్మణునకు ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండోదెబ్బ వెలుపలి వలయానికి వచ్చి తనకు ఎదురుగా వచ్చిన పదో రామునితో గొట్టి, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ ఒకటో రామునితో గొట్టి లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లా ఎడమపక్కకు జరుగుతూ వెలుపలి వలయంలో సవ్యమార్గంలో పయనిస్తూ మూడో దెబ్బ కొట్టిన తర్వాత వలయం మారి లోపలి వలయంలో అపసవ్య మార్గంలో పయనిస్తూ ఆడుతుంటారు. లక్ష్మణులంతా ఇదే పద్ధతిలో పయనిస్తూ ఆడుతుంటారు. అంటే వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు పదో రాముని వద్ద, మూడో లక్ష్మణుడు ఒకటో రామునివద్ద నాల్గో లక్ష్మణుడు రెండో రాముని వద్ద, ఐదో లక్ష్మణుడు మూడో రామునివద్ద, ఆరో లక్ష్మణుడు నాల్గో రాముని వద్ద, ఏడో లక్ష్మణుడు ఐదో రాముని వద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఆరో రామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఏడో రాముని వద్ద, పదో లక్ష్మణుడు ఎనిమిదో రాముని వద్ద మారుతారు. మరలా లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు వారి వారి ఉద్దికాళ్ల వద్ద

మారుతారు. ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు ఎడమ పక్కకు జరుగుతూ వెలుపలి వలయంలో సవ్యమార్గంలోను, లోపలి వలయంలో అపసవ్య మార్గంలోను పయ నిస్తుంటారు వరగత్తెర కోపులో వలయం మారేచోట కర్రవెనుకకు కొడతారు. కాని భామకోపులో కర్రలు ముందుకు ఊపుతారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచు తారు. దీనినే భామకోపు అంటారు.

## 26. భారత కోపు

"భారత దేవిరో" అనే పాటపేరు మీదుగా ఈ కోపుపేరు పెట్టబడింది. భారత కోపులో ముఖ్యంగా "భారతదేవిరో నిన్నూ" అనేపాటను,మరికొన్ని పాటలను పాడుతారు. దేశ నామంకూడా సరిపోతుంది. పాట తెగగొట్టడం, రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలప డంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటోదెబ్బ ఒకటో లక్ష్మణునితోగొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండోదెబ్బ రెండోలక్ష్మణునితో గొట్టి, మరికొంచెం ఎడమపక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి, తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి నాల్గోదెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, మరల ఎడమ పక్కకు జరిగి ఐదోదెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి, ఇంకొంచం ఎడమ పక్కకు జరిగి ఆరోదెబ్బ నాల్గో లక్ష్మణునితో గొట్టి వెలుపలి వలయానికి వస్తాడు. ఈ ఆరోదెబ్బ వెలుపలి వలయంలో ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. వెలుపలి వలయం లోని ఒకటో రాముడు కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ లోపలి వలయంలో తనకెదురుగా వచ్చిన మూడోలక్ష్మణునితో గొట్టి, మరికొంచెం ఎడమ పక్కకుజరిగి మూడోదెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి నాల్గోదెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదోదెబ్బ రెండో లక్ష్మణునితోగొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఆరోదెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితోకొట్టి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్ళంతా పయనిస్తూ వలయాలు మారుతూ ఆడుతుంటారు. అంటే లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు ఐదో లక్ష్మణునివద్ద, నాల్గోరాముడు ఏడో లక్ష్మణువద్ద, ఐదో

రాముడు ఎనిమిదో లక్ష్మణునివద్ద, ఏడో రాముడు పదో లక్ష్మణునివద్ద. ఎనిమిదో రాముడు ఒకటో లక్ష్మణునివద్ద, పదోరాముడు మూడో లక్ష్మణునివద్ద మారుతారు. అట్లే వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి మారేటప్పుడు తమతమ ఉద్ది కాళ్ళతో ఆరోదెబ్బకొట్టి వలయం మారుతారు.

అట్లే లక్ష్మణుల చలనం ఉంటుంది. అంటే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి మరికొంచెం ఎడమపక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో రామునితో గొట్టి, తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి నాల్గో దెబ్బ పదో




26

రామునితో గొట్టి, తర్వాత మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి ఐదో దెబ్బ తొమ్మిదో రామునితో గొట్టి, తర్వాత ఇంకా కొంచెం ఎడమపక్కకు జరిగి ఆరో దెబ్బ ఎనిమిదో రామునితో గొట్టి, వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు. ఈ ఆరో దెబ్బ లోపలి వలయంలో ఒకటో దెబ్బగా పరిగణించబడు తుంది. తర్వాత కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో దెబ్బ తొమ్మిదో రాముని తోను, ఇంకొంచెం ఎడమపక్కకు జరిగి మూడో దెబ్బ పదో రామునితోను, తర్వాత కొంచెం కుడి పక్కకు జరిగి నాల్గో దెబ్బ తొమ్మిదో రామునితో గొట్టి మరలా ఎడమపక్కకు జరిగి ఐదో దెబ్బ పదో రామునితో గొట్టి, ఇంకా కొంచెం ఎడమపక్కకు జరిగి తన ఉద్దికాడైన ఒకటో రామునితో ఆరో దెబ్బ కొట్ట లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులంతా ఎడమ, కుడి పక్కలకు జరుగుతూ పక్కనున్న వారితో పుల్లలు గలుపుతూ వలయాలు మారుతూ ఆడుతుంటారు. అంటే వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు తొమ్మిదో రామునివద్ద, మూడో లక్ష్మణుడు పదో రాముని వద్ద, నాల్గో లక్ష్మణుడు ఒకటో రామునివద్ద, ఐదో లక్ష్మణుడు రెండో రాముని వద్ద, ఆరో లక్ష్మణుడు మూడో రామునివద్ద, ఏడో లక్ష్మణుడు నాల్గో రామునివద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఐదో రాముని వద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఆరో రాముని వద్ద, పదో లక్ష్మణుడు ఏడో రాముని వద్ద మారుతారు. అట్లే లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు ఆరో దెబ్బ తమ తమ ఉద్దిరాళ్లతో కొట్టి వలయం మారుతారు.

ఇట్లు రాముళ్ళు, లక్ష్మణులు ఎడమపక్కకు జరుగుతూ వెలుపలి వలయంలో సవ్యమార్గంలోను, లోపలి వలయంలో అపసవ్యమార్గంలోను పయనిస్తూ, వలయాలు మారుతూ ఆడుతుంటారు ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచు తారు. దీన్నే భారత కోపు అంటారు.

## 27. మల్లెపందిరి కోపు

"మల్లెపందిరదిగో సెలి - మాదపుడల్లడుగో" అనే పాట పల్లవి మీదుగా మల్లెపందిరికోపు ఏర్పడింది. దీని గతి పూర్తిగా గమనిస్తే మల్లెలకు వేసిన పందిరివలె ఉంటుంది. పాట తెగగొట్టడం, రాముళ్లు లోపలి వలయానికి, లక్ష్మ

ణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొద లవుతుంది.

ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో లక్ష్మణునివద్ద ఒక కాలిమీద దొంతు కూర్చొని రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, కూర్చొని ఉండే కుడివైపుకు తిరిగి మూడో దెబ్బ ఒకటో లక్ష్మణునితోను, నాల్గో దెబ్బ మరలా రెండో లక్ష్మణుని తోను గొట్టి, ఐదో దెబ్బ కూర్చొన్న చోటునుంచి లేస్తూ మూడో లక్ష్మణునితోగొట్టి లేచి లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు. వెలుపలి వలయంలోని లక్ష్మణులు వెలుపలి వలయంలోనే ఉంటారు. అయితే ఒకటో రాముడు ఐదోదెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి, మూడు, నాల్గు లక్ష్మణుల మధ్యకు వస్తాడు అపుడు గరిడీ అంతా ఒకే వలయంగా ఏర్పాటవుతుంది. తర్వాత అందరూ ఒకరి చేతులు మరొకరు పట్టుకొని పాట కనుకూలంగా చేతులు పైకి ఎత్తుతూ, అడుగులు వేస్తూ, నెమ్మదిగా ఎడమ పక్కకు జరుగుతూ చుట్టూ అపసవ్యమార్గంలో తిరుగుతారు. రాముళ్లంతా ఇదే పద్ధతిలో పయనిస్తూ వెలుపలి వలయాంలోని లక్ష్మణుల మధ్యకు వస్తారు. అంటే లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వచ్చేటప్పుడు రెండో రాముడు నాల్గు, ఐదు లక్ష్మణుల మధ్యకు, మూడో రాముడు ఐదు, ఆరు లక్ష్మ ణుల మధ్యకు, నాల్గో రాముడు ఆరు, ఏడు లక్ష్మణుల మధ్యకు, ఐదో రాముడు ఏడు, ఎనిమిది లక్ష్మణుల మధ్యకు, ఆరో రాముడు ఎనిమిది, తొమ్మిది లక్ష్మణుల మధ్యకు, ఏడో రాముడు తొమ్మిది, పది లక్ష్మణులమధ్యకు, ఎనిమిదో రాముడు పది, ఒకటి లక్ష్మణుల మధ్యకు, తొమ్మిదో రాముడు ఒకటి, రెండు లక్ష్మణుల మధ్యకు, పదో రాముడు రెండు, మూడు లక్ష్మణుల మధ్యకు వస్తారు. ఒకే వల యంగా ఏర్పడిన తర్వాత అంతా కలసి చేతులు కలిపి పట్టుకొని, చేతులు పైకి ఎత్తుతూ, అడుగులు వేస్తూ, అపసవ్య మార్గంలో నెమ్మదిగా తిరుగుతారు. కొంత సేపు ఇట్లా ఆడిన తర్వాత జట్టు నాయకుని సంజ్ఞ మేరకు రాముళ్లంతా లోపలి వలయానికి వస్తారు. తర్వాత మరలా పై మాదిరిగానే జరుగుతూ ఆడుతుంటారు.

ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి అప్పటికి ఎదురుగా వచ్చిన పదో రామునివద్ద ఒక కాలిమీద దొంతు కూర్చొని రెండో దెబ్బ పదో రామునితోను, మూడోదెబ్బ కూర్చొని ఉండే

ముఖం కొంచెం కుడి పక్కకు తిప్పి ఒకటో రామునితోను, నాల్గో దెబ్బ మరలా పదో రామునితోను గొట్టి ఐదో దెబ్బలేస్తూ తొమ్మిదో రామునితోను గొట్టి లేస్తాడు లక్ష్మణులు వెలుపలి వలయంలోనే ఉంటారు. అపుడు లోపలి వలయం నుంచి రాముళ్ళు వచ్చి వెలుపలి వలయంలో చేరుతారు ఒకే వలయంగా ఏర్పడిన తర్వాత రామ లక్ష్మణులు చేతులు పట్టుకుని, పైకి ఎత్తుతూ, అడుగులు వేస్తూ, అపసవ్య మార్గంలో తిరుగుతూ ఆడుతుంటారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు. దీనినే మల్లెపందిరి కోపు అంటారు




27

## 28. మాయబజార్ కోపు

పాట చలనాన్ని బట్టి ఈ పేరుకు కొంత సామ్యం చెప్పవచ్చు. పాట తెగ గొట్టడం, రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావటం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో లక్ష్మణునితో పుల్లగొట్టి తన ఎడమచేతిని లోజేసుకొని తనచుట్టు తానే తిరిగి (అపసవ్యముఖంగా) ఒకడుగు ముందుకు జరిగి ఒకటో




28

లక్ష్మణునితో పుల్ల గలుపుతాడు అంటే ఒకటో లక్ష్మణుడు కూడా ఒకటో రామునితో పుల్లగలిపిన తర్వాత తన ఎడమ చేతిని లోజేసుకొని తన చుట్టు తానే తిరిగి ఒకడుగు ముందుకు జరిగి అంటే కొంచెం కుడి పక్కకు జరిగి అప్పటికి తనకు ఎదురుగా వచ్చిన ఒకటో రామునితో పుల్లగలుపుతాడు. ఇట్లే రాముళ్ళు ఎడమ పక్కకు, లక్ష్మణులు కుడి పక్కకు జరుగుతూ తమ చుట్టు తామే ఎడమ చేయి మీదుగా తిరుగుతూ ఉద్దికానితో పుల్లలు గలుపుతూ వలయం అంతా తిరిగి వస్తారు. రాముళ్ళు, లక్ష్మణులు ఉద్దులుద్దులుగా కలసి అపసవ్య మార్గంలో పయనిస్తుంటారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు. దీనినే మాయబజార్ కోపు అంటారు.

## 29. రాంబాణం కోపు

కోపు వేసేటపుడు మధ్యలో బాణం వేసే పద్ధతిలో నటిస్తుంటారు. బాణం అనగానే రామబాణం గుర్తొస్తుంది. కాబట్టి ఈ కోపుకు ఈ పేరు వచ్చి ఉండవచ్చు పాట తెగగొట్టడం, రాముళ్లు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొడతాడు ఇట్లే కొంచెం కొంచెం ఎడమ పక్కకు జరుగుతూ ఎదురుగా వచ్చిన మూడో లక్ష్మణునితో మూడో దెబ్బ, నాల్గో లక్ష్మణునితో నాల్గో దెబ్బ, ఐదో లక్ష్మణునితో ఐదో దెబ్బ, ఆరో లక్ష్మణునితో ఆరో దెబ్బ, ఏడో లక్ష్మణునితో ఏడో దెబ్బ, ఎనిమిదో లక్ష్మణునితో ఎనిమిదో దెబ్బ, తొమ్మిదో లక్ష్మణునితో తొమ్మిదో దెబ్బ, పదో లక్ష్మణునితో పదో దెబ్బ కొట్టి, పదకొండో దెబ్బను మరలా ఒకటో లక్ష్మణుని వద్ద కూర్చొని మరలా లేచి కొడతాడు. ఇట్లే అపసవ్య మార్గంలో కొంచెం కొంచెం ఎడమపక్కకు జరుగుతూ ఎదురుగా వచ్చిన లక్ష్మణునితో పుల్ల గలుపుతూ తిరుగుతుంటాడు అయితే ప్రతి లక్ష్మణునితో పుల్లగలిపేముందు రాముడు ఎడమకాలు ముందుకు అడుగువేస్తూ కుడిచేతిని పైకెత్తికొడతాడు. అంటే రాముడు బాణము వేసేటప్పుడు ఎడమకాలు ముందడుగువేసి, ఎడమచేత విల్లు ఎక్కుపెట్టి, వెనుకవున్న పొదినుంచి అమ్ము తీయడానికి కుడిచేతిని ఎత్తినట్లుగా ఆటగాడు అనుకరిస్తుంటాడు. ఎడమకాలు

ముందుకు వేసి, ఎడమచేతిలోని కఱ్రతో విల్లు ఎక్కుపెట్టినట్లుగా అభినయిస్తూ లక్ష్మణుని కఱ్రతో దెబ్బ కొడతాడు తర్వాత కుడిచేతిలోని కఱ్రతో పొదినుంచి బాణం తీస్తున్నట్లు నటిస్తూ చేయెత్తి లక్ష్మణుని కఱ్రతో దెబ్బ కొడతాడు. అంతే ఈ కోపులో పుల్లలు ఒక్కొక్కటే కలుపుతారు. రెండూ కలిపి కొట్టడం జరగదు. ఇట్లే రాముళ్లంతా కొంచెం కొంచెం ఎడమపక్కకు జరుగుతూ అపసవ్యమార్గంలో పయనిస్తూ ఎదురుగావచ్చిన లక్ష్మణులతో పుల్లలు గలుపుతూ తన ఉద్దికాళ్ళు ఎదురుగా రాగానే ఇద్దరూ కలిసి కూర్చొని లేచి మరలా అట్లే అపసవ్యమార్గంలో తిరుగుతూ ఆడుతుంటారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి, ఇట్లే కొంచెం కొంచెం



ఎడమ పక్కకు జరుగుతూ మూడో దెబ్బ తొమ్మిదో రామునితోను, నాల్గో దెబ్బ ఎనిమిదో రామునితోను, ఐదోదెబ్బ ఏడో రామునితోను, ఆరో దెబ్బ ఆరో రాముని తోను, ఏడో దెబ్బ ఐదో రామునితోను, ఎనిమిదో దెబ్బ నాల్గో రామునితోను, తొమ్మిదో దెబ్బ మూడో రామునితోను, పదో దెబ్బ రెండో రామునితోను కొట్టి, పదకొండో దెబ్బ తన ఉద్దికాడు ఎదురుగా రాగానే ఇద్దరూ కలసి కూర్చొని, లేచి తర్వాత ఒకటో రామునితో గొట్టి, అల్లే ఎడమ పక్కగా జరుగుతూ పుల్లగలు పుతూ సవ్యమార్గంలో పయనిస్తూ ఆడుతుంటారు. ఈ కోపులో వలయాలుమారడం ఉండదు ప్రతిచోట రామునితో పుల్ల గలిపేముందు రామునివలెనే లక్ష్మణుడు కూడ బాణం వేస్తున్నట్లు నటిస్తుంటాడు. అంటే ఎడమకాలు ముందుకు వేయడం, ఎడమ చేయి ముందుకు చాచడం, కుడిచేయి పైకెత్తి వెనుకకుపోనిచ్చి పైనుంచే కొట్టడం మొదలైన పద్ధతులే ఉంటాయి. అల్లే లక్ష్మణులంతా రాముళ్ళతో పుల్లలు గలిపేముందు బాణంవేసే పద్ధతిలో అనుకరిస్తూ, కొంచెం కొంచెం ఎడమపక్కకు జరుగుతూ తనకు ఎదురుగా వచ్చిన రాముళ్ళతో పుల్లలు గలుపుతూ, సవ్య మార్గంలో తిరుగుతూ, వారి ఉద్దికాళ్ళు ఎదురుగా రాగానే వాళ్లతో కలసి దొంతు కూర్చొని, వెంటనే లేచి మరలా పుల్లగలిపి అదే పద్ధతిలో పయనిస్తూ ఆడుతుం టారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు దీనినే రాంబాణం కోపు అంటారు.

## 30. రెడ్డోరి కోపు

రెడ్డి అంటే గ్రామాధికారి. గ్రామాధికారులమీద గౌరవంతో, లేదా రెడ్డి కులంమీద గౌరవంతో ఏర్పాటుచేసిన కోపు రెడ్డోరికోపు అయిఉండవచ్చు. పాట తెగగొట్టడం, రాముళ్ళంతా లోపలి వలయానికి, లక్ష్మణులంతా వెలుపలి వలయా నికి రావడం, ఉద్దులు పుల్లలుగలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటోదెబ్బ ఒకటో లక్ష్మణునితోగొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండోదెబ్బ రెండో లక్ష్మణునితోను, ఇంకొంచెం ఎడమపక్కకు జరిగి మూడోదెబ్బ మూడో లక్ష్మణునితోను కొట్టి, ఇంకా కొంచెం ఎడమపక్కకు జరిగి నాల్గోదెబ్బ నాల్గో లక్ష్మణునితో కూర్చొనికొట్టి, మరలాలేచి ఐదోదెబ్బ నాల్గో లక్ష్మణునితోగొట్టి లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి వస్తాడు. ఈ ఐదోదెబ్బ వెలుపలి వలయంలో ఒకటో రామునికి ఒకటోదెబ్బగా పరిగణించబడు

తుంది. తర్వాత వెలుపలి వలయంలోని రాముడు కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ మూడో లక్ష్మణునితోను, ఇంకొంచెం ఎడమపక్కకు జరిగి మూడోదెబ్బ రెండో లక్ష్మణునితోనుకొట్టి, ఇంకాకొంచెం ఎడమపక్కకుజరిగి నాల్గోదెబ్బ ఒకటో లక్ష్మణునితో కూర్చొనికొట్టి మరలాలేచి ఐదోదెబ్బ ఒకటో లక్ష్మణునితోకొట్టి వెలుపలి వలయంనుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్ళంతా కొంచెం కొంచెం ఎడమపక్కకు జరుగుతూ నాల్గోదెబ్బ కూర్చొనికొట్టి లేచి ఐదో దెబ్బ కొట్టి వలయాలు మారుతూ ఆడుతుంటారు అంటే లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండోరాముడు ఐదోలక్ష్మణునివద్ద, నాల్గో రాముడు ఏడోలక్ష్మణునివద్ద,ఐదోరాముడు ఎనిమిదో లక్ష్మణునివద్ద, ఆరోరాముడు తొమ్మిదో లక్ష్మణునివద్ద, ఏడోరాముడు పదో లక్ష్మణునివద్ద, ఎనిమిదో రాముడు ఒకటో లక్ష్మణునివద్ద, తొమ్మిదో రాముడు రెండో లక్ష్మణునివద్ద, పదోరాముడు మూడో లక్ష్మణునివద్ద ఐదోదెబ్బకొట్టి వలయం మారుతారు. అట్లే వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి మారేటప్పుడు తమతమ ఉద్దికాళ్ళతో అయిదో దెబ్బకొట్టి మారుతారు.

వెలుపలి వలయంలోని లక్ష్మణుల చలనం కూడా ఇట్లే ఉంటుంది. అంటే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో కొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండోదెబ్బ పదో రామునితోను, మరి కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో రామునితోనుకొట్టి, ఇంకా కొంచెం ఎడమపక్కకు జరిగి నాల్గో దెబ్బ ఎనిమిదో రామునితో కూర్చొని కొట్టి, మరలా లేచి ఐదో దెబ్బ కూడా ఎనిమిదో రామునితోనే కొట్టి, వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి వస్తాడు. ఈ ఐదోదెబ్బ లోపలి వలయంలో లక్ష్మణునకు ఒకటో దెబ్బగా పరిగ ణించబడుతుంది. తర్వాత లోపలి వలయంలోని లక్ష్మణుడు కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ తొమ్మిదో రామునితోను, మరికొంచెం ఎడమపక్కకు జరిగి మూడో దెబ్బ పదో రామునితోను కొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గోదెబ్బ ఒకటో రామునితో కూర్చొని కొట్టి, మరలా లేచి ఐదో దెబ్బ కూడా ఒకటో రామునితోగొట్టి లోపలివలయం నుంచి మరలా వెలుపలి వలయా నికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులంతా కొంచెం కొంచెంగా జరుగుతూ నాల్గో దెబ్బ రాముళ్ళవద్ద కూర్చొని కొట్టి, లేచి ఐదో దెబ్బకూడా ఆ రాముళ్ళతోనే కొట్టి వల యాలు మారుతూ ఆడుతుంటారు. అంటే వెలుపలి వలయంనుంచి లోపలి వలయా

నికి మారేటప్పుడు ఐదోదెబ్బ కొట్టి రెండో లక్ష్మణుడు తొమ్మిదో రాముని వద్ద, మూడో లక్ష్మణుడు పదో రామునివద్ద, నాల్గో లక్ష్మణుడు ఒకటో రామునివద్ద, ఐదో లక్ష్మణుడు రెండో రామునివద్ద, ఆరో లక్ష్మణుడు మూడో రాముని వద్ద, ఏడో లక్ష్మణుడు నాల్గో రామునివద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఐదో రామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఆరో రామునివద్ద, పదో లక్ష్మణుడు ఏడో రామునివద్ద మారుతారు. ఇట్లే లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి మారే టప్పుడు ఐదోదెబ్బ కొట్టి తమ తమ ఉద్దికాళ్ళవద్ద మారుతారు




30

ఇట్లు రాముళ్ళు, లక్ష్మణులు తమ తమ ఎడమ పక్కకు జరుగుతూ వెలుపలి వలయంలో సవ్యమార్గంలోను, లోపలి వలయంలో అపసవ్యమార్గంలోను పయనిస్తూ, ఐదోదెబ్బ కొట్టి వలయాలు మారుతూ ఆడుతుంటారు ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు దీనినే రెడ్డోరి కోపు అంటారు.

## 31. లలిత కోపు

లలితం అంటే మనోజ్ఞమైనదని అర్థం ఇంకా చెప్పాలంటే "సుకుమారంచే నగు అంగవిన్యాసరూపమైన స్త్రీల యొక్క శృంగార చేష్టావిశేషం"[18] అనే అర్థం ఉంది. అయితే పదం అర్థానికి, కోపుకి సంబంధం కన్పడదు పాట తెగగొట్టడం, రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం ఉద్దులు పుల్లలు గలపడంతో కోపు ప్రారంభం అవుతుంది.

ఒకటో రాముడు ఒకటో లక్ష్మణునితో పుల్లగలిపి, తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో లక్ష్మణునితో పుల్ల గలిపి, తర్వాత మరి కొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో లక్ష్మణునితో పుల్లగలిపి, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో లక్ష్మణునితో నాల్గోదెబ్బ కొట్టి లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి వస్తాడు ఈ నాల్గోదెబ్బ వెలుపలి వలయంలో ఒకటో రామునకు ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. ఒకటో రాముడు కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ మూడో లక్ష్మణునితోను, మూడో దెబ్బ రెండో లక్ష్మణునితోను, నాల్గో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునిలోను గొట్టి మరలా వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్లందరి చలనం ఉంటుంది. అంటే లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు ఐదో లక్ష్మణునివద్ద, మూడో రాముడు ఆరో లక్ష్మణునివద్ద, నాల్గో రాముడు ఏడో లక్ష్మణునివద్ద, ఐదో రాముడు ఎనిమిదో లక్ష్మణువద్ద, ఆరో రాముడు తొమ్మిదో లక్ష్మణునివద్ద, ఏడో రాముడు పదో లక్ష్మణునివద్ద, ఎనిమిదో రాముడు ఒకటో లక్ష్మణునివద్ద, తొమ్మిదో రాముడు రెండో లక్ష్మణునివద్ద, పదో రాముడు మూడో లక్ష్మణునివద్ద మారుతారు. తర్వాత వెలుపలి వలయంనుంచి

---

18. శ.ర., పు. 678.

లోపలి వలయానికి మారేటప్పుడు తమతమ ఉద్దికాళ్లవద్ద మారుతారు. ఇట్లు రాముళ్లు మొదట అపసవ్యమార్గంలోను, తర్వాత సవ్యమార్గంలోను పయనిస్తుంటారు.

ఆట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో రామునితో ఒకటో దెబ్బ కొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో దెబ్బ పదో రామునితో గొట్టి, మరలా కొంచెం ఎడమపక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో రామునితో గొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ ఎనిమిదో రామునితో గొట్టి వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు ఈ నాల్గో దెబ్బ లోపలి వలయంలో

31

ఒకటో లక్ష్మణునకు ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. లోపలి వలయంలోని లక్ష్మణుడు రెండో దెబ్బ, కొంచెం ఎడమపక్కకు జరిగి తొమ్మిదో రామునితోను, మరికొంచెం ఎడమపక్కకు జరిగి మూడో దెబ్బ పదో రామునితోను, ఇంకా కొంచెం ఎడమపక్కకు జరిగి నాల్గో దెబ్బ పన ఉద్దకాడైన ఒకటో రామునితోను గొట్టి లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు ఇట్లే లక్ష్మణులందరి చలనం ఉంటుంది అంటే వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు తొమ్మిదో రామునివద్ద, మూడో లక్ష్మణుడు పదో రాముని వద్ద, నాల్గో లక్ష్మణుడు ఒకటో రామునివద్ద, ఐదో లక్ష్మణుడు రెండో రామునివద్ద, ఆరో లక్ష్మణుడు మూడో రామునివద్ద, ఏడో లక్ష్మణుడు నాల్గో రామునివద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఐదో రామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఆరో రామునివద్ద పదో లక్ష్మణుడు ఏడో రామునివద్ద మారుతారు. తర్వాత లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి మారేటప్పుడు తమతమ ఉద్దికాళ్ళ వద్ద మారుతారు. ఇట్లు లక్ష్మణులంతా మొదట సవ్యమార్గం లోను, తర్వాత అపసవ్యమార్గంలోను పయనిస్తూ, వలయాలు మారుతూ ఆడు తుంటారు.

ఇట్లు రాముళ్ళు, లక్ష్మణులు ఎడమపక్కకు జరుగుతూ వెలుపలి వలయంలో సవ్యమార్గంలోను, లోపలి వలయంలో అపసవ్యమార్గంలోను పయనిస్తూ, నాల్గో దెబ్బ కొట్టి వలయాలు మారుతూ ఆడుతుంటారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు. దీనినే లలిత కోపు అంటారు.

## 32. లాలి కోపు

లాలి పాటలు ఎక్కువగా ఈ ఈ కోపులో కన్పిస్తాయి. పాట తెగగొట్టడం, రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉస్గులు పుల్లలు గలపడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితోను, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితోను, మరి కొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ నాల్గో లక్ష్మణునితోను, ఇంకా కొంచెం ఎడమ పక్కకు

జరిగి ఐదో దెబ్బ ఐదో లక్ష్మణునితోను గొట్టి, లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి వస్తాడు ఈ ఐదో దెబ్బ వెలుపలి వలయంలో ఒకటో రామునకు ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత వెలుపలి వలయంలోని రాముడు కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ నాల్గో లక్ష్మణునితోను, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ మూడో లక్ష్మణునితోను, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ రెండో లక్ష్మణునితోను, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితోను గొట్టి వెలుపలి




32

వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు ఇట్లే రాముళ్ళంతా తమ తమ ఎడమ పక్కకు జరుగుతూ ఎదురుగా వచ్చిన లక్ష్మణులతో పుల్లలు గలుపుతూ ఐదో దెబ్బ కొట్టి వలయం మారుతూ మొదట అపసవ్య మార్గంలోను, తర్వాత సవ్య మార్గంలోను పయనిస్తూ ఆడుతుంటారు. అంటే లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు ఆరో లక్ష్మణుని వద్ద, మూడో రాముడు ఏడో లక్ష్మణుని వద్ద, నాల్గో రాముడు ఎనిమిదో లక్ష్మణుని వద్ద, ఐదో రాముడు తొమ్మిదో లక్ష్మణుని వద్ద, ఆరో రాముడు పదో లక్ష్మణుని వద్ద, ఏడో రాముడు ఒకటో లక్ష్మణుని వద్ద, ఎనిమిదో రాముడు రెండో లక్ష్మణుని వద్ద, తొమ్మిదో రాముడు మూడో లక్ష్మణుని వద్ద, పదో రాముడు నాల్గో లక్ష్మణుని వద్ద మారుతారు. వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు వారి ఉద్దికాళ్ళ వద్ద మారుతారు

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితోగొట్టి, కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండోదెబ్బ పదో రామునితోను, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో రామునితోను, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ ఎనిమిదో రామునితోను, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదోదెబ్బ ఏడో రామునితోనుగొట్టి వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు. ఈ ఐదోదెబ్బ లోపలి వలయంలో లక్ష్మణునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత లోపలి వలయంలోని లక్ష్మణుడు కొంచెం ఎడమ పక్కకు జరిగి రెండో దెబ్బ ఎనిమిదో రామునితోను, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదో రామునితోను, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ పదో రామునితోను, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదో దెబ్బ ఒకటో రామునితోను గొట్టి లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులంతా తమతమ ఎడమ వైపుకు కొంచెం కొంచెం జరుగుతూ ఎదురుగా వచ్చిన రాముళ్ళతో పుల్లలు గలుపుతూ ఐదో దెబ్బకొట్టి వలయాలు మారుతూ, మొదట సవ్య మార్గంలోను, తర్వాత అపసవ్య మార్గంలోను పయనిస్తూ ఆడుతుంటారు. అంటే వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు ఎనిమిదో

వెలుపలి వలయానికి వస్తాడు. ఈ ఎదో దెబ్బ వెలుపలి వలయంలో రామునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. వెలుపలి వలయంలోని రాముడు కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, ఇంకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి అచటనే వంగి కుడి చేతిని వెనుకకు తిప్పి ఆ చేతిలోని కర్రతో రెండో లక్ష్మణుని కర్రను తాటిస్తాడు. ఇది నాల్గో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత లేచి కొంచెం కుడి పక్కకు జరిగి ఐదో దెబ్బ మూడో లక్ష్మణునితోను, తర్వాత మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి ఆరోదెబ్బ రెండో లక్ష్మణునితోను, ఇంకాకొంచెం ఎడమ పక్కకు




33

జరిగి ఏడో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో లక్ష్మణునితోను గొట్టివెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్లంతా కొంచెం కొంచెం ఎడమ పక్కకు జరుగుతూ, మూడు దెబ్బలు కొట్టి నాల్గో దెబ్బకు వంగి పుల్ల తాడించి, తర్వాత కుడి, ఎడమలకు కొంచెం కొంచెంగా జరుగుతూ ఏడో దెబ్బ కొట్టి వలయం మారుతూ ఆడుతుంటారు. అంటే రాముళ్లు లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండోరాముడు నాల్గో లక్ష్మణునివద్ద, మూడో రాముడు ఐదో లక్ష్మణుని వద్ద, నాల్గో రాముడు ఆరో లక్ష్మణుని వద్ద, ఐదో రాముడు ఏడో లక్ష్మణునివద్ద, ఆరో రాముడు ఎనిమిదో లక్ష్మణునివద్ద, ఏడో రాముడు తొమ్మిదో లక్ష్మణుని వద్ద, ఎనిమిదో రాముడు పదో లక్ష్మణుని వద్ద, తొమ్మిదో రాముడు ఒకటో లక్ష్మణుని వద్ద, పదో రాముడు రెండో లక్ష్మణుని వద్ద మారుతారు. వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి మారే టప్పుడు వారి వారి ఉద్దికాళ్లవద్ద మారుతారు. ఇట్లు రాముళ్లు మొదట అపసవ్య మార్గంలోను, తర్వాత సవ్యమార్గంలోను పయనిస్తారు

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటోదెబ్బ ఒకటో రామునిలో గొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ పదోరామునితోను, ఇంకొంచెం ఎడమపక్కకు జరిగి మూడోదెబ్బ తొమ్మిదో రామునితోనుగొట్టి అచటనేవంగి కుడిచేతిని వెనుకకు తిప్పి ఆ చేతిలోని కర్రతో పదోరామునికర్రతో తాడిస్తాడు. ఈదెబ్బ నాల్గోదెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి ఐదోదెబ్బ ఒకటో రామునితోను, తర్వాత మరలాకొంచెం ఎడమపక్కకు జరిగి ఆరోదెబ్బ పదోరాము నితోను, ఇంకాకొంచెం ఎడమపక్కకు జరిగి ఏడోదెబ్బ తొమ్మిదో రామునితోను గొట్టి వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి వస్తాడు. ఈ ఏడోదెబ్బ లోపలి వలయంలో ఒకటో లక్ష్మణునకు ఒకటోదెబ్బగా పరిగణించబడుతుంది, తర్వాత కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ పదోరామునితోను, ఇంకాకొంచెం ఎడమ పక్కకు జరిగి మూడోదెబ్బ ఒకటో రామునితోను గొట్టి అచటనే వంగి కుడిచేతిని వెనుకకుతిప్పి ఆ చేతిలోని కర్రతో పదోరాముని చేతిలోని కర్రపై తాడిస్తాడు. ఇది నాల్గోదెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం కుడిపక్కకు జరిగి ఐదోదెబ్బ తొమ్మిదో రామునితోను, తర్వాత మరలాకొంచెం ఎడమపక్కకు జరిగి ఆరోదెబ్బ పదోరామునితోను, ఇంకాకొంచెం ఎడమపక్కకు జరిగి ఏడోదెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రామునితోనుగొట్టి లోపలి వలయంనుంచి మరలా వెలుపలి వల

యానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులంతా ఎడమపక్కకు కొంచెం కొంచెం జరుగుతూ మూడోదెబ్బ కొట్టినతర్వాత వంగి నాల్గోదెబ్బ రెండోదెబ్బ కొట్టినవానితోగొట్టి తర్వాత కుడికి, ఆతర్వాత ఎడమపక్కకు జరుగుతూ ఏడోదెబ్బకొట్టి వలయం మారుతారు. ఇట్లే లక్ష్మణులంతా చరిస్తూ ఉంటారు. అంటే వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు పదోరామునివద్ద, మూడో లక్ష్మణుడు ఒకటోరామునివద్ద, నాల్గో లక్ష్మణుడు రెండోరామునివద్ద, ఐదోలక్ష్మణుడు మూడోరామునివద్ద, ఆరోలక్ష్మణుడు నాల్గోరామునివద్ద, ఏడోలక్ష్మణుడు ఐదోరామునివద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఆరోరామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఏడో రామునివద్ద మారుతారు. మరలా లోపలి వలయంనుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్ళవద్ద మారుతారు. ఇట్లు లక్ష్మణులు మొదట సవ్యమార్గంలోను, తర్వాత అపసవ్యమార్గంలోను పయనిస్తుంటారు.

ఇట్లు రాముళ్ళు,లక్ష్మణులు ఎడమపక్కకు జరుగుతూ వెలుపలివలయంలో సవ్యమార్గంలోను, లోపలి వలయంలో అపసవ్యమార్గంలోను పయనిస్తూ, ఏడో దెబ్బకొట్టి, వలయాలు మారుతూ ఆడుతుంటారు ఉసెత్తులో ఆటవేగాన్ని పెంచుతారు. దీనిగే వరగత్తెర కోపు అంటారు.

## 34. వాల్సైడు కోపు

వాలు అనే పదం సైడ్ అనే ఇంగ్లీషు పదంతో కలసి వాల్సైడు అనే పదం ఏర్పడి ఉండవచ్చు. జానపదుల వాడుకలో ఇంగ్లీషు పదాలు ఎలా చొచ్చుకుపోయాయో ఇచ్చట గమనించవచ్చు. ఇందులో ఎక్కువసార్లు ఎవరికివారే కొట్టుకుంటారు. ఎవరిపైపు వారే కొట్టుకుంటారు కాబట్టి ఈ 'సైడ్' అనే పదం 'పక్క' అనే అర్థంలోనే వాడిఉండవచ్చు. పాట తెగగొట్టడం, రాముళ్ళు లోపలి వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో లక్ష్మణునకు ఎదురుగా నిల్చొని తన చేతిలోని కర్రలతో తానే ముందు కుడికాలి గిలకవద్ద, మోకాలివద్ద చేతులెత్తి తలకుపైన కొట్టుకుంటాడు. తర్వాత ఎడమకాలి గిలకవద్ద, మోకాలివద్ద చేతులెత్తి తలకుపైన కొట్టుకుంటాడు. అప్పటికి ఆరు దెబ్బలు అవుతాయి. అట్లాగే మరలా కుడికాలి గిలకవద్ద, మోకాలివద్ద, తలకు పైన కొట్టుకుంటాడు అప్పటికి పన్నెండు దెబ్బలు

అవుతాయి. తర్వాత ఒకటో లక్ష్మణునితోను, కొంచెం ఎడమ పక్కకు జరిగి పదునాల్గోదెబ్బ రెండో లక్ష్మణునితోను, మరికొంచెం ఎడమపక్కకు జరిగి పదిహేనో దెబ్బ మూడో లక్ష్మణునితోను కొట్టి లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి వస్తాడు. వెలుపలి వలయానికి వచ్చిన ఒకటో రామునకు ఈ పదిహేనో దెబ్బ ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ రెండో లక్ష్మణునితోను కొట్టి, ఇంకా కొంచెం ఎడమ పక్కకు జరిగి

34

ఒకటో లక్ష్మణునకు ఎదురుగా వస్తాడు అపుడు మరలా తన కర్రలతో తానే కుడికాలి గిలకవద్ద, మోకాలివద్ద, తలకుపైన పుల్లలు గొట్టుకుంటాడు అట్లే ఎడమ కాలి గిలకవద్ద, మోకాలివద్ద, తలకుపైన కొట్టుకుంటాడు అప్పటికి ఆరు దెబ్బలు అవుతాయి. తర్వాత మరలా కుడికాలి గిలకవద్ద, మోకాలివద్ద, తలకుపైన, ఆ తర్వాత ఎడమకాలి గిలకవద్ద, మోకాలివద్ద, తలకుపైన కొట్టుకుంటాడు అప్పటికి పన్నెండు దెబ్బలవుతాయి పదమూడో దెబ్బ ఒకటో లక్ష్మణునితోను, పద్నాలుగో దెబ్బ కొంచెం ఎడమ ప్రక్కకు జరిగి రెండో లక్ష్మణునితోను, పదిహేనోదెబ్బ మూడో లక్ష్మణునితో గొట్టి వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఇట్లే రాముళ్లంతా తమ కర్రలతో తామే పన్నెండు దెబ్బలు కొట్టుకుని తర్వాత మూడు దెబ్బలు కొట్టి వలయం మారుతుంటారు అంటే లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు నాల్గో లక్ష్మణునివద్ద, మూడో రాముడు ఐదో లక్ష్మణునివద్ద, నాల్గో రాముడు ఆరో లక్ష్మణునివద్ద, ఐదో రాముడు ఏడో లక్ష్మణునివద్ద, ఆరో రాముడు ఎనిమిదో లక్ష్మణునివద్ద, ఏడో రాముడు తొమ్మిదో లక్ష్మణునివద్ద, ఎనిమిదో రాముడు పదో లక్ష్మణునివద్ద, తొమ్మిదో రాముడు ఒకటో లక్ష్మణునివద్ద, పదోరాముడు రెండో లక్ష్మణునివద్ద మారుతారు. అట్లే వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్లవద్ద మారుతారు ఇట్లు రాముళ్ళు ఎడమ పక్కకు జరుగుతూ మొదట అపసవ్య మార్గంలోను, తర్వాత సవ్యమార్గంలోను పయనిస్తారు.

అట్లే ఒకటో లక్ష్మణుడు ఒకటో రామునకు ఎదురుగాఉండి తన చేతి కర్రలతో తానే కుడికాలి గిలకవద్ద, మోకాలివద్ద, చేతులెత్తి తలకుపైన, తర్వాత ఎడమ కాలి గిలకవద్ద, మోకాలివద్ద, చేతులెత్తి తలకుపైన కొట్టుకుంటాడు. ఇవి ఆరు దెబ్బలు అవుతాయి. ఇట్లే మరలా కుడికాలి గిలకవద్ద, మోకాలివద్ద, తలకు పైన, ఆ తర్వాత ఎడమకాలి గిలకవద్ద, మోకాలివద్ద తలకుపైన కొట్టుకుంటాడు అప్పటికి మొత్తం పన్నెండు దెబ్బలు అవుతాయి. తర్వాత పదమూడోదెబ్బ ఒకటో రామునితోను, కొంచెం ఎడమపక్కకు జరిగి పదునాల్గోదెబ్బ పదో రామునితోను, ఇంకాకొంచెం ఎడమ పక్కకు జరిగి పదిహేనోదెబ్బ తొమ్మిదో రామునితోను గొట్టి, వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి వస్తాడు ఈ పదిహేనోదెబ్బ లోపలి వలయంలో ఒకటో లక్ష్మణునకు ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత

కొంచెం ఎడమ పక్కకుజరిగి రెండోదెబ్బ పదో రామునితో గొట్టి. ఇంకా కొంచెం ఎడమ పక్కకుజరిగి తన ఉద్దికాడైన ఒకటో రామునికి ఎదురుగావచ్చి పై విధం గానే కుడి, ఎడమ కాళ్ళవద్ద మొత్తం పన్నెండు దెబ్బలు తన కర్రతో తానే కొట్టి కుంటాడు. అప్పటికి మొత్తం పద్నాలుగు దెబ్బలవుతాయి. పదిహేనో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటో రామునితో కొట్టి లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులంతా తమ తమ ఉద్దికాళ్ళకు ఎదురుగా నిల్చొండి పన్నెండు దెబ్బలు కొట్టుకొని, పదిహేనో దెబ్బకొట్టి, వలయం మారు మారుతారు. అంటే వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు పదో రామునివద్ద, మూడో లక్ష్మణుడు ఒకటో రాముని వద్ద, నాల్గో లక్ష్మణుడు రెండో రామునివద్ద, ఐదో లక్ష్మణుడు మూడో రామునివద్ద, ఆరో లక్ష్మణుడు నాల్గో రామునివద్ద, ఏడో లక్ష్మణుడు ఐదో రాముని వద్ద, ఎనిమిదో లక్ష్మణుడు ఆరో రామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఏడో రాముని వద్ద, పదో లక్ష్మణుడు ఎనిమిదో రామునివద్ద మారుతారు తర్వాత లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి మారేటప్పుడు తమతమ ఉద్దికాళ్లవద్ద మారు తారు. ఇట్లు లక్ష్మణులు ఎడమకు జరుగుతూ మొదట సవ్యమార్గంలోను, తర్వాత అపసవ్యమార్గంలోను పయనిస్తూ, వలయం మారుతూ ఆడుతుంటారు.

ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు ఎడమపక్కకు జరుగుతూ వెలుపలివలయంలో సవ్యమార్గంలోను, లోపలి వలయంలో అపసవ్యమార్గంలోను పయనిస్తూ, వలయం మారుతూ ఆడుతుంటారు. ఆటగాళ్లు తమ ఉద్దికాళ్లకు ఎదురుగానే తమ కర్రలతో తామే కుడి, ఎడమ కాళ్లవద్ద పన్నెండు దెబ్బలు కొట్టుకుంటారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు దీనినే వాలైనడు కోపు అంటారు.

## 35. శ్రీకర కోపు

"శ్రీకారా వందహూ జానా" అనే పల్లవితో ఒక పాట ఉంది ఆ పల్లవి మీద ఈ కోపు వెలసింది. శ్రీకరుడు అంటే శ్రీరాగము పాడేవాడని[19] అర్థం ఉంది. ఈ కోపులో "శ్రీకారా వందరూ జానా" అనే పాటను పాడుతారు. దీనితో పాటు మరికొన్ని పాటలు పాడుతారు. పాట తెగగొట్టడం, రాముళ్ళు లోపలి

19. శ. ర., 760.

వలయానికి, లక్ష్మణులు వెలుపలి వలయానికి రావడం, ఉద్దులు పుల్లలు గలప డంతో కోపు మొదలవుతుంది.

ఒకటో రాముడు ఒకటో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో లక్ష్మణుని వద్ద కూర్చొని అతనితో రెండో దెబ్బ కొడతాడు. తర్వాత కూర్చొని ఉండే కుడిపక్కకు జరిగి మూడో దెబ్బ ఒకటో లక్ష్మణునితోను, నాల్గో దెబ్బ రెండో లక్ష్మణునితోను, ఐదో దెబ్బ మూడో లక్ష్మ ణునితోను కొట్టి అపుడు లేచి మూడో లక్ష్మణుని వద్ద లోపలి వలయం నుంచి




35

వెలుపలి వలయానికి వస్తాడు. ఈ ఐదో దెబ్బ వెలుపలి వలయానికి వచ్చిన ఒకటో రామునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం ఎడమ పక్కకు జరిగి లోపలి వలయంలో తనకు ఎదురుగా వచ్చి కూర్చొని ఉన్న రెండో లక్ష్మణునితో గొట్టి, మరలా కుడిపక్కకు జరిగి లోపలి వలయంలో కూర్చొని ఉన్న మూడో లక్ష్మణునితో మూడో దెబ్బ కొట్టి, మరలా ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ రెండో లక్ష్మణునితో గొట్టి, మరికొంచెం ఎడమ పక్కకు జరిగి ఐదో దెబ్బ ఒకటో లక్ష్మణునితో గొట్టి వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి వస్తాడు. ఈ ఒకటో రాముడు వెలుపలి వలయంలో, లోపలి వలయంలో కూర్చొని ఆట ఆడుతాడు ఇట్లే రాముళ్లందరి చలనం ఉంటుంది. అంటే లోపలి వలయంలో కూర్చొని కొడుతూ, ఐదో దెబ్బ కొట్టి వెలుపలి వలయానికి వచ్చి నిల్చుండే ఉండి అటు ఇటు జరుగుతూ లోపలి వలయంలో కూర్చొని ఉన్న లక్ష్మణులతో పుల్లలు గలుపుతూ ఐదో దెబ్బ కొట్టి మరలా వలయం మారుతారు. లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు రెండో రాముడు నాల్గో లక్ష్మణునివద్ద, మూడో రాముడు ఐదో లక్ష్మణునివద్ద, నాల్గో రాముడు ఆరో లక్ష్మణునివద్ద, ఐదో రాముడు ఏడో లక్ష్మణుని వద్ద, ఆరో రాముడు ఎనిమిదో లక్ష్మణుని వద్ద, ఏడో రాముడు తొమ్మిదో లక్ష్మణునివద్ద, ఎనిమిదో రాముడు పదోలక్ష్మణునివద్ద, తొమ్మిదోరాముడు ఒకటో లక్ష్మణునివద్ద, పదోరాముడు రెండోలక్ష్మణుని వద్ద మారుతారు. అట్లే వెలుపలి వలయం నుంచి మరలా లోపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్లవద్ద మారుతారు.

అట్లే వెలుపలి వలయంలోని ఒకటో లక్ష్మణుడు ఒకటో దెబ్బ ఒకటో రామునితో గొట్టి, కొంచెం ఎడమపక్కకు జరిగి రెండో దెబ్బ లోపలి వలయంలో అప్పటికి తనకు ఎదురుగా వచ్చికూర్చున్న పదోరామునితోకొట్టి, మరలా కొంచెం కుడిపక్కకుజరిగి మూడోదెబ్బ లోపలివలయంలో కూర్చొనివున్న తన ఉద్దికాడైన ఒకటో రామునితోను, మరలా కొంచెం ఎడమ పక్కకు జరిగి నాల్గో దెబ్బ పదో రామునితోను, మరికొంచెం ఎడమపక్కకు జరిగి ఐదోదెబ్బ తొమ్మిదో రామునితోను గొట్టి వెలుపలి వలయంనుంచి లోపలి వలయానికి వస్తాడు ఈ ఐదోదెబ్బ లోపలి వలయానికి వచ్చిన ఒకటో లక్ష్మణునికి ఒకటో దెబ్బగా పరిగణించబడుతుంది. తర్వాత కొంచెం ఎడమపక్కకు జరిగి రెండోదెబ్బ తనకు ఎదురుగా వచ్చిన పదో

రామునివద్ద కూర్చొని కొట్టి, కూర్చొని ఉండే కుడి పక్కకు జరిగి మూడో దెబ్బ తొమ్మిదోరామునితోను, నాల్గోదెబ్బ పదోరామునితోను, ఎడమపక్కకు జరిగి ఐదో దెబ్బ తన ఉద్దికాడైన ఒకటోరామునితోను కొట్టి, లేచి ఒకటోరాముని వద్ద లోపలి వలయం నుంచి మరలా వెలుపలి వలయానికి వస్తాడు. ఇట్లే లక్ష్మణులంతా వెలుపలి వలయంలో నిలబడి ఉండి, లోపలి వలయంలో కూర్చొని ఐదో దెబ్బ కొట్టి వలయం మారుతూ ఆడుతుంటారు. అంటే వెలుపలి వలయం నుంచి లోపలి వలయానికి మారేటప్పుడు రెండో లక్ష్మణుడు పదో రామునివద్ద, మూడో లక్ష్మణుడు ఒకటోరామునివద్ద, నాల్గోలక్ష్మణుడు రెండోరామునివద్ద, ఐదోలక్ష్మణుడు మూడో రామునివద్ద, ఆరోలక్ష్మణుడు నాల్గోరామునివద్ద, ఏడోలక్ష్మణుడు ఐదోరామునివద్ద ఎనిమిదో లక్ష్మణుడు ఆరో రామునివద్ద, తొమ్మిదో లక్ష్మణుడు ఏడో రామునివద్ద, పదోలక్ష్మణుడు ఎనిమిదోరాముని వద్ద మారుతారు. అట్లే లోపలి వలయం నుంచి వెలుపలి వలయానికి మారేటప్పుడు తమ తమ ఉద్దికాళ్ళవద్ద మారుతారు. ఇట్లు లక్ష్మణులు ఎడమ పక్కకు జరుగుతూ మొదట సవ్యమార్గంలోను, తర్వాత అపసవ్యమార్గంలోను పయనిస్తారు.

ఇట్లు రాముళ్లు, లక్ష్మణులు ఎడమ పక్కకు జరుగుతూ వెలుపలి వలయంలో సవ్యమార్గంలోను, లోపలి వలయంలో అపసవ్యమార్గంలోను పయనిస్తూ, వెలుపలి వలయంలో నిల్చుండి కుడి, ఎడమ పక్కలకు జరుగుతూ ఐదోదెబ్బకొట్టి వలయం మారుతూ లోపలి వలయంలో కూర్చొని ఉండే ఆడుతుంటారు. ఉసెత్తులో ఆట వేగాన్ని పెంచుతారు. దీనినే శ్రీకర కోపు అంటారు.

# కోలాటం పాటల వర్గీకరణం - అనువర్ణనం

కోలాటంలో ఆట ప్రధానమే అయినప్పటికి ఆటలోని అడుగుకు అనుసరణ గాను, తాళాని కనుగుణంగాను లయబద్ధంగా పాటలు ఉంటాయి. ఈ పాటలు ఉంటేనే కోలాటానికి రాణింపు ఉంటుంది. పాటలు ఆటను ఒక క్రమమైన పద్ధతిలో ఉంచుతాయి. ఈ పాటల్లో కూడా ఆట ఎత్తుగడలోనూ, ఆట మధ్యలోను, ఉసెత్తులోను పాడే పాటల లయలు వేరువేరుగా ఉంటాయి. ఆటఎత్తుగడలో పాటకు ముందు లయను సరిదిద్దే పదాలైన 'కిటకిట, కిట్కా, పెల్, ఏహా, బల్, గిత్త య్యకు తద్ధిమి' మొదలయినవి ఈ కోలాటం పాటల్లో అచ్చటచ్చట కన్పిస్తాయి. ఇవి పాటల్లో తాళాని కనుగుణంగా పాటల చరణాల్లో నిండుదనాన్ని కల్గించే ఊతపదాలు.

కులుకుల కోలాటంలో ఒక కోపులో ఒకే ఒక పాట పాడుతారు. మరొక పాటను ఆ కోపులోనే పాడాలంటే ఆట ఆపి మరలా మొదలు పెడతారు. కాని భారత కోలాటంలో ఒక కోపులో ఎన్నైనా పాటలు పాడవచ్చు. పాటకీ పాటకీ మధ్య ఆట ఉరవడి కొంచెం తగ్గిస్తూ ఉంటారు. కోపులో మొదట పాడేపాటకు, ఉసెత్తులో పాడే పాటకు లయలోనే గాక, ప్రకరణంలో కూడా ఒక్కొక్క సారి తేడా ఉండవచ్చు. పాడినపాటకు, పాడబోయె పాటకు అనుసంధానంగా ఉసెత్తులో పాటలుకొన్ని ఉంటాయి అంటే ప్రకరణోచితమైన అర్థం ఉండదు. ఉసెత్తులోపాటలు కొన్ని సంవాదరూపంలో ఉంటాయి. ఉదాహరణకు - "ఏమనబోకురా సిన్నికిష్టా"[1] "వానలు గురవగ - వానలు బండగ"[2], ''ఎక్కడిదానివే-సక్కానికోమటి''[3] మొదలయిన పాటలు ఇలాంటివే. సామాన్యంగా త్వరితంగా పలకడానికి వీలయ్యే పొట్టి చరణాలు ఉంటాయి. జానపద గేయాల సేకరణకు పూనుకున్నప్పుడు ఎన్నో

---

1. అను., పా. 24
2. అను., పా. 105
3. అను., పా. 20.

రకాల పాటలు లభిస్తాయి. లభించిన పాటలన్నీ జానపదగేయ లక్షణాలు కల్గి ఉంటాయనలేము. జానపదగేయ లక్షణాలు కల్గిన పాటలే జానపదుల్లో ప్రచారంలో ఉంటాయనలేం.

ప్రకృత పరిశోధన నిమిత్తం సేకరించిన కోలాటం పాటల్లో వస్తువు, నిర్మాణం మొదలయిన అంశాలనుబట్టి చాల రకాలు కన్పిస్తాయి ఆర్. వి.యస్. సుందరంగారు జానపద గేయాలను వర్గీకరిస్తూ కోలాటం పాటలను వేడుక పాటల విభాగం కింద చేర్చారు.[4] ఏ పాటలు ఏ విభాగంలో చేరినప్పటికి మరలా ఆ పాటలను వివిధ అంశాలను ఆధారంగా చేసుకొని సూక్ష్మాతిసూక్ష్మంగా పునర్విభాగాలుగా చేయవచ్చు. అయితే ఆ పునర్విభాగాల్లో ఒకరికి పది విభాగాలు చేయవీలయితే మరొకరికి అంతకంటే ఎక్కువ విభాగాలు చేయ వీలవుతుంది. ఆ పునర్విభజన సేకరించిన గేయాల ప్రాతిపదికమీద ఏర్పడుతుంది. ఎక్కువ పాటలు సేకరిస్తే అందులో వివిధ అంశాలకు సంబంధించిన విషయాలు లభిస్తాయి అపుడు పునర్విభాగాలు ఎక్కువగా చేయవచ్చు. ఒక్కోసారి పాటలు ఎక్కువ సేకరించగలిగినప్పటికి వాటిలో వివిధ అంశాలకు సంబంధించిన విషయాలు లేకపోవచ్చు. అపుడు తక్కువ విభాగాలుగా చేయవలసివస్తుంది. విభజన అనేది సేకరించిన పాటల్లో లభించే అంశాలమీద ఆధారపడి ఉంటుంది.

ఈ పరిశోధనలో సేకరించిన కోలాటం పాటల్ని పది విభాగాలుగా చూపవచ్చు.

1. కన్నీటి పాటలు (కరుణరస ప్రధానాలు).
2. తాత్త్విక గేయాలు.
3. దేశభక్తి గేయాలు.
4. పౌరాణికాలు.
5. ప్రార్థన గేయాలు.
6. మంగళారతులు.
7. లాలి పాటలు.

---

4. తెలుగు-కన్నడ జానపద గేయాలు, పు. 20.

8. వలపు పాటలు (శృంగార రస ప్రధానాలు).
9. స్థానిక గాథలు.
10. హాస్య ప్రధానాలు — అనేవిగా విభజించవచ్చు. ఈ విభాగాల్ని గూర్చి విడివిడిగా పరిశీలిద్దాం.

## 1. కన్నీటి పాటలు (కరుణరస ప్రధానాలు)

హఠాత్తుగా సంభవించే దుర్ఘటనలు, హృదయ విదారకమైన సన్నివేశాలే కాక ప్రముఖుల సహజ మరణాలు, సకాల మరణాలు కరుణ రసావిర్భావానికి మూలాధారాలు. ప్రకృతి వైపరీత్యాలయిన వరదలు, తుఫానులు, అగ్నిప్రమాదాలు, పడవప్రమాదాలు మొదలయినవీ, కలరా, మశూచి మొదలయిన అంటు వ్యాధులవల్ల అధికమైన మరణాలు, జాతీయ నాయకుల హత్యలు, ప్రాణ త్యాగాలు, ఇతర ప్రమాదాలవల్ల జరిగిన అకాల మరణాలు, సకాల మరణాలు, సహజ మరణాలు - మొదలయిన సంఘటనలు జరిగినప్పుడు జానపదులు కన్నులారా చూడడం గాని, లేదా చెవులారా వినడం గాని జరుగుతుంది ఆ సంఘటల్ని వర్ణిస్తూ, ప్రజల హృదయ వేదనను తెలిపే పాటలే కన్నీటి పాటలు. "అస్తమించె గాంది దేముడు"[5] అనే పాటలో గాంధీ హత్య జరిగిన సందర్భంలో దేశం ఎట్లా వాపోయిందో వివరించబడింది. "గాంది దేముడు" అని వాడడంలో గాంధీపై ఉండే భక్తి తెలుస్తుంది. మన జాతిపితను దేముడనడంలో అతిశయోక్తి కన్పించదు. దేశం అంతా 'దుత్తిరంబు దుక్కితసము లావరించి'నదట. సర్దార్ వల్లభాయి పటేల్, జవహర్‌లాల్ నెహ్రూ తల్లడిల్లారట. యుగ పురుషుడయిన సుభాస్ చంద్రబోసు 'సేతలుడిగిన'వట[6] గాంధీని కాల్చి చంపడం అనే దుశ్చర్యను 'భారతీయుల ప్రేమబలము - మారిపోయెనూ బాపుకు' అని వాపోయారు జానపదులు. గాంధీని దేవుడని, గాడ్సేని హంతకుడని ముద్రవేశారు. గాంధీ మరణంతో 'ఈ లోకం మీద నాడి నేడు వెడలి పోయెనోయి నేడూ' అని విలపించారు. పై కల్పనలు వారి భావనలోని తీవ్రతను తెలుపుతున్నాయి. గాంధీ హత్యకు సంబం

5. అను., పా. 10.
6. గాంధీ హత్య జరిగినప్పుడు సుభాస్ చంద్రబోస్ లేడు.

ధించినదే ''తందానా తందాన తందాన తందనానా''[7] అనే పల్లవితో మరొక కోలాటం పాట ఉంది.[8]

ఆంధ్రుల గుండెల్లో దాగి అడుగడుగునా ఆంధ్రాభిమానాన్ని గుర్తుచేసే మహనీయుడు అమరజీవి పొట్టి శ్రీరాములు. నాల్గుకోట్ల జనులకోసం తన ప్రాణాలు అర్పించాడు ఆయన్ని ఒక త్యాగమూర్తిగా, గొప్ప వ్యక్తిగా మాత్రమే పేర్కొనగలదు విద్వల్లోకం కాని జానపదులకు ఆయన స్వామి. ఆంధ్రుల ఆశలన్నీ దీర్చడానికి ఆయన ప్రాణాలు కోల్పోయాడు. ఎవరూ చేయలేని త్యాగం చేశాడు. అందుకే ఆయనకు తమ హృదయాలలో అగ్రస్థానం ఇచ్చి "సామిరార పొట్టి శీరామ"[9] అని సంబోధించారు. అంతేకాదు, 'ప్రేమతోడ వందానములూ — అందుకోరసామి నేడు' అని తమ వందనములు సామాన్యమైనవి కావనీ, ప్రేమతో చేసే వందనాలనీ హృదయాన్ని విప్పి చెప్పారు. భక్తిభావాల్ని, ప్రేమాభిమానాల్ని ఎంత మధురంగా చెప్పగలరో కుట్రలు, కుతంత్రాల్ని అంత నిర్మోమాటంగా, భయభ్రాంతులు లేకుండా చెప్పగలరు. అరవదొరలు నిన్నూ నేడు - అనగ దొక్క జూసినారూ' అని అరవవారు మోసం చేశారనే భావాన్ని వెలిబుచ్చుతారు.

'సామిరార పొట్టిశీరామ' అనే పాట అనుకరణలోనే పోట్ల భూదేవయ్య అనే వ్యక్తిమీద "ఆంధ్రుడ రావయ్యొ పోట్ల బూదెయ్యా - ఆంధ్రులాకు అమరజీవి"[10] అనే మరొక పాట ఉంది. ఈయన గురజాల తాలూకా, జూలకల్లు గ్రామ వాస్తవ్యుడు కమ్మ కులానికి చెందినవాడు. ఆయన చావుచూసి, ఆయనమీది గౌరవం కొద్దీ, సానుభూతిని తెలుపుతూ వెలువడిందీపాట.

శ్రీరామనవమికి భద్రాచలం వెళ్ళిన అన్నా, వదినెలలో అన్నమాత్రమే తిరిగివచ్చి వదినె రానందున చెల్లెలు కారణం అడుగుతుంది.[11] గోదావరినదిలో

7. అను , పా. 56.
8. ఈ పాటలో జానపద లక్షణాలు కన్పించవు. ఆధునిక కవి ఎవరో రాసినట్లు కన్పిస్తుంది.
9. అను., పా. 121.
10. అను., పా, 12,
11. అను., పా. 118

జరిగిన ఘోరమైన పడవ ప్రమాదంలో మరణించిందని అన్న తెలుపుతాడు. అపుడు 'మయిమగం శీరామనవమికి-మరనమేమి టన్నయా' అని దేవుని గుట్టును బయటపెడుతుంది. 'మీ వదిన ఒక్కటెగాదు సెల్లెలా - వందలే మరనించి'రని అన్నగారి సమాధానం 'అందరెట్లా మరనమందిరి-అసలు దెల్పారన్నయా' అని ఎదురుప్రశ్న. చెల్లెలి ప్రశ్నకు జవాబిస్తూ 'నీకు మాత్రమేగాదు సెల్లెల - ప్రెజల కందరకిప్పుదే; ఈ గోరమయినా ఉసయమూలు - సెప్పుదమురా సెల్లెలా' అని చెల్లెలిని బజారుకు తీసుకుపోవడంతో పాట అయిపోతుంది ఇందులో పునరావృత్తి కన్పించదు. పాట అర్ధంతరంగా ముగిసిపోయింది.

"ఏ మోన గురిసెనయ్యో - దేవుని మాయా"[12] అనే మరొక పాట విధి వైపరీత్యం కారణంగా జరిగిన సంఘటనను స్మరింపజేసేది. ముప్పారంవాళ్ళు, సోమారంవాళ్ళు, ఏనాటి ఎరుకలవాళ్ళు అంతా కలసి తొంపై గుడిసెలవాళ్ళు అర్ధరాత్రి వచ్చిన వరదలో కొట్టుకుపోతారు. వరదలో కొట్టుకుపోతూ మృత్యుగహ్వరం నుంచి తప్పించుకోవాలని పట్టుదలతో ఒక బాలుడు ఇండ్లన్నీ ముంచి నిడివిగా పారుతున్న జలప్రవాహంలో అచ్చటచ్చట చుక్కలను చూస్తూ నిటారుగా ఉన్న తాటిచెట్లలో ఒకదాన్ని ఆసరాగా తీసుకున్నాడు వరదప్రవాహం ఉధృతస్థాయికి చేరుకొనే సమయంలో వచ్చిన ప్రవాహపు పొంగులకు చెట్టుమీద నుంచి కూడా కొట్టుకొనిపోతాడు వరద దృశ్యం ఈ పాట చదివిన పాఠకునికి తన కళ్ళతో చూచినట్లుగా కన్పిస్తుంది. ఎంతో భావాన్ని పది పంక్తుల్లో ఇమిడ్చారు. భావం చెప్పడంలో పొదుపే కాకుండా 'నీళ్ళ నిడవల బంతి - తాళ్ల చుక్కల బంతి' మొదలయిన పదబంధాలవల్ల భాషలో కూడ పొదుపు కన్పిస్తుంది.

కోలాటం పాటల్లోని కన్నిటి పాటల్లో కమ్యూనిస్టు సాహిత్యం నుంచి తీసుకున్న పాటలు కూడా లేకపోలేదు [13]

## 2. తాత్త్విక గేయాలు :

రక్తి, భక్తి మార్గాలు బాగా తెలిసినవారు జానపదులు. అంతేగాదు, ముక్తి మార్గాన్వేషకులు కూడా. ఈ అన్వేషణలో వెలసినవే తత్త్వాలు. ఈ తత్త్వాల్లో ప్రచుర

12. అను., పా. 26
13. అను., పా. 58.

ప్రచారంలో ఉన్న యాగంటి లక్ష్మయ్యగారు, ఎడ్ల రామదాసుగారు, పిడుపర్తివారు, చిలుకపాటివారు మొదలయిన వారి తత్త్వాలే కాకుండా బ్రహ్మంగారి 'కాలజ్ఞాన తత్త్వాలు' కూడా చోటు చేసుకున్నాయి. ఏప్రచారంలో ఒక తత్త్వంలో మరొకటి కలగాపులగం అయ్యాయి. ప్రచారంలోవున్న తత్త్వాల్ని అనుసరిస్తూ జానపదులు సృష్టించినవి కొన్ని ఉన్నాయి. అయితే ఇవి పూర్వ తాత్త్వికుల తత్త్వాలంత లోతైనవి కావు. ఈ తత్త్వాల్లో కోలాటం లయకు అనుకూలమైనవి కోలాటం పాటలుగా ప్రచారం పొందుతున్నాయి.

"సందెవేళను పొందనంటడు,"[14] "ఓం నమశ్శివాయో ఆరు సంవత్సరములు-తొట్టి కారంభమే ఉయ్యాలో,"[15] "ఏటి కెదురునడవే మనసా"[16], "అన్నా బ్రెమ్మపట్నం పోదమంటే సీకటేమిర అన్నయ,"[17] "చెంచలంబగు జగతిలోపల శాశ్వితం దొకటేదిరా,"[18] "సివసివయని బుజియించే వారికి సిత్తము యిలపై యెక్కడిదీ,"[19] "సందమామ సందమామా సందమామారాజూ,"[20] "ఎరకాలావారింటో సిన్నాది,"[21] "దిగుదిగు నాగా-ఓ నాగన్నా దియ్యా సుందరినాగా,"[22] "మేరువాసావాల్మీదా సందమామా రాజూ"[23] మొదలయిన పాటలన్నీ ప్రాచీన తాత్త్వికులవే. వీటిని అనుకరించి కొన్ని పాటలు పుట్టకపోలేదు.

---

14. అను , పా. 120
15. అను., పా. 29
16. అను., పా. 23.
17. అను., పా. 5.
18. అను., పా. 48.
19. అను , పా. 111.
20. అను., పా. 49.
21. అను., పా. 21.
22. అను., పా. 61.
23. అను., పా. 94.

తాత్త్విక గేయానుకరణలో పుట్టిన వాటిలో "ప్రతివత ఎప్పుడు పతి పాదంబులు పూజించినదే ఆడది"[24] అనే పాట ఒకటి. ఇందులో ప్రబోధం ఉంటుంది. దూషణ ఉంటుంది అత్త మామలను ఆదరిస్తూ 'పొత్తులో వున్నది ఆడద'ని, అట్లాకాకుండా 'యిత్తనమంతా సేతాబట్టి పెత్తనము జేసినది గాడిద'ని, బావమరదులను 'అన్నతో బావము జూసుకున్నది ఆడద'ని, అట్లా కాకుండా కుచ్చిత గుణాలు గలిగి 'తంతనము జెందినది గాడిద'ని, అట్లే బంధు వర్గాన్ని 'సంరచ్చన జేసిందాడద'నీ, అట్లాగాక తిరస్కార భావంతో 'కావర గుణములు మదిలో నుంచీ - పాపరము జెందినది గాడిద'అనీ స్త్రీకి గృహిణిగా ఉండవలసిన ధర్మాలు చెప్పుతూ - అవన్నీ తిరస్కరించడం స్త్రీ లక్షణం కాదంటూ 'గాడిద' అని దూషించడం గూడా కన్పిస్తుంది.

### 3. దేశ భక్తి గేయాలు

దేశభక్తిని తెలిపే పాటలు ముఖ్యంగా చెక్కభజన కోలాటాల్లో ఎక్కువగా కన్పిస్తాయి. జానపద గేయాల్లోని తక్కిన విభాగాలలో ఇవి అంతగా కన్పించవు. దేశభక్తిని ప్రదర్శించే ఈ పాటల్లో దేశాన్నిగురించీ, దాని గొప్పతనాన్నిగురించీ, దేశనాయకుల్ని గురించీ కన్పిస్తుంది. "భారత దేవిరో నిన్నూ"[25] అనే పాటలో భారతదేశ గొప్పతనం వర్ణించబడింది. "నమో నమో ప్రియ భారతమాతా"[26] అనే అనుకరణ గేయంలో భారతమాత చల్లని తల్లియనీ, గొప్ప గొప్ప మహాత్ము లయిన గౌతమ బుద్ధుడు, గాంధీ మహాత్ముడు, రామకృష్ణ పరమహంస, వివేకా నందుడు, దయానంద సరస్వతి, కందుకూరి వీరేశలింగం మొదలైన వారిని కనిపెంచిన తల్లియనీ, గంగ–యమున–కృష్ణ–గోదావరి–తుంగభద్ర–కావేరి– పినాకిని మొదలయిన నదుల్ని కన్న తల్లియనీ వివరించబడింది. "ఓ భారతాంబా వరము లిచ్చి రచ్చింపావమ్మా"[27] అనే పాట కూడ భారత దేశ ప్రశస్తిని తెలుపుతుంది.

---

24. అను., పా. 77.
25. అను., పా. 84.
26. అను., పా. 66.
27. అను., పా. 30.

**4. పౌరాణికాలు :**

జానపదులకు నిత్యజీవిత యాత్రలో భక్తి ముఖ్యమైంది వారికి పురాణ పురుషుల మీద భక్తి అమితంగా ఉంటుంది పౌరాణికాల్లో పలురకాలున్నప్పటికీ సేకరించిన కోలాటం పాటల్ని రామాయణ పరంగాను, భాగవత పరంగాను విభజించవచ్చు.

**రామాయణ సంబంధి గేయాలు :** రామాయణ సంబంధి గేయాల్లో సీతారాముల వనవాసానికి సంబంధించిన వరకే లభించాయి సీతను రావణుడు చెరబట్టుకు పోయిన తర్వాత రాముడు దుఃఖిస్తూ సీతను ఎవరో ఎత్తుకు పోయారని అచ్చట కన్పించిన ప్రతివారిని చివరకు చెట్టును పుట్టను అడిగినటున్న సందర్భం "సుందర సకులారా - వో హో శెందనంపులారా"[8] అనే పాటలో వర్ణితం 'పాపాత్ముండెవడో - సీతను యెత్తుకు పోయాడూ' అనీ, 'మోసమాయెగదురా లచ్మన - యెంత జరిగెగదురా' అని విలపిస్తాడు రాముడు. రాముడు సీతజాడను తెలుసుకోవాలన్న ఆతృతతో 'నారికేలులారా వనిజము - పూరపలములారా, సీప తల్లులారా మీరూ - జాడలు గంటిరటే' అని వనంలోని ఫలవృక్షాల్ని అడుగు తాడు.

యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛిల్లినపుడు రాముడు దుఃఖించడం "అర మరలునుదాటి - అయొజ్జకును జేరి"[29] అనే పాటలో కన్పిస్తుంది. 'ఒదిన కోసమూ వచ్చి - వారిది బందించి - వొరిగి పోతివి తమ్ముడూ' అని దుఃఖి స్తాడు. 'ఉప్పు కోసము వచ్చి కప్పురము యిడనాడి - కపులార నేనేమి సేతు' అంటూ విలపిస్తాడు సామాన్యంగా సంఘంలో మనుష్యులు ప్రమాదాలకు గురైగాని, లేదా అకాల మరణం పొందితే వారి బంధువులు, ఇంకా వారి గుణగణాలు తెలిసిన ఇతరులు చనిపోయిన వారి మంచి గుణాల్ని, సాహసాల్ని చెప్పుకుంటూ ఏడుస్తుంటారు. అంతేకాకుండా, దూరంగా ఉన్న బంధువులకు నేనేమి సమాధానం చెప్పాలంటూ చనిపోయిన వ్యక్తికి దగ్గర ఉన్నవాళ్ళు ఏడుస్తుంటారు. ఆ పద్ధతి లోనే రాముడు 'నీ సతీ వురిమెళ్ళ నా పతియేడంటే - యేడంటే యేమందునూ'

---

28.- అను, పా. 123.

29. అను., పా. 8.

అని అంటూ 'లచ్చ గొడుగుల కింద రండిల్లు కుంటనే వత్తున్నాడని సెప్పేదా' అని విలపిస్తాడు. తర్వాత జాంబవంతుడు ముందుకువచ్చి హనుమంతుడు సంజీవని కోసం వెళ్తాడని చెప్పడం, హనుమంతుడు సంజీవని పర్వతానికి వెళ్ళడం, సంజీవని కనుగొనలేక ఆ పర్వతాన్ని 'బరికి సంకన' పెట్టుకొని రావడం, సంజీవనితో లక్ష్మణునికి స్పృహ రావడం మొదలయిన విషయాలన్నీ ఇందులో వర్ణితాలు. లక్ష్మణ మూర్ఛను గురించి రాముడు విలపించేదే "పాలా వరునాప సిలకా"[30] అనే మరొక పాటలో వర్ణించబడింది. 'ఆకాశనుండేటీ - ఆ యింద్రా జిత్తు సూర్యబానము నాటెనా, లేక ఇంద్రా బానము నాటెనా' అని విలపిస్తూ 'యెడాలు యెడాలేగాని ఎదుపే కెన్నడురావు' అనీ 'నీయంటి తమ్ముడూ - యిక నీతిమంతుడూ ఏ జల్మమున జూతురా' అని లక్ష్మణుని వినయ విధేయతలను, నీతి నియమాలను యేకరువు పెడతాడు. ఇంకా 'మనతండ్రి దశరద మరియాద దప్పక అడిమి పాలుగ జేసెరా' అనీ, 'పుట్టినపుడు కయిక కుతికా నిండొక్కసారిబోసి కూర్చి సంపక పోయెరా' అని దశరథుని, కైకను దూషించడం కన్పిస్తుంది. ఇది జానపదులకు రామలక్ష్మణులపై ఉండే భక్తి, అభిమానాలను; కైక, దశరథులపై ఉండే ద్వేష భావాన్ని తెలుపుతుంది.

"యినవే వూర్మిల నా ముద్దు సెల్లెలా"[31] అనే పాటలో ఊర్మిళతో సీతాదేవి లక్ష్మణుని గుణగుణాల్ని 'మంచి సవాస గానుడమ్మ నా మరిదీ' అనీ, 'మంచీ రత్నం నా మరిదీ' అనీ వివరిస్తుంది.

### భాగవత సంబంధాలు :

భాగవత సంబంధి గేయాల్లో కృష్ణచేష్టలకు సంబంధించినవి, కంసుని ఆగడాలకు సంబంధించినవి ఉన్నాయి. "ఓరి కంసా యినరా మనమిని దాకి గానవలెరా"[32] అనే పాటలో కంసుని ఒకవైపు 'కుటిలాత్ముడవై కోపతాపమున కొట్టజూసితివిరో' అంటూ, మరొకవైపు 'నవరతనాలకు నవదాన్యాలకు నాన్నెము గాంచితివి' అని ఆతని గొప్పతనాన్ని ప్రశంసించడం కన్పిస్తుంది. "గొల్లవారి

30. అను., పా. 75.
31. అను., పా. 107.
32. అను., పా. 32.

వాడలకు కిష్ణమూరితీ"[33] అనేది కృష్ణచేష్టను తెలిపే ప్రసిద్ధమైన పాట. ఇది సంవాదగేయం. ఒక కొత్త కోడలుతో కృష్ణుని సరసం. గొల్లవారి వాడలకు 'ఏమి పనుకొచ్చినావని' ప్రశ్నిస్తే 'పాలుగొనవచ్చినానని' కృష్ణుడి సమాధానం. 'కొత్త కోడలినని అత్తగారొప్పరయ్య కిష్ణమూరితి' అని బతిమాలుకుంటుంది. కృష్ణుడు తక్కువ తిన్నాడా! 'నీవు 'కొత్తా కోడలువైతే గొల్లబామా-నేను రొక్కమిత్త పుచ్చుకొమ్మం'టాడు చివరకు 'నీ రొక్కమొద్దు గిక్కమొద్దు కిష్ణమూరితీ నా మొగుడు యింటే యెగుడు జేసు కిష్ణమూరితీ' అని తనకున్న భయాన్ని కూడా చెప్పేస్తుంది. కృష్ణుడుమాత్రం అంతవరకూ వచ్చి వదలిపెడతాడా! 'నీ మొగుడు నిన్నూ యెరుగుదూనే గొల్లబామా - మీ యత్తకి నాకు యతుకు లేవే గొల్లబామా' అని ఆ ఇంటిగుట్టు బయటపెడతాడు. కోలాటం పాటల్లో ఈ పాట ప్రచారం ఎక్కువగానే ఉంది. కృష్ణుని చేష్టలను తెలిపే మరొక పాట "యిడవరా గోపాలా"[34] అనేది. ఇందులో మితిమీరిన శృంగారం కన్పిస్తుంది. మరొకపాటలో గోపికల పిర్యాదుల్ని తట్టుకోలేక యశోద కృష్ణుని తప్పుల్ని నిలదీసి అడుగుతుంది. "మదనా జనకా సిన్నికిష్ణా"[35] అనే పాటలో కొత్త కోడండ్ల ఇళ్ళలో చేరి వెన్న దుత్తలు పగుల గొట్టడం, జలక మాడే టప్పుడు చీరలు తీసుకెళ్ళడం, అర్ధరాత్రి నిద్రబోయే పడతుల్ని జడలతోటే కట్టివేసి పరుగెత్తడం మొదలయిన కృష్ణుడి ఆగడాలన్నీ యశోద గుర్తుచేస్తుంది. కృష్ణుడు మాత్రం నాకేమి తెలియ వంటాడు. కృష్ణుని చేష్టలను తెల్పుతూ వెలువడిన ఈ పాట కులుకుల కోలాటం లయకు సరిపోతుంది. "మల్లె పందిరదిగో సెలి- మాదవుడల్లడుగో"[36] అనే మరొక పాటలో మాధవుని స్తుతి మాత్రమే కన్పిస్తుంది అయితే ఈ పాట పూర్తిగా జానపద గేయంగా కన్పడదు. భజనల్లో కూడా ఈ పాటను కొందరు పాడుతుంటారు.

### ౬. ప్రార్థన పాటలు :

భజన కోలాటాల్లో కూడ నాటకాల్లోవలె మొదట ప్రార్థన పాట ఉంటుంది. విఘ్నేశ్వర పూజ ఉంటుంది. వారు చేయబోయే పనికి విఘ్నాలు కలుగకుండా

33. అను., పా. 45.
34. అను., పా. 106.
35. అను., పా. 88.
36. అను., పా. 90.

విఘ్నేశ్వరుని ప్రార్థించడం పరిపాటి ఎక్కువ భజన సమాజాలు, కోలాటం జట్టులు విఘ్నేశ్వరునే స్తుతిస్తుంటారు పల్నాటిలో "పరమపద గోయింద మాదవ''[37] అనే ప్రార్థనపాట ఎక్కువగా కన్పిస్తుంది. ఈ పాటలో విఘ్నేశ్వరుని స్తుతి ఎక్కువగా కనిపిస్తుంది మధ్యలో అచ్చటచ్చట వెంకటేశ్వరుని పేరు విన్పిస్తుంది. ఇంకా విఘ్నేశ్వరుని ఆకారం, అందచందాలు వర్ణితాలు. ''పాయి పాయి గనేశ బవుకర''[38] అనే మరొకపాట కూడా ప్రార్థన గేయంగా కన్పిస్తుంది. ఈ పాటలో ఆటగాళ్లు "మే మాడెదము పాడెదము కోలన్న ఏసెదము బయబాత్తితో" అంటూ 'మొక్కు లొసగెడి వారి పనులను సక్కబెట్టే దేవరా! మా బత్తిగని కాపాడరా' అని స్తుతిస్తారు

కొందరు అద్వైతాన్ని ప్రబోధించే "సెరను సెరనూ వయికుంటా నాయికా''[39] అనే పాటను కూడా పాడుతారు. ఇందులో వైష్ణవ మతపరంగా కన్పించే విష్ణువు, శైవ మతపరంగా కన్పించే శివుడు కన్పిస్తారు. వారిద్దరిని కలిపి స్తుతించే ఈ ప్రార్థన పాట అంత ఎక్కువగా కన్పించదు.

నాటక సమాజాలవారు నాటకారంభంలో ప్రచురంగా పాడే ప్రార్థన పాట "పారా బ్రెమ్మ పారామేశ"[40] అనేది కూడా కోలాటంలో ప్రార్థన పాటగా కొన్ని చోట్ల చోటు చేసుకుంది. ప్రస్తుతపు కోలాటం జట్టు నాయకులకి కొద్దిగనో, గొప్పగనో నాటకాలతో సంబంధం ఉండడంవల్ల ఈ పాట కోలాటంలో చోటు చేసుకుని ఉంటుందని ఊహించవచ్చు. "శ్రీ యెంకటేశ్వరుని సిరిమల్లె తోటలో"[41] అనే మరొక పాటనుకూడ ప్రార్థన పాటగా కొందరు పాడుతున్నారు. ఇందులో వెంకటేశ్వరుని స్తుతి ఉంటుంది. పరమాత్మనేలుకోవడం తప్ప ఇతర ఏ పని తగదని ఇందులో ప్రబోధం కన్పిస్తుంది.

---

37. అను., పా. 72.
38. అను., పా. 76.
39. అను., పా. 109.
40. అను., పా. 74.
41. అను., పా. 119.

గురు స్తుతిని తెల్పే "సీ గురు పదములు మదిలో యెప్పుడు – సింతన జేయుము రోరన్న"[42] అనే మరొక పాట కూడా ప్రార్థన పాటగా కన్పిస్తుంది. అన్నింటికన్న గురుడే మిన్నయని, ముఖ్యుడనీ 'యేగతి జూసిన యింతకు మిక్కిలి' లేదని కాబట్టి గురుని సేవించమని ఇందులోని ప్రబోధం. గురుడే బ్రహ్మ, గురుడే విష్ణువు, గురుడే శివుడు, గురుడే సత్యం, గురుదే తోడు, గురుదే నీడ, గురుడే సర్వం – కాబట్టి గురుని పాదాలే మనస్సులో ఎప్పుడూ స్తుతించమని ఉద్బోధ. 'అందరాని పలమంద బోకుమీ, ఆశలు దీరవని', 'ముందుగ గురుతెరగని పనులు మోసమని', ఈ శరీరము శాశ్వతం కాదనీ 'నెత్తురు మాంసాల తిత్తేగాని పుత్తడి గాదనీ' కాబట్టి మానవ జన్మ ఎత్తినందుకు గురు పాదాలు మనస్సులో ఎప్పుడూ సేవిస్తూ, కీర్తిప్రతిష్ఠలు సంపాదించడమే జన్మ సార్థకమౌతుందనీ, జీవిత పరమావధికి గురుని సేవలు అవసరమని బోధించే దీపాట.

సేకరించిన కోలాటం పాటల్లోని ప్రార్థన పాటల్లో దాదాపు అన్నీ కూడా ప్రబోధాలే.

## 6. మంగళారతులు :

కోలాటంలో చివర మంగళారతి పాడుతారు ఆట అంతా విఘ్నంలేకుండా సాగిన తర్వాత చివరలో మంగళప్రదమైన పాటను పాడడం అనేది నాటకాల్లో కన్పిస్తుంది. జానపద గేయాల్లో మంగళారతులు ప్రత్యేకంగా ఉన్నాయి. అవి పెండ్లి సందర్భాల్లోను, వేడుక సమయాల్లోను పాడేవి. కాని కోలాటంలో పాట పూర్తిగా అయిపోయిన తర్వాత ఆట ముగించే ముందు చివరి పాటగా పాడేది మంగళారతి. ఈ పాటలో సామాన్యంగా దైవస్తుతి ఉంటుంది. "అంబ నీకు యిదిగొ మంగళం"[43] అనే పాటను ఎక్కువగా పాడుతారు. ఇందులో అంబ గొప్పతనాన్ని పొగడుతూ అన్నివేళలా కాచి రక్షించమని ప్రార్థిస్తారు. ''మంగళమని పాడి ఆడరే"[44] అనే పాటను కూడా కొందరు పాడుతారు. ఇందులో రంకు నేర్చిన ఈ మాయ ప్రపంచంలో శాంతిగా బ్రతకాలంటే సంకటములన్నీ బాపే శ్రీ వెంకటరమణుని సేవించమనే ప్రబోధం కన్పిస్తుంది. మరొక మంగళ గీతం

---

42. అను., పా. 117.
43. అను., పా. 6.
44. అను., పా. 86.

"దేవ దేవ మంగళం"[45] అనే దానిలో హనుమంత, శ్రీరామచంద్రుల స్తుతి కన్పిస్తుంది. "సెలియా మంగాళా మనారీ, శ్రీశెన్న కేశవ సకియా మంగాళా మనారీ"[46] అనే మరొక మంగళగీతంలో చెన్న కేశవస్వామి స్తుతి కన్పిస్తుంది. నాటకాంతంలో ప్రచురంగా పాడే "నీ నామా రూపములకు నిచ్చె జయా మంగళం"[47] అనే పాట కూడా కొన్నిచోట్ల కన్పిస్తుంది.

## 7. లాలిపాటలు :

పిల్లలకి సంబంధించిన జోల పాటలే లాలిపాటలు. లయకు ప్రాధాన్యం ఉంటుంది. సంగీతానికి దగ్గరగా ఉంటాయి తల్లులు పిల్లలకు లాలిపాటలు పాడే టప్పుడు రాముడు, కృష్ణుడు, లవుడు, కుశుడు ఒకరేమిటి- వారికి తోచిన ఏ దేవుణ్ణో, ఏ బాల వీరుణ్ణో తమ బాలునికి ఆపాదించి పాడుతుంటారు. ఈ లాలి పాటలు కోలాటం పాటల్లో చోటు చేసుకున్నాయి. వీటిలో "రామాలాలీ మేఘశ్యామా లాలీ"[48] అనే పాట చాలా ప్రసిద్ధి చెందింది. "లాలి లాలోయమ్మ లాలి లాలి మాయమ్మా"[49] అనే మరొక పాటలో సీత, అంగదుడు, హనుమంతుడు, జాంబ వంతుడు మొదలయినవాళ్ళు కన్పిస్తారు. "కోడె కాళ్ళందరు కోలన్న వేయ్యా - నవ్వుతూ కిష్ణమ్మ లాలనుచు పాడు' అని కృష్ణుణ్ణి జట్టు నాయకునిగాను, కోడె కాళ్ళంతా కోలన్న వేసే జట్టుగాను చక్కని ఉపమానాలతో పుట్టినదీ పాట. అయితే ఈ పాటలో కన్పించే ఇతర వ్యక్తుల గురించి ఏమీ తెలియదు. వారితో పాటకు సంబంధం కూడా కన్పించదు. అయినప్పటికి ఇట్లాంటి పాటలు ప్రచారం పొందు తూనే ఉంటాయి. "అన్నాయేడవకూరా-లవ్వన్నా యేడవకూరా"[50] అనే మరొక లాలిపాటలో సీత తన కష్టాలు కొడుకుతో ఏకరువు పెడుతుంది. 'ఒంటొంటి బతుకాయె' నని, 'ఒక రాత్రి వొక పగులూ- పొన్నమాను కింద' అనీ, 'సుప్పుం

---

45. అను., పా. 63.
46. అను., పా. 52.
47. అను., పా. 70.
48. అను , పా. 97.
49. అను., పా. 101.
50. అను., పా. 4.

డేది పూరడిమి - నువు పండేదే కారడిమి' అనీ తన బాధల్ని వెళ్ళబుచ్చుకుంటూ, 'పినతండ్రీ లచ్మనుడు వచ్చే యేడవకూరా' అనీ ఊరటపడుతుంది. అంతే కాకుండా, 'మీ తండ్రీ రామయ్య యిల్లు యిరిసి పెళ్లియాడే'నని, 'నను మరిసి అడిమికంపె' నని, మీ యవ్వలుకౌసల్యా, సుమిత్రలు నీ మీద దయదప్పారనీ తన గత విషయాలన్నీ గుర్తుచేసుకుంటుంది. అంతేకాకుండా, ఈ పాటలో మరణిం చిన దశరధుని పేరు సీత చేత పల్కించడం, బ్రతికి ఉన్న కైక పేరు పల్కించక పోవడం విశేషంగా గమనించ తగ్గ విషయాలు. అంటే సీతకు కైక మీద కోపం ఉన్నా లేకపోయినా సీతారాముల్ని అడవికి పంపిన విషయం జానపదులు మాత్రం మరచిపోలేదు. "ఆటాలాడిరీ కుశలవు లాటాలాడిరీ"[51] అనేది మరొక లాలిపాట. కుశలవుల గొప్పదనం ఇందులో వర్ణితం.

సేకరించిన లాలి పాటల్లో అన్నీ రామాయణ సంబంధి గేయాలే లభించాయి.

## 8. వలపు పాటలు :

జానపదుల గేయాల్లో వలపు పాటలు అగ్రస్థానాన్నే ఉంటాయి. ఇవి శృంగార రసప్రధానాలు. ఇందులో అసభ్యంపాలు కూడా ఎక్కువగానే ఉంటుంది. కొన్ని కొన్నిచోట్ల బూతుకనబడడం కద్దు. ఏటిలో స్త్రీలపరంగాను, పురుషులపరం గాను, స్త్రీ పురుషుల సంవాద రూపంలోను ఉంటాయి. "కలువరాయ వుదయ వెన్నెల"[52] అనే ఒక పాటలో ఒక కాంత విరహవేదన కన్పిస్తుంది. తన విటుడు కలువరాయడు. అతని హృదయంనుంచి వెలువడే చల్లని వెన్నెల హాయికి కలిగిన వియోగబాధకు తాళలేకపోయింది. అంతేకాదు, అతడు ఆమె పాలిటి మాచర్ల చెన్న కేశవుడు ఆ కులుకులాడి 'సందమామకంటె సక్కని సిన్నదాన్నిరా' అని తన అందాన్ని పొగడుకుంటుంది. ఆమె నీరుకావివస్త్రం కట్టింది. ప్రియుణ్ణి చూడాలని మనసుకల్గింది. ఆ తహతహతో నిలువలేకపోయింది. తాను అందగత్తె ముస్తాబ యింది. కాబట్టి తన రూపు తానే చూసుకోవాలి. అందుకని ప్రియుణ్ణి 'నీడ జూడ నాకు నిలుటద్దమంపరా' అని కోరింది. ఇంత విచ్చలవిడిగా తన మనస్సు విప్పి చెబుతున్నా తనకూ భయం ఉంది. 'అత్తమామ గల్లదాన్ని' అంతేకాదు, 'కత్తి

51. అను., పా. 15.
52. అను., పా. 34.

పదును యంటి మొగుని గల్లదాన్నిరా' అని తెలుపుతుంది. ప్రియుణ్ణి జూడకుండా నేమో ఒక నిముషమైనా ఓర్చలేదు. కాబట్టి 'మొగుడు వూరిలో లేకజూచి మాట లాడరా'అని విటుని బాగోగులను ఆలోచించి జాగ్రత్తగా రమ్మని హెచ్చరించింది. వస్తూ వస్తూ ఆకులొక్కలు తెమ్మంది. ఈ పాటలో పాఠాంతరాలు కన్పిస్తాయి. 'నారదాది ..పద్మనాభ నిన్నుజూడ - మనసు గల్గెరా మోహన' మొదలుగాగల నాల్గుపాదాలు అధిక చరణాలు. ఈ చరణాలు ఏపాటనుంచి ఎగిరివచ్చి ఇందులో దూకాయో తెలీదు. కాని పాట మధ్యకు చొచ్చుకుపోయాయి. ఈ పాఠాంతరాలు, అధిక చరణాలు అనేవి అధిక ప్రచారంవల్ల చేరుతాయి. జానపదగేయ లక్షణాలు బాగా వంటబట్టిన పాట ఇది.

"శ్రీకార పలనాటి సీమలో నెలకొన్న"[53] అనే మరొక పాటలో పలనాటి సీమలోని జాణల సరసాలను తెల్పె కథనాలు కన్పిస్తాయి. ఒక పడతి తన విటుడికి కబురంపుతూ 'కొలపట్టి సూసితే గోత్రమందున నాకు కులము లేదని' చెప్పమన్నది. తన విటుడికి ఎవరన్నా 'జాబు రాసెదమన్న సరములు' నేనిస్తా నంటుంది. మజిలీ రేపే కాబట్టి 'తూరుగోటికిరమ్మ' అని సంకేత స్థలాన్ని చెప్తూ 'మాట తప్పక రమ్మ'ని మరిమరీ గుర్తుచేస్తూ కబురంపుతుంది. అంతే కాదు, తానొక్కతే వస్తుంది. తనతో తర్కానికి దిగిన వాళ్ళకు ఆధారం తానే చూపుతా నంటుంది. శ్రీ గిరిపాటి చిన్నదేమో తన విటుడు ముత్తయ్యను గుండ్లపాటికి రమ్మని కబురంపుతుంది. శ్రీగిరిపాటికి గుండ్లపాడు తూర్పు దిశలో 8 కి.మీ. దూరంలో ఉంటుంది. కటియారం, రైలు వడ్డాణం, రాతెండి కడియాలు, జలతారు చీరె, దానికితగ్గ రైక గనుక తెస్తే శ్రీగిరిపాటికి దూర్పుదిశన 50 కి.మీ. దూరంలో ఉన్న కోటప్పకొండకు కూడా వస్తానంటుంది. అంటే అవన్నీ ధరించి ముస్తాబై కోటప్ప కొండలో మహాశివరాత్రికి జరిగే తిరుణాలకు వస్తుంది. ఇవన్నీ విని తత్తరపడి అసలు రాకుండా పోతాడేమోనని ఊరకే అన్నాను, కాబట్టి 'తత్తర పడబోకు వుత్తాదే నువుయాని - సిత్తాము దయ వుంచ' మంటుంది. పేటన్నిటికి చాటున 'నా మొగుడు బొయ్యాడు — అడిమిలో వున్నాడు నాకేమి భయం' లేదు రమ్మంటుంది. అంతేకాకుండా 'కడగొట్టు నా మరిది గట్టి సాదన కాడు చెప్పెట్టి తిరిగి రమ్మని' హెచ్చరిక కూడా చేస్తుంది. ప్రియుడి కబురు ఎట్లాగు తెలిపేదు

53. అను., పా. 114.

పొరపాటున అత్తమామలకు తెలిస్తే ఇబ్బంది. కాబట్టి ఎవరికీ తెలియకుండా ఉత్తరం రాయమని తన జాగ్రత్త తాను పడింది. ముదిరిన రంకుతనమైనా ముప్పురాకుండా చూసుకొంటున్న జాణతనం. ఈ పాటలో కూడా అధిక చరణాలు, పాఠాంతరాలు కోకొల్లలు. ఈ పాట ప్రచారానికేమీ తక్కువలేదు.

ఇరుకు సరుకులు చూసుకుంటూ, ఇబ్బందులకు గురికాకుండా ప్రియుణ్ణి గమనించనట్లు తన పని తాను చేసుకుంటున్న ఒక వగలాడిని ప్రియుడుచేసే సైగలు "పసుపూ గొట్టె సిన్నా పడతీ-పలకారించావే"[54] అనే మరొక పాటలో కన్పిస్తాయి అతన్ని పలకరించాలి. ఆతనిపై గంధం, కస్తూరి చిలకరించాలి. అక్కడి సరసం కాగానే అసలు సంజ్ఞ, పాలకోసమనే నెపంలో పనసపాటికి రమ్మంటాడు తానైతే నేతి కోసమనే నెపంతో నెలతపాటికి వస్తానంటాడు. ఎల్లుండి గనుక ప్రియురాలు రాకపోతే తనవల్ల ఏదో నేరం జరిగిందని భావిస్తానని తన మీద ఒట్టు పెట్టుకుంటాడు 'ఎల్లాటూరికి బొల్లాపల్లి ఎంతో దూరామూ' అని సంకేత స్థలం దూరాన్ని గూర్చి అడుగుతాడు. ఇంతెందుకు, తాను రావడానికి పడకటిల్లు ఎంత దూరం ఉందో తెలీదంటాడు చాటు సరసాలేగాని, బజారు సరసా లెరుగని వగలాడి పడకటింటికి సందు మాత్రమే అడ్డం ఉంది, ప్రియురాలు వస్తానంటే ప్రియుడికి అది కూడా ఒక దూరమా ? అని దూరం ఉందని రాకుండా పోతాడేమోనన్న అనుమానంతో అసలు గుట్టును, ఆకాంక్షను తెలుపుతుంది.

ప్రియురాలి జాడను ప్రియుడికి తెలియజేసిన దూతిక సందేశం "నిన్నే కోరియున్నాదీ"[55] అనే ఒక పాటలో తెలుస్తుంది. ఆతడు ఆమె పాలిటికి చెన్నరాయడు. దూత అతనితో ప్రియురాలిని గొప్ప చేసి చెబుతుంది. 'ఎర్రా యెర్రాని సిన్నదీ—అది యెండీ సొమ్ముూలు గల్లదీ', పిడికెడు నడుముతో, ముఖమంతా మొటిమలతో, హంసమొగ్గల రవిక దొడిగి మదనశాస్త్రాన్ని మదించి 'నిన్నేకోరి యున్నాదీ, సేవకే రమ్మన్నదీ'అని సందేశం. అసభ్యతనే అత్యున్నత స్థాయిలో కూర్చొబెడుతున్నారనకుండా సభ్యతలో కూడ అగ్రస్థానాన్ని తెలిపే

54. అను., పా. 73.

55. అను., పా. 69

రచనలు ఉంటాయనడానికి ఇచటి 'సేవ' అనే పద ప్రయోగం ఉదాహరణగా గ్రహించవచ్చు.

"ఓలలాడిరి సకులు"[56] అనే మరొకపాటలో హైద్రాబాదు సికింద్రాబాదుల వరకు కోటయ్య పంతులే మేటియని ఒక జట్టు నాయకుని పొగడ్త కన్పిస్తుంది ఈయన పిల్లుట్ల శివారులోని రుక్మిణీపురం నివాసి అయిన ముడిమాల కోటయ్యా అని కొందరి ఊహ [57] "కోలా కోలే కోలన్నా కోలే"[58] అనే మరొక పాటలో వస్తూ వస్తూ కారణం లేకుండానే తన కడకు రాకుండా పోయిన ప్రియుణ్ణి ప్రియురాలు బ్రతిమాలడం కన్పిస్తుంది తన కడకు రాకుండా పోవడానికి కారణం తెలేదు తాను ఏ నేరమూ చేయలెదు. అందుకే 'నిన్నాన్నేడు నాతొ పొందూగూడి- నా నేరాములూ ఎంచ నీకు రీతిగాదయ్యా' అని నీతులు లెలుపుతుంది. పాపం, అతడు కూడా మోజున్న వాడే, కాని ఏంచేస్తాడు?. ఆతని సోదరుడు 'బామామంచీదీ బంగారూ గుళ్ళాదీ- నేనేమి జేతుర తమ్ముాడా అది కానీ కులమూదీ' అని తన అభ్యంతరాన్ని తెలుపుతాడు. ఎంత చాటు సరసం అయినా ఎక్కువ కులంవాళ్ళకు తక్కువ కులం వాళ్ళతో సంబంధం సభ్యత కాదని అన్నగారి ఉద్బోధ. చేసేది తప్పైనా కొంత సభ్యత అవసరమని సోదరునికి ఉవాచ ప్రియుడి ఇబ్బందులు తనకు లెలియవు. తనవల్ల నేరంలేదు. ఇప్పుడు కానికులమనో మరొకటనో నేరాలు మోపడం రీతి గాదు. అందుకామె ఏ బాధ్యతా వహించదు. తనకు కావలసింది తన విటుడి సరసం. అయినా తన ఇష్టప్రకారం ఏదీ జరిగేటట్టులేదు. అందుకే చివరకు 'నీ అడుగులాకూ మొక్కేదానూ ఆశదీర్చరా' అని తన చివరిమాటకూడా చెప్పిందీ మోజుకత్తె.

''కోలు కోలన్న కోలు కోలో నా సామి - కొమ్మలిద్దరు మంచి జోడో"[59] అనే పల్లవితో మరొక పాటుంది. ఈ పాటలోని చరణాల్ని పోలిన చరణాలు

---

56. అను., పా. 31.
57. కొండం వెంకట నర్సయ్యా అనే జట్టు నాయకుని నుంచి ఈ విషయం సేకరించబడింది.
58. అను., పా. 42.
59. అను , పా. 38

కొన్ని మరికొన్ని పాటల్లో కలిశాయి. మరికొన్ని చరణాలు వేరు వేరు పాటలుగా వెలశాయి. ఈ పాటలో వలపు కత్తెల మరియు వలపుకాళ్ళ రకరకాల రంకులు, పడ్డపాట్లు, తదితర విషయాలు బయట పడతాయి. వింతలు వింతలుగా ఉన్న ఈత పేళ్ళ రవికతో ముస్తాబైన ఒక వగలాడి 'సోజ్జమైనా జొన్న చేలో నాసామి-దోసకాయకు మోసపోతి' నంటుంది. మరోవనిత కడవతో బావికి నీళ్ళకు బోయి కడవను ముంచుకుంటూ 'జోడు జేతులు కిడవమీద' పెట్టి, 'వాలుగన్నులు' పక్కనే ఉన్న ఒక వాగ్గాయమీద విసరింది. ఆతడు తక్కువ తిన్నాడా! 'వార జాతల కడవనిండే నాసామి - వోలలాడీ పోవె బాలా' అని సరసానికి దిగుతాడు. మరొాక కులుకులాడి చేటలో చేరెడు వడ్లుబోసుకుని చేమకూర కొనడానికి వెళ్ళింది. ఈవిడ చేమకూరకే వెళ్ళిందో, మరెందు కెళ్ళిందో తెలియదుగాని 'సేమ కూరా సెదులు బట్టే నాసామి-వాడిమీదా ప్రేమలు దప్పే' అని గొణుక్కుంటూ తిరిగి వచ్చింది. ఆ సోగ్గాడు మరే కులుకులాడితో కులుకుతున్నాడో లేక చెప్పిన మాట తప్పాడోగాని ఈమె కింత కోపం వచ్చింది. వేట నేర్చిన మరొాక చిన్నది పుట్ట మీది పిట్టను కొట్టబోయింది. కానక కాలెక్కడ పెట్టిందో? తేలు కుట్టింది. తేలు గుడితే గ్రామాల్లో సామాన్యంగా మంత్రం బెడుతుంటారు. ఈ చిన్నదానికి ఏ చిన్నోడు మంత్రం బెట్టినా మల్లెపూల పాన్పువేస్తానని అభయమిస్తుంది. తోటకు పోయిన మరొాక గడుసుపిల్ల తనను వెంబడించిన ప్రియుడితో కొయ్యకూర మాత్రమే కోశాను. ఇంకా చెంచలికూర కొయ్యాలని బ్రతిమాలుతుంది. చివరి కాతడి ఇబ్బంది భరించలేక 'వాసిగల్లా మొగవాడా నాసామి-వచ్చి ఒక రోజుండ రాదా' అని తనకు ఇంటివద్ద ఎలాంటి అడ్డంకులు లేవనే 'గుట్టు'ను తెలుపుతుంది. ఒక సరసుడు తన ప్రియురాలితో తన కోర్కెలన్నీ చెబుతాడు. బలుసుకూర, నెల్లికూర, చింతచిగురు మొదలయినవన్నీ వండిపెడితే తన వలపు తీరుతుందంటాడు ఒక మోజుకత్తె బొమ్మలున్న రవికను ఎలుక కొరికింది. ఆ రవిక మీద ఆమెకు మోజు ఎక్కువ. చినిగి పోయిందయినా జాలంబోసుకుని దాన్నే తొడగాలని ఉబలాటం. అందుకే 'జాలబోసే జంగముంటే నాసామి-జాముకొక్కా పానుపేద్దూ' అని తెలుపుతుంది. ఒక రెడ్డి పొలానికి పైరు కోతగోయడానికి చక్కగా ముస్తాబై కూలికి బోయిన ఒక కులుకులాడి 'కోనలమ్మా చీరగట్టి నాసామి - కూలి కోతకు నేనుబోతే; కూలి మీనా దుమ్ముబాడే నాసామి-రెడ్డి మీనా మరులు బుట్టే' అని కూలి సంగతి మరచిపోయి కులుకుల్లో బడింది. ఒక మరదలు పిల్ల మామ కొడుకుతో

'మాయదారీ బంచమీనా నాసామి - మంచుసూరె మూప కౌడుకా మ ద దేలా మాకు రేలా నాసామి-మదిలో ఉంటే సాలు పోరా' అని తన కేసి ఎత్తి పెట్టి నవసరం లేకుండానే మనస్సులో గుర్తించుకుంటే ఉంటుంది మూరొక మోటు పటుడితో సరిసాటికి దగిన షోకులాడి 'కాటె కాటె బంచమీనా నాసామి - పంద మంటడే ముసకౌడుకు, కందిరీగ వంటి నడుమూ నాసామి - కంచిపోయే యేమి సేతూ' అని వాపోతుంది

కొండమీద ఇల్లు గట్టుకున్న మరొక అందగత్తె అందానికి మురిసిపోయిన ఒక మోజుకాడు ఉంటే చిన్నదాని కొసమే ఉండాలనీ, ఆమెకోసం జన్మంతా ఖైదు చేయడానికైనా సిద్ధమేనని అంటాడు ఇదే చరణానికి మరొక చరణం రూపాంతరంగా కన్పిస్తుంది. కట్ట చివరలో ఉన్న ఇంటి చిన్నది చాలా అందగత్తెనీ, ఆమె ఎర్రబుగ్గల మీద మోజు కొద్దీ ఆ ఇంటికి వెళ్ళితే ఆరు నెలలు జైలు శిక్ష వేశారనీ ఒక మోజుకాడు వాపోతాడు. చేపలుపట్టే ఒక వయ్యారి ఎండిపోయిన చెరువు నిండగానే చేపలకు వెళ్ళి తన పాత మోజు తీర్చుకున్నానంటుంది.

ఇట్లా ఈ పాటలో చాలరకాల మనస్తత్త్వాలు తెలుస్తాయి. జారలక్షణాలు మితిమీరిన మోతాదులోను, శృంగారం విచ్చలవిడిగాను కన్పిస్తుంది. అధిక చరణాలు, పాఠాంతరాలు కోకొల్లలు. ఇదే పోలికతో చాలా పాటలు ఇతర ప్రదేశాల్లో కూడా ఉండవచ్చు.

ఏ పాట చూసినా ప్రియుడికోసం వయలు ఒలకపొయ్యడమో, లేక ప్రియుణ్ణి వర్ణించుకోవడమో, లేక ప్రియుడు ప్రియురాలిని వర్ణించుకోవడమో కన్పిస్తుంది. "కూసోని సెరిగే సేడె కురులపై"[60] అనే పాటలో ప్రియురాలు పని చేస్తూ ఉన్నప్పుడు తాను గమనించిన వంపుసొంపుల్ని చెప్పుకొని మురుస్తున్నాడొక సరసుడు.

---

60. అను; పా. 37.

"సంతమాను సిలకలార - గొరమేటిగ్గేనులార - సందమామ వంటి దాన్నిరా! నా సామిరంగ - సందుగాదు యేమి జేత్తురా"[61] అనే పల్లవితో మరొక ప్రఖ్యాతమైన పాట ఉంది. ఇది విస్తృత ప్రచారం పొందిన పాట. ఈ పాటకే 'నా సామిరంగ' అనే దానికి బదులుగా 'రంగయ్యబావ' అనే పదంతో ఇదే పల్లవితో పాఠాంతరం కన్పిస్తుంది ఈ పాటలోని వగలాడి 'రంగయ్య బావ'ను ఆకర్షించడానికి లేనిపోని మాటలన్నీ చెబుతుంది. వేసవిలో పచ్చిక లభించని గ్రామాల్లో దగ్గరగా ఉండే అడవుల నుంచి పశువుల మేతగా ఏపె ఆకు కోసుకొనివచ్చి వాడుతారు. ఈ పాటలోని చిన్నది 'ఎక్కలేని యేపె లెక్కి సిలకవోలె సిక్కినా' నంటుంది. కాబట్టి చెట్టునుంచి దించమని కోర్కె. మామూలుగా దించడంకాదు. కలివెపూల దట్టిగట్టి దించాలి, కలివెపూలు వేప పూవు ఆకారంలో చిన్నవిగాను, తెల్లగాను ఉంటాయి. ఎందరో కవులు ఎన్నో కావ్యాల్లో పలు రకాల పూలను శృంగార ఉద్దీపన వస్తువులుగా వాడారు. కాని కలివెపూలు ఏ కవి వాడినట్లు కనపడదు. మరి దాని మాధుర్యాన్ని రసికాగ్రణులే ఊహించాలి

మరొక చిన్నదాని మగడేమో ఇంటి మీద ఉల్లిపొట్టు గప్పి, మల్లెమొగ్గ మంచమల్లి వ్యాపార నిమిత్తం వెళ్ళాడు, ఈ వన్నెలాడిదేమో బాలప్రాయం. 'సిలకలున్న గూటిలోన వజ్జరాల వాన గురిసె - సిలక పలుకు లొలుకు పట్టెరా నా సామిరంగ - పొగడసెక్క నెగిడి పంపరా' అని తన సరసతను తెలిపింది. పొగడ చెక్క నెగడితో ఆగలేదామె కోర్కె. 'ఒక్క రాత్రి నిద్రసేయరా' అనేది మనసులోని మాట. అంతేగాదు, తాను అందెగత్తెనని, వయసులో ఉన్నదాన్ననీ, అంతకుముందు నుంచి ఉన్న పరువం, అందం తగ్గిన ప్రియురాలిని వదలి రమ్మని 'సిగురులేని మానుబాయరా' అనే గూఢార్థ ప్రబోధం. ఎప్పుడో ఒక్క రవిక తెచ్చి మళ్ళి ముఖం చూడలేదని తిరిగి తన వశంచేసుకోవడం కోసం 'కొత్తది ముచ్చాలపొట్టు కొమల కుంట, సెట్ల రవిక - అప్పుజేసి యేల తెత్తివి' - అని ఆప్యాయత, సానుభూతులను తెలుపుతూ 'అపటి మాట లేల బోయరా' అని తమ గతాన్ని గుర్తుచేస్తుంది. అంతేకాదు, మిద్దెమీద దుక్కుడుతీగ అల్లుకొని పెద్దదయి కాయలు, పిందెలు కలిగే వయసుకు వచ్చిందని తనకు ఉపమానంగా చెప్పుతూ

---

61. అను; పా. 50.

'ప్రాయమెవరి పాలు జేత్తురా' అని వాపోయింది అంతేగాదు, 'ఒడమీద పయిలు కాడు - యీలలేసి పిలవసాగె - ఓడ బేరమాడమాసెరా' అని రెచ్చగొడుతుంది. ఇట్లా తన గతాన్ని మర్చిపోలేక ప్రియుణ్ణి మళ్ళీ తనవణ్ణి చేసుకోవాలని ఎన్నో పన్నాగాలు పన్నుతుంది. ఇచ్చటి ముదిరిన కోర్కె, ముచ్చగొలిపే సరసం గమనించదగ్గది.

"అమ్మా నేను సిన్నదాన్ని - అల్లుకొస్తే తోలపోకు"[62] అనే మరొక పాటలో కన్పించే వయసు చిన్నదైన ఒక వన్నెలాడి 'తమలపాకు నడుము' ఉందనీ, కురులు కంచె మేకలపాలతో పెంచినవనీ, తాను తిరగని భూమిలేదని చెప్తుంది. ఈ పాటలో శృంగారం శృతిమించి పచ్చిగా బజారెక్కింది. మోట తోల బోయిన ఒక ఏతరి మోటబావిలో పడింది.అతడు పనిచాలించి యాత్రకుపోయాడు. ఏతరి భార్య మిండల మరిగెందట.

సారంగధరుడిమీది మోజుకొద్ది పినతల్లి చిత్రాంగి వలపు పాటలకెక్కింది. "సామిరార సారంగదారా"[63] అనే ఈ పాటలో పైపాటలకు తీసిపోని వర్ణన కన్పిస్తుంది వంచన చేయవలదని సారంగధరుణ్ణి ప్రాధేయపడుతుంది. తానుపట్టు కున్న సారంగధరుని 'పంచవన్నెల పావుర మిత్తు'నని ఆశ పెడుతుంది. 'కామకేళి గూడి నా మది ప్రేమదీర్చి పోరసామి' అని సిగ్గువిడిచి చెప్పింది. సారంగధరుని చూచింది మొదలు చిత్రాంగికి నిద్రలేదు. మనస్సుకు ప్రశాంతతలేదు. 'ప్రేమతోటి వందనములు అందుకొమ్మ'న్న పినతల్లితో సారంగధరుడిచేత నీతులుచెప్పించడం కన్పిస్తుందీపాటలో. 'పిన్నతల్లివి కావలెనమ్మా' అని చిత్రాంగి స్థానాన్ని తన వావి వరుసల్ని గుర్తుచేస్తాడు. ఆమెకు అతనియెడ మాతృప్రేమ ఉండాలికాని విరహం కాదని గుర్తుచేస్తూ మదనుణ్ణి అధీనంలో ఉంచుకొని 'వాడువాయె - రాలిలోన' అని బ్రతిమాలుటూ పావురాన్ని ఇచ్చి త్వరగా పంపమని వేడుకుంటాడు. మరొక లయ పద్ధతిలో నడచిన నాల్గు చరణాల్లో సారంగధరుడు చక్కనివాడనీ, పినతల్లిచేత మాటలాడలేక చావుకు తలవొగ్గాడని వివరించబడింది. ఈ పాటలోని కల్పనా చతురత మెచ్చదగింది జానపదుల చేతిలోపడ్డ ఏ విషయమైనా చేవదేలవలసిందే. ఇట్లే

62. అను., పా. 8.

63. అను., పా. 122.

"అటిగో సూడు మంచి పొద్దులు దొడిగింది"[64], "ఇంటి యెనక సేమంచిసెట్టు"[65], "ఎక్కాడిదానివే సక్కాని కోమలీ"[66], "ఏమిరా కిట్నా నేసు వొంటరిగా ఉండా లేను"[67], ఏప్రూరె బామా యేమె నీపేరూ"[68], "మనోహరా విందురారా"[69], "నా మాట ఇనవమ్మ కోయిల"[70], "రావేరావే నల్లతుమ్మీద"[71], "రండీరండోయ్"[72], "జడ నీకు ఎవరేశారె"[73], "పో పోమ్మానే పోమ్మానే"[74], "బంతిపూలా వాసిన్న దానా"[75], "మందయ్యానో వో మందయ్యానో"[76], "మళ్ళో మిచ్చాలపేరు ముద్దుగుమ్మా",[77] "రారా ముద్దులగుమ్మా"[78] మొదలయిన పాటలన్నీ శృంగార వానన వెదజల్లె విరజాజులే. అయితే వలపు పాటల్లో అశ్లీలంతతోకూడిన శృంగార వర్ణనలు ఎక్కువగానే ఉన్నాయి

## 9. స్థానిక గాథలు :

స్థూలంగా స్థానిక వ్యక్తులకు సంబంధించిన చరిత్రను మాత్రమే ఈ పాటలు తెలుపుతున్నయి. "ద్రుగ్గి కాపూరస్తుడు"[79] అనే పాటవల్ల మాచర్లలోని

---

64. అను., పా. 1.
65. అను., పా. 18.
66. అను., పా. 20.
67. అను., పా. 25.
68. అను., పా. 28.
69. అను., పా. 39.
70. అను., పా. 68.
71. అను., పా. 99.
72. అను., పా. 96.
73. అను., పా. 55.
74. అను., పా. 80.
75. అను., పా. 81.
76. అను., పా. 87.
77. అను., పా. 93.
78. అను., పా. 98.
79. అను., పా. 62.

శ్రీ చెన్నకేశవ స్వామికి సంబంధించిన వస్తువాహనాలు, ఆ స్వామి కళ్యాణ మహోత్సవానికి సంబంధించిన తిరుణాల్లో జరిగే వివిధ విశేషాలు వెల్లడవు తున్నాయి. ఈ పాటలో కన్పించే 'లచ్చిమిదేవి మిద్దె' అనేది ఇప్పటికీ వాడుకలో ఉంది. లక్ష్మీదేవి అనే దేవనర్తకి, మాచర్లలోని చెన్నకేశవాలయానికి ఆగ్నేయ దిశలో పెద్ద బజారులో స్వామి వారికి మండపం కట్టించిందని ప్రతీతి. అది ఇప్పుడు 'లక్ష్మీదేమి మిద్దె' అనబడుతుంది. కాని స్వామి వారి కళ్యాణం ప్రస్తుతం దేవాలయ మండపంలోనే జరుగుతుంది.

పల్నాడిలోని ప్రజల్లో కొందరి మెడలోనో మొలలోనో కన్పించే హను మంతుని బిళ్ళ ఒక విశేషం అందులో వెలసిన శ్రీగిరిపాడు హనుమంతుడు పల్నాటిలో చాలామందికి ఇష్ట దైవం. మాచర్లకు దక్షిణ దిశలో 15 కిలో మీటర్ల దూరంలో శ్రీ గిరిపాడు ఉంది ఇచ్చటి హనుమంతుడు భక్తులకు కొంగు బంగారమనీ, కోరిన కోర్కెలు తీరుస్తాడనీ ప్రతీతి, ప్రదక్షిణలు తిరుగుతూ ఉపవాసాలు ఉంటూ మొక్కుబడులు చెల్లించుకుంటారు. పిల్లలు లేనివారు ఎక్కువగా దర్శిస్తారు లేకలేక పుట్టిన పిల్లలకు ఎక్కువగా హనుమంతుని పేర్లు పెడతారు. హనుమంతుని వర్ణించే "శీగిరి పాటిలోన"[80] అనే ఈ పాట కూడా కోలాటం పాటల్లో కన్పిస్తుంది.

కృష్ణా నదిపై నందికొండ వద్ద కట్టిన ఆనకట్ట జగత్ప్రసిద్ధమైంది. దీని మీది పాట చాలా ప్రసిద్ధి చెందింది. నందికొండ వద్ద ఆనకట్ట కట్టిన తర్వాత నందికొండ పేరు 'నాగార్జునసాగర్' అని మార్చబడింది "నందికొండా వచ్చెను రోరన్నా"[81] అనే ఈ పాట "ఏరువాకా సాగెనురోరన్నా" అనే పాటకు అనుకరణ. ఇది ఆధునికమైనదే. ఈ పాటలో కృష్ణానది కాలువ అని ఎచ్చటా కన్పించదు. ఈ పాటలో-

నాగార్జునుడికి నమస్కరించి
మాశెర్లయో శెన్నుని దలిసి

80. అను, పా. 116.
81. అను., పా. 65.

కారంపుడి అంకమ్మను కొలిసి
గుత్తికొండ బెలస్తానంలోను
మత్తునిద్ర బ్రెమ్మయ్యను లేప'

మొదలయిన చరణాల్లో కన్పించేవన్నీ పల్నాటిలోని విశేషాలే. ఈ ఆనకట్టకు అనుకూలంగా విద్యుత్తు, తంతి, రవాణా సౌకర్యాలు ఏర్పడ్డాయి. పండే పంటలు మారాయి.

గుండ్లకమ్మ నదిని గూర్చిన ఒక పాట కోలాటం పాటల్లో చోటుచేసుకుంది. ఈ గుండ్లమ్మ నది ప్రసిద్ధి చెందింది. "ఆహా నిండీ పారీతీవి నురుగులు గమ్ముసూ"[82] అనే ఈ పాటలో నల్లమల, కంభం చెరువు, అయినవోలు, వినుకొండ, అద్దంకి డివిజను మొదలనవాటి ప్రసక్తి కన్పిస్తుంది.

స్థల ప్రశస్తిని తెలిపే పాట ఒకటి టంగుటూరు మీద ఉంది. టంగుటూరు పల్నాటి సీమలోనిది కాదు. జానపదగేయాలు ప్రచారం పొందే లక్షణం గలవి కాబట్టి ఒక ప్రాంతం పాట మరొక ప్రాంతంలో కన్పించవచ్చు. ఆ కోవలోనిదే అయిన "బలిరే టంగుటూరు బలిరే టంగుటూరు"[83] అనే పల్లవితో ఉన్న ఈ పాటలో టంగుటూరులోని విశేషాలు వెల్లడవుతాయి. అక్కడ బలమైన రైతులు ఉన్నారనీ, వజ్రాల వర్తకులు ఉండేవారనీ, టంగుటూరు తోటలకు ప్రసిద్ధి అనీ ఈ పాటలో కన్పించే విశేషాలు 'రేనాటి బూమిన నెమిలి సిన్నపరెడ్డి — కొడుకు అయ్యపరెడ్డి — గోపాల కిష్ణమ్మ గోవులే కాయంగ — గోవు పాలాతోటి కోరివేసిన టంగుటూరు' అనే పాదాలవల్ల నెమలి చిన్నపరెడ్డి అనే వ్యక్తికి టంగుటూరితో ఉన్న సంబంధం ఈ పాటవల్ల తెలుస్తుంది. ఈ పాటను అనుకరిస్తూ ఇదే పద్ధతిలో చెప్పాల చెన్నయ్య అనే కోలాటం జట్టు నాయకుడు "బలిరే కమ్మంపాడు బలిరే కమ్మంపాడు"[84] అనే పల్లవితో పల్నాటిలోని కంభంపాటిలో కారుమంచి వెంకయ్య అనే రైతును పొగడుతూ ఒక పాటను కట్టాడు.

---

82. అను., పా. 17.
83. అను., పా. 83.
84. అను., పా. 82.

**10. హాస్యరస సంబంధిగేయాలు :**

నవరసాల్లో హాస్యరసం ఒకటి. దీనికి స్థాయి హాసం. ఉత్తేజాన్ని, ఉల్లాసాన్ని, ఆనందాన్ని ఇచ్చే హాస్యరసానికి వికృత ఆకారమో, వికృత వేష భూషణాలో మూలాలు. విఘ్నేశ్వరుని వికృత రూపం నవ్వు పుట్టిస్తుంది. వేషభూష ణాలు, ఆకారాలే కాకుండా వికృత సంభాషణలు, వికృత ఉచ్చారణలు, వికృత పద ప్రయోగాలు నవ్వుపుట్టించేవే. జానపద గేయాల్లో ఈ విధమైనవి ఎన్నో ఉన్నాయి. ఇట్లాంటి హాస్య గేయాలు కోలాటం పాటల్లోకూడా చోటు చేసుకున్నాయి. "పోతుంది సూడరా కల్లింటికి"[85] అనే పాటలో కావలసినంత మోటు హాస్యం. ఒక స్త్రీ కల్లు దాగడం చక్కగా వర్ణితం. 'జీతగానీవోలె కాసు సేతికిచ్చి కలు బోయ' మంటుంది. కాసు చేతికిచ్చి ఊరుకోలేదు. 'కల్లు బాగుంటె రేపొత్త మీ యింటికి' అని మంచి కల్లు తాగడానికి పథకం వేసింది.

'కల్తైతె తాగింది
కళ్ళెల్ల బెట్టింది
పళ్ళిగల బెట్టింది
బడబడా గక్కింది' అనే చరణాల్లో కావలసినంత హాస్యం. ఇంత జరిగిన తర్వాత 'ఇకపోను కల్లుకి యేనాటికి' అని శపథం చేస్తుంది. 'ఎంతపని యాయనే దేయాని' కని బాధ పడింది. తగిన బుద్ధి వచ్చిందనుకుంటుంది.

'ఎవరన్న జూసితే యేమనుకుంటరని
బట్ట ముసుపూకోని దాటబడి వస్తుంది' అనే చివరి చరణాల్లో హాస్యం తారా స్థాయి నందుకుంది పాట కల్పన రమనీయంగా ఉంది.

"సొరకాయా సొక్కం బీరకాయా"[86] అనే మరొక పాటలో కూరలు, ఇతరమైన తిండి పదార్థాలు ఎన్నో వివరించిబడ్డాయి. శనగపప్పు, పెసరపప్పు, కందిపప్పు, నేతిబొట్టు ఒకదాన్ని మించి మరొకటి రుచిలో పోటీపడతాయి. అట్లే

---

85. అను., పా. 79.
86. అను., పా. 125.

శనగా పిట్ట, గురకా పిట్ట, కముజు పిట్ట, కోడిపెట్టలు పోటీ పడతాయి. జానపదుల ఆహారాల్లో దేనికంటే ఏది ఎక్కువ రుచిగలదో ఈ పాటవల్ల తెలుస్తుంది. పప్పుల లోకి నేయి ఉంటేనే రుచి అనీ, పక్షి మాంసాల్లో కోడిపెట్టే అత్యధిక రుచి అనీ, చేపల్లో కొర్రమట్ట అత్యధికమైన రుచి కల్గిఉంటుందని వివరిస్తుందీపాట

మగణ్ణి పనికి పంపి మాటున మదన విలాసాలు జరిపే ఒక కులుకులాడిని మగడు నిందించడం "ఆకులో పాకులో"[37] అనే ఒక పాటలో చక్కగా వివరించ బడింది. 'మొగుడిముందు ఒక నడకా, మొగుడెనకా ఒక నడక' అని అతి విన యాన్ని ఎత్తిచూపి నిందిస్తాడు. అంతేకాదు, భార్యను 'బోగంరత్తే' అని వ్యభి చారిత్వాన్ని గుర్తుచేస్తూ సంబోధిస్తాడు నీవేకాదు, నేనూ వ్యభిచారినేలే అన్నట్లు 'నీ కంట్లో నాలంజొడక' అంటాడు. ఇంకా 'బీది మురుగుల దానా లబ్బరి గాజుల దానా బంగారి మురుగులకు బాగనే మరిగావే' అని నిందిస్తాడు ఆ విధంగా తిడుతూనే 'పుల్లలకూ నే బోతే పిలగాడు జద్దరమే' అని తమ సంతాన బాగోగుల్ని గూర్చి హెచ్చరిస్తాడు. ఇబ్బంది కల్గిస్తే పిల్లవాణ్ణి 'నీ కడ్డమొస్తేను పొయి కడ్డ మేయవే' అని వ్యంగ్యంగా తిడతాడు. ఇందులో అసభ్యమైన హాస్యం తొంగిచూస లాడుతుంది.

ఇట్లా హాస్యానికి కూడా కోలాటం పాటల్లో పీఠం ఉంది.

ఇట్లు సేకరించిన కోలాటం పాటల్ని పది విభాగాలుగా విభజించడం జరిగింది. ఆయా విభాగాల్లో చేరిన ఆయా పాటల అనువర్ణనం ఇది.

---

37. అను., పా. 14.

# కోలాటం పాటలు : సామాజిక పరిస్థితులు

మానవ జీవితానికి సంబంధించిన సకలాంశాల్ని కూలంకషంగా తెల్పేది సాంఘిక చరిత్ర. నేటి పరిశోధనా ప్రపంచంలో రాజుల, రాజ్యాల చరిత్రల కంటే సామాన్య మానవుల చరిత్రమీదనే విశేష కృషి జరుగుతూ ఉంది. ప్రజల్లో నెలకొన్న మతాలు, కులాలు, దేవతలు, విశ్వాసాలు, వినోదాలు, కళలు, వృత్తులు, వ్యవసాయం, వాణిజ్యం, నమ్మకాలు, వైద్యాలు, గృహపరికరాలు, జీవన విధానం, అలంకారాలు, నిత్యావశ్యక సామగ్రి మొదలయిన సామాజిక పరిస్థితులన్నీ సాంఘిక చరిత్రలోని విషయాలే. అయితే చరిత్ర కందని కాలం నాటి సాంఘిక చరిత్రను నిర్మించాలంటే చాలా కష్టం. వాటికి ఆధారాలు చాలా తక్కువగా కన్పిస్తాయి. సురవరం ప్రతాపరెడ్డిగారు సాంఘిక చరిత్రకు ఆధారాలుగా ''సారస్వతము, శాసనములు, స్థానిక చరిత్రలు (కైఫీయత్తులు), విదేశీ జనులు చూచి వ్రాసిన వ్రాతలు, శిల్పములు, చిత్రములు, నాణెములు, సామెతలు, ఇతర వాఙ్మయములలోని సూచనలు, దాన పత్రములు, సుద్దులు, జంగము కథలు, పాటలు, చాటువులు, పురావస్తు సంచయములు''[1] మొదలయిన వన్నీ పనికి వచ్చే సాధనాలుగా పేర్కొన్నారు ఇన్ని ఆధారాలద్వారా సాంఘిక పరిస్థితుల్ని సమగ్రంగా చర్చించవచ్చు. ఇందులోని ఏదైనా ఒకే ఒక్క అంశాన్నుంచి మాత్రమే సామాజిక పరిస్థితుల్ని విపులీకరించాలంటే అది సమగ్రంగా ఉండదు. మరి ఒక అంశాన్ని సూక్ష్మాతి సూక్ష్మాంశాలుగా విభజించి, వానిద్వారా విషయ పరిశీలన చేయడం పరిశోధనా పద్ధతి. పైన చెప్పిన పాటలు అనే అంశం కింద చేరే ఎన్నో రకాల సూక్ష్మాంశాల్లో ఈ పరిశోధనలోని 'కోలాటం పాటలు' అనే విషయం సూక్ష్మాతి సూక్ష్మాంశం. ఇంత చిన్న అంశం ఆధారంగా సాంఘిక పరిస్థితుల్ని వివేచించడం ప్రకృత ప్రకరణంలోని పరమార్థం, ఈ పాటల్లో లభించే విషయాల ఆధారంగా సాంఘిక పరిస్థితుల్ని వీలైనంతవరకు పరిశీలిద్దాం.

---

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పు. 8.

ఉదాహృతాలయ్యాయి, "ఆంద్రుడ రావయ్య పోట్ల బూదెయ్యా"[7] అనే పాటలో 'మసీదన్నా తీరకపోయే, నీ పేరు మాసిపోయె' అని మహమ్మదీయ దేవాలయ ప్రసక్తి కన్పిస్తుంది.

ఏదో ఒక త్యాగం చేసో, లేక తత్త్వబోధనతోనో లేదా మరేదైనా మహత్కార్యంతోనో కొందరు వ్యక్తులు ప్రజల హృదయాలలో దేవతలుగా స్థిరపడిపోతారు. అటువంటివారు అన్ని ప్రాంతాల్లోను ఉంటారు. పల్నాటిలో అటువంటి వారిలో చిరుమామిళ్ళ సుబ్రహ్మణ్యంగారు ఒకరు. పల్నాటిలోని ధర్మవరంలో ప్రతి సంవత్సరం పుష్య బహుళ అష్టమినాడు శ్రీ చిరుమామిళ్ళ సుబ్రహ్మణ్యం గారి మఠంలో ఆరాధనోత్సవం జరుగుతుంది. ఈయన 19 శతాబ్దివాడు. కమ్మ కులంలో పుట్టి, తరతరాలుగా సంక్రమించిన వ్యవసాయక వృత్తిని స్వీకరించి న్యాయమార్గంలో భక్తిప్రపత్తులతో జీవిస్తూ, భక్తితత్త్వాన్ని ప్రబోధించిన మహనీయుడు చాలా కృతులు రచించాడు. ఈయన రచనల్లో ప్రచురణార్థం తీసుకెళ్ళిన పదమూడు తాళపత్ర గ్రంథాల్లో నాల్గు ముద్రితమయ్యాయి.[8] అచ్చయిన వాటిని 'చిరుమామిళ్ల సుబ్రహ్మణ్యకృతులు' అనే పేరుతో ఈ మధ్యనే పునర్ముద్రించారు. శ్రీ సుబ్రహ్మణ్యంగారు సుబ్బదాసుగానే వ్యవహార ప్రసిద్ధం. ఆయన తత్త్వాలు పల్నాటిలో ఎన్నో ప్రచారంలో ఉన్నాయి. ఆయన దుర్గి శ్రీ వేణుగోపాలస్వామి భక్తుడు. నిత్యం దుర్గి వచ్చి స్వామిని పూజిస్తుండేవాడు సుబ్బదాసుగారికి స్వామి ప్రత్యక్షమైనట్లు వివరించే కథనాలు కూడా ప్రచారంలో ఉన్నాయి. కంచనపల్లి నారాయణరావు అనే జమిందారు ఒకనాడు తెల్లవారు ఝామున ఏదో పనిమీద వెళ్ళుతూ శ్రీ వేణుగోపాలస్వామికి నమస్కరించ వెళ్ళాడనీ, అచట సుబ్బదాసుగారితో వేణుగోపాలస్వామి సంభాషణ విన్నాడనీ, ఆ విషయం ఎవ్వరికీ చెప్పవద్దని సుబ్బదాసుగారు నారాయణరావుతో చెప్పినప్పటికీ ఆయన ప్రజలకు చెప్పాడనీ, సుబ్బదాసుగారి కోపానికి గురై నారాయణరావుగారి కుటుంబం ఇబ్బందులపాలయిందనీ వివరించే కథనాలు సైతం ఉన్నాయి. ఈ సుబ్బదాసుగారిపైన వెలసిన ఒక పాట కోలాటం పాటల్లో చోటు చేసుకుంది. "సుబ్బదాసుని గాంచుమురోరన్నా సిన్నన్నా, నీ మోచ్చమార్గము నెరుగుమురో

---

7. అను., పా. 12.
8. శ్రీ చిరుమామిళ్ల సుబ్రహ్మణ్యకృతులు, పీఠిక, పు. 2.

రన్నా సిన్నన్నా"[9] అనే పల్లవిలో వెలువడిన ఈ పాటలో ఆయన ఉనికి అంతా తెలుస్తుంది. అంతేకాకుండా, ఆయన మఠంలో యోగనిద్రతో ఉన్నాడనీ, ఆయన రాజయోగి అనీ, భక్తులకు ముక్తిమార్గం తెలిపాడనీ, చెన్నయ్య అనే భక్తుడ్ని కాచి రక్షించాడనీ ఈ పాటలో వివరించబడింది.

కుల నిర్మూలనకు శైవ, వైష్ణవ మతాలు తోడ్పడ్డప్పటికీ ఈ మతాల పతనాంతరం ఈ రెండు మతాల ఆధారంగా మరలా సరికొత్త కులాలు కొన్ని ఏర్పడ్డాయి. వీటిలో కొన్ని కులాలకు కొన్ని కొన్ని వృత్తులు స్థిరపడిపోయాయి. ఈ కులాల ప్రస్తావన కొన్ని కోలాటం పాటల్లో గోచరిస్తుంది. సేకరించిన పాటల్లో బ్రాహ్మణ, కోమటి, రెడ్డి, కమ్మ, భోగం, చెంచు, ఎరుకల, జంగం, గొల్ల, చాకలి, గౌండ్ల, తురక మొదలయిన కులాలవారు కన్పిస్తారు. ఇందుకు ఉదాహరణముగా-

> "బ్రేమ్మలు నిన్నుగొలవ గననాదా"[10]
> "శెరువుపాకిట సీరెలుదికే సేడె
> బ్రేమ్మణ సిన్నదీ"[11]
> "యీదిలో దానిల్లురా - బాజారులో దానంగడీ
> అది గడియ గడియకు బేరమిస్తది సకియ కోమటి సిన్నిదీ",[12]
> "కోమట్లు సిన్నుగొల్వ గననాదా"[13]
> "కూలిమీనా దుమ్ముబాడే నాసామి
> రెడ్డిమీనా మరులు బుట్టే"[14]
> "బలమైన కమ్మోరు బాగ్గెమున్నది కమ్మంపాడూ"[15]

9. అను., పా. 124.
10. అను., పా. 112.
11. అను., పా. 95.
12. పైది.
13. అను., పా. 112.
14. అను., పా. 38.
15. అను., పా. 82.

"మొగుడెనకా ఒక సడకా—మొగుడిముందు ఒక సడకా
కనకలంగజ్జా—నీకట్లో నాలంజొడకే భోగముర త్తే"[16]
"కాళ్ళగజ్జెలు కంచుతాళము యెనక మద్దెల నింపగా
అది తధిమి ధిమితకలాడు సున్నది కన్నెబోగము సిన్నదీ"[17]
"ఎక్కాడి దానవే సక్కాని కోమలీ
ఒక్కాదాని వడిమిలో ఓసెంచూ -
వంటి దాని వడిమిలో"[18]
"పట్టు సీరలేలనమ్మ పారుటాకు లుండంగ
సెట్టు కింద వోలలాడె సెంచువారికి"[19]
"ఎరకాలా వారింటో సిన్నాదీ మంచి
ఎరకైతే తాదెల్పు సున్నాదీ లలనా"[20]
"నూనె బుంగది జారుకొప్పుది కాటుకా కన్నూలదీ
అది సీకటింటకి వన్నెదెచ్చిన అతివ యెరకల సిన్నదీ"[21]
"తడిన వాత్రము మెడన లింగము నొసట యిబుదిరేకది
అది మాటిమాటికి శివుని దలిసే మటము జంగము సిన్నదీ"[22]
"జాల బోసే జంగముంటే నాసామి
జాము కొక్కా పానుపేద్దు"[23]
మొదలయినవి కన్పిస్తాయి.

"గొల్లవారి మమ్మామేము సల్లలమ్మే వారిమమ్మా"
"పూజగొల్లా వారిమమ్మా బుద్ధులైనా నేరమమ్మా"
"ఎఱ్ఱగొల్లా వారిమమ్మా ఎగ్గులేవో నేరమమ్మా"[24]

---

16. అను., పా. 14
17. అను., పా. 95.
18. అను., పా 20.
19. అను., పా. 9.
20. అను., పా. 21.
21. అను., పా. 95.
22. అను., పా. 95.
23. అను., పా. 38.
24. అను., పా. 44.

"గొల్లవారి వాడలకు గొల్లభామా
నే పాలుగొన వచ్చినానె గొల్లభామా"[25]
"సిన్నదీ ఐలె వన్నెదీ యేమన్నదీ రమ్మన్నదీ
అది కంటికి యింపయినా సిన్నది
కర్న గొల్లోల్ల సిన్నదీ"[26]

మొదలయిన చరణాలవల్ల యాదవుల్లోని పూజగొల్ల, ఎర్రగొల్ల, కర్ణగొల్ల మొద లయిన తెగలవారి ఉనికి తెలుస్తుంది.

"నాబాబు మంగమ్మా వచ్చి నాది బాగమనే"[27]
"కొత్త నీళ్ళు వచ్చెనాని యెక్కె కొండశేప
నిండే తురకప్ప శెరువు తూరుపలుగు వెళ్లిబారె"[28]

ఇచ్చటి 'నవాబు' అనే పదం ముస్లింల హంగును గుర్తుచేస్తుంది. "యోగిరా, సయ్యోగిరా"[29] అనే పాటలో 'కాళ్ళగజ్జెలు కంచు లాళాల'తో నాట్యమాడే బోగము వారి చిన్నది, 'జారు కొప్పుది కాటుక కన్నూలది' అయిన ఎరుకల చిన్నది, తడిసిన వస్త్రం, మెడలో లింగం, నొసట విభూతి రేకలతో శివుని జపిస్తూ ఉండే జంగమువారి చిన్నది, 'సీరయుదికే' చాకలి చిన్నది, పసిడి రంగులు కల్గి, చెరువు వాకిట చీర ఉదుకుతున్న బ్రాహ్మణ చిన్నది, 'కంటికి ఇంపైన కర్ణగొల్లోల్ల చిన్నది', చుట్టూ ఆమడ దూరం గట్టు తిరుగుతున్నది 'సేత పిడకల గంపదీ' అయిన షూద్రుల చిన్నది, 'లొట్టిమీద లొట్టి పెట్టి' కల్లో కల్లని అమ్మే గొంళోళ్ళ చిన్నదీ, బజారులో అంగడి పెట్టి 'మాటిమాటికి బేరమిచ్చే' కోమటివారి చిన్నది, 'యీపు జడలది తోపు రెయికది లోపలా తాపొందుదీ మారు బాసాలాడే' మగువ

25. అను., పా. 45.
26. అను., పా. 95.
27. అను., పా. 61
28. అను., పా. 61.
29. అను., పా. 95.

తురకల చిన్నది మొదలయిన కులాల పడతులు, వారి వృత్తులు, వేష భూషణాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. పైన పేర్కొన్న కులాల పడతులు శ్రీనాథుని రచనలుగా ప్రచారమవుతున్న చాటువులలో కన్పించే పలు కులాల స్త్రీలను ప్రతిబింబించడం గమనించదగ్గది

"కాపులు నిను గొల్వ గనదానా
నిన్ను కాడి మేడందురయ్య గననాదా"30

అనే చరణాలలో కన్పించే 'కాపులు' అనే పదం కొన్ని ప్రాంతాలలో తెలగ కులస్థులనూ, వేరు కొన్ని ప్రాంతాలలో రెడ్లనూ పిల్వడానికి ప్రచారమవుతుంది. ఎక్కువ చోట్ల వ్యవసాయదారులను 'కాపులు' అనే వాడుక ఉంది పైన పేర్కొన్న 'కాపులు' అనే పదానికి రైతులు అన్న అర్థమే స్ఫురిస్తుంది ఈ కాపులు గణపతిని ప్రార్థిస్తారు. కాడిమేడి వారి కోర్కె.

కళలు :

విద్య, శిల్ప నిర్మాణం, చిత్రలేఖనం, సంగీతం కళలుగా పరిగణిస్తుంటారు. సేకరించిన గేయాల్లో మొదటి మూటికి సంబంధించిన విషయాలు లభిస్తాయి.

విద్య :- విద్యా విషయకంగా ప్రపంచం ఎంతో అభివృద్ధి చెందింది. అయినప్పటికి జానపద గేయాల్లో ఎచ్చటనో తప్ప సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండే కవుల పేర్లే కన్పిస్తాయి. కొరుకుడు పడని విద్వదౌషధాలు సృష్టించిగాని, చిత్ర కవితా రసాయనాలు తయారుచేసిగాని, భాషా భేషజాలు ప్రదర్శించిగాని గండ పెండేరాలు ధరించవచ్చు కనకాభిషేకాలు చేయించుకోవచ్చు. గజారోహణాలు చేయవచ్చు. కాని వారికి వరుసగా జానపద గేయాల్లో అగ్ర తాంబూలం అందదు. వారిని గురించి జానపదులకు అవసరంలేదు. వారి కవితాసృష్టి ఎవరికి పనికిరాదు. వీరి సమస్యల్ని, వీరికి సంబంధించిన విషయాల్ని తెలిపే కవిత్వమే వీరికి కావలసింది ఈ కవితా స్రష్టలే వీరి మహాకవులు. వేమన, బ్రహ్మంగార్లవంటి వారే ఈ గేయాల్లో చోటు చేసుకుంటారు వారు

30 అను, పా. 112.

చెప్పిన సూక్తులు, తత్త్వాలు సరాసరి ఈ పాటల్లో వచ్చి చేయుకుంటాయి కొందరి పేరు కన్పించకుండా వారి ఊరిపేరు మాత్రమే కనపడుతుంది "ఆహా యేమదీ"[31] అనే పాటలో జగ్గయ్యపేట కవి అని మాత్రమే కన్పిస్తుంది భక్తి తత్త్వాన్ని కీర్తనల ద్వారా ప్రచారంచేసిన పరమభక్తులు, తాత్త్వికుల్లో సుబ్బదాసుగా వాడుకపడ్డ చిరుమామిళ్ళ సుబ్రహ్మణ్యంగారు ఒకరు వీరి కృతులన్నీ భక్తిని ప్రబోధించే రచనలే. పల్నాటిసీమలో ఇంకా ఎందరో కవులున్నా కోలాటం పాటల్లో చేరింది మాత్రం సుబ్బదాసుగారొక్కరే.

కవిత్వం వలెనే మంత్రవిద్యల్లో ఎందరో పేరు గడిస్తారు. ఆ మంత్రాల్లో పాము మంత్రం, తేలు మంత్రం మొదలయినవిధంగా ఉంటాయి.

''కట్టమీనా కలియసెట్టో నాసామి
కొట్టబోతె తేలు గుట్టే
మంతరించేగ్గేనులుంటే నాసామి
మల్లెపూలా పానుపేద్దూ''[32] అనే చరణాలలో మంత్రగాళ్ళ ప్రసక్తి కన్పిస్తుంది. ఈ మంత్రాలతో బాధలు తగ్గుతాయని నమ్మకం.

శిల్పనిర్మాణం :- రాచరిక వ్యవస్థలో కళ లన్నింటికి సమాన ఆదరణ, ప్రోత్సాహం లభించింది. ఆ కాలాల్లోనే ప్రపంచ ప్రసిద్ధిగాంచిన శిల్పనిర్మాణాలు జరిగాయి.

''అత్తార్ పన్నీరు అద్దాలమేడలు
అమిరి యున్నది టంగుటూరు,''[33]
''అద్దాల మేడలో యిద్దరముండగ
ముద్దుటుంగరమిచ్చి ముద్దుబెట్టిన జాలు,''[34]

---

31. అను., పా. 16.
32. అను., పా. 38.
33. అను., పా. 83.
34. అను., పా. 80.

తురకల చిన్నది మొదలయిన కులాల పడతులు, వారి వృత్తులు, వేష భూషణాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. పైన పేర్కొన్న కులాల పడతులు శ్రీనాథుని రచనలుగా ప్రచారమవుతున్న చాటువులలో కన్పించే పలు కులాల స్త్రీలను ప్రతిబింబించడం గమనించదగ్గది.

"కాపులు నిను గొల్వ గనదానా
నిన్ను కాడి మేడందురయ్యా గననాదా"[30]

అనే చరణాలలో కన్పించే 'కాపులు' అనే పదం కొన్ని ప్రాంతాలలో తెలగ కులస్థులనూ, వేరు కొన్ని ప్రాంతాలలో రెడ్లనూ పిల్వడానికి ప్రచారమవుతుంది. ఎక్కువ చోట్ల వ్యవసాయదారులను 'కాపులు' అనే వాడుక ఉంది. పైన పేర్కొన్న 'కాపులు' అనే పదానికి రైతులు అన్న అర్థమే స్ఫురిస్తుంది ఈ కాపులు గణపతిని ప్రార్థిస్తారు. కాడిమేడి వారి కోర్కె.

**కళలు :**

విద్య, శిల్ప నిర్మాణం, చిత్రలేఖనం, సంగీతం కళలుగా పరిగణిస్తుంటారు. సేకరించిన గేయాల్లో మొదటి మూటికి సంబంధించిన విషయాలు లభిస్తాయి.

**విద్య :-** విద్యా విషయకంగా ప్రపంచం ఎంతో అభివృద్ధి చెందింది. అయినప్పటికి జానపద గేయాల్లో ఎచ్చటనో తప్ప సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండే కవుల పేర్లే కన్పిస్తాయి. కొరుకుడు పడని విద్వదౌషధాలు సృష్టించిగాని, చిత్ర కవితా రసాయనాలు తయారుచేసిగాని, భాషా భేషజాలు ప్రదర్శించిగాని గండ పెండేరాలు ధరించవచ్చు కనకాభిషేకాలు చేయించుకోవచ్చు. గజారోహణాలు చేయవచ్చు. కాని వారికి వరుసగా జానపద గేయాల్లో అగ్ర తాంబూలం అందదు. వారిని గురించి జానపదులకు అవసరంలేదు. వారి కవితాసృష్టి వీరికి పనికిరాదు వీరి సమస్యల్ని, వీరికి సంబంధించిన విషయాల్ని తెలిపే కవిత్వమే వీరికి కావలసింది ఈ కవితా స్రష్టలే వీరి మహాకవులు. వేమన, బ్రహ్మంగార్లవంటి వారె ఈ గేయాల్లో చోటు చేసుకుంటారు వారు

30 అను , పా. 112.

చెప్పిన సూక్తులు, తత్త్వాలు సరాసరి ఈ పాటల్లో వచ్చి చేరుకు టాయి కొంద పేరు కన్పించకుండా వారి ఊరిపేరు మాత్రమే కనపడుతుంది "ఆహా యిదేమదీ"3 అనే పాటలో జగ్గయ్యపేట కవి అని మాత్రమే కన్పిస్తుంది భక్తి తత్త్వాన్ని కీర్తన ద్వారా ప్రచారంచేసిన పరమభక్తులు, తాత్త్వికుల్లో సుబ్బదాసుగా వాడుకపడ్డ చిర మామిళ్ళ సుబ్రహ్మణ్యంగారు ఒకరు వీరి కృతులన్నీ భక్తిని ప్రబోధించే రచనలే పల్నాటిసీమలో ఇంకా ఎందరో కవులున్నా కోలాటం పాటల్లో చేరింది మాత్ర సుబ్బదాసుగారొక్కరే.

కవిత్వం వలెనే మంత్రవిద్యల్లో ఎందరో పేరు గడిస్తారు. ఆ మంత్రాల్లో పాము మంత్రం, తేలు మంత్రం మొదలయినవిధంగా ఉంటాయి.

''కట్టమీనా కలియసెట్టో నాసామి
కొట్టబోతె తేలు గుట్టే
మంతరించేగ్గేనులుంటే నాసామి
మల్లెపూలా పానుపేద్దూ''32

అనే చరణాలలో మంత్రగాళ్ళ ప్రసక్తి కన్పిస్తుంది. ఈ మంత్రాలతో బాధలు తగ్గుతాయని నమ్మకం.

శిల్పనిర్మాణం :- రాచరిక వ్యవస్థలో కళ లన్నింటికి సమాన ఆదరణ, ప్రోత్సాహం లభించింది. ఆ కాలాల్లోనే ప్రపంచ ప్రసిద్ధిగాంచిన శిల్పనిర్మాణాలు జరిగాయి.

''అత్తార్ పన్నీరు అద్దాలమేడలు
అమిరి యున్నది టంగుటూరు,''33
''అద్దాల మేడలో యిద్దరముండగ
ముద్దుటుంగరమిచ్చి ముద్దుబెట్టిన జాణ,''34

---

31. అను., పా. 16.
32. అను., పా. 38.
33. అను., పా. 83.
34. అను., పా. 80.

"కాకినాడ బోగం పిల్లా
పట్టనాటి **గాజుల మేడ**"[35] మొదలైన చరణాల్లో కన్పించే అద్దాల మేడ, గాజుల మేడ అనే పదాలు పట్టడాల్లోని కళా రీతుల్ని గుర్తు చేస్తున్నాయి.

**చిత్రలేఖనం :** మానవుడు తన మనోభావాల్ని ఎదుటివారికి తెల్పడానికి వాడిన సాధనాల్లో చిత్రరూపమొకటి ఈ చిత్రరూపమైన సంకేతాల నుంచి కొన్ని లిపులు రూపొందినట్లు శాస్త్రజ్ఞుల ఊహ. తాను చూసిన, ఊహించిన సమస్త విషయాల ప్రతిరూపం గీయగల్గిన ప్రజ్ఞ సాధించాడు ఆ యానందం అంతటితో ఆగలేదు. తాను వాడే ప్రతి వస్తువుమీద తనకు నచ్చిన చిత్రాన్ని చిత్రించుకోవడం లేదా చిత్రింప జేసుకోవడం జరుగుతుంది. ఇంటి గోడలమీద, వాకిళ్ళమీద, తలుపులమీద, ఇంటి పరికరాలమీద, చివరకు ఒంటిమీద చిత్రాలు చిత్రింపబడుతున్నాయి. ''ద్రుగ్గి కాపూరస్తుడు''[36] అనే పాటలో-

'ఏడు కొమ్మల పొన్న మాను-యెదురునడి సెవుడతలెమి
సిలకలు పావురములు యేమి-సిత్తారుగల్లమామ
వంగి చూసే గుడ్డి కొంగలు-వారసూపుల తెల్లకొంగలు
సుట్టూ గొప్పేస్తలేమి-నడమనుండు కిష్టమూరితి
కిలకిల నవ్వినట్టు ఉండెనేమో-సబవంతజూసినట్టు

వుండెనేమో' అనే చరణాల్లో మాచర్ల శ్రీ చెన్నకేశవ స్వామి ఉత్సవ వాహనమైన పొన్నమాను మీద చిత్రాలు ఉన్నవి ఉన్నట్లుగా వర్ణించబడినాయి.

''ఇంతలింతల సీవగట్టే నాసామి
ఈతపేళ్లా రెయిక దొడిగి,''
'సిలకముక్కూ ఱీడిరెయికా నాసామి
ఎలక కొరికిన దేమిసేత్తూ,'[37]

---

35. అను, పా. 115.
36. అను., పా. 62.
37. అను., పా. 38.

"కొత్తది పుచ్చాల పొట్టు కొమలకుంటశెట్ల రెయిక
అప్పుజేసియేల తెత్తివి నాసామిరంగ''
''సిలకనిచ్చి నేనుదెస్తి చింతపేళ్ళ పట్టెమంచం
యిద్దరికియిమ్ముకు జాలదూ! రంగయ్యాబాప''[38]
''మొకయెల్ల మొటిమాలదీ అదీ
అంసామొగ్గల రెయికాదో''[39]
''పెసరబేడల సీర పేటంచు రెయికాది
వయ్యారి సేడెలున్నది టంగుటూరు''[40]

మొదలయిన చరణాల్లో చీర, రవికలమీదవేసే ఆయా బొమ్మల పేర్లు విశదమవు తున్నాయి కొన్ని కొన్ని అల్లకాల్లో చిత్రాలు వచ్చేట్లు అల్లుతారు.

"ఉల్లిపొట్టు ఇల్లుగప్పి మల్లెమొగ్గ మంచమల్లి
వాడుబోయె వాడబేరము నాసామిరంగ''[41]

మొదలయిన చరణాల్లో మంచం అల్లకాల్లో చిత్రకళ కన్పిస్తుంది.

## అ ల ం క ర ణ

అలంకరణ సంఘంలో కాలానుగుణంగా మారుతూ ఉండడం సహజం. ఒకనాటి అలంకరణ తర్వాతి కాలం వాళ్ళకు వింత గొలుపవచ్చు. అట్టి అలం కరణల్లోని వైశిష్ట్యాన్ని పరిశీలిద్దాం. అందుకుగాను స్త్రీల అలంకరణ, పురుషుల అలంకరణ వేరువేరుగా తీసికొని వాటిని విడివిడిగా ఇట్లా పరిశీలించవచ్చు.

**స్త్రీల అలంకరణ :-** అలంకరణలో స్త్రీలకు ప్రాముఖ్యం ఉంది. స్త్రీల అలంకరణలో వారు ధరించే చీర, రవిక, నగ-నట్ర, ఆభరణాలు, బొట్టు-కాటుక మొదలయిన వాటి విశిష్టతలు కోలాటం పాటల్లో గోచరిస్తాయి.

---

38. అను , పా. 50.
39. అను., పా. 69.
40. అను., పా. 83.
41. అను., పా. 50

"అలివేల్మంగమ్మగారు ఆదిలచ్చువమ్మగారు
పట్టుసీర లంపరమ్మ సెంచువారికి
పట్టుసీర లేలనమ్మ పారుటాకు లుండంగ
సెట్టుకింద వోలలాడె సెంచువారికి,"[42]
"కోట బొమ్మంచుదే కోకకే మిగిలిద్దు,"[43]
"జెరి జెరీ సీరెలు గట్టి
జగజ్జోతి పంచెలు గట్టి,"[44]
"పెసర బేడల సీర - పేటంచు రెయికాది,"[45]
"కడయింటి సిన్నది కాట్రేటి కోకదీ,"[46]
"దగ దాగా మానేటి జలతారు సీరెకు
తగినట్టు రెయిక దెమ్మన్నది,"[47]
"సిలక ముక్కూ జీడి రెయికా నాసామి
ఎలక కొరికిన దేమి సేత్తూ,"[48]
"కొత్తది ముచ్చాల బొట్టు
కొమలకుంట శెట్ల రెయిక,"[49]
"మొక మెల్ల మొటిమాలదీ అదీ
అంసా మొగ్గల రెయికాదో,"[50]
"సిరులు దడిసే మరులూ దడిసే
శెనగపూల రెయికా దడిసే"[51]

---

42. అను., పా. 9
43 అను, పా. 27.
44. అను., పా 62.
45. అను., పా. 114.
46. అను., పా. 100.
47. అను., పా. 114.
48. అను., పా. 38.
49. అను., పా. 50.
50. అను., పా. 69.
51. అను., పా. 115.

మొదలయిన చరణాల్లో పారుటాకుల చీర, పట్టుచీర, కోట బొమ్మంచుచీర, జెరీ చీర, పెసరబేడల చీర, కాబ్రేటి కోక, జలతారు చీర మొదలయిన రకాల చీరలూ, ఈతపేళ్ళ రవిక, పేటంచు రవిక, సిలకముక్కు జేడిరవిక, కొమలకుంటశెట్ల రవిక, హంసమొగ్గల రవిక, కనగపూల రవిక మొదలైన రకాల రవికల ఉనికి తెలుస్తుంది.

అడవుల్లో సంచరించే ఆటవికులైన చెంచు, కోయ మొదలయినవారు పెద్ద ఆకులు వస్త్రాలుగా ధరిస్తుంటారు ఈ ఆకుల్ని 'పారుటాకులు' అంటారు. వీటిని చీరలకు బదులుగా కట్టడంవల్ల 'పారుటాకుల చీరలు' అని వచ్చిందీ పదం. బొమ్మంచు అంటే ఎర్రని అంచు అని అర్థం.[52] కోట గోడలవంటి బొమ్మలు ఎర్రని అంచునగల తెల్ల చీరను కోట బొమ్మంచు చీర అంటారు.

కొన్ని కులాల్లో స్త్రీల అలంకరణలో తేడాలుంటాయి. కొందరు పూజా పునస్కారాల్లో, వంటవార్పుల్లో కూడా 'మడి' (తడివస్త్రం) కడతారు.

'తడిన వాత్రము మెడన లింగము నొసట యీబుది రేకదీ'[53] అనే చరణం ఈ విషయాన్ని గుర్తు చేస్తుంది.

'ఈపు జడలది తోపు రెయికది
లోపలా తాకొందుదీ' అనే చరణంలో ముస్లిం స్త్రీల వస్త్రధారణ తెలుస్తుంది.

జానపదుల వాడుకలోని ఆభరణాలు ఎన్నో కన్పిస్తాయి.

"బీసి మురుగులదానా లబ్బరిగాజులదానా
బంగారి గాజులకి బాగనేమరిగావే",[54]
"జడవ జాబికాయ",[55]

---

52. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పు. 73.
53. అను., పా. 95.
54. అను., పా. 14.
55. అను , పా. 55.

"ముక్కుపుల్లలు పెట్టుకోని
నత్తులు యోగపోటుకుంటూ",[56]
"అంసా నడకలు నడిసే లేమకు
అందెలు గదులూనే
కాలందెలు గదులూనే బామా",[57]
"నడిసేటి కాళ్ళకు కోయిలా
నాలుగందెలు జేయిత్తా కోయిలా,"[58]
"ఇంద్రుని గనవమ్మ కోయిలా
నీకు యింద్ర ఆరములిత్తా కోయిలా
శెంద్రుని గనవమ్మ కోయిలా నీకు
శెంద్ర ఆరములిత్తా కోయిలా,"[59]
"బామాకున్న కట్లదండ కల్యాకమ్మితి సైసై,"[60]
"మెళ్ళో ముచ్చాలపేరు
ముద్దుగుమ్మా బంగారిబొమ్మా,"[61]
"రాతెండి కడియాలు రైలు వడ్డాణాము
రంగు మెరిసిన ముద్దు సిన్నదీ"[62]

మొదయిన చరణాల్లో మురుగులు, గాజులు, జాజికాయ, ముక్కుపుల్ల, నత్తులు, అందెలు, ఇంద్రహారం, చంద్రహారం కట్లదండ, ముత్యాలపేరు, కడియాలు, వడ్డాణం మొదలుగాగల వాడుకలోని ఆభరణాల ఉనికి తెలుస్తుంది. మురుగులు వెండి, బంగారాలతో చేస్తారు సత్తుతోగూడా చేస్తారు ఇవి చేతికి రెండేసి చొప్పున

---

56. అను., పా. 62.
57. అను., పా. 37.
58. అను., పా.68.
59. అను., పా. 68.
60. అను., పా. 87.
61. అను., పా. 93.
62. అను., పా. 114

నాల్గు ఉంటాయి. వీటిమధ్యలో గాజులు ఉంటాయి. ఈ మురుగులు కడియాల ఆకారంలో ఉంటాయి. అట్లాకాకుండా చదరంగా ఉండేవాటిని గోట్లు అంటారు మురుగులు మగవారుకూడా ధరిస్తారు. గాజుల వాడకం ఎక్కువగా కన్పిస్తుంది. గాజులను మట్టితోను, రబ్బరుతోను, ప్లాస్టిక్కుతోను తయారుచేస్తారు జడలో పెట్టుకునే ఆభరణాల్లో జాజికాయ ఒకరకం. నత్తులు అంటే ముక్కుపోగులు. అందెలు, కడియాలు అనేవి కాళ్ళకు ధరించే ఆభరణాలు. కోలాట కర్రలకు, ఇతర పరికరాలకు వేసే అందెలు వేరు. అవి పరిమాణంలోను, అకారంలో కాళ్ళకుపెట్టే అందెలకంటే భిన్నమైనవి. కాలి అందెలు సామాన్యంగా వెండితో తయారుచేస్తారు. ఇవి తల కిందుగ రాసిన రెండు 'U' ఆకారాల (∩)లో ఉంటాయి. ఒక (∩)ఆకారం కాలి ముందుకీ, రెండో (∩) ఆకారం కాలివెనుక భాగానికి వచ్చేట్టు ధరిస్తారు. వెండి ఆభరణాలు మోచేతులవద్దకూడా ధరిస్తారు. వీటిని కడియాలు అనికూడా అంటారు. పురుషుల్లోకూడా మోచేతివద్ద వెండికడియాలు ధరించడం కన్పిస్తుంది. వెండికడియాలకి బదులుగా కాళ్ళకు వెండి ఆభరణాలు ధరించేస్థితి లేనివారు రాతెండికడియాలు వాడుతారు. సామాన్యంగా వివాహాది శుభకార్యాలకు వడ్డాణం ధరించడం కన్పిస్తుంది. రైలువడ్డాణం అంటే రైలుపెట్టెలవలె గదులుగదులుగా అమర్చబడిన వడ్డాణం.

> "సీడ జూడ నాకు నిలువుటద్దమంపరా,"[63]
> "సెమటకు దానిపై సెదిరిన గందం,"[64]
> "మెడకి బూసిన మంచి గందం
> నెలకి గుమగుమలాడెరా,"[65]
> "సుక్కబొట్టూ పెట్టారాదు
> సూర్యునీకి మొక్కారాదు,"[66]
> "అద్దములో బొట్టు దిద్దనేర్చిన గాని,"[67]

---

63. అను., పా. 34.
64. అను., పా. 37.
65. అను., పా. 95.
66. అను., పా. 44.
67. అను., పా. 80.

"కళ్ళకూ కాటికబెట్టి
పళ్ళాకు దాసీనయేసి,"[68]
"నూనెబుంగది జారుకొప్పది
కాటికా కన్నూలదీ,"[69]
"కాటిక కన్నుల కలికిముద్దులకొలికి
కటియారమే తెమ్మన్నదీ,"[70]
"గులహాల కుంకము పాపటిబొట్టూయేమి,"[71]
"అత్తారు పన్నీరు అద్దాలమేడలు
అమరి యున్నది టంగుటూరూ,"[72]
"గందామూ కస్తూరీ నాపై సిలకారించావే,"[73]
"కురులు మోడిసినాడు
సిరత పాయమున"[74]

మొదలయిన చరణాల్లో నిలువుటద్దం, గంధం, చుక్కబొట్టు, పసుపు, కుంకుమ, అత్తరు, పన్నీరు, కస్తూరి మొదలయిన అలంకరణకు సంబంధించిన విషయాలు తెలుస్తున్నాయి. జారుకొప్పు, కురులు మోడ్చుదం మొదలయినవి కేశ సంస్కారానికి సంబంధించిన విశేషాలు.

**పురుషుల అలంకరణ :**

పురుషులు వాడే వస్త్ర విశేషాల్లోని తలగుడ్డ, వలెవాటులు, శాలువలు మొదలయినవి; మొలతాడు, ఉంగరం మొదలయినవీ పాటల్లో కన్పిస్తాయి. అందుకుదాహరణలుగా —

---

68. అను , పా. 62.
69. అను., పా. 95.
70. అను , పా. 114.
71. అను., పా. 62.
72. అను., పా. 83.
73. అను., పా. 73.
74. అను., పా. 80

"తలగుడ్డలు మీరు తియ్యండీ తలవొంచీ
బజనలు సెయ్యండీ,"[75]
"నీటయిన తలగుడ్డ నీకు నేయించగ,"[76]
''వలెవాటులు మీరు తియ్యండీ,''[77]
"పులిచర్మము దరించె లింగడు
పట్టు శాల్వలు దరించె రంగడు''[78] అనే చరణాల్లోను–

"మొదటి నెల్లో నీకు మొలతాడు జేయిద్దు''[79] అనే చరణంలోను కన్పిస్తాయి.

శైవ వైష్ణవ మతాల వారి వేషాల్లో-
''యీబూది దరించె లింగడూ
పట్టె నామము దరించె రంగడూ
రుద్రాచ్చలు దరియించె లింగడూ
తులసి మాలలు దరించె రంగడూ''[80]

అనే చరణాల్లో కన్పించే విభూతి, పట్టెనామం, రుద్రాక్షలు, తులసి మాలలు ముఖ్యంగా ఉంటాయి.

## వ్యవసాయ సంబంధాలు

ఆంధ్ర దేశంలో వ్యవసాయం ముఖ్య వృత్తిగా ప్రాచీన కాలం నుంచీ కొనసాగుతుంది. కొన్ని ప్రాంతాల్లో నీటిపారుదలతో వ్యవసాయం చేస్తున్నారు కొన్ని ప్రాంతాల్లో వర్షాధారంతోనే వ్యవసాయం చేస్తున్నారు. పల్నాటి సీమలో కొన్ని గ్రామాల్లోని భూమికి నాగార్జునసాగర్ కాలువద్వారా నీటిపారుదల అవకాశం

---

75. అను., పా. 2.
76. అను., పా. 27.
77. అను., పా. 2.
78. అను., పా. 110.
79. అను., పా. 116.
80. అను., పా. 110.

కల్గించి కొన్ని గ్రామాలకు నీటిపారుదల లేదు కొన్ని గ్రామాల్లో బావులు తవ్వి వాటి ద్వారా నీటిని పారించి పండిస్తున్నారు బావిలోని నీటిని ఎద్దుల ద్వారా తీసే విధానాన్ని మోట అంటారు పెద్ద బకెట్టులో నీరు తోడుతారు దీనినే ఏతాము అంటారు. ఏతాము తోలేవానిని 'ఏతరి' అంటారు.

కట్ట కింద వంటి మోటా
వంటి మోటకు దండ కఱ్ఱ
దండ కఱ్ఱెద్దుకు గంట లేదురా
చల్ ! మల్లెల చెన్నా
దండ కఱ్ఱెద్దుకు గంట లేదురా
వొక్కనేమో బాలో వోయె
తొండయేమో తాసీవోయె
ముడిసే యేతరి జాతరదోయెరా"[81]

అనే చరణాల్లో మోటకు సంబంధించిన వివరాలు గోచరిస్తున్నాయి చెరువుల కింద వ్యవసాయం సాగు అవుతుంది.

"నిండే తురకప్ప శెరువు
తూరుపలుగు తెల్లబారె"[82] చరణాల్లో వచ్చించే అలుగు అనేది చెరువుకు ముఖ్యమైంది. చెరువునుంచి పొలాలకు నీరు వదిలే రంధ్రాన్ని అలుగు అంటారు.

మెట్ట ప్రాంతాల్లోని పొలాలకు వాడే అరక సామానులకు నీటిపారుదల ఉన్న పొలాలకు వాడే అరక సామానులకు తేడా ఉంటుంది మెట్టపొలాల్లో వాడే అరక సామానులకంటె మాగాణి పొలాల్లో వాడే అరక సామానులు బరువులోను, పరిమాణం లోను తక్కువగా ఉంటాయి. మెట్టపొలాల్లో వాడే అరక సామానుల్లో నాగలి, గొఱ్ఱు, గుంటక, దంతె ముఖ్యాలు. నాగలి భూమిలోనికి దాదాపు అడుగులోతువరకు చొచ్చుకొనిపోయి భూమిని చీల్చి గండి యేర్పాటు చేస్తుంది. అట్లా చేనంతా దున్న డాన్ని దుక్కి దున్నడం అంటారు.

---

81. అను., పా. 7.
82. అను., పా. 61.

"పెదపెద్ద నాగళ్ళు పేరైన గుంటకాలు
ముప్పూరి పగ్గాలు ములకాల కర్రాలు,"[83]
"మర్రిసెట్టి సేను మన పాంవర్తేను
ఒక్క సాల్దున్నించి మొక్క జొన్నేయించి"[84]

అనే చరణాల్లో నాగలి, గుంటకల ప్రసక్తి కన్పిస్తుంది. దుక్కి ఒకసారి దున్న డాన్ని ఒక సాలు దున్నడం అంటారు. అట్లే రెండుసార్లు దున్నితే ఇరువాలు దుక్కి అనీ, మూడుసార్లు దున్నితే మూడో సాలు దుక్కి అని అంటుంటారు. 'పగ్గాలు' అనేవి ఎద్దులను అదుపులో పెట్టేందుకు ఎద్దుల కొమ్ములకు కట్టే తాళ్ళు. అరకకు రెండు పగ్గాలను కలిపి ఒకటిగా వాడుతారు. కొందరు రెంటిని విడివిడిగా వాడుతారు. ఒకే పగ్గమైతే 18 నుంచి 20 బారల దాకా ఉంటుంది. ఇవి సామా న్యంగా జనపనారతో తయారు చేస్తారు. రెండు పురులు వేసిన తర్వాత మూడో పురిని వేస్తారు. మూడో పురిని వేయడంవల్ల తాడుకు గట్టిదనం ఏర్పడుతుంది. పొలాలకు ఎన్నోరకాల పేర్లుంటాయి. మిట్టచేను, చట్టుచేను, మిర్రుచేను, బాడవ చేను, వాగుచేను, కుంటచేను మొదలయినవిధంగా ఉంటాయి.

"మిట్టమీనీ సేను
మిర్రుమీనీ సేను"[85] అనేవి ఇట్లాంటి పేర్లను తెల్పుతున్నాయి.

"మన్నె రేగళ్ళమి
పైర పడిగే లేమి"[86] అనే చరణంలో కన్పించే మన్నెరేగడి అనేది మాన్యంగా వచ్చిన రేగడి భూమి. నేలల్లో కూడ రేగడి, ఎర్రభూమి, చవిటి నేలలు, మొరస నేలలు, ఇసుకపర్రలు, బంకనేలలు మొదలయిన రకాలుంటాయి. పందులు, నక్కలు, కాకులు పైర్లకు శత్రువులు. వాటిబారినుంచి కాపాడడానికి రైతులు పొలాలకు కాపలా పెడుతుంటారు.

---

83. అను., పా. 83
84. అను., పా. 27.
85. అను., పా. 27.
86. అను., పా. 82.

"ఒక్కసాల్దున్నించి మొక్కజొన్నేయించి
నక్కలకు బెదరేసినా పెగ్గె గెలిపిద్దు
ఒక్క కాకినైనా వాలకుండా జేద్దూ"[87] అనే చరణాల్లో పైరును నక్కలు, కాకుల నుంచి రక్షించే విధం తెలుస్తుంది.

**పాడిపంటలు :**

"ఏరుబడితే మేలురా"[88] అనే పాటలోను,
"గడ్డి గడ్డసి మంచి దొడ్డగా బలికేవు"[89] అనే పాటలోను,
"కంచీ మేకల పాలూబోసీ
పెంచూకుంటి నాదీకురులూ"[90],
"గోవర్ధనగిరి గోవులుగాసెటి
గోపాల కిష్ణనే బామా"[91],
"పాలాకానీ సువ్వేరావే పనసాపాటికీ
నేతీకానీ నేనేవల్తా నెలతాపాటికీ"[92],
"సల్ల దాగిన వారికీనాటికీ
కల్లు సంగతేమెరకమ్మ లోకానికీ,"[93]
"బర్రెనమ్మితీ బరెదూడా నమ్మితీ"[94]

మొదలయిన చరణాల్లోను బర్రె (గేదె), దూడ, గోవు, ఎద్దు, మేక మొదలయిన పశువులూ, పాలు, పెరుగు, నేయి, చల్ల మొదలయిన పాడి సంబం

---

87. అను., పా. 27.
88. అను., పా. 27.
89. అను., పా. 43.
90. అను., పా. 7.
91. అను., పా. 51.
92. అను , పా. 73.
93. అను., పా. 79.
94. అను., పా. 87.

ధాలూ, చెంగలగడ్డి, గునగాకు, గోళ్ళగొంటి, కొండపిండి, చిప్పెర, చల్ల కవ్వాల గడ్డి, చెంచలాకు, యెర్రగోగుల గడ్డి, ఒంటె సవరం గడ్డి మొదలయిన పశువులు తినే గడ్డి రకాలూ మొదలయినవన్నీ కన్పిస్తాయి

**ధాన్యాలు .** కోలాటం పాటల్లో కంది, జొన్న, మొక్కజొన్న, పెసర, శెనగ, వరి, వరిగలు మొదలయిన ధాన్యాల ఉనికి తెలుస్తుంది. కందిలో ఒడ కంది, అట్టడకంది మొదలయిన రకాలు పండిస్తున్నారు జొన్నలో ఎర్రజొన్న, తెల్లజొన్న, పచ్చజొన్న, పైరజొన్న, ఉత్తరాది జొన్న, హైబ్రిడు జొన్న మొదలయిన రకాల జొన్నలు మెట్ట ప్రాంతాల్లో ఇప్పటికి పండిస్తున్నారు. మొక్కజొన్న మాత్రం పల్నాటిలో కన్పించదు. పైరజొన్న ఐదు నెలల పంట. తక్కిన రకాల జొన్నలు మూడు నెలల పంటలు ఎర్రజొన్నలతో చేసిన రొట్టెలు రోగులకు అల్పాహారంగాను, పథ్యంగాను వాడుతారు "ఎరజొన్న రొట్టితో యెనపూస ముద్దతో యెన్నాళ్ళు యెడిద్దురా"[95] అనే ప్రయోగం ఈ విషయాన్ని గుర్తు చేస్తుంది, ఎర్రజొన్నలు దంచితే నూక ఎక్కువగా వస్తుంది. జొన్నలను దంచితే జొన్నలపై అతి స్వల్పంగా ఉండే పైపొర ఊడిపోతుంది. వేరుచేసిన ఈ పొరను జొన్న పిసరు అంటారు ఇది గేదెలకు మంచి పుష్టి గల ఆహారం. పిసరు నుంచి వేరు చేసిన జొన్నలనే జొన్నబియ్యం అంటారు. వీటిని పిండిగా దంచి అన్నం వండుతారు. ఈ పిండితో వండిన వంటకాన్నే సంకటి అంటారు పచ్చజొన్నల్లో పిండి ఎక్కువగా వస్తుంది కాబట్టి వీటిని సంకటికి ఎక్కువగా వాడుతారు ఎర్రజొన్నలు, తెల్లజొన్నలు, పైర జొన్న లలో పిండి ఎక్కువగా రాదు. వీటి నుంచి నూక ఎక్కువగా వస్తుంది. ఎర్ర జొన్న రొట్టెలను వాడుతారు

కంది, పెసర, శనగ మొదలయిన పప్పుధాన్యాలు పండిస్తున్నారు. కందులు, నల్లపెసలు జొన్న, సజ్జలలో పండిస్తారు పంచెని పౌర్ర, వేరుశెనగల లోను, విడిగాను పండిస్తారు. పచ్చపెసర విడిగా పండిస్తారు. మే, జూన్ మాసాలలో పచ్చపెసర విత్తుతారు ఇది మూడు నెలల పంట, ఇది పండించిన పొలాన్ని మరొక పైరుకు వినియోగిస్తారు. శనగ ప్రత్యేకంగా పండిస్తున్నారు.

95. అను., పా 100.

కందులు, పెసలు, శనగలు పప్పుకు ఎక్కువగా వాడుతారు పొదుపు కోసం పెసర పప్పును వాడుతారు

"గిద్ద పెసరా పప్పు గిన్నెలోనే వండి
వద్దు వద్దనగా నీ కొల్ల కొల్లగగట్టి
మూలనా యంగింత ముంతలో దాపెట్టి
పొద్దుటన్నంలోకి పొలమునీకంపిద్దు"[96]
అనే ప్రయోగం ఈ విషయాన్ని గుర్తు చేస్తుంది.

''కూరాకు లేదాయె కూడెట్టు
తిందునే పెళ్ళామా,''[97]
''కోసింది కొరకూర మట్టా నాసామి
కొయ్యంది శెంచాలిమట్టా,''
''శేటకొమమ్మన సేరెడొడ్లూ నాసామి
సేయకూరా కొయ్యబోతే,''
''సోజ్జమైనా జొన్నచేలో నాసామి
దోసకాయకు మోసపోతీ,''
''బాయిలున్నది బలుసుకూరా నాసామి
నేలబారిన నెల్లికూరా,''
''వాలుగొమ్మల సింతసిగురో నాసామి
వండిపెడితే వలపు తీరు,''[98]
''ఉల్లిపొట్టూ యిల్లు గప్పి
మల్లెమొగ్గ మంచమల్లి''
''సింత జూడు సిగురు జూడు
సిన్నిదాని పొగరు జూడు''
''యింటి మీని సిక్కుడు తీగె

96. అను., పా. 27.
97. అను., పా. 27.
98. అను., పా. 38

ఇంటిమీని వల్లుకూనే,''
''వత్తబోతి వంగతోట - రాసుపోను రాగితోట,''[99]

"ఉప్పు గోంగుర పూరచొక్కుతో"[100] మొదలయిన చరణాల్లోనూ; "సొరకాయా సొక్కం బీరాకాయా"[101] అనే పాటలోనూ తొయ్యకూర, చెంచలి కూర, చేమకూర, బలుసుకూర, నల్లికూర, దొస, చింతచిగురు, ఉల్లి, ఎక్కుడు, వంగ, గోంగూర, సొర, బీర, బెండ మొదలయినవాటి కూరల ఉనికి తెలుస్తుంది.

**ఉపవృత్తులు :**

ప్రజలు అనుసరించే చేతిపనులు వారి సంపాదన మార్గంగా ఉపయోగ పడడమే కాకుండా కళానైపుణ్యాన్ని పెంచుతాయి పరిశ్రమల్లో పట్టు పరిశ్రమ ఒకటి. పట్టులో మణిపట్టు, పచ్చసిపట్టు, సరిపట్టు, రత్నంబుపట్టు, సంకుపట్టు, మరకతపట్టు, హొంబట్టు, నెరపట్టు, వెలిపట్టు, నేత్రంబు పట్టు మొదలయిన రకాల పట్టువస్త్రాలున్నట్లు పాల్కురికి సోమన పేర్కొన్న విషయం గమనించదగ్గది.[102]

"అలివేల్మంగమ్మగారు ఆటి లచ్చువమ్మగారు
పట్టుసీరలంపరమ్మ సెంచువారికి''[103]

అనే చరణాల్లో పట్టు ఉనికి తెలుస్తుంది. ఇంకా-

పట్టు పద్దసగా నే తొల్లగొల్లగ పెట్ట
మూలనా యింగింత ముంతలో దాపెట్టి
పొట్టు టన్నములోకి పొలము నే పంపిస్తి"[104] అనే చరణాల్లోను,

---

99. అను., పా. 50.
100. అను., పా 65.
101 అను , పా. 125.
102 బసవపురాణం, పు. 59
103 అను , పా. 9.
104. అను., పా. 27.

"లొట్టిమీదా లొట్టి బెట్టి
దుత్తమీదా దుత్త బెట్టి,"[105]
"కడమ నెల్లో నీకు
కడవ నెయి జూపిద్దు"[106]

అనే చరణాల్లోను కన్పించే 'ముంత, దుత్త, లొట్టి, కడవ' అనేవి పల్లెటూళ్ళలో వాడుతుంటారు. కుండలు తయారు చేయడం ఒకరకమైన చేతిపని. ఇది కుమ్మరి కులం వారి వృత్తిగా స్థిరపడింది. కుండలు కాల్చే చోటును 'ఆము' అంటారు బంక మట్టితో చేసి, ఆరబెట్టిన తర్వాత కాలుస్తారు కాల్చిన కుండలను అమ్ముకొని డబ్బు సంపాదిస్తారు. కుండలేకాక గృహ పరికరాలుగా వాడుతున్న ముంతలు, దుత్తలు, కడవలు, కూజాలు, తొట్లు మొదలయిన వెన్నో చేస్తారు. "పెదపెద్ద నాగళ్ళు పేరైన గుంటకాలు"[107] అనే చరణంలో కన్పించే నాగళ్ళు, గుంటకలు మొదలయిన వాటిని వడ్రంగి తయారు చేస్తాడు. నాగలి పొలం దున్న డానికీ, గుంటక పొలం చదును చేయడానికి రైతు వాడే వ్యవసాయ సాధనాలు. నాగళ్ళలో రేగడినేలల్లో దున్నేవి పెద్దవిగాను; ఇసుక, మొరస, చవిటి నేలల్లో దున్నేవి చిన్నవిగాను; మాగాణిలాంటి పొలాల్లో దున్నేవి చాల చిన్నవిగాను ఉంటాయి నాగళ్ళు, గుంటకలే కాక వడ్రంగి గొర్రు, దంతె మొదలుగా గల వ్యవసాయ సంబంధమైన అన్ని రకాల సాధనాలు తయారు చేస్తాడు. అందుకు ముఖ్యంగా ఉలి, బాడిస, డాగలి, పట్టుకారు, సరిగాల, సుత్తె, రంపం, పిడిశాన మొదలయిన పరికరాల్ని వడ్రంగి వాడుతాడు.

## జీవన విధానం

జీవన విధానంలో ప్రజల ఇల్లు - వాకిళ్ళు, ఇంటి పరికరాలు, పాడి - పంటలు ఒకటేమిటి-జీవన వ్యాపారంలోని ప్రతి అంశాన్ని చెప్పవచ్చు.

---

105. అను., పా. 95.
106. అను., పా. 27.
107. అను., పా. 83.

"ఏనాటి ఎరకలోళ్ళు
ఏక తొంబై గుడిసెలోళ్ళు,"[108]
"లచ్చిమిదేవి మిద్దెలదనక
లచ్చనంగా తీసికొచ్చి,"[109]
"మేడలకూ పూయూ పూతాలు
సున్నపురాళ్ళేగా సైసై,"[110]
"అద్దాలమేడలో యిద్దరముండంగ
ముద్దుటుంగరమిచ్చి ముద్దుబెట్టినదాలు,"[111]
"శెరువుపాకిట సీరలుదికె
సేడె బ్రేమ్మణ సిన్నది,"[112]
"కాకినాడ బోగంపిల్లా
కట్టినాది గాజుల మేడా"[113]

మొదలయిన చరణాల్లో గుడిసె, మిద్దె, మేడ మొదలయిన గృహాల రకాలు కన్పిస్తాయి. పల్నాటసీమలో దాదాపు అంతా గుడిసె పైకప్పుకు వరిగడ్డి, తాటాకు, తుంగ, జమ్మ, ప్రత్తికట్టె, కందికట్టె, తుత్తురుకట్టె, సజ్జచొప్ప మొదలయిన వాటిలో ఏదో ఒకటి వారి వారి అనుకూలం, అవకాశాల కనుగుణంగా వాడుతుంటారు గుడిసె గోడలు మట్టి, రాళ్ళు, ఇటుక, తడికెలు మొదలయిన వాటిలో ఏదో ఒకటి వాడుతుంటారు మట్టి సామాన్యంగా ఎర్ర బంకమట్టిని, నల్లమట్టి (పాటిమట్టి)ని వాడుతుంటారు రాళ్ళలో ఇసుకరాళ్ళు, నాపరాళ్ళు, గులకరాళ్ళు నల్లసుద్దరాళ్ళు మొదలయిన రకాలరాళ్ళు వాడుతుంటారు తడికెలను వెదురు, కొండచువ్వ, ప్రత్తికట్టె, కందికట్టె, పాలచెట్టు తీగలు, పాముకోరచెట్లతీగలు మొదలయినవి వాడుతుంటారు ఈ గోడలమీద కప్పు వేసేందుకు వీలుగా దూలం

---

108. అను., పా. 26.
109. అను., పా. 62.
110. అను., పా. 78.
111. అను, పా. 80.
112. అను., పా. 95.
113. అను., పా. 115.

కొందరు వేస్తారు. కొందరు వేయరు. మూడంగుళాల వ్యాసం లావుగల పొడపైన కర్రలు చుట్టూ అమర్చుతారు. వీటిని వాసాలు అంటారు. వీటిమీద కప్పు వేస్తారు.

మిద్దెలు చుట్టూ గోడలు పైన దూలంనిలువుగాను, దూలంపైన కడ్డీలు అడ్డంగాను, కడ్డీలపై చిరుతపేళ్ళు కడ్డీల కడ్డంగాను అమర్చుతారు. రెండంగుళాల వెడల్పుగల చిన్నచిన్న కర్రముక్కలను చిరుత అంటారు. పీటపై సామాన్యంగా చవిటి మట్టిని పోస్తారు పైనీరు పైపైన పొర్లిపోతుంది. వర్షాలు ఎక్కువగా పడినా నీరు ఇంటిలోనికి దిగదు కొందరు పాటిమట్టి (చవిటిచాపలుగల నల్లమన్ను)ని వాడుతారు కొందరు చిరుతకు బదులుగా కడ్డీలమీద బండలు వాడుతారు ఇవి పెద్దపెద్ద ఎర్రనాపరాళ్ళు. చాలపల్చగా ఉంటాయి. వీటనే చూరుకు గూడావాడు తారు. కడ్డీలకు తాటి, బిల్లుడు, చిరుమాను, యేగె, యేపె, టేకు, మద్దికర్ర జాతులను వాడుతారు. దూలాలకు తాటి, టేకు, ఇంకా చేవగలిగిన యేపె, వేప, యేగె, మద్ది మొదలయిన కర్రజాతులు వాడుతారు. గోడలకు రాళ్ళ మధ్యన మట్టిని వాడి పైపూతగా సిమెంటు చేస్తారు. కొందరు ఇసుక-సున్నం గానుగలో తిప్పి చేసిన గచ్చును వాడుతారు. ఇది చాలా గట్టిగ ఉంటుంది. ఇళ్ళకు రెండు మూడు వాకిళ్ళు ఉంటాయి. బజారుకుఉంటే వాకిలి, సందువాకిలి, దొడ్డివాకిలి మొదలయిన వాటి వలెనే వెరుపుపైపు వాకిలి మొదలయిన విధంగా వాకిళ్ళలో రకాలుంటాయి. సిమెంటు ఇనుములతో కలిపిన కాంక్రీటుతో కప్పువేసిన ఇంటిని మేడ, డాబా అని అంటుంటారు. వీటిలో చాల అంతస్థులుగా వేస్తుంటారు. ధనమున్న వాళ్ళు అద్దాలలో వివిధ పరికరాలు ఇంటిగోడలకు నిర్మిస్తారు.

పరికరాలు : గృహ పరికరాల్లో మట్టితో చేసే వస్తువులు, చెక్కతోచేసేవి, లోహాలతో చేసే వస్తువులు ఎన్నో ఉంటాయి. "గిద్ద, తవ్వ, గిన్నె, ముంత, కడవ, దుత్త, బుంగ, కుండ, కొట్టె, చట్ట, బుట్ట, గంప, గొడుగు, రాటము, చేట, చాప, మంచం, గొడ్డలి, ఉప్పు, కర్పూరం ఈటె, బర్సె, చమురు, రోకలి, కుదురు, దీపం, మప్పుటి, సూది"- మొదలుగా రోజువారీ వాడకానికైన గృహపరి కరాలు కోలాటం పాటల్లో కన్పిస్తాయి. గిద్ద మానికలో పదహారోభాగం. తవ్వలో ఎనిమిదోభాగం.

4 గిద్దలు = 1 సోల
2 సోలలు = 1 తవ్వ
2 తవ్వలు = 1 మానిక
4 సోలలు = 1 మానిక

మొదలయిన విధంగా ఈ కొలమానం ఉంటుంది ముంత, కడవ, బుంగ, దుత్త, లొట్టి అనేవి మట్టితో చేసిన పాత్రలు. వీటిలో కడవ అనేదానికి, బుంగ అనేది మరొకపేరు కడవ ఆకారంలో కడవకంటె తక్కువగాని, కడవలో సగంగాని పరిమాణంలో ఉన్నదాన్ని దుత్త అంటారు. కుండకు మూతి వెడల్పుగా ఉంటుంది. ఆకారంలోను, పరిమాణంలోను చెంబుకు సరిపోల్చదగింది ముంత. దుత్తను కల్లు తీయడానికి వాడుతారు వాటితోనే అమ్ముతుంటారు కల్లుకు వాడే ఈ పాత్రను 'లొట్టి' అంటారు.

తట్ట, గంప ఒకేదానికి వేరువేరు పేర్లు ఇదేఆకారంలో, తక్కువ పరిమాణంలో ఉన్నదాన్ని బుట్ట అంటారు ఈ తట్ట బుట్టలకు వెదురు, కొండచువ్వ, పాము కోర, ఇతర తీగె జాతుల చువ్వలు, ప్రత్తి కట్టె, కందికట్టె మొదలయినవి పల్నాటిసీమలో ఎక్కువగా కన్పిస్తాయి రాట్నము నూలు వడికే సాధనం. వ్యవసాయంగల రైతుల ఇండ్లలో ఉంటుంది. చాప అల్లకానికి ఈత ఆకులు, తుంగ, జమ్ములను వాడుతుంటారు. మంచాలకు నులక ఎక్కువగా కన్పిస్తుంది, ఈ నులకను గోగునార, జనపనార, సాగనార, కలబంద నారలనుంచి త్రాళ్ళుపేని తయారు చేస్తారు సంపన్నుల ఇండ్లలో మంచాలు టేకుజాతి కర్రతో చేయిస్తారు. నూటికి తొంభై పాళ్ళ గ్రామాల్లో మంచాలకు బిల్లుడు, చిరుమాను, ఏగె, నర్లంగి మొదలయిన జాతుల కర్రలు వాడుతుంటారు.

## ప్రజా సౌకర్యాలు

ఏ రకమయిన పరిపాలన జరిగినా ప్రజలకు సౌకర్యాలు కల్గించడం పాలకుల విధి. ప్రపంచంలో విజ్ఞానం అభివృద్ధి అవుతున్నకొద్దీ సౌకర్యాలు పెరిగిపోయాయి. ఆయా సౌకర్యాల ప్రస్తావన కోలాటం పాటల్లో కూడ కన్పిస్తుంది. సేకరించిన పాటల్లో రక్షణసౌకర్యాలు, న్యాయవిషయాలు, నీటిపారుదల, రవాణా సౌకర్యం, రైలు మార్గాలు, విద్యుత్తు, తంతి సౌకర్యం, కొలమానాలు,

నాటేలు మొదలయిన సౌకర్యాలు కన్పిస్తాయి. పూర్వకాలంలో కూడా ప్రభుత్వాలు రక్షణ వ్యవహారాలు పటిష్ఠంగా అమలు పరిచేవి ప్రజలకు రక్షణ కల్పించనిదీ, నేరస్తులను శిక్షించనిదీ ఏ ప్రభుత్వమూ గట్టిగా నిలువలేదు కాబట్టి ప్రజలకు రక్షణ కల్పించడంలో ప్రభుత్వం శ్రద్ధ వహిస్తుంది. గ్రామాలనుంచి నగారాల దాకా రక్షణ సౌకర్యం వివిధ పద్ధతులలో ఉంటుంది గ్రామాల్లో మునసబు, కరణం అనేవారు గ్రామోద్యోగులు వీరికి సహకారులుగా మోతాదు, వెట్టి అనే వారుంటారు. గ్రామాల్లోని నేరస్థులను వీరి ద్వారా పట్టణాల్లో ఉండే రక్షణ శాఖ కార్యాలయాలయిన పోలీసు స్టేషన్లకు పంపుతారు నేరస్థులను పోలీసు స్టేషనుల్లో నిర్బంధించి, న్యాయ స్థానాల్లో విచారణ జరిపిస్తారు. శిక్షలు అమలు పరచే చోటును జైలు అంటారు ఘోరమైన నేరాలకు 'మరణదండన', 'జన్మఖైదు' లాంటి శిక్షలు విధిస్తుంటారు.

"కొండమీనా దాని యిల్లూ నాసామి
కొలిమి తిత్తులు దాని సఖ్యా
ఉండవచ్చును దాని కొరకూ నాసామి
సెయ్యి వచ్చును జల్మకయిదు",[114]

"కట్ట కొమ్మున దానియిల్లూ నాసామి
ఎర్ర బుగ్గలమీద మనుసూ
దాని కోసము నేనుబోతే నా సామి
ఆరు నెల్లు జల్మకయిదు,"[115]

"పోలీసు జవాన్ల బిలిసి
పొడిపిద్దునా నిన్ను
యెట్టివాళ్ళ బట్టిచ్చి
నెట్టిద్దునా నిన్ను,"[116]

"కంది పువ్వందనము తుమ్మెదా నీ
కరణము పేరేమి తుమ్మెదా,

114. అను., పా. 38.
115. అను., పా. 60.
116. అను., పా. 62.

మునగ పువ్వందనము తుమ్మెదా నీ
ముడుసూబు పేరేమి తుమ్మెదా,
మోమగ పువ్వందనము తుమ్మెదా నీ
మోతాదు పేరేమి తుమ్మెదా,
ఎలక పువ్వందనము తుమ్మెదా నీ
వెట్టోడి పేరేమి తుమ్మెదా"[117]

అనే చరణాల్లో కన్పించే జన్మఖైదు, పోలీసు, మునసబు, కరణం, మోతాదు, వెట్టి అనే పదాలన్నీ రక్షణ శాఖకు సంబంధించినవే.

పూర్వకాలంలో చెరువుద్వారా నీటిని పారించి కొంత భూమిని సాగుచేసి పంటలు పండించేవారు ఇప్పటికీ కొన్ని ప్రాంతాల్లో చెరువుల కింద సాగుజరుగు తుంది.

ఊరికి దచ్చిన వయిపున
సిన్న సెరువు కట్టకింద"[118]

అనే చరణాల్లోని చిన్న చెరువు జూలకల్లు గ్రామంలోనివి. అట్లే

"ఆహా నల్లమలలో పుట్టి
కొండ గుహలు దాటి
కంబం సెరువూ జేరినావా"[119]

అనే చరణాల్లోని కంభంచెరువు చాల ప్రసిద్ధిచెందింది. దాని కింద చాలాపొలం సాగు చేస్తున్నారు. వరిపైరుగాక చెరకు, పసుపులాంటి వాణిజ్యపు పంటల్ని, పైరుల్ని కూడా పండిస్తున్నారు

"అదిగో సింతల సెరువు అంచునా పెద్దరము",[20]
"కొత్త నీళ్లు వచ్చెనాని
యెక్కె కొండ శేప

---

117. అను., పా. 99.
118. అను., పా. 12.
119. అను., పా. 17.
120 అను. పా 28

నిండే తురకప్ప చెరువు
తూరు పలుగు తెల్లబారె''[121]

అనే చరణాల్లోను కన్పించే 'చింతల చెరువు, తురకప్ప చెరువు' మొదలయిన వాటివల్ల నీటిపారుదల ఉనికి తెలుస్తుంది. నాగార్జునసాగర్ ఆనకట్టవల్ల ఆంధ్ర ప్రదేశ్‌లో చాలవరకు నీటపారుదల సౌకర్యంగా ఏర్పడింది. దీనివల్ల వరిపైరునే గాక ప్రత్తి, మిర్చి, పొగాకు, చెరకు పసుపు, మినుము, వేరుశెనగ మొదలయిన వాణిజ్య పంటలను పండిస్తున్నారు.

''నంది కొండా వచ్చెనురో రన్నా రైతన్నా
నీ కట్టమంతా తీరునురో రన్నా కూలన్నా''[122]

అనే పాటలో విపులంగా వర్ణించబడింది. సరుకు ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి సులభంగాను, తొందరగాను చేరేందుకు గాను రవాణా సౌకర్యాలు ఎక్కువగా ఏర్పడ్డాయి. ప్రయాణాలకు మోటారు వాహనాలు, రైలు సౌకర్యాలు ఉన్నాయి.

''మంగళవారం పది గంటలకు
మాయదారు కారు వచ్చే
కారును నిలయేసి నారా
డయివర్ని సెయిబట్టి లాగియేసి'',[123]
''జాతీ దొరలా బండి
వల్లొచ్చే మారు బండి,''[124]
''రైల్వేలు రాత్రాలు వెలట్టరు
మాటలతో యెయ్యామడ ముచ్చట''[125]

అనే చరణాల్లో కారు, రైళ్ళ ఉనికి తెలుస్తుంది

121. అను, పా 61.
122. అను., పా. 65.
123. అను, పా. 12.
124. అను., పా. 59.
125. అను, పా. 65

నేటి ప్రపంచంలో విద్యుత్తు రోజువారీ వాడుక వస్తువుగా తయారయింది దేశంలో ఒక గంట విద్యుత్తు ఆగిపోతే కోట్ల రూపాయల నష్టం ఉంటుంది. తంతి సౌకర్యం గ్రామాలకు కూడా కల్పించాలని ప్రభుత్వం సంకల్పిస్తుంది. పై చరణాల్లో ఈ విద్యుత్తు, తంతి సౌకర్యాల ప్రస్తావన కన్పిస్తుంది కొలమానాలు మారినప్పటికి గ్రామాల్లో ఇంకా పాత కొలమాన పద్ధతునే వాడుతున్నారు. గిద్ద, సోల, తవ్వ మానిక అనేవి కొలపాత్రలుగా వాడుతున్నారు కాలమానాన్ని తెలిపే సాధనం గడియారం దీనివల్ల గంటలు, నిముషాలు, సెకనులుగా కాలాన్ని లెక్కిస్తారు

"నిన్ను జూడ నేరాక
నిముసమో ర్తునా మోహన"[126] అనే చరణాల్లో గడియారం ఉనికి తెలుస్తుంది.

ఇప్పటి నాణేలకు పూర్వం కానీ,అర్ధణా,అణా,బేడా,పావులా, అర్ధరూపాయి, రూపాయి అనే నాణేలుండేవి. ఇప్పటి పావులా, అర్ధ రూపాయలమీద 25, 50 సంఖ్యలున్నాయి. పూర్వం పావులా, అర్ధరూపాయిలమీద $\frac{1}{4}$, $\frac{1}{2}$ అనే సంఖ్యలు ఉండేవి. ఆమానం ఇట్లా ఉంటుంది.

2 కానీలు = 1 అర్ధణా
2 అర్ధణాలు = 1 అణా
2 అణాలు = 1 బేడా
2 బేడాలు = 1 పావులా
2 పావులాలు = 1 అర్ధరూపాయి
2 అర్ధరూపాయలు = 1 రూపాయి."
కాడసన్నము కారపాకులు
కానీకి మూడాకులు"[127]
అనే చరణాల్లో 'కానీ' ప్రసక్తి గోచరిస్తుంది.

---

126. అను., పా. 34.
127. అను., పా. 13.

## ఇ త రా లు

"ఏ ముండ దగిరిచ్చెరా కొడుకా

శేత్రోలు సెగరోగము"[128] అనే పాటలో గుప్తరోగం, దానికి మందు వాడే విధానం తెలుస్తుంది. సెగరోగం అనేది మర్మాంగాల వద్ద వచ్చేది. దీనికి మందు రాసేటప్పుడు ఒక కోడీకతో రాస్తారు. కోడీక వెంట్రుకలు మెత్తగా ఉండి, పుండుకు వత్తిడి తగులకుండా ఉంటుంది. ఈ రోగస్థులకు గ్రామాల్లో వెన్నపూసతో ఎర్రజొన్నరొట్టె మాత్రమే తినదగిన ఆహార పదార్థం. పథ్యం జాగ్రత్తగా ఉంచుతారు. పురుషుల నుంచి స్త్రీలకు, స్త్రీలనుంచి పురుషులకు వ్యాపించే అంటు వ్యాధి ఇది. ఆయుర్వేదానికి గ్రామాల్లో ప్రచారంబాగుగానే ఉంది. దీనిని నాటు వైద్యం అంటారు. కొన్ని మూలికలు కలిపి ఈ మందులు నూరుతుంటారు. పాము మంత్రం, తేలు మంత్రాలకు కూడా ప్రచారం బాగా ఉంటుంది.

"కట్టమీద పాల పిట్టో నాసామి
కొట్టబోతే తేలుగుట్టె
మంతరించే నాథుడుంటే నాసామి

మల్లెపూలా పానుపేద్దు"[129] అనే చరణాల్లో తేలుమంత్రగాళ్ళ ఉనికి తెలుస్తుంది. తేలు కుట్టినచోట గాయాలకు కోసిన ఉల్లిపాయ ముక్కలతో రుద్దుతూ, మంత్రగాళ్ళు వేప మండలతో తేలుకుట్టిన వారిని దిగదుడుస్తూ మంత్రిస్తారు. వేపాకు చేదు కాబట్టి మంత్రగాడు వేపాకు నమలినందువల్ల పాము కుట్టిన వారికి విషం ఎక్కదని నమ్మకం.

"పుట్టినపుడు కయిక కుతికా నిండొడ్లూ బోసి

కూర్చి చంపకపోయెరా"[130] అనే చరణాలలో వడ్లతో చంపడం అనే విషయం కన్పిస్తుంది. విధవరాండ్రకో, పెండ్లికాని కన్యలకో పుట్టిన బిడ్డలవల్ల అపఖ్యాతి వస్తుందనుకున్న వాళ్ళు, లేదా ఒక బిడ్డ పుట్టుక ఇష్టంలేని వాళ్ళు బిడ్డలకు పుట్టగానే కుతికలో వడ్లుపోస్తారని లోక వ్యవహారం.

128. అను., పా. 100.
129. అను., పా.38.
130. అను , పా 75.

"పోతుంది సూడరా కల్లింటికీ
లంజె తాగినంకా రాదు మా యింటికీ"[131]

అనే పాటలో కల్లు ప్రసక్తి గోచరిస్తుంది కల్లులో తాటికల్లు, ఈతకల్లు, మేడికల్లు, వేపకల్లు అనేరకాలు ఉన్నాయి మేడికల్లు, వేపకల్లు ఆరోగ్య సంబంధంగా మందుగా వాడుతారు. ఈతకల్లు, తాటికల్లు మత్తు పానీయాలుగా వాడుతారు. కల్లు అమ్మే ఇండ్లను కల్లిండ్లు అంటారు. కల్లు పోసే పాత్రను లొట్టి అంటారు. కల్లుమత్తు విరిగిపోవడానికి మజ్జిగ తాగుతారు.

ఇట్లు ప్రజల్లో వాడుకలో ఉన్న నిత్యావసర వస్తువులు, ఆచార వ్యవహారాలు, ఆహారవిహారాలు, ఆభరణఅలంకారాలు, జీవనవిధానం మొదలయినవన్నీ ప్రకృత పరిశోధనకు సేకరించిన కోలాటం పాటల్లో కన్పిస్తున్నాయి.

131. అను., పా. 79.

# కోలాటం పాటలు: భాషా విశేషాలు

జానపద గేయాల్లోని ప్రయోగ పద్ధతి శిష్టసాహిత్యంలోని రీతులకంటె భిన్నమైంది. ఈ గేయాలు మౌఖిక ప్రసారంవల్ల ప్రచురంగా ప్రచారం పొందుతూ వచ్చాయి గాబట్టి వీటిలో పాఠాంతరాలు, అధిక చరణాలు ఇతర పాటలకు అనుసరణలు, అనుకరణలు కన్పిస్తాయి. ఉదాహరణకు "ఏరువాకా సాగారోరన్నో సిన్నన్నా" అనే పాట అనుసరణతో "నందికొండా వచ్చెనురో రన్నా సిన్నన్నా" అనేదీ, "సుబ్బదాసుని గాంచుమురో రన్నా సిన్నన్నా" అనేదీ కన్పిస్తాయి. జానపదుల నోళ్ళలో నలిగినపుడు వాటి రూపురేఖల్లో ఊహించరాని మార్పులు జరగవచ్చు. విస్తృత ప్రచారంవల్ల ఇటువంటి మార్పులు తప్పనిసరి.

శిష్ట సాహిత్యంలోని ప్రయోగ పద్ధతితో పోలుస్తూ జానపదగేయాల్లోని విశిష్టతలు పరిశీలిద్దాం. జానపదవాఙ్మయంలోని భాషలో శబ్దపరిణామ రీతులను, విశిష్ట సంధులు, సమాసాల్లో విశేషాలు, వ్యతిప్రామాణికాలు, విభక్తి ప్రత్యయాల్లో విశేషరూపాలు, క్రియారూపాలు, వాక్య నిర్మాణంలో విశిష్టతలు కన్పిస్తాయి. ఒక్కొక్క దాన్ని పరిశీలిద్దాం.

కోలాటం పాటల్లో కన్పించే పరిణామ రీతుల్లో కొన్ని హ్రస్వ భేదాలకు సంబంధించిన ప్రయోగాలు తాళానికో, లయకో సరిపెట్టేందుకు జరిగిన ఉచ్చారణ విశిష్టతలు కావచ్చు. ఉచ్చారణకు సంబంధించిన హ్రస్వ, దీర్ఘభేదాలు ప్రతి పదంలోను కన్పిస్తాయి. మచ్చుకు కొన్ని మాత్రమే ఇచ్చట ఇవ్వడం జరిగింది. ఇందు మొదటి రూపం జానపద సాహిత్యానికి, రెండో రూపం శిష్టసాహిత్యానికి సంబంధించినవి.

**I. a)** పదాది అచ్చుల మార్పాటు.

(1) ఆ < అ :

పాడ్మాటా < పడమట.

కొండలకు పాడ్మాటా గోదేరు తొవ్వించి (పా. 82).

మారాటీలు < మరాటీలు.

పచ్చమూరాటీలు పచ్చమూరాటీలు (పా 1)
వాత్రము < వస్త్రము.
తడిన వాత్రము మెడన లింగము నొసట ఈబుది రేకదీ(పా ౯౫).
సొవారు<సవారు.
మేటీ సొవారి మీస వచ్చెనమ్మా యెల్లిపోయెనమ్మా (పా ౯౮)

ii) ఈ<ఇ .
యీబుది<విభూతి.
తడిన వాత్రము మెడనలింగము నొసట యీబుది రేకదె (పా 95)

iii) ఊ < ఉ :
గూళ్ళద<గుండ్లదె.
బాహూ మూంచిదీ బంగారూ గూళ్ళదీ (పా 42)

vi) ఉ < ఊ :
ఉరమెళ<ఊర్మిళ
ఉత్తమయిల్లాలు ఎదురూగ రాగానే -
ఉరిమెళతో ఏమెంచురా (పా. 75)

v) ఏ < ఎ :
మేచ్చగ < మెచ్చగ.
పోరా కిష్నని పడతులు మేచ్చగ (పా. 90).

vi) ఓ<ఒ :
బోజ్జ<బొజ్జ.
గుజ్జురూపము బోజ్జ గనపతి (పా. 72)
మోటీమాలు<మొటిమలు.
మొకమెల్ల మోటీమాలంద అదీ (పా. 69).

b. ఉచ్చారణలో పదమధ్య అచ్చుల మార్పాటు.

i) ఆ < అ .
ఎరకాలా < ఎరుకల.
ఎరకాలా వారింట్లో సిన్నాదీ (పా. 21)
ఏరూడాప్పా < ఏరుడప్పు

ఏకైక వీరూవావూ లోకాధి వందితుడాపూ (పా. 11).

సందామామ < చందమామ.

సందామామల బట్టి - సందిటి కేసీ కొట్టి (పా. 25).

మేనాత్తవే < మేనత్తవే.

సెల్లెలా మా తల్లివే సిత్తమున మేనాత్తవే (పా. 5).

నిరతాము < నిరతము.

వరములిచ్చి రచ్చింపు - నిరాతాము నీ దాసులము (పా. 30).

ii) ఈ < ఇ :

మాంచీది < మంచిది.

బామా మాంచీది బంగారు గూళ్ళది (పా. 42).

యిడీగాను < విడిగాను

ఆహాయిచ్చల యిడీగాను గజ్జెల కొండా దాటి. (పా. 17).

ఊరీకి < ఊరికి.

ఊరీకి దచ్చిన వయిపున (పా 12)

iii) ఊ < ఉ :

పట్టూకు < పట్టుకు.

పట్టూకు దొరకానీ పాపారా (పా. 21)

కన్నూలదీ < కన్నులది.

నూనె బంగది జారు కొప్పుది - కాటుకా కన్నూలదీ (పా. 95).

నవ్వూలు < నవ్వులు.

మొలకా నవ్వూలూ మోవంపూ సూపులూ (పా. 96).

శంబూని < శంబుని

శంబూని రానీ దేవి నీకు యిదిగొ మంగలం (పా. 6)

కులమూదీ < కులముది.

ఏమీ సేతుర తమ్ముడా అది కానీ కులమూది (పా. 42).

iv) ఉ < ఊ :

ఈబుది < విభూతి.

తడినవాత్రము మెడనలింగము నొసట యీబుదిరేకదీ (పా. 95).

c) పదాంత హ్రస్వాలు దీర్ఘాలుగా కన్పించడం.

i) ఆ < అ :

తడపడరా < తడపడర.

కుడి ఎడమం తడబడకా పాడిగా (పా. 23).

ఎరకా < ఎరుక.

ఏనాటి ఎరకా లోళ్లు (పా. 26).

ముండా < ముంత

ముంతా కడుపున ముందురో కాప్పుండినాయుండి (పా. 64).

బాకునా < బాకున.

నిన్ను బాకునా చూసేదు సిన్నయ్యా (పా. 1)

అంసా < హంస.

అంసా మొగ్గం వెయికాదీ (పా. 69).

ii) ఈ < ఇ :

జోగీ < జోగి.

పామును బట్టే జోగి యెవరే సందమామా రాజా (పా. 48)

మేటీ < మేటి.

మేటీ యొక్క మాగ్గట్టే సందమామా రాజా (పా. 84).

గోళ్ళగొండీ < గోళ్ళగొండి.

కొండపిండిగాదు గోళ్ళగొండీ గాదు (పా. 43).

గబ్బీ < గబ్బి

దాని గబ్బీ గుబ్బాలు (పా. 16)

కస్తూరీ < కస్తూరి.

గందాము కస్తూరి నాపై సింకారించావే (పా. 73).

iii) ఊ < ఉ :

వెంచలాకూ < వెంచలాకు.

సెంగులా యెగ గట్టి వెంచలాకూ గోసి (పా. 43)

వెలుగూ < వెలుగు.

నీకు యెలుగూ వొరుకును వేరా (పా. 17)

రాటమూ < రాట్నము.

వాటమైనా కొత్త రాటమూ మన కొత్తె (పా. 27).
గజ్జేలా < గజ్జెలు.
కాళ్ళా గజ్జేలూ చేకర్రా యేటూలా (పా. 96).
చెరుప్పూ < చెరుపు.
నువు కంబం సెరుప్పూ జేరినావా (పా. 17).

d) ఉచ్చారణలో పదాదిలో ఉ, ఊ, ఒ, ఓలకు బదులుగా వు, వూ, వొ, వో లు కన్పించడం.

వుత్తర < ఉత్తర.
ఎర్రగొంపకు వుత్తర పయిపున (పా. 12).
వుప్పొంగు < ఉప్పొంగు.
వురుము < ఉరుము.
నీవు వురిమితే వుప్పొంగినావా (పా. 17)
వూళ్ళో < ఊళ్ళో, వొట్టు < ఒట్టు.
ఈ ఊళ్ళో వుంటే వొట్టు (పా 25).
వూరడవి < ఊరడవి.
నువ్వుండేదీ వూరడమి నువుసండేది (పా 4).
వొంటరి < ఒంటరి.
నేను వొంటరిగా యుండాలేనే (పా 25).
వొరిగి < ఒరగి
వదిన కోసమూ వచ్చి వారిపి బందించి-
వొరిగి పోతివ తమ్ముడా (పా 8)
వోరి < ఓరి, వోరోరీ < ఓరోరి.
వోరి కంసాయినరా - వోరోరీ కంసాయినరా (పా 32)
వోలలాడు < ఓలలాడు
పట్టుసీర లేలసమ్మ పారుటాకు లుండంగ -
సెట్టుకింద వోలలాడె సెంచువారికి (పా.9).
వోసందమామా < ఓ చందమామ.
యింటుంటే బతుకామూ వోసందామామయ్యో (పా. 4).

తురకల చిన్నది
మారు బాసాలాడుతుంది-
మగువ తురకల సిన్నదీ (పా. ౬౮)
మునసబు పేరు
మునగపువ్వందనము తుమ్మెద నీ-
ముసునూబుపేరేమి తుమ్మెదా (పా. 99)
మోతాదు పేరు
మోమగ పువ్వందనము తుమ్మెదా నీ
మోతాదు పేరేమి తుమ్మెదా (పా. 99).

V. ఇగ్లీంషు పదాలు మొదటి పదంగా గల సమాసాలు.

i) ఇంగ్లీషు + సంస్కృతం :
కాంగ్రెసు మంత్రులు.
కాంగ్రెసు మంత్రుల కార్యదీచ్ఛతో (పా. 65)

ii) ఇంగ్లీషు + దేశ్యం .
కేసుల కోలాటం.
కాసుల వాడిసితె తెలిసిందేగద-
కేసుల కోలాటం సైసై (ప్రా. 108).

iii) ఇంగ్లీషువైకృతం :
రబ్బరు గాజులు.
బీడి మురుగుల దానా - లబ్బరుగాజుల దానా (పా. 14).
రైలు వడ్డాణము.
రాతెండి కడియాలు రైలు వడ్డాణము
రంగు మెరిసిన ముద్దు సిన్నదీ (పా. 114).

iv) ఇంగ్లీషు + ఇంగ్లీషు :
రైటు బ్యాంకు.
రైటు బేంకంటారు లంక మోటంటారు (పా. 92).

v) ఇంగ్లీంషు + అన్యదేశ్యం :
కాంగ్రెసు జెండా.
ఢిల్లీలాల్ ఖిల్లాపైన జెండవాలెనూ -

కాంగ్రెసు జెండవాలెను (పా. 9).
పోలీసు జవాను.
పోలీసు జవాన్ల పిలిసి - హొడిపిద్దునా నిన్ను (పా. 62).

## క్రియానిర్మాణం

I. ఇంచుకు స్థానంలో కన్పించే ప్రయోగాలు.

i) 'ఇస్తే' కనిపించడం :
ఆడిస్తూ ఉన్నది.
హరిలోక దరమందు ఆడిస్తూవున్నది (పా. 21).
చప్పరిస్తే.
చప్కు చచ్చప్కుతోటి -
మూడు చప్కులు సప్పరిస్తే (పా. 62).
జేయిత్తూ.
నడిసేటి కాళ్ళకు కోయిలా నాలు -
గందెలు జేయిత్తూ కోయిలా (పా. 68).

ii) 'ఇంచు' కు బదులుగా 'ఇచ్చు' కనిపించడం :
తగిలిచ్చు.
ఏముంద దగిలిచ్చెరా కొడకా
శేత్రబోలు సెగరోగమః (పా. 100).

iii) అంపిద్దు, చేయిద్దు మొదలయిన విధ్యర్థక రూపాలు :
గెలిపిద్దు.
నక్కలరు పెదరెసి నాపెగ్గ గెలిపిద్దు (పా. 27)
మాపిద్దు.
కడమ నెల్లో నీకు పడవ నెయి మాపిద్దు (పా. 27).
చేయిద్దు.
మొదటి నెల్లో నీకు మొగ్తాగు జేయిద్దు (పా. 27).
హొడిపిద్దు
పోలీసు జవాన్ల బిలిసి హొడిపిద్దునా నిన్ను (పా. 62).

మిగిలిద్దు.
నీటయిన తలగుడ్డ నీకు నేయించంగ
కోట బొమ్మంచుదే కోకకే మిగిలిద్దు (పా. 27).

II. 'చు' వర్ణాంత ధాతువులలో కన్పించే మార్పులు.

1) 'స్తే' కన్పించడం .
పిల్లనిత్తే < పిల్లనిస్తే.
అత్తకొడుకుకు పిల్లనిత్తే
ఆదిగ్గేనయే సెల్లెలా (పా. 120)
జేరమిస్తది.
ఆదిగడియ గడియకు జేరమిస్తది -
సకియ కోమటి సిన్నది (పా. 95).
ఏడిత్తే < ఏడిస్తే.
ఏడిత్తే నీ కనులూ నీలాలూ గారూనూ (పా. 4).
చూస్తే.
రేపు జూస్తే యెంకటగిరిలో సందమామా రాజు (పా. 94).
వత్తబోత < వస్తుబోతూ.
సింత జూడు సిగురు జూడు
సిన్నదాని పొగురు జూడు
వత్తదోత నన్ను చూడరా (పా. 50)
వత్తేను < వస్తేను.
మావోరు వత్తేను సిన్నయ్యో (పా. 1)
వత్తివిరా < వస్తివిరా.
ఎందూ కొత్తివిరా - దొంగలమ్మిడి కొడకా (పా. 62)

III. 'యు' వర్ణాంత ధాతువులలో కన్పించే మార్పులు.

i) 'స్తే' కన్పించడం :
ఏమిజేత్తురా < ఏమిజేస్తురా.
నాసామిరంగ - సందుగాడు యేమిజేత్తురా (పా 50).

IV 'తృ' వర్ణకార్థంలో వచ్చే 'ఎడి' స్థానంలో 'ఎటి, ఏటి'లు కన్పించటం.

1) ఎటి/ఎడి :

గుణము లేలెటి < గుణము లేలెడి.

మక్కువతో త్రిబుగునము లేలెటి (పా. 76).

మొక్కులొసగెటి < మొక్కులొసగెడి.

**మొక్కులొసగెటి** వారి పనులను సక్కబెట్టేదేవర (పా. 76).

పడవ నడిపెటి < పడవ నడిపెడి.

**పడవ నడిపెటి** బెస్తబోయడు -

లేడు గదురా అన్నయా (పా. 5).

ii) ఏటి/ఎడి :

ఆకాశనుండేటి < ఆకాశనుండెడి.

**ఆకాశనుండేటి** ఆయింద్రాజీత్తు -

సూర్య బానము నాటెనా (పా. 75).

గట్టెక్కించేటి < గట్టెక్కించెడి.

మన కస్టాలను **గట్టెక్కించేటి** -

నాయకు డేడండి (పా. 78).

నిరతమ్ము గొలిసేటి < నిరతమ్ము గొలిసెడి.

అనుమ అనుమాయాని - **నిరతమ్ము గొలిసేటి** (పా. 116).

కీర్తనా చదివేటి < కీర్తనా చదివెడి.

వరద సిరిగిరిపాటి పురమందు నాయింక -

ఆది **కీర్తనా సదివేటి** సిన్నది (పా. 114).

జేసేటివాడు < చేసేడివాడు.

ఎంతో దండానా **జేసేటివాడే** - కుందారాదానా సైసై (పా 87).

తిరిగేటి < తిరిగెడి.

బత్తీగలిగినవారి బావములోపల

బయలయి **తిరిగేటి** సిన్నది (పా. 21).

నడిచేటి < నడిచెడి.

**నడిసేటి** కాళ్ళకు కోయిలా -

నాలుగందెలు జేయిత్తూ కోయిలా (పా. 68).

పాడేటి < పాడెడి.
పాటలు పాడేటి పద్మ దలాచ్చిరో
బోటి నేనొక్కాదాన్నన్నది (పా 114).
బతికేటి < బ్రతికెడి.
పరువుగ బతికేటి మాలచ్చువమ్మ (పా 53)

V. సహాయక క్రియగా 'కొను' ధాతువను ప్రయుక్తమయినపుడు "—కు, -కున్న, - కో, - కోని", సపదాంశాలుగా కన్పించడం.

i) కు :
ఎత్తుకుపోయాడు
పాపాత్ముండెవడో సీతను -
యెత్తుకుపోయాడు (పా. 123).
చెరపట్టుకుపోయాడు.
పాపాత్ముండెవడో సీతను -
శెర బట్టుకుపోయాడు (పా. 123).

ii) కున్న :
పట్టుకున్న.
పట్టుకున్న దొంగను నట్టనడిమికి దీసకొచ్చి (పా. 62).
మొత్తుకున్న.
మొత్తుకున్న కొరడు దాన్ని -
వత్తి వత్తి సంపీనావట (పా. 88)

iii) కో :
చెప్పుకోమన్నది.
కొలపట్టి సూచితే గోత్రమందున నాకు
కులములేదని సెప్పుకోమన్నది (పా. 114).

iv) కోని :
ఆకులొక్క లేసుకోని.
ఆకులొక్క లేసుకోని అద్దమడగ నేను బోతే (పా. 50).
బట్ట దులుపూకోని.
బట్ట దులుపూకోని బాటఒడి వస్తుంది (పా 79)

పట్టుకోని
నాల్గా బజార్లు జూసి నాజూగ్గ **పట్టుకో**ని (పా. 62)
ఎగపట్టూకోని.
ముంగల గదిలో బంగారక్క-
ముంగల కొంగు యెగబట్టుకోని (పా 62).
చుక్కబొట్టు పెట్టుకొని
సుక్కబొట్టు పెట్టుకోని సున్నమగడ నేనుబోతే (పా 50).
ముక్కుపుల్లలు పెట్టుకోని
**ముక్కు పుల్లలుపెట్టుకో**ని-
నత్తులు యెగ పోటుకుంటూ (పా 62).
ముంచుకోని.
కానొచ్చె కడబాయి నీల్లో నాసామి-
కడవనిండా **ముంచుకో**ని (పా. 38)

**VI.** 'ఇచ్చు' నకు సర్వానికి బాలవ్యాకరణ సూత్రం ప్రకారం 'ఈ' అవుతుంది అయితే వ్యవహారంలో 'ఇచ్చు' కు బదులుగా 'ఇయ్య, ఇవ్వ' అనే రూపాలు కన్పిస్తాయి

**i) ఇయ్య :**

పావురమియ్యి.
పిన్న తల్లివి కావలెనమ్మా-పంచవన్నెల పావురమియ్యి (పా.122).
సారసమియ్యి.
నిన్ను జూసి నిమరలేదు-
నిన్నుగూడి సారమియ్యి (పా 122).
చెయ్యి దియ్యిరా.
ఇద్దరికి యిమ్మనాలదూ! రంగయ్య బావ-
రొమ్ముమీద సెయ్యిదియ్యిరా (పా 50)

**ii) ఇవ్వ :**

జాయిరివ్వవే.
ఫనికి మాలిన పట్టుసీరె **జాయిరివ్వవే** సెల్లెలా (పా. 120).

తెరువ నివ్వవు.
వందిరీగలు పాడుగాసూ నాసామి
కళ్ళు దెరవనివ్వవాయె (పా. 38).
బొత్తిగ రానివ్వరు.
అత్తమామలు యింటె బొత్తిగ రానివ్వరు (పా 114).
ముద్దూనివ్వు.
పొద్దూ చేనబోయెదరా వొక ముద్దూనాకివ్వరా (పా. 102).
సంతులివ్వు.
పుట్టకేమి కోమాశేమా-కోమలిడిసి సంతులివ్వయ్యా (పా. 113).
ఆరమివ్వు.
ఐదు పులులకు ఐదు మేకలు
ఆరమివ్వవే సెల్లెలా (పా. 5).

## వాక్య నిర్మాణం

**క్రియా విహీరత వాక్యాలు :**
అదిగో సింతల సెరువు అంచునా పెద్దరము (పా. 29).
అంబ నీకు యిదిగో మంగళం (పా. 6).
అమ్మా నేను సిన్నాదాన్ని (పా. 7).
కట్టమీన కత్తిమెరుపూ—వోలల నా సెర్లోన సేపతళుకు (పా. 33).
కడగొట్టు నామరిది గట్టి సాదనకాడు (పా. 114).
నూనెబుంగది, జారుకొప్పది కాటుకా కన్నూలది (పా. 95).
పెసర బేడలసీరె పేటంచు రెయి కాది (పా. 83).
మొకమెల్ల మొటిమాలదీ-
ఆదీ అంసా మొగ్గల రెయికాదో (పా. 69).
ఈడిలో దానిల్లురా బాజారులో దానంగడి (పా. 95)
ఈపు జడలది తోపు రెయికది-
లోపలా తాబొందుదీ (పా. 95).

# కోలాట కళాకారుల నేపథ్యం

ప్రస్తుత పరిశీలనం నూటికినూరుపాళ్ళు ఈ వ్యాసకర్త స్వయంగా కోలాటం ఆటగాళ్ళ నుంచి సేకరించిన సామాగ్రిపై సాగినందున ఎతద్వ్యాస కర్త క్షేత్ర పర్యటన వివరణలు ప్రదర్శించడం చాలా అవసరం. కోలాటం ఆటగాళ్ళు, జట్టు నాయకుల సాంఘిక, ఆర్థిక, విద్యాది విషయాలు ఎంతో ఆసక్తికరంగా ఉన్నాయి.

**ఆటగాళ్ళు :**

పల్నాటిసీమలోని పలు గ్రామాల్లోని కోలాటం ఆటగాళ్ళ ద్వారా కోలాటానికీ, ఆటగాళ్ళకూ సంబంధించిన అనేక విషయాలు సేకరించడం జరిగింది. చిన్నచిన్న రైతులు, రెక్కాడితేగాని డొక్కాడని కూలీలు, ఇతర కమ్మరం కుమ్మరం, చల్లరమల్లర వృత్తుల నాశ్రయించి జీవించే వాళ్ళతోపాటు అన్ని కులాల వాళ్ళు వీళ్ళలో కన్పిస్తారు. కాయకష్టంచేసి మనుగడ సాగిస్తున్న మనుషులు వీరు. వీరి ఆర్థిక స్థితి చాలా పరిమితంగా ఉంది. కొందరు ఆర్థికంగా హీన స్థితిలో ఉన్నారు.

వీరిలో చాలా మంది నిరాక్షరాస్యులు. అక్షరాలను కూడబలుకుకొని చదువుకోగలిగిన వారు సహితం ఎక్కువ మంది కన్పించరు. వీరిలో చదువుకున్నవారు ఐదోతరగతిదాకా చదివి ఉంటే చాల ఎక్కువ. పసితనంనుంచీ పెద్దలుపాడగా విని ఆయాపాటల్ని కంఠస్థం చేసినవారు ఎక్కువమంది కన్పిస్తారు. అందుచేత వీరిలో జానపదస్వభావంతోపాటు జానపదభాషారీతులు గూడ మనకు కొట్టవచ్చినట్టు కన్పిస్తాయి. పండగ - పబ్బాల్లోను, తిరుణాల ల్లోను ఎన్నో కోలాటపు జట్టుల వారి క్రీడా భంగిమల్ని, గేయఫణితుల్ని అనేక పర్యాయాలు పరికించడంవల్ల ఇది ఎక్కువగా చోటు చేసుకున్నట్లు చెప్పవచ్చు.

పల్నాటి సీమలో కోలాటంలో పాల్గొనే వారిలో పురుషులే కన్పిస్తారు. బాలికలు గాని, వయసు వచ్చిన స్త్రీలుగాని దీనిలో పాల్గొనడం పల్నాటిసీమలో ఎక్కడా కన్పించలేదు.

సాధారణంగా ఆటగాళ్ళ వయసు 18-20 సంవత్సరాల మధ్య ఉన్నట్టు గమనించడం జరిగింది. అంతకంటె తక్కువ వయస్సు, ఎక్కువ వయస్సుకల ఆటగాళ్ళు లేనేలేరనికాదు. చాల తక్కువమంది కన్పిస్తారనే చెప్పవచ్చింది. దీనిని సాధారణంగా ఆటగాళ్ళ స్థూలమైన నేపథ్యంగా స్వీకరించవచ్చు.

**జట్టునాయకులు :-** పల్నాటి సీమలోని తొంభైయయిదు గ్రామాల్లో దాదాపు పదకొండు గ్రామాలు ప్రస్తుత పరిశీలనలో సమాన దూరంలోగల కేంద్రా లుగా ఎన్నుకొని కోలాటం పాటలు సేకరింపడం జరిగింది. ఈ పదకొండు కేంద్రాల్లో మొత్తం పన్నెండు మంది జట్టు నాయకుల్ని సంప్రదించి కోలాటానికి సంబంధించిన అన్ని వివరాలు సేకరించడం జరిగింది. ఐతే ఇందులో ఇద్దరు పల్నాటి సీమకు పొరుగు తాలూకాల నుంచి అప్పుడపుడు వచ్చి కొంతకాలం పల్నాటి సీమలో ఉండి కోలాటం శిక్షణ ఇస్తున్న వారు అందుచేత వారిని కూడా లెక్కలోకి తీసుకోవడం జరిగింది. తక్కిన జట్టు నాయకులు అచ్చంగా పల్నాటి సీమలో పుట్టి పెరిగిన వారే వీరు పల్నాటిలోనే గాక గుంటూరు జిల్లాలోని ఇతర ప్రాంతాలకు, చుట్టుపట్లగల తక్కిన జిల్లాలకు వెళ్ళి ఆయా ప్రాంతాల్లోని జట్టులకు శిక్షణ ఇచ్చి వస్తూంటారు. వీరి జీవితాంశక వివరణలు దిగువ విపులంగా ఇవ్వడం జరిగింది.

**చెవాల్ల చెన్నయ్య :**

మాచర్లకు తూర్పు దిశలో ఎనిమిది కిలోమీటర్ల దూరంలోగల ఆత్మకూరు జన్మస్థలం. అయితే మాచర్లకు ఆగ్నేయ దిశలో 5 కి.మీ. దూరంలోను, ఆత్మ కూరుకు ఉత్తర దిశలో 4 కి మీ దూరంలోను ఉన్న కంభం పాడులో తన ఇరవయ్యో యేట అత్తగారింటికి ఇల్లిటం వెళ్ళి స్థిరపడి పోయాడు. రజక కుల స్థులు కుంకల గుంట వెంకయ్య ఈయన గురువు ప్రస్తుతం కుంకల గుంట నర్సరావుపేట తాలూకాలోని గ్రామం. వయస్సు యాభై యారు సంవత్సరాలు. చదువులేదు నాటికీ నేటికీ తన బట్టలుదికే వృత్తినే ప్రధానంగా పెట్టుకొని ఖాళీ దొరికినప్పుడల్లా పరిసర గ్రామాలకి వెళ్ళి కోలాటం నేర్పుతుంటాడు. పందుల్ని పెంచి, వాటిని లాభాలకు అమ్మడం, పంది పెంట కుప్పగా వేసికొని అమ్ముకో వడం మొదలయినవి ఇతర ఉపవృత్తులు కోలాటం నేర్పడం కూడా ఉపవృత్తే. ఇతనికి పదికోపులు వస్తాయి. గోలిలో ఒకజట్టు, కుంభంపాటిలో మూడుజట్లు, ఆత్మకూరులో ఒక జట్టు మొత్తం ఐదు జట్లకు పల్నాటి సీమలో శిక్షణ ఇచ్చాడు మిర్యాలగూడెం తాలూకా దేవులపల్లిలో ఒక జట్టుకు శిక్షణ ఇచ్చాడు. అన్ని వర్ణాల



ప్రజల ఆదరణకు పాత్రుడయ్యాడు కుల మత భేదాలు పాటించక అందరితోను సామెతలు వాడుతూ, పాటలు పాడుతూ, నవ్వుతూ, అందరిని నవ్విస్తూ ఉంటాడు. అంతేగాక యువతరానికి మంచి హుషారునిస్తూ "అడుగో చెన్ను వస్తున్నాడు"ని దగ్గరకు చేరగానే సామెతలతో కడుపుబ్బ నవ్విస్తుంటాడు 'చెన్ను' అనేది ఆ గ్రామ ప్రజలు చెన్నయ్యను పిలిచే ముద్దు పేరు.

చెన్నయ్య వద్ద పాటల సేకరణ సమయం (మే, 1978) మరపురానిది. సేకరణకు వెళ్ళే సమయానికి కుండతో పందులకుపోసే కుడితి తీసుకెళ్లుతున్నాడు ఆ గ్రామంలోని పరిటాల ప్రభాకరరావు అనే ఒక మిత్రుని సహకారంతో చెన్నయ్యను కలుసుకోవడం జరిగింది. చెన్నయ్యతో 'మాకు పాటలు కావాలి! నీవు పాడాలి' అనగానే ఆ కుండ అక్కడే పెట్టి, మాకు కూర్చోవడానికి రెండు బండలు చూపించి పాడడం మొదలు పెట్టాడు. ఇంతలో కుడితి కోసం వచ్చిన పందులు పక్కనే అరుస్తూ గోలచేస్తూ చుట్టూ తిరుగుతున్నాయి. ప్రజలు గుమిగూడలేదు. కారణమేమంటే వాళ్లకు రోజూ వినే ఎన్నుపాటలే కొద్ది సేపటికి ఇద్దరు పిల్లలు పంది పెంట బుట్టలతో వచ్చి వాటిని అక్కడనేఉంచి మాతోపాటు వాళ్లు కూడా పాటలు వింటున్నారు వాళ్లు చెన్నయ్య బావమరుదులు. చివరకు పందుల గొడవకు తట్టుకోలేక వాటికి కుడితిపోసి, ఆ తర్వాత పాటలు పూర్తి చేశాడు. కోలాటం పాటలే గాక సామెతలు, వడుస పాటలు, విధంగేయాలు ఎన్నో వస్తాయి. "చెన్నయ్యా! నీ పాట వినాలి" అంటే చాలు ఉబ్బిపోయి తన పని పాట్లు వదలి పొద్దెరగకుండా మనకు విసుగు పుట్టేవరకు పాడుతూనే ఉంటాడు. ఇట్లాంటి వారివలన పాటలను సేకరించడం చాల సులువు.

చౌలా నరసింహదాసు :

1978 లో ఈయన వద్ద విషయాన్ని సేకరించడం జరిగింది. వినుకొండ తాలూకా గుట్టపల్లి వాస్తవ్యుడు. మాలకులస్థులు కుంపలగుంట వెంకయ్య ఈయన గురువు. వయస్సు నలభై అయిదేండ్లు ఐదవ తరగతి వరకు స్వగ్రామంలోనే చదివాడు తల్లిదండ్రులు కూలి పనులు చేసేవారు ఇతను మాత్రం కోలాటం, భజనలు నేర్పడమే జీవనోపాధిగా స్వీకరించాడు పల్నాటి సీమలో ఎక్కువ గ్రామాల్లో ఇతనిద్వారా కోలాటం నేర్చుకుంటుంటారు. రెంటచింతలలో కోలాటం నేర్పే సమయాన దాసునుంచి విషయం సేకరించడం జరిగింది ఇప్పటికి దాదాపు యాభైనుంచి అరవైదాకా జట్లు తయారు చేశాడు గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో ఎక్కువ మంది ఇతని దగ్గర కోలాటం నేర్చుకున్నారు. భజనలు, కోలాటాలు నేర్పడం వల్ల దాసుకు నెలసరి ఆదాయం నాల్గు వందల నుంచి ఐదు వందల దాకా ఉంటుంది. దాసుకు ముప్పై కోపులు వస్తాయి కాని ఈయన నేర్పే ప్రతి చోటా ప్రధానమైనవి పన్నెండు కోపులు మాత్రమే నేర్పుతాడు. ఎన్నో బహుమతులు వచ్చాయి. అవి అన్నిగూడ వెండి పతాకాలే దాసు తన చిన్నతనంలో ఇంటివారిపై

అలిగి, ఇంటి నుంచి వెళ్లిపోయి, జీవనానికై కుంకలగుంటలో వెంకయ్య ఇంటిలో పనికై కుదిరి, రాత్రి పూట కోలాటం నేర్చే వారందరిని చూచి, అభిలాష ఉన్నా పైకి చెప్పక, రోజూ వారి ఆటను చూస్తుండేవాడట. అది గమనించిన వెంకయ్య, దాసుకు తాను నేర్చిన భజన కోలాటాలు పూర్తిగా నేర్పి పంపాడు. ఈతడు గుంటూరు జిల్లాలోనే మేటి అని చెప్పవచ్చు.

**జూపల్లి పొట్టెయ్య :**

మాచర్లకు దక్షిణ దిశలో 10 కి.మీ ల దూరంలో ఉన్న కోలగుట్ల గ్రామ నివాసి. రజక కులస్థులు. దాదాపు ఎనభై యేడు సంవత్సరాలు. నిరక్షరాస్యుడు. తల్లిదండ్రుల నుంచి సంక్రమించిన బట్టలుదికే వృత్తే ప్రధాన వృత్తి. కోలాటం నేర్పడం ఉప వృత్తిగా స్వీకరించాడు కాని ఇప్పుడు ఏ ఇతర వృత్తులు లేవు. కోలాటం నేర్పడం కూడా మాని వేశాడు. నడిపయసులో ఉన్నప్పుడు కోలగుట్ల, ఆత్మకూరు, పోలేపల్లి, రాయవరం, దుర్గి మొదలైన గ్రామాల్లో దాదాపు ఇరవై జట్లులు తయారు చేశాడు. పొట్టెయ్య తాను కోలాటం నేర్చే రోజులలో కేశాలంకరణకు వీలుగా జుట్టుఉండేదని, జుట్టుకుపూలు చుట్టుకోవడం ఉండేదని తెలిపాడు. పాటలు పాడమని ఎన్నో సార్లు బ్రతిమాలినా మొదట తిరస్కరించాడు. చదువుకున్నవారి ఎదుట నిరక్షరాస్యుడైన తాను పాడితే అపశబ్దాలు, తప్పులు దొర్లుతాయని చదువుపై ఉండే గౌరవ భయం చేత తిరస్కరించాడు. కాని చివరకు ఓర్పుగా అన్ని వివరాలు చెప్పాడు. ఈయనను ఒప్పించడానికి దాదాపు పదినెలలు పట్టింది (1978-79 లలో). చూడడానికి ముది వగ్గైనా ఉసెత్తులో పాట పాడేటప్పుడు తనకు తానే తన్మయత్వం చెంది ఎగురుతూ, అడుగులు వేస్తూ పాడి వినిపించాడు. పొట్టెయ్య నేర్చింది కులుకుల కోలాటం.

**మక్కెన బంగారయ్య :**

మాచర్లకు తూర్పు దిశలో 10 కి. మీ. దూరంలో ఉన్న దుర్గి ఈతని స్వగ్రామం. రజకకులస్థులు. గురువు కుంకలగుంట వెంకయ్య. వయస్సు యాభై రెండేండ్లు. నిరక్షరాస్యుడు. చేపలు పట్టడం పధాన వృత్తి. కోలాటం నేర్పడం, బట్టలుదకడం, వేట ఉపవృత్తులు. తన భార్య మరణించడంతో కోలాటం నేర్పడం మానివేసి, దిగులుతో కొన్నాళ్ళు వంటరి జీవితాన్ని గడిపాడు. తర్వాత మరలా పెళ్లి చేసుకుని ప్రస్తుతం కాలం గడుపుతున్నాడు. దాదాపు పద్దెనిమిది సంవత్స

కాలక్రితం కోలాటాన్ని విసర్జించాడు. అయినప్పటికీ అప్పుడప్పుడూ కోలాటం పాటలు పాడుకుంటూ, మననం చేసుకుంటూ ఉంటాడు. దుర్గికి దగ్గరలో ఉన్న జలాశయం (నాగార్జునసాగర్ కుడి కాల్వకు మంచికల్లువద్ద కట్టిన రిజర్వాయరు)లో చేపలు పట్టడానికి తెల్లవారు ఝామున నాల్గు గంటలకు వెళ్ళి ఉదయం తొమ్మిది గంటలకు ఇల్లు చేరుతాడు. తాను తెచ్చిన చేపలను మాచర్లలోని చేపలు కొనే కంట్రాక్టరుకు అమ్మి, ఆ డబ్బుతో తన కుటుంబాన్ని పోషిస్తున్నాడు వారానికి రెండు మూడు సార్లు కుందేళ్ల వేటకి అడవికి వెళతాడు. సాయంత్రం నాల్గుగంటలకు అడవికి వెళ్ళి, వలలుపన్ని, మాటువేసి ఉండి, రాత్రికి చిక్కిన వాటిని పట్టుకొనివచ్చి, ప్రొద్దుటే వాటిని అమ్మి తన సంపాదనను ఇనుమడింపజేసుకుంటున్న శ్రమజీవి. గ్రామంలో గుడ్డలుదకడం మరో సంపాదన. ఈయన పాటలు వింటుంటే తాళబద్ధంగా ఉంటాయి. ఉసెత్తు పాటలు పాడే సమయాన లేచి ఎగరడు కాని ఎగిరినంత హుషారుగా పాడుతాడు. చేపలకు పుట్టి (చేపలు పట్టేటప్పుడు రోతు నీళ్లలోనికి వెళ్ళేందుకు ఉపయోగించే పెద్ద బుట్ట) పై వెళ్లేటప్పుడూ, వస్తూపోతూ మార్గమధ్యంలోనూ, అడవికి వేటకు వెళ్లే సమయాల్లోను కోలాటపు పాటలు పాడుకొని తనలోతానే తన్మయత్వం చెందుతుంటా నంటాడు. అందువల్లనే పద్దెనిమిది సంవత్సరాల నుంచి కోలాటంలో నేర్చుకున్న పాటలన్నీ జ్ఞాపకం ఉన్నాయి. దురదృష్టవశాత్తు ఒక కన్ను నడి వయసులో పోయింది. ఇప్పుడు ఒక్క కంటితోనైనా తనసంపాదనకు లోటులేకుండా రాత్రింబవళ్ళు కష్టపడే మనిషి బంగారయ్య. ఇతనికి పదకొండు కోపులు వస్తాయి. 1979 లో ఇతని వద్ద విషయం సేకరించడం జరిగింది.

వెనుబి రామలింగారెడ్డి :

1979 లో ఈయనవద్ద విషయం సేకరించడం జరిగింది. నల్లగొండ జిల్లాలోని మిర్యాలగూడ తాలూకా, రాజవరం పోస్టుకుచెందిన బోయగూడెం స్వగ్రామం. బోయగూడెం నాగార్జునసాగర్‌కు ఉత్తర దిశలో దాదాపు 15 కి. మీ. దూరంలో ఉంది రెడ్డికులస్థులు. మిర్యాలగూడెం తాలూకాలోని పెద్దగూడెం గ్రామ నివాసి పిచ్చిరెడ్డి ఈయన గురువు. ఇరవైఎనిమిది సంవత్సరాల వయస్సు. ఐదో తరగతి వరకు స్వగ్రామంలోని ప్రైవేటు స్కూలులో చదివాడు. వ్యవసాయం ముఖ్యావృత్తి. కోలాటం ఉల్లాసంకొద్దీ నేర్పుతుంటాడు. కులుకుల కోలాటం నేర్చాడు. మొత్తం నాల్గుజట్లు తయారు చేశాడు.

**మందపాటి రాములు :**

గురజాల తాలూకాలోని దాచేపల్లి గ్రామనివాసి గురజాలకు పూర్వదిశలో 15 కి. మీ దూరంలో ఈ గ్రామం ఉంది తెలగ కులస్థులు నలభై నాల్గు సంవత్సరాల వయస్సు. ఐదో తరగతి వరకు దాచేపల్లిలోనే చదివాడు. వ్యవసాయం ప్రధానవృత్తి. కోలాటంమీద అభిలాషకొద్దీ దీన్ని ఉపవృత్తిగా స్వీకరించాడు. ఈతనికి పన్నెండు కొపులు వచ్చినప్పటికీ ఏడుమాత్రమే నేర్పుతుంటాడు. బలహీనంగా ఉన్నప్పటికి కోలాటం వేసే సమయంలో ఎక్కువ హుషారుతో గరిడీ వేదికమీద ఎగురుతాడు. ఇతనికి ఘనమైన కొరడా (చంద్రకోల) ఉంటుంది. నోటిలో పీక ఉంటుంది. ఉచ్చారణకు సరిపోయే మనిషి. ఇతనివద్ద విషయం సేకరించడం చాలా కష్టమైంది. 1979 లో సేకరించడం జరిగింది

**కొండం వెంకట నరసయ్య :**

గురజాల తాలూకా, పిల్లుట్ల శివారులోని మల్లవోలు గ్రామనివాసి. అయితే అన్నదమ్ముల తగవులాటవల్ల ఇంటిని, ఆస్తిని వదిలిపెట్టి ఏడెనిమిది సంవత్సరాలనుంచి పిడుగురాళ్లలో ఉంటున్నాడు. ముతరాసు కులస్థులు. వయస్సు నలభై యేడు సంవత్సరాలు గురజాల తాలూకా, పిల్లుట్లశివారు రుక్మిణీపురనివాసి ముడిమాల కోటయ్య ఈయన గురువు. ముడిమాల కొటయ్య తుమ్మపూడి దాసయ్య శిష్యుడు. తుమ్మపూడి దాసయ్యది ఒంగోలు ప్రాంతమని ప్రతీతి.

వెంకటనరసయ్య నాల్గో తరగతి వరకు చదువుకున్నాడు. ప్రధాన వృత్తి భజన, కోలాటాలు నేర్పడం. కూలి పని, సాము నేర్పడం, గుఱ్ఱపు బండి తోలడం మొదలయినవి ఉప వృత్తులు. ఇంతేగాక ఫ్లూట్ వాయించడం, నాటకాలలో వేషాలు వేయడం (ముఖ్యంగా బ్రహ్మంగారి నాటంలో బ్రహ్మంగారు, ఈశ్వరమ్మ, సిద్ధయ్య పాత్రలకు పేరు సంపాదించిన నటుడు. పౌరాణిక నాటకాలలో అర్జున, కృష్ణ, యయాతి, అంగద, అశ్వత్థామ పాత్రలు నటించడం తెలుసు) ఈయన ఇతర కార్యకలాపాలు. పల్నాటి సీమలో గొప్ప కోలాటం జట్టు నాయకుడు. ఈయన కులుకుల కోలాటం, మురళి కోలాటం, బజారు కోలాటం, దసరా కోలాటం, గోల్కొండ కోలాటం మొదలయిన ఐదు కోలాటాల పేర్లు చెప్తాడు. పల్నాటి సీమలోని గ్రామాల్లోను, ఈ సీమకు చుట్టుపట్ల గల గ్రామాల్లోను దాదాపు అరవై జట్లకు శిక్షణ ఇచ్చాడు. ఈయన పిల్లుట్ల, కామేపల్లి,

మోర్జంపాడు, మాచవరం, పిన్నెల్లి, కొత్తపాలెం, వేమవరం, యలంపల్లి, రేగుల గడ్డ, కోప్లూరు, కిష్టాపురం, రఘునాదపురం, గోపనాద్రి గూడెం, ఉంతరాల, చంద్రాజుపాలెం, పెరికపాడు, మాసాయ పాలెం, చోట పాపపాలెం, గుడిపూడి, వెల్దుర్తి, చింతలపాలెం, లింగాపురం, బ్రాహ్మణపల్లి, తుమ్మలచెరువు, ముత్యాలంపాడు, సింగరాయపాలెంతండ మొదలయిన గ్రామాల్లో జట్టులు తయారు చేశాడు ఇందులో గుంటూరు జిల్లాలోని గ్రామాలే కాక ప్రకాశం, నల్లగొండ జిల్లాల్లోని గ్రామాలు కూడా ఉన్నాయి. దాదాపు అరవై రెండు వెండి పతకాలు, రెండు బంగారు పతకాలు, ఒక వెండి తోడా (కాలికి పెట్టుకునే లయన్నర తులాల బరువు గల కడియం), ఇంకా అనేక స్టీలు సామాన్లు కోలాటం పోటీల్లో గెల్చాడు కులుకుల కోలాటానికి, భారత కోలాటానికి లాళంలో తేడా ఎట్లుం టుందో వివరంగా చెప్పిన మేటి గర్వం కనిపించని ఆదర్శ శిల్పి. సేకరణలో బాగా సహకరించాడు. 1979 లో విషయం కోసం దాదాపు అరవై ఐదు రోజులు పరిశీలించడం జరిగింది.

**బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు :**

మాచర్లకు ఈశాన్యదిశలో ఇరవై కిలోమీటర్ల దూరంలో ఉన్న శ్రీగిరి పాడు గ్రామవాస్తవ్యుడు. తొగట కులస్థులు. వయస్సు యాభై రెండు సంవత్స రాలు ఉంటుంది. శ్రీగిరి పాటిలోనే మూడో తరగతి వరకు చదివాడు. ప్రధాన వృత్తి వ్యవసాయం. కోలాటం నేర్పడం ఉప వృత్తి మాత్రమే. ఈయన మొదట పాటలు చెప్పడానికి కొంత బిడియ పడ్డాడు. అయితే తర్వాత రాసుకోవడానికి అనుకూలంగా చెప్పాడు. 1979 లో ఈయన వద్ద విషయం సేకరించడం జరిగింది పాడుతుంటే బజారువెంట పోయేజనం గుమిగూడారు. చక్కని కంఠ స్వరం. మంచి మాటకారి. ఈయన నేర్చిన కోలాటం పేరు గోల్కొండ కోలాటం అంటాడు. ఇందులో ఆరు కోపులుమాత్రమే ఉన్నాయి. ఇంతవరకే నేర్పు తుంటాడు. మొత్తం శ్రీగిరిపాడులోనే మూడు జట్టులు తయారు చేశాడు. వ్యవ సాయం పనులతో తీరక కోలాటం నేర్పడం ప్రస్తుతం పూర్తిగా వదలివేశాడు.

**జక్కుల వెంకయ్య :**

కారెంపూడికి ఆగ్నేయదిశలో 4 కి. మీ. దూరంలో ఉన్న గాదెవారిపల్లె ఇతని జన్మస్థలం. బోయకులస్థులు. వయస్సు నలభై రెండు సంవత్సరాలుంటుంది. ఇతని గురువు పోలెపల్లివాసి వెంకటేశ్వర్లు పోలేపల్లి మాచర్లకు తూర్పుదిక్కుగా

5 కి. మీ. దూరంలో ఉంటుంది. ఈయన మూడో తరగతివరకు చదువుకున్నాడు. ప్రధానవృత్తి వ్యవసాయం. ఉపవృత్తిగా మాత్రమే కోలాటం నేర్పడాన్ని ఎన్నుకున్నాడు. దాదాపు పది సంవత్సరాలనుంచి కోలాటం శిక్షణ ఇస్తున్నాడు. పన్నెడు కోపులు తెలుసు. దాదాపు పది జట్లకు శిక్షణ ఇచ్చాడు. ఈతనికి బ్రాహ్మణపల్లిలో వెండి పతకం, మండాదిలో వెండికప్పు బహుమతులుగా లభించాయి. 1979 ఈయనవద్ద విషయం సేకరించడం జరిగింది.

**పెంకుర్తి శివయ్య :**

మాచర్లకు నైఋతి దిశలో 4. కి. మీ. దూరంలో ఉన్న రాయవరం ఇతని నివాసస్థలం. ఎరుకల కులస్థులు. వయస్సు నలభైరెండు సంవత్సరాలు. ఐదో తరగతి వరకు చదివాడు. ప్రధానవృత్తి కోలాటం నేర్పడం. ఉపవృత్తి కూలి. భారత కోలాటంలోని పది కోపులు తెలుసు. పది సంవత్సరాల శిక్షణానుభవం ఉంది. దాదాపు ఇరవై జట్టులు తయారు చేశాడు. కోలాటం వేసేటప్పుడు డప్పు తీసికొని చాలా ఎత్తుకు ఎగురుతూ ఆడుతాడు. తాళానికనుకూలంగా తప్పెట వాయిస్తూ భలే హుషారుగా ఎగిరి జనాన్ని ఉల్లాస పరుస్తాడు. సన్నగా ఉంటాడు. పెద్ద ఉంగరాల జుట్టు అందంగా ఉంటుంది. శివయ్య కోలాటం జట్టు నాయకునికి బాగా సరిపోయే మనిషి. 1979 లో ఈయనవద్ద విషయం సేకరించటం జరిగింది.

**జాష్టి సీతారామయ్య :**

కారెంపూడికి ఆగ్నేయ దిశలో 4 కి. మీ. దూరానగల గాదెవారిపల్లె ఈతని జన్మస్థలం. తెలగకులస్థులు. వయస్సు ముప్పైఏడు సంవత్సరాలు ఉంటుంది. మాచర్లకు తూర్పుదిక్కుగా 5 కి. మీ. దూరంలో గల పోలేపల్లి నివాసి వెంకటేశ్వర్లు ఈయన గురువు. మూడో తరగతివరకు చదివాడు. వ్యవసాయం ప్రధాన వృత్తి. కోలాటం నేర్పడం ఉపవృత్తి. దాదాపు పన్నెండు సంవత్సరాల శిక్షణానుభవం ఉంది. ఎక్కువ జట్టులు తయారు చేశాడు. కొనకలమిట్లలో వెండి పతకం, చినగార్లపాడు, రుద్రపాడు, విజయవాడల్లో వెండి పతకాలు, ఎర్రగుంటపాడులో వెండిగంట, గాదెవారిపల్లెలో వెండికప్పు, పెదకూరపాడులో మెరిట్ సర్టిఫికెట్టు మొదలయిన బహుమతులు సంపాదించాడు. తనకు తగ్గట్లు నేర్పుతూనే శిష్యసముదాయాన్ని పెంచుకుంటున్నాడు. 1978 లో ఈయన వద్ద విషయం సేకరించడం జరిగింది.

తోట హనుమయ్య :

మాచర్లకు నైఋతి దిశగా 15 కి. మీ. దూరంలో ఉన్న గుండ్లపాడు గ్రామనివాసి. పెరిక కులస్థులు. వయస్సు నలభై సంవత్సరాలుంటుంది. నిరక్షరాస్యుడు. ప్రధాన వృత్తి వ్యవసాయం. ఉపవృత్తి కోలాటం నేర్పడం. ఈయన నేర్చిన కోలాటాన్ని నాటుకోలాటం అంటున్నాడు. గుండ్లపాడులో మొత్తం మూడు జట్లు తయారు చేశాడు. 1978 లో ఈయనవద్ద విషయం సేకరించడం జరిగింది. ఈయనకు పన్నెండు కోపులు వస్తాయి. తన గ్రామజట్టుల తోటే పండగ పబ్బాలకు, తిరుణాల సమయాల్లో పక్క గ్రామాలకు వెళ్లి కోలాటం వేయిస్తుంటాడు.

ప్రకృత పరిశోధనకు నూటఇరవైఐదు కోలాటం పాటలు, ఎన్నుకున్న పదకొండు కేంద్రాల్లో పన్నెండు మంది జట్టు నాయకుల నుంచి సేకరించడం జరిగింది. పై జట్టు నాయకులు పల్నాటిసీమలోనే కాక ఇతర ప్రాంతాలకు కూడా వెళ్లి కోలాటం నేర్పి, జట్లు తయారు చేసి ఉత్సవాలకు పోటీకై తీసుకెళ్లతుంటారు. వీరిలో ఏడుగురు వెనుకబడిన తరగతుల కులాలకు చెందిన వారు. ఒకరు షెడ్యూల్డు కులాలకు, మరొకరు షెడ్యూల్డు తెగలకు, ముగ్గురు అగ్రకులాలకు చెందినవారు. ఇరవైయారు సంవత్సరాలనుంచి ఎనభైయయిదు సంవత్సరాల వయసు ఉన్నవాళ్లు ఉన్నారు. వీరిలో పెద్దగా చదువుకున్న వాళ్లు లేరు. ఉచ్చారణలో గాని, పాడే తీరులోగాని, ఇతరవిషయాల్లో గాని చదివిన వారికి, చదవని వారికి పెద్ద తేడా. కన్పించదు. సంతకం చేయడం మాత్రమే చదువుకున్నట్లు ప్రత్యేకంగా తేడా కోలాటం నేర్పడమే ప్రధానవృత్తిగా జీవిస్తున్నవారు ముగ్గురు. తక్కిన వారంతా కోలాటాన్ని ఉపవృత్తిగానే స్వీకరిస్తున్నారు. కోలాటంతో పాటు సాము, భజన, నాటకాలు వేయడం నేర్చిన జట్టు నాయకులు న్నారు. వ్యవసాయం చేసే కృషీవలులూ ఉన్నారు. వేటాడే వేటగాళ్ల ఉన్నారు. అయితే అందరికీ కోలాటం మీదే మక్కువ ఎక్కువ. గెల్చిన బహుమతులు పతకాలయితే ప్రదర్శన రోజున మెడలో లేదా చొక్కాకు చుట్టూ పిన్నీసులతో కట్టుకొని అలంకరించుకుంటారు. విషయ సేకరణలో కొందరు చాలా ఇబ్బంది పెట్టినప్పటికీ విసిగించి చివరకు విసుగుకొని సహకరించారు. కొందరు చాలా మర్యాదను ప్రకటిస్తూ వారి విషయాన్ని తెలిపారు.

# ఆలోకనం

ప్రకృత పరిశోధనకు పల్నాటి సీమలో పదకొండు గ్రామాలను పర్యటన కేంద్రాలుగా ఎన్నుకొని, ఈ కేంద్రాల వాస్తవ్యులైన కోలాట కళాకారుల నుంచి కోలాటానికి సంబంధించిన సకల విషయాలు సేకరించడం జరిగింది. కోలాటం పద వ్యాప్తి, వ్యుత్పత్తులను గురించీ, పర్యాయ వాచకాలు, రూపాంతరాలు, ఆడే పద్ధతి, అందులో గమనించదగ్గ ప్రత్యంశమూ విపులంగా చర్చించబడింది. పురా వస్తు నిర్మాణాలు, సాహిత్యం, చారిత్రకుల ఉద్ధరణలు మొదలయిన ప్రాచీన ఆకరాల్లో కోలాటం ప్రసక్తి ఎట్లా కన్పిస్తుందో చర్చించబడింది. ఇంతేగాక ఇతర సీమల్లో కన్పించే కుమ్మి, జట్టి జాము, గర్బా, దండియారాస, రాస నృత్యాలు, ఘోరియా,భాంగ్రా, కధీ,మొర్రిస్ మొదలైన నృత్యాలకూ కోలాటానికీ కన్పించే తుల్యమైన అంశాలను గురించి పేర్కొనడం జరిగింది. జానపద విజ్ఞానాన్ని వాక్సహిత కళలు (**Verbal arts**), వాగ్రహిత కళలు (**Non-Verbal arts**), మిశ్ర కళలు (**Mixed arts**) అని మూడు రకాలుగా నూతనంగా విభజించడం జరిగింది. అందులో కోలాటం మిశ్ర కళా విభాగానికి చెందిన తీరు విపులంగా చెప్పబడింది. ఈ పరిశోధనకు ముఖ్య కేంద్రంగా తీసుకున్న పల్నాటి సీమ నైసర్గిక స్థితిని కూలంకషంగా వివరించడం జరిగింది. ఈ సీమలోని ప్రజల్లో కళాభిలాష ఎట్లా ఉంటుందో, కోలాటాన్ని వారు ఎట్లా ఆదరిస్తారో సూచించబడింది. ఈ సీమలో విస్తృత ప్రచారాన్ని పొందిన కోలాటంలోని రకాలు, వాటిలోని కోపులు, ఆయా కోపులు తిరిగే పద్ధతి, చిత్రాలతో సహా సవివరంగా నిరూపించబడింది. ఈ కోలాటంలో పాడే పాటల్ని దాదాపు 125 సేకరించడం జరిగింది. వాటిని వర్గీకరించి అనువర్ణించిన తీరు ఇందులో పరిశీలనార్హం. సేకరించిన పాటల్లో కన్పించే సామాజిక పరిస్థితులు సోదాహరణంగా రూపించబడ్డాయి. మతాలు, కులాలు, కళలు, సంస్కృతి, వృత్తులు, ఉపవృత్తులు

మొదలనవన్నీ ఇందులో విశ్లేషించబడ్డాయి. పల్నాటి సీమ పూర్తిగా వెనుకబడిన ప్రదేశం కాబట్టి ఈ పాటల్లో భాషా విలక్షణతలు ఎక్కువగా కన్పిస్తాయి. అందులో శబ్దవిపరిణామాలు, సంధులు, సమాసాలు, వింతరూపాలు, క్రియానిర్మాణాలు మొదలయిన విశేషాలను వీలైనంత విపులంగా చర్చించడం జరిగింది.

ఈ పరిశోధనకు మూల విరాట్టులైన కోలాటం కళాకారుల నేపథ్యంలో వారి కులమతాలు, తిండితిప్పలు, పనిపాటులు, కష్టసుఖాలు, చదువుసంధ్యలు, వృత్తులు, జీవన విధానం మొదలయిన విషయాలు విపులంగా వివరించడం జరిగింది. ఈ పరిశోధనకు సేకరించిన పాటలు అనుబంధంలో ప్రదర్శించబడ్డాయి.

## 1. అదిగో సూడు మంచి బొద్దులు

(పాడినవారు : ఘుక్కైన బంగారయ్య)

అదిగో సూడు మంచి బొద్దులు దొడిగింది
కాంబోజి కాంబోజి అద్దాలు దొడిగింది
ఏడాది నావద్ద కిరీట మందిండి
పచ్చ మారాటీలు పచ్చ మారాటీలు
పారు టాకుల సీరె పచ్చంగ కట్టింది
పాపా యేవూరి దానావే?
సెంచీతా యేవూరి దానావే?
ఆఁ . . ఏ వూరు వైతేమి
యేమిరా మొగవాడ!
వేట కొచ్చినాను సిన్నయ్యా!
పోవయ్య పోవయ్య మొగవాడా
నీకు పొద్దేద బోలేదు మొగవాడా
మావోరు వత్తేను సిన్నయ్యా
నిన్ను యీటెనే యేసేరు సిన్నయ్యా
నిన్ను బల్లేన బొడిసేరు సిన్నయ్యా
నిన్ను బాకునా యేసేరు సిన్నయ్యా
నీకు పొద్దేడ బోలేదు మొగవాడా
శ్రీ కిట్ట మూరితినె సెంచీతా
నను బెండ్లియాడవే సెంచీతా
నీకు బొవ్వున్నెముంటదే సెంచీత
నను పెండ్లి యాడవే సెంచీత

## 2. అనంతరంగం సిరి వైకుంటం

(పాడినవారు : మందపాటి రాములు)

అనంత రంగం సిరి వైకుంటం-
 రాజై మంతయు రాంభజనా

ఏమిర నరుడా జాగము సేసెవు
నవ్వులు గాదిది రాంభజనా !
తలగుడ్డలు మీరు తియ్యండీ
తల వంచీ భజనలు సెయ్యండీ ! ॥ఏమిర॥
వలె వాటులు మీరు తియ్యండీ
వళ్ళొంచీ భజనలు సెయ్యండీ! ॥ఏమిర॥
మదము పట్టి పెద్దెనుగు లావయి
మరిసితి వంటోయ్ రాంభజనా ! ॥ఏమిర॥
నడుముకు దట్టీల్ కట్టండీ
నడుమొంచీ భజనలు సెయ్యండీ! ॥ఏమిర॥
అనంత రంగం సీరి వైకుంటం
రాజ్జెమంతయు రాంభజనా ॥ఏమిర॥

## 3. అన్నయో గారడీ

(పాడినవారు : మక్కెన బంగారయ్య)

అన్నయో గారడీ
ఒల్ అన్నయో గారడీ
పారి పొయ్యే పాముల బట్టి
పట్టి తెచ్చిన గారడీ
అన్నయో గారడీ
ఒల్ - అన్నయో గారడీ

## 4. అన్నా యేడవకురా

(పాడినవారు 1. పొంనరసింహదాసు. 2. చెప్పాలచెన్నయ్యా 3. మక్కెన బంగారయ్యా. 4. కొండం వెంకటనర్సయ్యా. 5. తోట హనుమయ్యా.)

అన్నా యేడవకూరా - లవ్వన్నా యేడవకూరా
అయోజ్జా బాలకుడా - మా తండ్రి యేడవకూరా
ఏడవకూ యేడవకూ - యెండ్రిమా లవ్వన్నా
ఏడిస్తే నీ కనులూ - నీలాలూ[1] గారునూ ॥అన్నా॥

ఒకరాత్రి వొకపగులూ - పొన్నామానుకిందా కొడకా
ఒంటొంటి బతుకాయె - వోసందామామయ్యో[2].
నెత్తినా కిరీటమన్నా - నెలవొంకా నామము కొడక
నువ్వుండేది పూరడిమి - నుప్పండేదే కారమిడి[3].
బాలా యేడవకూ పుత్రా - గోలా యేడవకూ యమర్త
పిన తండ్రీ లచ్మనుడు - వచ్చే యేడవకూరా ॥అన్నా॥

---

1. నీరు. 2. యింటుంటే బతకామూ - వోసందమామయ్యో (పా.,వె చె)
3. వాలు గన్నొక పూలు వరసన సిగజుట్టి
బంగారు టుయ్యాలలో పవ్వళించెదరావోయీ
ఇందరిలోపల నీకూ యెవ్వరు గావలెనన్నా
లలితాంగి రుప్పినీలలనా నీకేగావలెనా (అ.చ.,చె.చె.)
4. మీ తండ్రీ రామయ్యా యిల్లుయిరిసి పెళ్ళియాడే
యిల్లుయిరిసి పెళ్ళియాడీ - ననుమరిసీ అడిమికంపె ॥అన్నా॥
మీ తాత దశరధుడు - నీ మీనా దయదప్పె
మీ యవ్వా సుమిత్రా - నీ మీనా దయదప్పె
నీ బాబాయ్ లచ్మయ్యా- నీ మీనా దయదప్పె ॥అన్నా॥ (అ.చ.,కొ.వెం)

## 5. అన్నా బ్రెమ్మపట్నము

(పాడినవారు : చెప్పాల చెన్నయ్య)

అన్నా బ్రెమ్మ పట్నము పోదమంటే
సీకటేమిర అన్నయా
ఓంకార మయినా సమురు దీసి
దియ్యె[1] బెట్టవె సెల్లెలా
సెల్లెలా మా తల్లివే
సిత్తమున మే నాత్తవే
అత్తకొడుకుకు పిల్లనిత్తే
ఆదిగ్గేనమే[2] సెల్లెలా
అన్నా బ్రెమ్మ ప్రట్నము పోదమంటే
అడుము లడ్డామన్నయో
గురుమంత్రమయినా గొడ్డలెత్తి
అడిమి నరకవే సెల్లెలా
అడిమి నరికితే ఐదుపులు
లాడడ్డమొచ్చే రన్నయా
ఐదు పులులకు ఐదు మేకలు
ఆర మివ్వవే[3] సెల్లెలా
అన్నా బ్రెమ్మపట్నము పోదమంటే
యేరులడ్డా మన్నయో
గురు మంత్రమయినా పటువు జేసి[4]
పడవ నడపవే సెల్లెలా
పడవ నడిపెటి బెస్తబోయెడు
లేడు గదురా అన్నయా

---

1. దివ్వె, 2. జ్ఞానము, 3. ఆహారము, 4. ప్రరన జేసి.

సూటిగను సుక్కాని పట్టి
పడవ నడపవే సెల్లెలా
నిన్ను జూద్దాపన్న రాతిరి
నిదురొత్తుం దన్నయా
నిద్రలోనే మేలుకోనీ
నన్ను జూడవే సెల్లెలా

## 6. అంబ నీకు యిదిగో మంగళం

(పాడినవారు : చెప్పాల చెన్నయ్య)

అంబ నీకు యిదిగో మంగళం
శంబూని[1] రానీ దేవినీకు
యిదిగో మంగళం
పంచ వన్నెల పళ్ళెరములో
ఆరంజోతి[2] యెలిగించి
పంచె పూజలాను జేతు
పలుకవే శారదాంబ తల్లి
అంబ నీకు యిదిగో మంగళం
శంబోని రానీ దేవినీకు
యిదిగో మంగళం
అడ్డగొండ మీదయున్న
అందామైన యీశ్వెరమ్మ[3]
ముందుగా నీకు పూజసేతు
ముత్తీ[4] తెల్పవేమో తల్లి
అంబనీకు యిదిగో మంగళం
శంబూని రానీ దేవి నీకు
యిదిగో మంగళం

---

1. శంభుని. 2. అరుంధతి. 3. ఈశ్వరి. 4. ముక్తి.

## 7. అమ్మా నేను సిన్నదాన్ని

(పాడినవారు : నెమలి రామలింగారెడ్డి)

అమ్మా నేను సిన్నదాన్ని
అల్లుడొత్తె తోలబాకు
ఊళ్ళో దుడ్డులు[1] సల్లగుంటేనే
ఓయమ్మా నేను సిల్లరప్పులు దొర్లా గొడుదూనే
నీకూ జూడ సిన్నదాన్ని
నిమ్మకాయల రొమ్ముదాన్ని
తమలపాకు నడుము దాన్నిరా
చెల్ ! మల్లెల చెన్నా
తగులు కుంటే వదలజాలరా
కంచీ మేకల పాలూ బోసీ
పెంచుకుంటి నాదీ కురులు
ఒక్క నాటి వలపులాకూ
చెల్ ! మల్లెల చెన్నా !
పక్కనేసీ మాపు కొంటిరా
మేకాలాకు మేపే లేదు
నేను తిరగని బూమిలేదు
కొత్తకుంట కోపు[2]లోనేరా
చెల్ ! మల్లెల చెన్నా !
కొంగు పరవని సోపే లేదురా
కట్టకింద వంటి మోటా
వంటి మోటకు దండకర్ర
దండకర్రెద్దుకు గంటలేదురా
చెల్! మల్లెలచెన్నా!
దండక్రకర్రెద్దుకు గంటలేదురా

---

1. ఒకరకం రాగి నాణెం. 2. వానవల్ల నేలకు ఏర్పడిన స్థితి.

బొక్కెనే[1]మో బాలో[2] పోయె
తొండమే[3]మొ తాసి[4]పోయె
ముడిసే యేతరి[5] జాతర బోయెరా
చెల్! మల్లెలచెన్నా!
ఏతరి పెళ్ళం మిండల మరిగేరా.

## 8. అరమరలును దాటి అయోజ్జకును జేరి

(పాడినవారు : చెప్పాల చెన్నయ్య)

అరమరలును దాటి అయోజ్జకును జేరి
అమ్మతో యేమందురా
లచ్మనా అమ్మతో యేమందురా!
వొదినె కోసమూ వచ్చి - వారిది[6] బందించి
వొరిగిపోతివా తమ్ముడా
లచ్మనా వొరిగిపోతివా తమ్ముడా!
అయ్యో వుప్పుకొసము వచ్చి - కప్పురము యిడనాడి
కపులార నేనేమి సేతూ
అయ్యో కపులార నేనేమి సేతూ!
పణతి కోసమువచ్చి - పగదంబు దోగొట్టి
కపులార నేనేమి సేతూ!
అయ్యో కపులార నేనేమి సేతూ
నీ సతి వురిమెళ్ళ[7] నా పతి యేడంటే
ఏడంటే యేమందునూ
లచ్మనా యేడంటే యేమందునూ!

---

1. **Bucket.** ఏతాముకువాడే పెద్ద బక్కెట్టు. 2. బావి. 3. ఏతాము బొక్కెనకుకట్టే తోలుతిత్తి. 4. తడిసి. 5. ఏతాము తోలేరైతు ఏతరి. 6 వారధి. 7. ఊర్మిళ.

లచ్చ[1] గొడుగుల కింద - రంజిల్లుకుంటనే
వత్తున్నాడని సెప్పేవా
లచ్మనా వత్తున్నాడని సెప్పేదా!
అంతలో తన బంటు జాంబమంతుడువచ్చి
రామయ్యా దుక్కా మేమిటి సామీ!
అసుమంతు[2] గునమెంతొ అతని సాయసమెంతో[3]
ఆపదలు గడపవయ్యా
అనుమంతు ఆపదలు గడపవయ్యా!
జంగు జంగున మూడు జంగాల్బెట్టుక
పరపతము[4] గట్టెక్కెను
అనుమయ్యా పరవతము గట్టెక్కెను!
పరవతము గట్టుపై సంజీవి గనలేక
బరికి సంకన బెట్టెనూ
అనుమయ్యా బరికి సంకన బెట్టెనూ!
సూరియుండు[5] మనపై సుగపగలు తలిసెనని
రాంబాన మ్రొక్కు పెట్టెను
రామయ్యా రాంబాన మ్రొక్కు పెట్టెను!
అయ్యో సూరియుండు గాడయ సుగ్రీవుడనుమంతు
సంజీవి తెత్తు న్నడూ
రామయ్యా! సంజీవి తెత్తున్నడూ!
సంజీవి దెచ్చియు సవుమిత్రి[6] కియ్యంగ
సరితోడు లేసునయ్యా
తమ్ముడు సరితోడు లేసునయ్యా!
హరహరా నేనెంతో అన్న పాచములపై
అలిసి నిద్దర బోతిని
శరనమ్మ సీతమ్మ శరనమ్మ రామయ్య
శరనూ సీతాపతికి

---

1. లక్ష, 2. హనుమంత. 3. సాహసము. 4. పర్వతము.
5. సూర్యుడు. 6. సౌమిత్రి.

శరనన్నవారికి మరనమెన్నటికయిన
మరనమే లేదురా
తమ్ముడూ మరనమే లేదురా!

## 9. అలివేల్మంగమ్మగారు

పాడినవారు : చెప్పాల చెన్నయ్య

అలివేల్మంగమ్మగారు ఆదిలచ్చివమ్మగారు
పట్టు సీరె లంపరమ్మ సెంచువారికి
పట్టు సీరె లేలనమ్మ
పారుటాకులుండంగ
పట్టు సీరె లేలనమ్మ
పారుటాకు లుండంగ

పట్టు సీరె లేలనమ్మ పారుటాకు లుండంగ
సెట్టు కింద వోలలాడె సెంచువారికి
అలివేల్మంగమ్మగారు ఆదిలచ్చివమ్మగారు
సన్న బియ్యమంపరమ్మ సెంచువారికి
సన్నబియ్య మేలనమ్మ
ఎదురు బియ్యముండంగ
సన్న బియ్యమేల నమ్మ
ఎదురు బియ్యముండంగ

సన్నబియ్యమేలనమ్మ ఎదురు బియ్యముండంగ
సెట్టు కింద వోలలాడె సెంచువారికి

## 10. అస్తమించె గాంది దేవుడు

(పాడినవారు : 1. చౌలనరసింహదాసు. 2. చెప్పాల చెన్నయ్య. 3. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు. 4. కొండం వెంకటనర్సయ్య. 5. మక్కెన బంగారయ్య.)

అస్తమించె గాంధి దేమ
దస్తమించెనూ - నేడస్తమించెనూ
దుత్తిరంబు దుక్కతనము
లావరించెనూ మనల[1]
డిల్లీల్లాల్ ఖిల్లాపైన
జెండవాలెనూ - కాంగ్రెసు జెండవాలెనూ[2]
ఘాత చరితుడైన బాపూజీ
కూలిపోయెనూ నేడు[3]
వల్లభాయిపటేల్ గుండె
తల్లడిల్లెరా నేడూ
కూలిపోయె మహామారి
కూలిపోయెనూ - నేడు కూలిపోయెనూ[4]

---

1 దుస్తిరంబు దుక్క సమరము
ఆవరించెనోయి నేడు (పారాం., ఏ. వెం.)

2. గిరుల బవన మకటకట
చీతిలేకనో గాంధితాత లేకనో
యుగపురుసుడయిన బోసు
సేతులుడిగెనోయి నేడు. (అ. చ., బొ. వెం.)

3. పూత చరితు డయిన రాందాసు
చీతి సెందెనో మోహన
సితిని కనుల జూసి నెవరూ.
సేతలుడిగెనూ - నీగాతపోయెనూ.
(అ.చ.,కొం.వెం,చె చె.)

4. మూగబోయినా మారి
మూగబోయెనూ - నేడు యేగిపోయెనో
ఈ లోకం మీద నాడి నేడు
యెడలిపోయెనోయి నేడు (అ.చ ,బొ.వెం.)

కూళ్ళనాదుడా గాడ్నే
　　కూల్చివేసెనూ తాతను[1] ॥అ స్త॥ (చౌ. దా.)

## 11. ఆంనేయ నిర్మల కాయ

(పాడినవారు : చౌల నరసింహదాసు)

ఆంజనేయ నిర్మాల కాయా
　　అకిల లోక పూజితాయా
ఆ ర్తజన వితాస రచ్చయా[2]
　　వీరాంజనేయా
బ త్తి[3] స్ప్రంగారములతోటి
　　పట్టిన కులుకు యీ కోలన్నా
ర క్తి గలుగు నటులు జూడుమా
　　రామాంజనేయా

---

1. పున్నెమయిన వేదిలోప
　　పూజనాచ్చనా నీ పున్నె టేజన (అ.చ.,చె.చె.)
పున్నెమవృత్రి వేణీలోగా
　　పూజా అస్తులో హా - యిబూడి గల్చెరో (అ.చ.,కొం.వెం.)
గనమైన గంగానడిలో
　　కలసిపోయెనా తాత (అ.చ.,చె చె.)
కన్నెయయిన గంగా దేవి
　　కవిలి పోయెనో జీవికి
బారతీయుల ప్రేమబలము
　　బావమేమిరా నీటేజషేమిరా
బారతీయుల ప్రేమ బలము
మారిపోయెనూ బాపుకు - మారిపోయెనూ (అ.చ.,కొం.వెం.)
2. రక్ష. 3. భ క్తి.

ఏకైక యీరూడావు
లోకాబి వందితుడావు
ఏ కారణ యెత్తావయితివిగా
శ్రీ[1] యాంజనేయా
ఆజంనేయా నిర్మలకాయా
అకిలలోక పూజితాయా
ఆర్తజన పితాన రచ్చయా[2]
ఏరాంజనేయా.

## 12. ఆంద్రుడ రావయ్య పోట్ల బూదెయ్య

(పాడినవారు : కొండం వెంకట నర్సయ్య)

ఆంద్రుడ[3] రావయ్య పోట్ల బూదెయ్య[4]
ఆంద్రులాకు అమర జీవి
సిన్నలాకు యమర జీవి
పెద్దలాకు యమర జీవి
ఆంద్ర మాత తనయుడావు
ఆశ లేమొ దీర్చి నావా
ఎర్రగొండకు ఉత్తర వయిపున
ఉక్కువంటి జూలకల్లు
ఉక్కూవంటి జూలకల్లూ
ఉద్దరించిన[5] బూదెయ్య నాయనా
ఊరీకి దచ్చిన[6] వయిపున
సిన్న సెరువు కట్ట కింద

1. శ్రీ. 2. రక్ష 3. ఆంధ్రుడ.
4. పోట్ల భూదేవయ్య గురజాల జాలుకా, జూలకల్లు గ్రామ కాపురస్తుడు. కమ్మ కులానికి చెందినవాడు. గ్రామపెద్ద. గ్రామంలోని అంతః కలహాలవల్ల చంపబడ్డాడనీ, ఆ సమయంలో ఒక మసీదు కట్టిస్తున్నాడనీ (దాదాపు 30 సం॥ క్రితం) ప్రచారంలో ఉంది. 5. ఉద్ధరించు. 6. దక్షిణ.

మసీదన్నా తీరకపోయె
నీ పేరు మాసిపోయే
లోటి వారి మాటలు యిని
మోసపోయినావు తండ్రీ
మోసపోయి నీదు పేనం[1]
సేతి కిచ్చి నావు నాయనా
ఊరికి వుత్తర వయిపున
పందిరి పాలెం బాయికాడ[2]
పంద్రీ పాలెం బాయి కాడా
ముట్టడేసి నారు నాయనా
మంగళోరం పదిగంటలాకు
మాయదారు కారూవచ్చే
మాయదారూ కారూవచ్చే
కారును నిలయేసినారా
డయివర్నె[3] సెయిబట్టి లాగియేసి
వీపెలెయ్యగ జూసినారా
బర్సెలెయ్యగ జూసినారా
ఈపెలెయ్యంగ జూపినాయనా
ఎగరేసి పొడసినారా
పెద్ద పెద్ద లందరుగూడి
ఆనగ[4] చొక్క జూసినారా
నీదు కోర్కెదీర్చనేమో
కొండ మెంకట నర్సయ్యగారు
కయి[5] జేసినారు నాయినా
కయి జేసినారు నాయినా ॥ఆంధ్రుడు॥

---

1. ప్రాణం. 2. బావి. 3. డ్రైవర్. 4. అణగ. 5. కవి.

## 13. ఆకులమ్మా ఆకులు

(పాడినవారు : పాలకుర్తి శివయ్య)

ఆకులమ్మా ఆకులూ శివరామపూరి కవుటాకులు
కాడసన్నము కారపాకులు కానీకి[1] మూడాకులు
నల్లగొండకు తూరుపెత్తున నల్లతీగేటాకులూ
కన్నతల్లులార వినుడి సిన్నతొడిమా పాకులు
నందికొండ[2]కు పడమరెత్తున నల్లతీగటాకులూ
అక్కడుండే బీదసాదకు తాంబూలాలియకులు. ॥ఆకులమ్మా॥

## 14. ఆకులో పాకులో

(పాడినవారు : చెప్పాల చెన్నయ్య)

ఆకులో పాకులో
మైదారు పల్లె కొచ్చిన జోరాకులో
లబో లబో లబు జనకా
మొగుడెనకా వొకనడకా
మొగుడి ముందు వొకనడక
కనకల గజ్జో
నీ కంట్లో నాలంజొడకే
బోగము[3] రత్తే ॥ఆకులో॥
బీది మురుగులదానా
లబ్బరి గాజుల[4] దానా
బంగారి[5] మురుగులకి
బాగనే[6] మరిగావే ॥లబో లబో॥

---

1. కాణి. అణాలో నాల్గోవంతు నాణెం. రూపాయలో అరవై నాల్గోవంతు.
2. నాగార్జున సాగర్ ప్రాంతానికి ప్రాచీననామం. 3. భోగం. 4. రబ్బరు గాజులు. 5. బంగారం. 6. బాగుగ.

పుల్లలకు నేబోతే
పిలగాడు బద్దరమే[1]
నీ కడ్డ మొత్తేను
పొయి కడ్డమేయవే ॥అబో అబో॥

## 15. ఆటాలాడిరే కుశలవులు

(పాడినవారు : చౌలనరసింహదాసు)

ఆటా లాడిరీ కుశలవు లాటాలాడిరి నాయనా
వాటముగను కొనగోట మీటుసును
సూటి తప్పక మేటిగ కుశలవు
లాటాలాడిరీ నాయనా ఆటాలాడిరి
గగనమునకు సెండ్లెగరవేయగా
మేటిగ కుశలవు లాటాలాడిరీ నాయనా
దగదగమని కంకణములు మెరియగ
సూటి దప్పక మేటిగ కుశలవుల్
ఆటాలాడిరీ కుశలవులాటాలాడిరీ నాయనా

## 16. ఆహా యిదేమదీ

(పాడినవారు : కొండం వెంకట నర్సయ్య)

ఆహా యిదేమదీ
ఆచ్చెరియ మయినదో
ఆ సుందరాంగియొ
ఆ సుదతి[2] యెవతిరా
నాసిత్తమెల్ల[3] నెవరు
సేయు సున్నదిచ్చట ॥ఆహా॥

---

1. భద్రము. 2. సుదతి. 3. చిత్తము

ఆహా అబ్బురంబుగా
దాని గబ్బిగుబ్బాలు
అట్లా గదిమిపట్టి
నాక్కేవరకు ఐతేపోయెను
ఆహా! దాసపోసక[1]
వేలూరి వాసక
ఆహా దాసపోస జగ్గయ్యపేట
కయిని బోవరా[2] ॥ఆహా॥

## 17. ఆహా నిండపారీతీవి (గుండ్లకమ్మపాట)

(పాడినవారు :- 1. చౌలసరసింహదాసు 2. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు.
3. చెప్పాల చెన్నయ్య. 4. మక్కెన బంగారయ్య.)

ఆహా నిండీ పారీతీవి నురుగూలు గమ్మసూ
ఎంతో శౌరియము గుళ్ళకమ్మా
ఆహా దండీగ మాతల్లి నిండీ పారీతీవి
ఎంతో శౌరియము గుళ్ళకమ్మా
ఆహా సల్లమలలో పుట్టి కొండగూహాలు దాటి
కంబం సెరువ్వా[3] జేశెనావా
సెరువు అలుగూను జూసుకున్నావా
సన్నజాలుగా పారుసున్నావా
ఆహారాను రాను నినుజూడ సిరుగుండె బడుసుండె
ఎంతో శౌరియము గుళ్ళకమ్మా
ఆహా యిచ్చల యిడీ[4]గాను గజ్జెల కొండాదాటి
అయినేలు[5] జేరొచ్చినావా
అల్లయినకొండ[6] యిడిపించినావా
డిజను[7] అద్దంకి జేరొచ్చినావా

---

1. పోషక. 2. కవిని బ్రోవరా. 3. కంభం చెరువు. 4. విచ్చలవిడి.
5. అయినవోలు. 6. వినుకొండ. 7. డివిజన్.

ఆహా మేల్గాను బవనాసి కాల్త్రైపారీతివి
ఎంతో శౌరియము గుళ్ళకమ్మా
ఆహా దంటీ కాల్వాలన్నీ నిండి పుక్కిటబట్టి
ఉండలేనని పారినావా
నీవు పురమితే పుప్పొంగినావా
నీవు మెరిసీతే మేటెంచినావా
ఆహా సిత్తా సాతీ[1]లోనె పంతంబు నీకేల
ఎంతో శౌరియము గుళ్ళకమ్మా
ఆహా యింద్రాప యింద్రులు పట్నంలో నిను బిల్వ
యిష్టం లేదని యెల్లినావా[2]
తెప్ప తిరనాలె యిస్టమన్నావా
సుడితెప్పాల సుడి దిరిగినావా
ఆహా ఎంతో శౌరియము గుళ్ళకమ్మా
ఆహా సూటిగ మేటి బుజ్జాలపైన[3]
ఆటలాడుసు యెల్లినావా
మేకపోతులు బలిగోరినావా[4]
సీరె రౌకలె యిడవమన్నావా
ఆహా మేల్గాను బవనాసి కాల్త్రైపారీతివి
ఎంతో శౌరియము గుళ్ళకమ్మా ॥ఆహా॥

## 18. ఇంటియెనక

(పాడినవారు: కొండం వెంకటనరసయ్య)

ఇంటియెనక[5] సేమంటీ[6] సెట్టూ
కొమ్మా దొక్కి పూవులు బూయగా

---

1. చిత్త - స్వాతి. 2. ఇంద్రాపయిందులు యిస్టముతో పొగడంగ యిస్టము లేదని యెల్లినావా (పాఠాం, బొ. వెం.) 3. బురుజులపైన.
4. మేకపోతులనే యిడవమన్నావా (పాఠాం., బొ. వెం.). 5. వెనుక.
6. చేమంతి.

కొమ్మాదొక్కి పూపులు బూయగా
ముదిరినా సేమంచీ మొగ్గకు
ముల్లునాటె నేమో సెలియా
ఇంతనై తీ అంతనై తీ
బాయిలో[1] జలబిందునయితీ
రాచవారి కన్నెనేసే
రాజు పొంయిలినే సెలియా ॥ఇంటి॥

## 19. ఉదయించునోయి

(పాడినవారు : మందపాటి రాములు)

ఉదయించు నోయీ నీ జీవితాన
ఆశాబానుడు ఒక్క దినానా
బతుకే వెతరా యిలలోనా
సిదికే వేలల సోకానా
సీకటి బాసి పోవునులే
నీకూ వెలుగూ దొరుకును లేరా ॥ఉద॥
విరులూ గిరులూ సీదారీ
కూరిమి నోరిమి సనుమోయీ
మదిలో దేముని నమ్మమురా
స్తుతికి జీవము నీవేరా ॥ఉద॥

## 20. ఎక్కాడిదానివే

(పాడినవారు : జూపల్లి పొట్టెయ్య)

ఎక్కాడి దానివే
సక్కాని కోమటి
ఒక్కాదానివడిమిలో

1. బావి.

ఓ సెంచూ !
ఒక్కాడానివడిమిలో
ఓ .ఎక్కాడి దానివే
సక్కాని కోమలి
ఆఁ .సెంచూ దాననని
వంచానా జేసేవు ॥ఆఁ .సెంచూ॥
ఓ ..వగిసీ[1] దాననని
యెగిసీ గంతెయ్యామాకు
వగిసీ దాననని
యెగిసీ గంతెయ్యామాకు
వగిసీ దాననని యెగిసీ గంతెయ్యమాకు
అరికాల్లో ముల్లు నాటుసూ
ఓ సెంచూ ! కుడికాల్లో ముల్లునాటునూ ॥ఎక్కాడి॥

## 21. ఎరకాలావారింట్లో

(పాడినవారు : 1. చాల నరసింహదాసు., 2. మక్కెన బంగారయ్య.)

ఎరకాలా[2] వారింట్లో సిన్నాదీ మంచి
ఎరకైతే తాదెల్పు సున్నాదీలలనా
ఎరుకు మరుకులు లేని సిన్నాదీ అది
యేదాంతము[3] తోటి వున్నాదీ లలనా
బ్రెమ్మాండమంతా[4] సేపట్టేరా[5]
దాని సేతిలొ తామరలు పుట్టేరా ॥ఎరకాలా॥
నరలోక సురలోక నాగలోమునంత
ఆటలాడించుతూ వున్నాదీ లలనా[6]

---

1. వయసు. 2. ఎరుకల. 3. వేదాంతం. 4. బ్రహ్మాండం.
5. కులుకు మంచి తేనె లొలుకాక ముద్దు
మదుర బట్టును తేనె లొలుకాక వయ్యారి (అ. చ., మ. బం.)
6. హరిలోక కరమంపు ఆడిస్తూ వున్నది. (పారాం., మ. బం.)

బట్టబయలూ దానిరూపురా అది
పట్టూకు దొరకానీ పాపారా[1]
ఎరకాలా వారింట్లో సిన్నాదీ మంచి
ఎరకైతే తాదెల్పు తున్నాదీ లలన

## 22. ఏ గజరాజ

(పాడినవారు : చౌల నరసింహదాసు)

ఏ గజరాజ[2]వదన బజే[3]మం పాలాయా
గజరాజ వదనం బజే
కోటి చినపాట్ కోమరా మంగళామాని
గజరాజ వదనం బజే
దాసానదాసా బోసే[4]మం పాలాయా
గజరాజ వదనం బజే
ఏ గజారాజ వదనం బజే మం పాలాయా
గజరాజ వదనం బజే

---

1. బత్తిగలిగిన వారి బావము లోపల
బయలయి తిరిగేటి సిన్నదీ అది
బయలయి తిరిగేటి సిన్నది
మగువ సంచారుని మగువరా
అది పూర్న కాడంత జోగరా
నాడు నేడనకుంచ రత్నాల బరనిలో[5]
ఏడుమేడలపైన సిన్నదీ ॥అది ఏడు॥
అది ఎనిమదింటా నాడు సున్నది
ముట్టూ యంటూ లేక ముదిత మోహనాంగి
గట్టిగ కోటయ్యొ సౌరమందు[6] నెలకొన్న సిన్నది ॥అది॥
2. హే గజరాజ. 3. భజే 4. ఘోషే. 5. భరణి. 6. స్వరము

## 23. ఏటికెదురు నడవేమనసా

(పాడినవారు . కొండం వెంకటనర్సయ్య)

ఏటి కెదురు నడవే మనసా

యేటి కెదురు నడవె

ఏటి కెదురుబడి

దారిదాటే మార్గము

సూటి దప్పకను

సూపుల నడమను[1]

కాటుక కొండల[2]

గట్ల నడమంటి

బల్దాటిగ కనపడు

దారి సూసుకొని ॥ఏటి॥

తడువు సేయవలదే మనసా

దారి యందుగందే

తడువు సేయగను

దాటిమీరగను

కుడి ఎడమల

తడబడకా వొడిగా

నడి నాళ్ళంబున

నాగకన్యకల

అడుగులోన

అడుగిడుసును వొడిగా ॥ఏటి॥

అనుమాన మికేలా సద్గురు

ఆత్మనమ్మి శాలా[3]

---

1. నడుమ 2. నల్లటి కొండలు 3. చాల

కనవలె యినవలె[1] మనవలె
సాదన[2] కనుగొని
యమునా మనములు
నిరమలతను[3] యిడవక[4] వాడిగా ॥ఏటికెదురు॥
అందీ యందని ఆత్మా
నొంద మొదవి యుండూ
బిందు నాదములు
బేద మెరుగక
సుందరాంగిమయి సూడసోజ్జమై
సూరియ[5] జనంబులకు ఇది
కడు సులబమై[6] లోకులకు
ఆరు శ్రకముల[7] కాదారంబయి
మేరిశికర[8] సామీప్యంబయి
అల ఈ గురుని పద నీరజసేవకు ॥ఏటికెదురు॥

## 24. ఏమన బోకురా

(పాడినవారు : జూపల్లి పొట్టెయ్య)

ఏమన బోకురా
సిన్ని కిస్టా నన్ను[9]
తాలగ లేనుర
సిన్ని కిస్టా
నే తాలగ లేనురా
సిన్ని కిస్టా
నన్ను ఏమన బోకురా
సిన్ని కిస్టా
నే వోర్వగ లేనుర
సిన్ని కిస్టా

1. వినవలె 2. సాధన 3. నిర్మలత 4. విడువక 5. సూర్య
6. సులభమై 7. చక్రముల 8. మేరుశిఖర 9. చిన్నికృష్ణ.

## 25. ఏమిరా కిట్నా

(పాడినవారు: జూపల్లి పొట్టెయ్య)

ఏమిరా కిట్నా నేనూ - వొంటరిగా యుండారెనూ
నేమనమీ[1] జేసేదానూ - నామమతాదీర్చా బోనూ
శాలా[2] ముద్దులిమ్మా! - కుచగిరుల గోటా జిమ్మా
కుచగిరుల గోట జమ్మా - గోపాలా నీదే సొమ్మా
సందా మూమల బట్టి - నాసందిటి కేసి కట్టి
ఈ పూళ్ళో వుంటే వొట్టూ - సువు పచ్చినదారి బట్టూ
ఏమిర కిట్నా నేనూ - వొంటరిగా యుండారేనూ
నే మనమీ జేసేదానూ - నా మమలా దీర్చాబోనూ
కలికిర యినగదవే - కర్నాటి లచ్చుమయ్య[3]
అనంత మెలుకులతో వేయించినవాడు కులుకుల కోలన్నా
ఏ . దైవమో ॥ఏమిర కిట్నా॥

## 26. ఏమోనా గురిసెనయ్యా

(పాడినవారు : నెమలి రామలింగారెడ్డి)

ఏమోన గురిసె నయ్యా దేముని మాయా
ఎరుగాకా పోతిమయ్యా రామయ్యా
ముందుగా ముప్పారపోళ్ళు
సొంపుగా సోమారపోళ్ళు
ఏనాటి ఎరకాలోళ్ళు
ఎక తొంబయి గుడిసెలోళ్ళు
అద్ద రాతిరి[4] వానవచ్చి
నిదరబోయి నీళ్ళలో గలిపే ॥ఏమోన॥

---

1. మనవి. 2. చాల 3. మాచర్ల వాసి, కులుకుల కోలాటానికి మాచర్లలో ఒక జట్టుకు తన ఖర్చులతో శిక్షణ ఇప్పించినట్లు వినికిడి, ఆయనకు కృతజ్ఞతలు తెల్పుతూ ఈ పాట పాడి ఉండవచ్చు.
4. అర్ధరాత్రి.

ఏమోనా గురుసుటా[1] ఈ మాయ జనులంత
ఎరగక పోతిమయ్యా రామయ్యా
నీళ్ళు నిడవల[2] బంతి
తాళ్ళు[3] సుక్కల బంతి
తమ్ము డెక్కెతాడి సెట్టు
తన్నూ డె జెల్దిలో[4] గలిసె ॥ఏమోన॥

## 27. ఏరుబడితే మేలురా

(పాడినవారు : నెమలి రామలింగారెడ్డి)

ఏరు బడితే మేలురా మొగుడా[5]
కూడ వుంటే పోరురా
పాలుమాలక నీవు పాలు పంచూకుంటే
నలుగురు పెద్దలు నాయంటు జెప్తురు
బావ పెత్తం దారి బయటోనే[6] తిరిగేను
నావల్ల కాపురము నెరవేరు తున్నాది! ॥ఏరు॥
దండిగను పురహరము దయదెరుసు పురహరము
నిండుగను కాపురము నిండు గంగయ్యదాసు
కండితంబుగ[7] మన్ల కడనుంచి కడతేర్చు! ॥ఏరు॥
గిద్ద పెసరాపప్పు గిన్నెలోనేవండి
వద్దు వద్దనగా నీకొల్ల కొల్లగబెట్ట
మూలనా యింగింత ముంతలో దాపెట్ట
పొద్దుటన్నములోకి పొలము నీకంపిద్దు!
వాటమైనా కొత్త రాటమూ మనకొత్తే
రోజుకూ నేనేడు కుంజాల[8] నూలొడికి
నీటయిన తలగడ్డ నీకు నేయించంగ
కోట బొమ్మంచుదే కొకకే మిగిలిట్టు! ॥ఏరు॥

---

1. కురియుట 2 జలధి 3 తాడిచెట్లు 4. జలధి 5 మగడా
6. బయటనే. 7. ఖండితంబుగ. 8. పుంజము.

పది రూకలకు పాడి బఱ్ఱెనే నువు గొంటే
సిట్టి తవుడూ దెచ్చి సిక్కంగ నేగలిపి
తట్ట గడ్డీ మేపి తవ్వపాలూ పిండే
ముదర గాగిస పాలు ముందుగా నీకు దోసి
ఉదయాన పెరుగేమొ పుంచి నీ కొద్దించి
మొదటి నెల్లో నీకు మొంతాడు జేయిస్త
కడమ నెల్లో నీకు కడవ నెయి జూపిద్దు! ॥ఏరు॥
మిట్టమీని సేను మిఱ్ఱుమీని సేను
మఱ్ఱి సెట్టూ సేను మన పాలు వ్రత్తేను
ఒక్క సొల్లున్నించి మొక్కజొన్నేయించి
నక్కలకు బెదరేసి నాపెగ్గె[1] గెలిపిద్దు
ఒక్క కాకీనైనా వాలకుండా జేద్దూ! ॥ఏరు॥
ఏరు పతకాముందు ఏకట్ట మెరుగనూ
కూరాకు లేదాయె కూడెట్టు తిందునే
పెల్లామా[2] ఏమి దాత్తివి సెప్పవే.

## 28. ఏవూరేబామా! ఎమే నీపేరు

(పాడినవారు : జూపల్లి పొట్టెయ్య)

ఏ వూరే బామా యేమే నీపేరూ
నీ వూరి పేరేమో నిలిసి మాట్లాడు
ఆ॥ సిన కంచెర్లరా[1]
పెద కంచెర్లరా[2]
సినకంచెర్లరా
పెద కంచెర్లరా
సిన కంచెర్లరా! పెదకంచెర్లరా
నడమ నరసరావుపేటరా మాది ॥ఏ వూరే॥

1 ప్రజ్ఞ 2. పెళ్ళామా 3 ఒంగోలు జిల్లాలోని గ్రామం. 4. ఒంగోలు జిల్లాలోని గ్రామం.

ఓ॥ పొదిలి పదకముడా
పొందైన దర్శిరా
పొదిలి పదకముడా
పొందైన దర్శిరా
పొదిలి పదకముడా పొందైన దర్శిరా
ఆలమోరద్దంకి సీమరా మాది! ॥ఏ వూరే॥
ఏ వూరే బామా యేమే నీపేరూ
నీ వూరు పేరేమో నిలిసి మాట్టాడూ
ఆ॥ .ఏ వూరు వైతేమీ
ఏ పల్లె వైతేమి
ఏ వూరు వైతేమి
ఏ పల్లె వైతేమి
ఏ వూరు వైతేమి ఏ పల్లె వైతేమి
మావోరు యింటేనే మాటొచ్చుపోరా! ॥నీవూరే॥
ఓ॥ . అదుగో సింతల సెరువు
అంచునా పెద్దరము
అదుగో సింతల సెరువు[1]
అంచునా పెద్దరము
అదుగో సింతల సెరువు అంచునా పెద్దరము
పేరైన పెదపురము పేటరా మాది ॥ఏవూరే॥
ఏవూరే బామా యేమే నీ పేరూ
నీ వూరి పేరేమో నిలిసి మాట్టాడు

## 29. ఓం నమశ్శివాయో

(పాడినవారు జూపల్లి పొట్టెయ్య)

ఓం నమశ్శివాయో ఆరువత్సరములు
తొట్టికారంబమే వుయ్యాలో

1. ఒంగోలు జిల్లాలోని గ్రామం.

రచ్చకుడు సిన్మయుడు తొట్టిలోపల
తాను వ్రాగుతావున్నాడే వుయ్యాలో
పంచాద్రి కీసుట్టు పరబ్రెమ్మమే పట్టు
పంచ బూతములైదు వుయ్యాలో
ఆతట్టు ఈతట్టు యెలితట్టు లోతట్టు
వ్రాగుతా వున్నాడే వుయ్యాలో
మన్ను నీరును అగ్గి వాయువుతో నాలుగు
పట్టెలుగ గావించె వుయ్యాలో
సూడంగ సూడంగ సూపులోనే రూపు
సిన్మయుడు తానాయె వుయ్యాలో
ఎరుపు నలుపూ తెలుపు పసిడివన్నెలపట్టు
పరుపు గాయించెనే వుయ్యాలో
ఆశ్వాస ఉశ్వాసములు రెండు
తొట్టిగాయించిరే వుయ్యాలో
సులక యిరవయ్యయిదు సారలాతొట్టిని
మనుసుతో నల్లిరే వుయ్యాలో
అశ్వాస ఉశ్వాసములు తాళ్ళుగాయించి
తొట్టె నిలదీసిరే వుయ్యాలో
పంచ కన్నెలుగూడి పంచయేదము జదివి
తొట్టి బట్టూపిరే వుయ్యాలో
ఆలట్టు యీకట్టు యెలితట్టు లోతట్టు
తన మనుసులో వూగిరే వుయ్యాలో

## 30. ఓ బారతాంబ

(పాడినవారు : చౌల నరసింహదాసు)

ఓ బారతాంబా వరములిచ్చి రచ్చింపవమ్మా
వరములిచ్చి రచ్చింపు- నిరాతామూ నీదాసూలాము

1 మనసు

మరిమరీ నిన్నే వేడెదమమ్మ
అమ్మతల్లివే నీవే దిక్కూ మాకు
దండాము నీకు-యెల్ల యిగ్నములు బాపుమాకు
అంబ సల్లాగా బ్రోవుమమ్మా
సరగూనా యేడితీమీ
పిల్లలాయేమి యెరుగామమ్మా
అంబకమలా-సంబావ యిజ్జలరాని
గందాసవేని అమరావందిత మంజులవాని
అంబ నిమసామ యెడబాయకమాపై
నెనరూ సందింపనేలా-నమోనమో యని పిలుతుమమ్మా
అంబావాసికెక్కిన తల్లివి నీవే
వనురుగా[1] యేంకటేశుని కోడలు నీవే
అంబరా బాసురముగ సరీవేళ
దాసునీ కమల హృదయ-వాసికెక్కిన తల్లివి నీవే.

## 31. వోలలాడిరి సకులు

(పాడినవారు : 1. చౌల నరసింహదాసు 2. మందపాటి రాములు 3. చెప్పాల చెన్నయ్య 4. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు 5. మక్కెన బంగారయ్య.)

వోలలాడిరి సకులు[2] వోలలాడిరి
సెలులు వోలలాడిరీ
కోలలాడిరీ కిష్నని కేళి గూడిరీలలనా[3]
మల్లెబంతులా-సక్కని సరుల దొంతులా[4]

---

1. ఒనరగ. 2. సఖులు.
3. ఆటపాటలా రంగా-ఆటపాటలా -
సక్కని తేట మాటలా
సాటిమేటులా మనమిజేసువారలా లలన (అ.చ.,మం రా.,చె.చె.,బొ.వెం.).
4. మల్లెబంతులా రంగా మల్లెబంతులా
శరన సిల్లగంతులా (పారాం., బొ.వెం ).

ఎన్నోయింతలా -మనమి జేసువారలా లలనా[1]
వారి జాచ్చలా-వయ్యారి కిప్పలా
తార సీడలా మ మి[2]-జేసువారలా లలనా
ఆవల ఆవల కొండ-నగరాన గోలుకొండ
సన్నజాజుల దండ-శిరాముల మెడనిండ లలనా
హైదాబాదు దాటి-సికింద్రాబాదు సూటి[3]
కోలాలాకు మేటి-కోటయ్య పంతులు[4] సూటి లలనా
తకిట జనతరీ-కిటతకిట కాకుందరీ[5]
తిపరీశరీగపా-గపామాసనా లలనా[6]

## 32. వోరి కంసా యినరా

(పాడినవారు . 1. చెల నరసింహదాసు ; 2. మక్కెన బంగారయ).

వోరి కంసా యినరా మనమిని దారిగానవలెరా[7]
వోరోరి కంసాయినరా దారిగానవలెరా
నవరతనాలకు నవదాన్యాలకూ నాన్నె ముగాంచితివీ
కుటిలాత్ముడవయి కోపతాపమున కొట్టజూసితివీ[8]

---

1. యెన్నజింతలూ-మానసీడు సంకలోలలన (పారాం, బొ. వెం.)
2. మనవి
3. యేరు లేదనీ రంగా యేరు లేదనీ-
మామూలు యెంక టేశని
సేరరమ్మనే మనమి జేసుకొమ్మనే లలన (అ చ., బొ. వెం.)
4. ముగిమాల కోటయ్య, కోలాటం జట్టునాయకుడు.
5. త్రికుట జనహరేకంగా త్రికుట జనహరే (పారాం, బొ. వెం.)
6. విపరీశరే గాన గామ పానిసాలలన (పారాం., బొ. వెం.)
7. వోరి కంసా యినరా మగుగడ
దారి గానవలెరో మగుగడ (పారా. మ. బం.)
8. కుటిలాచ్చుడవై కోపతాపమున కొట్టదూరితివిరో (పారాం., మ. బం )

బారమనకరోరీ సెల్లెల దారిగానవలెరా[1]
వోరి కంసా యినరా మనమిని దారిగానవలెరా[2] (చౌ. దా.)

## 33. కట్టమీన కత్తిమెరుపు

(పాడినవారు : నెమలి రామలింగారెడ్డి)

కట్టమీన కత్తిమెరుపూ వోలలనా
సెర్లోన సేప మెరుపు
యీ మెరుపన్న జూసిపోరా
మేనత్త కొడకా వోరబ్బీ బంగారిసామి!
అబ్బీ బంగారిసామి లలనా
అయ్యో బంగారిసామీ
ఈ రానిపోని మాటలకు
రాదారి[3] సీటిరో అయ్యో బంగారిసామి!
కోడి పుంజులన్నీ గూడీ వోలలనా
కోలాట మేస్తుంటే
ఏలేశరము[4] నక్కొచ్చి ఎక్కిరిచ్చి
పోయెరో రబ్బీ బంగారిసామి
మేక పోతులన్నీ గూడీ వోలలనా
మేశాకు బోతుంటే
తోకలేని తోడేలొచ్చి
తొడపాశం పెట్టెరో రబ్బీ బంగారి సామి
కట్టెంట బొయ్యోదానా వోలలనా
కడుపేమొ లావున్నదీ

---

1. పాపమనకరోరీ నీ సెల్లెల బాద పెట్టితివిరో (పాఠాం, మ బం)
2. దేవకీ దేవుల కొడుకుల నందర అతము జేసితివిరో (అ. చ, మ బం)
3. రహదారి.
4. ఏలేశ్వరము నాగార్జునకొండకు మూడు - నాల్గు కిలో మీటర్ల దూరంలో ఉంది. ఈ గ్రామం చుట్టూ అడవులు ఉన్నాయి.

నీ కళ్ళేమి కళ్ళోగాని
ఉడుపులొక్క పిల్లరో రచ్చి బంగారిసామి

## 34. కలువరాయ

(పాడినవారు 1. చెల నరసింహదాసు, 2. మందపాటి రాములు, 3. చెప్పాల చెన్నయ్య, 4. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు, 5 మక్కెన బంగారయ్య, 6. కొండంవెంకటసర్సయ్య)

కలువరాయ హృదయ వెన్నెల[1]-
ఆయి జాలరా నేతాళజాలరా[2]
కలువరాయడా మాశెర్ల
శెన్నకేశవా మోహన[3]
నీలమేగ శారీరా
నందనందనా యేశోదనందనా
నిన్నుజూడ నేనాక
నిమిస మోర్తునా మోహన ॥కలువ॥

---

1. హృదయ వెన్నెల
2 చలువరాయ హృదయ వెన్నెల
ఆయిజాలరా నేతాలజాలరా (పారాం., బొ. వెం.)
3 (i) చలువరాయా కారిజ్జాల
శెన్నకేశవా మోహన (పారాం., మం. రా.)
ii) చలువరాయడా జాజుల
శెన్నకేశవా మోహన (పారా , కొ. వెం )
iii) చెలువరాయడా జాజుల
శెన్నకేశవా మోహన (పారాం , చె. చె.)
iv) చెలువరాయ కాజ్జాల
శెన్నకేశవా మోహన (పారాం., బొ. వెం.)

సందమామ కంటె సక్కని
సిన్నదాన్నిరా సొక్కాని దాన్నిరా
సరసి జాచ్చునిన్ను జూడ[1]
మనసు గల్గెరా మోహన[2] ॥కలువ॥
నీరుకాయ దోవతిగట్టి
నిలువలేనురా నిల్వంగలేనురా
నీడజూడ నాకు నిలుపు
టద్దమంపరా మోహన ॥కలువ॥
అత్తమామ గల్లదాన్ని
అదియుగాకనో వేరొకటి గాకనో
కత్తి పదునుయంటి మొగుని
గల్లదాన్నిరా మోహన[3]

---

1. నీలమేఘ
2. i) సరసిజాచ్చ సిన్నికిష్నా
మమ్ముబోవరా కిష్నా (పారాం., చె. చె.)
ii) సరసిజాచ్చ సిన్నికిష్నా
కరున బోవరామోహన (పొతాం., కొ. వెం,)
3. మొగుడు వూరిలో లేకజూసి
మాటలాడరా సరసు మాటలాడరా (అ.చ ,మ బం.)
మొగుడు వూరలేని మంచి
సమయమందునో వో సమయమందునూ
(అ.చ. + పారాం.,కొ.వెం.)
అగుడు సేయక ఆకులొక్కలు
నాకు బంపరా మోహన (అ.చ ,మ.బం )
ఆటలాడరా నాతో
బాసలాడరా మోహన (అ చ. + పారాం.,కొ.వెం.)

కలువరాయ వుదయ వెన్నెల
ఆయిజాలరా నే తాళజాలరా
కలువ రాయడా మాశెల్ల
చెన్నకేశవా మోహన[1]

## 35. కిట్నమ్మా గోపాల

(పాడినవారు : జూపల్లి పొట్టెయ్య)

కిట్నమ్మా గోపాల బాలాకిట్నమ్మా
ఆ॥ నందాకుమార రారా
నవనీత శోరరార
కుందనంపు బాసి పొందుల
కుచ్చాల సికేయిద్దూ
పప్పుటంగనా చిత్తులు
కుప్పెనా మెడనా యేత్తు
కిట్నమ్మా గోపాల బాలా కిట్నమ్మా

---

1. బారతీయుల ప్రేమపాలవి
బావమేమిరా నీ ఠీయమేమిరా (అ.చ.,చె.చె.)
ఇంతగా యినకొండ యెక్కిన
యూరరాగవా మోహన (అ.చ.,చె.చె.)
తుమ్మపూడి దాసయ్య
దాసవర్దుడే వాడు దాసవర్దుడే
నిమ్మమైన నిలయ సజ్జన
నీరజాచ్చుడే మోహన (అ.చ.,బొ.వెం.)
తుమ్మపూడి దాసయ్య
దాసబుద్దుడే వాడు దాసబుద్దుడే
నిమ్మమైన నిలయ సజ్జన
నీరజాచ్చుడే వాడు నీరజాచ్చుడే (అ.చ.+పాఠాం.,మ బం.)

## 36. కిష్నా కరునలోల

(పాడినవారు : చెంచనరసింహదాసు)

ష్నా కరునలోల
ోవర్దన గిరిదర గోపాలా
ోవర్దనగిరిదర గోపాలా
ందకుమార నవతీతశోరా
ారాయణ నిన్నే నమ్మితిరా ॥కిష్నా॥
ాపద్బాంధవ ఆనంద ాచ్చిక
ాదరించరా మా పాండురంగా
చ్చివాయనా పాండవపచ్చ
మ్మాదరించవా మాపాలిదేవ
ిష్నా కరునలోల
గోవర్దన గిరిదరగోపాలా
గోవర్దనగిరిదర గోపాలా

## 37. కూసోని సెరిగె సేడె కురులపై

(పాడినవారు : 1. చెంచనరసింహదాసు 2. చెప్పాల చెన్నయ్య)

కూసోని సెరిగే
సేడె కురులపై
బామ కురులపై
తుమ్మెద లాడేనే దరనిలో
అంసా నడకలు
నడిసే బామకు
అందెలు గదులూనే బామా
కాలందెలు గదులూనే ॥కూసోని॥
సెమటకు దానిపై
సెదిరిన గందం
దగ దగ లాడూనే బామా
దగ దగ లాడూనే ॥కూసోని॥

నీ సేతి రోకలి
సెంంపు రోకలి
నిగనిగ లాడూనే బామా
నిగ నిగ లాడూనే ॥కూసోని॥
కుందన చంచగ
కుదు రల్లాడగ
గుబ గుబ[1] లాడూనే బామా
గుబ గుబ లాడూనే ॥కూసోని॥

## 38. కోలు కోలన్న కోలు కోలో నాసామి

పాడినవారు : 1. వొల నరసింహదాసు 2. వెప్పాల చెన్నయ్య
3. నమలి రామలింగారెడ్డి 4 మక్కెన బంగారయ్య.

కోలు కోలన్న కోలు కోలో నాసామి
కొమ్మలిద్దరు మంచి జోడూ
ఆరాజు నన్నూ విడ్వడమ్మా నాసామి
రాజ గోపాలు డే కొమ్మా[2]
ఇంతలింతల సీరగట్టి నాసామి
ఈ త పేళ్ళా రయిక దొడిగీ
సోజ్జమైనా జొన్న సేలో నాసామి
దోస కాయకు మోసపోతీ ॥కోలు॥
కరమంచ కరబాయి నీళ్ళో నాసామి
కడవ నిండా పొయ్య బోతే[3]

---

1. ఘుమ ఘుమ.
2. మాశెర్ల శివసెన్నుడమ్మా
యీ పొద్దు మాపాలి గలిగుండు కొమ్మా (పారా , నె రా.)
i) కామంచే కదబాయి నీళ్ళో నాసామి
కడవనిండా ముంచుకోని (పారాం., నె.రా.)
ii) కానొచ్చ పడబాయి నీళ్ళో నాసామి
కడవ నిండా ముంచుకోని (పారాం , చె చె )

వార జాతల కడవ నిండే నాసామి
    వోలలాడీ పోవె బాలా[1] ॥కోలు॥
శేట కొమ్మన సేరబొట్లూ నాసామి
    సేమ కూరా గొయ్య బోతే
సేమకూరా సెదులు బట్టె నాసామి
    వాడిమీనా ప్రేమలు దప్పె[2] ॥కోలు॥
కట్టమీనా కలియ సెట్టో నాసామి
    కొట్టబోతే తేలుగుట్టే
మంతరించే గ్గేను లుంటే నాసామి
    మల్లె పూలా పానుపేద్దూ[3] ॥కోలు॥

---

1. జోడు సేతులు కడవ మీనా నాసాంమి
    వాలు గన్నులు వానిమీద (పారాం.,చె.చె ,నె.రా.)

2. బాయిలున్నది బలుసుకూరా నాసామి
    నేల బారిన నెల్లికూరా
వాలు గొమ్మల సింత సిగురో నాసామి
    వండి పెడితే వొలుపులీరు (అ.చ.,నె రా )
గజ్జెల గల కోడి పుంజో నాసామి
    దిబ్బ లెక్కి కూత గూసే
కాకిరాలా కన్నె పెట్టా నాసామి
    కోల కొక్క గుడ్డు పెట్టె (అ చ ,మ బం.)
గజ్జెల్ల గల కోడి పుంజో నాసామి
    దిబ్బ లెక్కి కూత గూసే
అందు కూరీ కన్నె పెట్టా నాసామి
    కూత కొక్కా గుడ్డు పెట్టె (అ చ ,పారాం.,చె.చె )
సిలక ముక్కూ జీడి రెయికా నాసామి
    ఎలక కొరికిన దేమిసేద్దూ
జాల బోసే జంగముంటే నాసామి
    జాము కొక్కా పాను పేట్టూ (అ చ ,చె.చె.)

౩. మంతరించే నాదుడుంటే నాసామి
    మల్లెపూలా పానుపేదూ (పారాం.,చె.చె )

కోసింది కొయకూర మట్టానాసామి
కొయ్యంటె శెంచాలి మొక్కా
వాసిగల్లా మొగుడివయితే నాసామి
వచ్చి వొకరోజుండరాదా[1]



---

1. కట్టమీనా కలియ సెట్టో నాసామి
కాతకే యిర్లూగు తుండే
నడమ బొయ్యే నల్ల పడుసో నాసామి
నిదరకే పొవు సొక్కుతుంది (పారాం.,నె.రా.)
అరుగుమీనా అరిటి పండో నాసామి
అడగబోతే బోవు సిగ్గూ
పండుమీనా ప్రెమవుంటే నాసామి
పందెమేసీ గెలవరాదా (అ.చ.,మ.బం.,చె.చె.)
సక్కని సరిబంపమీనా నాసామి
సెప్పరానీ దుక్క మొచ్చె (అ.చ.,నె.రా.)
సెక్కవచ్చి సెంపనాటే నాసామీమి
సెప్పరానీ దుక్కమొచ్చే (అ.చ.,నె.రా.)
ఏటివొడ్డున యేపె సెట్టూ నాసామి
ఏపురేగీ పూతబూసే
పూతదిన్నా బూతపెయ్యా నాసామి
కొడెలేరా గొడ్డుబోయా (అ.చ.,నె.రా.)
కోనలమ్మా సీరగట్టి నాసామి
కూలికోతకు నేనుబోతే
కూలిమీనా దుమ్ముబాడే నాసామి
వెడ్డిమీనా మరులు ...ట్టే (అ.చ.,మ.బం.)



కోలు కోలన్న కోలు కోలో నాసామి
కొమ్మలిద్దరు మంచిజోడూ
ఆరాజు సెన్నా బిల్వాడమ్మా నాసామి
రాజగోపాలుడే కొమ్మా (చౌ.దా.)

---

మాయదారీ బండమీనా నాసామి
మందు సూరె మాఁవకొడుకా
మందులేలా మాకులేలా నాసామి
మతిలోపుంటే సాలుపోరా (అ.చ.,నె రా.)

పాపజుట్టను యీరిగాడూ దానివొద్ద
సంది నడపను గురివిగాడు
రెంటినడమా నారిగాడూ దానివద్ద
ప్రేమతో పున్నాడే జూనా (అ.చ.,చె.చె.)

కరనమోరీ కందిసేలో నాసామి
కన్నెబూసిన పత్తకిందా
కందిరీగలు పాడుగానూ నాసామి
కళ్ళు దెరవ నివ్వవాయె (అ చ.,నె.రా.)

కాలె కాలె బండమీనా నాసామి
పంచమంటడే ముండకొడుకూ
కందిరీగాపంటె నడుమూ నాసామి
పండిపోయే యేమిసేతు (అ.చ., చె.చె.)

కొండమీనా దాని యిల్లూ నాసామి
కొలిమి లిత్తులు దాని సళ్ళూ
ఉండవచ్చును దానికొరకూ నాసామి
సెయ్యవచ్చును ఒమ్మరయిడు (అ.చ., చె.చె )

గుంటిమీనా గుడ్డికొంగా నాసామి
నీరులేకా నిక్కిసచ్చే
కిన్నెరోలా కన్నెపడుగో నాసామి
మనుము లేకా మరనమాయె (అ.చ.,నె రా.)

## 39. కోలుకోలన్నకోలు కోలేనాసామి

(పాడినవారు . ఊపల్లి పెద్దయ్య)

కోలు కోలన్న లుకో కోలె నాసామి
కొమ్మలిద్దరు మంచి జోడే
రాజునన్నా[1] బిల్వడమ్మా
మరిశాన[2] రాజగోపాలుడే కొమ్మా
ఓ యేటవొడ్డున యేపె సెట్టూ నాసామి
ఏపూరేగి పూత బూసే
పూతడిన్నా బోరుపెయ్యా[3] నాసామి
కోడెరేకా గొడ్డుపోయా ॥కోలు॥
ఊరియెనకా వుడత జచ్చే నాసామి
ఉంచుకున్న లంజె జచ్చె
దానికొక్కా తమ్ముడుండె నాసామి
సూడపోయా వాడు జచ్చె ॥కోలు॥
రాజనము[4] నే దంచబోతే నాసామి
శందనము సెయి జారిపోయె
గొప్ప రాజుం శంప్రమిడమ్మా నాసామి
ప్రేమగల్లా దేముడమ్మా ॥కోలు॥

## 40. కోలూకోలన కోయాకోతే

(పాడినవారు : కొండం వెంకట నర్సయ్య)

కోలూ కోలన కోలూ కోతే ..కోలూ
కోయా కోలనా కోయా కోతే ...

---

1 రాజునన్ను.
2 మరిచాను (< దా..).
3 పెరిగి పెద్దది ఈడుకు వచ్చిన ఆవుదూడ.
4 రాజనం. సస్యవిశేషం.

కోలూ కోలనా కోలూ కోలే ఏకాబలముూ
కొమ్మాలిద్దారూ మంచీ జోడే
వానేడ గురిసెరా జానా మటము
యెంకటగిరి సపకె[1]లోనా
మల్లె గురిసేరా జానా వానా గురిజాలా[2]
వరదా రాజులా పాదమాన
సీరెల్లో సీత్తారు[3] రాతాదాని
పయ్యెల్లో[4] బంగారు పోతా
రొమ్ముమీనా తుమ్మెదలమోతా మాశెర్ల[5]
తేరుమీదావే రంగురాతా
రాజానా[6]లే దంచపోతే నాచేతి
శందనమే సెయిజారేనమ్మా
గొప్పారతిగల సెన్నుడమ్మా నాపాలి
కలిగుండ దేముండోయమ్మా
కులుకు కిన్నెర మీటుకుంటూనాసామి
సన్నజాజులె జల్లుకుంటా
సన్నజాజులె జల్లుకుంటా వాసి శెంత
శెన్నరాయని వేడుకుంటా
కోలూ కోలన కోలూ కొలే కోలూ
కోలూ కోలనా కోలూ కోలే .
కోలూ కోలనా కోలూకోలె ఏకాబలముూ
కొమ్మలిద్దారూ మంచీ జోడే
ఉసెత్తు : అలలానయేమే
కోలన్నా చెలి
అలలానయేమే
కోలన్నా చెలి

---

1. రచ్చ 2. గురజాల. 3. చిత్తరువు. 4. పయ్యెద 5. మాచర్ల.
6. రాజనం, సస్యవిశేషం.

## 41. కోలూ కోలే

(పాడినవారు : కొండం వెంకట నర్సయ్య)

కోలూకోలే ఆఁ ..కోలూకోలే
ఆఁ కోలూకోలే శెలియా
మేలా కోలన్నా సైసై
నిన్నా న్నేడూ నాతో పొందూ గూడి
నానేరాములా యెంచనీకురీతి గాదయ్యా
ముద్దు రంగయ్యా మోహన రంగయ్యా
మంచి గజ్జలాకల కోలకుంట
కలికి రంగయ్యా సైసై
అందగాడా నీ విందురార
నీ అడుగూలాకు మొక్కేదాను
ఆశ దీర్చరా సైసై
ఉసెత్తు : ఓరందగాడా నీవు యిందురారాసైసై
ఓరందగాడా నీవు
యిందురారాసైసై

## 42. కోలూకోలే కోలన్నా కోలే

(పాడినవారు : జూపల్లి పొట్టెయ్య, చెప్పాల చెన్నయ్య)

కోలూకోలే కోలన్నా కోలే
యా కోలూకోలే శెలియా మేలూకోలన్నా[1] ॥కోలూ॥
నిన్న న్నేడూ నాతో పొందూజేత్తూ
నా నేరాములూలా యెంచనీకూ రీతీగాదూ ॥కోలూ॥
బామామాంచీది - బంగారు గూళ్ళదీ
నేనేమి జేతుర తమ్ముడ - అది కానీకులమూదీ[2] ॥కోలూ॥

---

1. కలికిరో యినదగవే కర్నాటి లచ్చుమయ్యా మెలుకువాతో యేపించాడు కులుకుల కోలన్నా. (అ. చ , చె చె.)
2. ఏమిర దానితీరు యేలెత్తూ బంగారు దాని సిటికెన యేలూగోరూ అది సేసుర పాదీ వేలూ (అ చ., చె చె )

మందయ్యానో-వో మంధయ్యానో
నీమాటలేమో మామిడి పండూ కుందారాదానా సైసై
మందయ్యానో-వో మందయ్యానో
పీదులీదు లెరగాలేను మందయ్యానో సైసై ॥కోలా॥
ఒ రండగాడో - నాయిందు రారో
ఏయడుగూలాకు మొక్కేదాను అందుకోరా ॥కోలా॥
(జూ. పౌ )

## 43. గడ్డి పాట

(పాడినవారు : చెప్పాల చెన్నయ్య)

గడ్డి గడ్డని మంచి దొడ్డగా పలికేవూ
గడ్డి బేరము జెప్పు వో పిల్లా
నీ మూట బేరము జెప్పు సోకిల్ల
ఓహో! మేలు గలిగిన మంచి
లేత శెంగలగడ్డి
ఏమి తెల్పుదునీకు యెఱ్ఱ గోగులగడ్డి
లంజె సవరము జూడు కుఱ్ఱోడా
మంచిలావు సిప్పెరగడ్డి పిల్లోడా
ఓహో! సెంగులూ యెగగట్టి
శెంచలాకూగోసీ
గుడ్డ సల్లుగజేసి గునగాకు నేదెచ్చి
సెప్పు తట్టామంచి స్రేష్టమయినా గడ్డి
సల్లకవ్వలగడ్డి పిల్లోడా
మంచి సరసమైనా గడ్డి కుఱ్ఱోడా
చల్ కొండ పిండీగాదు
గోళ్ళగొండీ గాదు
దండిదీ నామూట కుఱ్ఱోడా
నువు దైర్నముంటే[1] దించుపిల్లోడా,

1. ధైర్యము.

అయ్యో పంటెద్దు నాగడ్డి మెయ్యాలే
నీకు వొక్కటే రంకేమొ మెయ్యాలే

## 44. గొల్లవారిమమ్మా

పాడినవారు : 1 చౌలనరసింహదాసు 2. మందపాటి రాములు,

గొల్లవారి మమ్మా మేము - సల్లలమ్మే వారిమమ్మా
మేము గొల్లవారిమమ్మా - సల్లలమ్మే వారిమమ్మా
మేరు సయిూా మందూబసులా - మేపుతుండే వారిమమ్మా
॥గొల్ల॥

పూజగొల్ల వారిమమ్మా - బుద్దులైన నేరమమ్మా[2]
అడ్డగట్టు కట్టారాదూ - ఆడయశ్వా మెక్కారాదూ ॥గొల్ల॥
సుక్కబొట్టు పెట్టారాదూ - సూరియునీకి మొక్కా[3]రాదూ ॥గొల్ల॥
(చౌ. దా.)

## 45. గొల్లవారి వాడలాకు

(పాడినవారు : 1. చౌల నరసింహదాసు, 2 చెప్పాల చెన్నయ్య,
3. కొండం వెంకటనర్సయ్య)

గొల్లవారివాడలాకు కిష్నమూరితీ
నీవుయేమిపనుల కొచ్చినావు కిష్నమూరితీ[4]
పాలుగొన వచ్చినానే గొల్లబామా[5]

1. శైల, 2 పూజ గొల్లవారిమమ్మా-బుద్దులేవోనేరమమ్మా
(పారాం., మం. రా.)

3. ఎఱ్ఱగొల్లా వారిమమ్మా - ఎగ్గులేవో నేరమమ్మా (అ, చ , మం రా.)

4. నీవు ఎందుకేల వత్తివయ్య కిష్నమూరితీ (పారాం., చె చె,)

5. నే గొల్లవారి వాడలకు గొల్లబామా
నేను పాలుగొన వచ్చినానే గొల్లబామా (పారాం , చె.చె )

నాకు పాలుబోసి నన్ను బంపు గొల్లబామా[1]
కొత్తా కోడలునయ్యా కిష్నమూరితీ
మా అత్తగారు వొప్పరయ్యా కిష్నమూరితీ[2]
నీవు కొత్తాడలువైతే గొల్లబామా
నీకు రొక్కమిత్త పుచ్చుకోవే గొల్లబామా[3] (చౌ. దా.)

## 46. గోపబాలులార

(పాడినవారు : చౌల నరసింహదాసు)

గోపబాలులార మనము
గొబ్బియాట లాడుదాము
పన్నగేంద్రసేన[4] నిన్నూ
పండారినాదుని
గొబ్బియాని పాడరమ్మ
నిబ్బరంపు సేడెలార
గోపబాలులార మనము
గొబ్బియాట లాడుదాము
పన్నగేంద్రసేన నిన్నూ
పండారినాదుని (చౌ. దా.)

---

1. మంచి పాలుబోసి నన్నుబంపు గొల్లబామా (అ.చ., చె. చె.)
2. మా అత్తగారి నడవగయ్యా కిష్నమూరితీ (పారాం., చె. చె.)
3. నీ రొక్కమొద్దు గిక్కమొద్దు కిష్నమూరితీ
నా మొగుడు వింటే యెగుడుజేసు కిష్నమూరితీ
నీ మొగుడు నిన్నూ యెరుగూదూనే గొల్లబామా
మీ యత్తకి నాకు అతుకులేవే గొల్లబామా
ఇన్నిమాట లేలనయ్యా కిష్నమూరితీ
మంచిపాలు బోసుకెళ్ళు కిష్నమూరితి. (అ చ ,కొ.వెం.)
4. శయన

## 47. గోయింద నందనందన

(పాడినవారు : తోట హనుమయ్య)

గోయింద నందనందన
కోటిమదన సుందర
కోటిమదన సుందరా
ఆటకాచితాంబరా
గోయింద నందనందన
కోటి మదన సుందర
రామచెంద్ర బూమిపాల
కామితార్దనాయకా
కామితార్దనాయికా
కండితారి[2] నాయికా ॥గోయింద॥
ఏకశిలా నగరవాస
శ్రీకరా మహేదరా[3]
శ్రీకరా మహేదరా
శేసతల్ప శ్రీదరా ॥గోయింద॥
వాసుదాసు వరద శ్రీని
వాసలోక పాలనా
వాసలో కపాలనా
దాసలోకలాలనా ॥గోయింద॥

## 48. శెంచలంబగు

(పాడినవారు : కొండం వెంకటనర్సయ్య)

శెంచలంబగు[4] జగతిలోపల
శాశ్వితంబొకటేదిరా
కన్నుమూసీ తెరిసి నంతలో
కలిమిలేముల మాయరా !

1. కామితార్థ. 2. ఖండితారి. 3. మహీధర. 4. చంచలం.

తల్లిదండ్రీ ఆస్తిపాస్తులు
అన్నదమ్ములు యిక్కడా
పరమభక్త మునీంద్రులెల్లా
పసందులు సేయుదురక్కడా! ॥శెంచలం॥
ఇల్లు వాకిలి అన్నదమ్ములు
యిచ్చిపుచ్చేదిక్కడా
యెల్లిపోయేనాడు యెవ్వరు
యెంటరారూ అక్కడ! ॥శెంచలం॥
బంకమట్టి యిల్లురా యిది
అగ్గిబుగ్గైపోవురా
నీది నాదీ అనుసు నరుడా
వాదులాడాబోకురా! ॥శెంచలం॥
గురువునని మెడనిండ దండలు
గురుతులేసేదిక్కడ
పరమభక్త మునీంద్రులెల్ల
పసందు సేయుదు రక్కడా! ॥శెంచలం॥

## 49. సందమూమ సందామూమూ

(పాడినవారు : 1. కొండం వెంకటనర్సయ్య 2. చౌల నరసింహదాసు)

సందమామ సందమామా సందమామారాజూ
సంది దెలిపేగ్గెను లెవరే సందమామో రాజూ
కాయమాను పుట్టలోనే సందమామాపాము
ఆయిగానూ[1] వెలుగూతూంది సందమామారాజు
తొమ్మిది వాకిళ్ళుమూసి సందమామా పాముని
నెమ్మదిగా పట్టవలయు సందమామారాజు[2]

---

1. హాయిగాను
2. వాకిట వొక్కడు వస్తడు బోతడు సందమామారాజు (అ.చ.,చౌ.దా)

జంటనాగ సరమూలాది[3] సందమామా పాముని
మెల్లగానూ లేపావలయూ సందమామారాజు
పామునుబట్టే జోగీయెవరే సందమామారాజూ
అతనిపేరు సిద్దయ్యగురుడే సందమామారాజూ
జంట నాగాసరమూలాది సందమామా అతడు
ఆటలు పాటలు నేర్పినాడే సందమామారాజు
పట్టి బుట్టలో యేసినాడే సందమామారాజు (కొ. వెం.)

## 50. సింతమాను సిలకలార

(పాడినవారు 1 పాల నరసింహదాసు 2. కొండం వెంకటనర్సయ్య
3. చెప్పాల చెన్నయ్య 4. మందపాటి రాములు)

సింతమాను సిలకలార గవరమేటి గ్గేనులార [1]
సందమామ వంటిదాన్నిరా నాసామిరంగ[2]
సందుగాదు ఏమి జేత్తురా
ఎక్కరాని యేపెలెక్కి సిలకవాలె[3] సిక్కినాను
కలియపూల దట్టిగట్టరా నాసామిరంగ
కదలకుండ నన్ను దింపరా[4]

---

1. సింతమాను సిలకలార జవరమేటి జానలార (పారాం., చె.చె.)
2. సందమామవంటిదాన్నిరా! రంగయ్యబావ (పారాం., మం రా )
3. i) సిలకలున్న గూటిలోన వజ్జరాల వానగురిసె
సిలక పలుకులొలుకు బట్టెరా రంగయ్యబావ
సిలక పలుకులొలుకు బట్టెరా (అ.చ., మం.రా.)
ii) సిలకలున్న గూటిలోన వజ్జరాల వానగురిసె
సిలకపలుకులొలుకు బట్టెరా నాసామిరంగ
ఒక్కరాత్రి నిదర జేయరా (అ.చ., పారాం., కొ.వెం.)
4 సింతజూడు సిగురుజూడు సిన్నదాని పొగురుజూడు
వత్తబోత నన్నుజూడరా నాజానకాడ
ఒక్కరాతిరి నిదుర జేతురా (అ చ.,చె చె.)

ఉల్లిపొట్టూ యిల్లు గప్పి మల్లె మొగ్గ మంచమల్లి
వాడుబోయె వాడబేరమూ నాసామిరంగ
వోలలాడె బాలప్రాయమూ[5]

---

సిలకజూడు సింతజూడు సిన్నదాని వయసుజూడు
సిగురులేని మానుబాయరా రంగయ్యబావ
సిగురులేని మానుబాయరా (అ చ ,మం రా )

5. i) కొత్తది ముచ్చాలబొట్టు కొమలకుంట శెట్లరెయిక
అప్పుజేసి యేల తెత్తివీ నాసామిరంగ
అపటిమాట లేల బోయెరా (అ.చ.,చె.చె )

ii) మంటిమీని సిక్కుడు తీగె ఇంటిమీని కల్లుకూనే
కాయపిందెల కాలమాయరా ! నాసామిరంగ
పాయమెవ్వరి పాలు జేతురా (అ.చ.,చె.చె.)

iii) వత్తబోత వంగతోట రానుబోను రాగితోట
యిద్దరి మజ్జె యిరికి తోటరా నాసామిరంగ
సందుగాదు యేమి జేతురా (అ చ ,చె చె.)

iv) ఓడమీన వొయిలుకాడు యీలలేసి పిలవసాగె
ఓడబేర మాడమనెరా ! రంగయ్య బావ
ఓడబేర మాడమనెరా

v) సిలక నిచ్చి నేనుదెస్తి సింతపేళ్ళ పట్టెమంచం
యిద్దరికి యిమ్ము జాలదూ ! రంగయ్య బావ
రొమ్ముమీద సెయ్యి దియ్యరా (అ చ.,మం.రా.)

vi) ఆకులొక్క లేసుకోని అద్దమడగ నేను బోతే
వాడుజూసే సూపులాకు ఆకులొక్కలాడిపోయే
వాడి బెమలు తీరిపోయెరా నాసామిరంగ
కాకిమూర్ఛ సంభవించె కాపురానికి తిప్పలొచ్చెనే

vii) సుక్కబొట్టు పెట్టుకోని సున్నమడగ నేనుబోతే
వాడు జూసే సూపులాకు సుక్కబొట్టు సున్నమాయె
అత్తా నేనేమి జేత్తునే !
ఇంటి మొగుడు యింటవుండ గంటవాలె దీపమెలిగె
అత్తా నేనేమి జేత్తునే ॥సింత॥ (అ చ.,చె.చె )

పటివొడ్డు నేపమాను మెక్కిసూర్తే సిల్లిబూమి
సిల్లిబూమి తెల్లజొన్న కొయ్యవచ్చి మొయ్యరాదురా
నాసామిరంగ కొయ్యవచ్చి మొయ్యరాదురా[1] ॥సింత॥ (చౌ.దా )

## 51. సిటపట సినుకులు

(పాడినవారు చౌల నరసింహదాసు)

సిటపట సినుకులు చుప్పటి దడిసెను
తలుపు దీయవే బామా
నువు, తలుపు దీయవే బామా
అర్ధ[2] రాత్రికడ నిద్దరపోతున
ఎవరని తీత్తును మామా
నువు యెవరని తీత్తును మాంవా
గోవర్ధనగిరి గోవులు గాసెటి
గోపాల కిష్నునే బామా
నే గోపాల కిష్నునే
సిటపట సినుకులు చుప్పటి దడిసెను
తలుపు దీయవే బామా
నువు తలుపు దీయవే బామా (చౌ. దా.)

## 52. మంగళహారతి

(పాడినవారు : నెమలి రామలింగారెడ్డి)

శెలియా మంగాళా మనారీ
శ్రీ రెన్నకేపని సకియా మంగాళా మనరీ
శ్రీ వమిశ గాత్రునకు స్తిరవంటి
వమిశజు పారినాకు నీల మేగాశ్యామునకు
గునశాలియగు వనమాలి దరునకు

1. పొగడ చెక్క నెగడి. 2. అర్ధరాత్రి.

శెలియా మంగాళా మనారే
శ్రీ శెన్న కేశని సకియా మంగాళా మనరీ
అల్లా రేపల్లెలోను సెల్లాటముగా
యెల్లా బాలుర తోడానూ
యుల్లములు రంజిల్లగా
గొల్ల బామల యిళ్ళలో
తుది కొల్లలాడె గోప బాలకు ॥శెలియా॥

నారాత నుత పాత్రకు
కొప్పనూరెపురి జానా వాసుకు
దరని యే కవి నార్యుని
స్తిర వంది వమిళజు పారుసకు
వర సీతారామా యా కృని
దియ్యముగ రచ్చించు కేశవుకు ॥శెలియా॥

## 53. సెల్లివి నీవే

(పాడినవారు : కొండం వెంకటనర్సయ్య)

సెల్లివి నీవే సెల్లెలు నీవే
పరువుగ ఒతికేటి మాలచ్చివమ్మా
మాలచ్చివమ్మా గాలము మోలచ్చివమ్మా ॥సెల్లివి॥

నిన్ను జూడ నీ తల్లి వచ్చేనమ్మా
నిన్ను జూడ మీ తండ్రి వచ్చేనమ్మా
కొండరెన్నో దాసైనా వచ్చేనమ్మా
వారిజూడ నీకైనా కనులేవమ్మా ॥సెల్లివి॥

నిన్ను జూడ మీ వదినలు వచ్చేరమ్మా
ని బర్త శెంద్రయ్య యేడ్చేనమ్మా
నీ కూతురు అమ్మా యని పిలిసేనమ్మా
వారిజూడ నీకైనా కనులేవమ్మా ॥సెల్లివి॥

చైత్ర శుద్ధ నమీరోజు సెల్లెలా
శ్రీరాముని కళ్యాణము సూడపోతివా సెల్లెలా
ఆకులు కోకలు అందపోయితివా
కొండెమువారి ఆడబిడ్డవై
గాలమువారి కోడలువై పోతివా
పోయితివా పొరగిపోతివా సెల్లెలా
నీమీద ప్రేమసేత
కొండ మెంకటనరసయ్య
కయి రాసెను సెల్లెలా

## 54. సేడెలారా

(పాడినవారు : 1. పొల నరసింహదాసు, 2. మక్కెన బంగారయ్య)

సేడెలారా మీరు కూడిరారే
        వారిజాడ లున్నాయిచోటనూ
మదముతో కిష్టుని మొత్తుకపోయిన
        జాడజాడలున్నాయిచోటనూ[1]
సుట్టు దంపాటాలు
        సోజ్జము కావాల
పట్టి కావలియుండె
        ఎద్రముగా
యేదవులపై జామ
        యేమి శ్రీరామ
మదన జానికులుండె
        ముదమొప్పగ
సేడెలారా మీరు కూడిరారే
        వారి జాడలున్నాయిచోటనూ        (పొ. న.)

---

1 అతికోపమున కిష్టునుని మొత్తుకపోయిన జాడలున్నాయిచోటనూ
(అ. వ., మ. బం)

## 55. జడనీకు యెవరేశారే

(పాడినవారు . చెప్పాల చెన్నయ్య)

జడనీకూ యెవురేశారే
ఓ సినదానా జడనీకు యెవురల్లారే
జడన జాజికాయ మెడన పూలదండ
జడనీకు యెవురేశారే
ఒక దళం దళం పయినా
బంగరు మేడమకట వోరణమేగంటి
ఒక లంకా కాళిలో సకలామూ గనుకోని
సన్నిదానము గంటినే
జడనీకు యెవురేశారే
ఓ సినదాస జడనీకు యెవురల్లారే.

## 56. తందానా తందాన

(పాడినవారు . చౌల నరసింహదాసు)

తందానా తందాన తందాన తందనానా
శాంతమూర్తి మన కరునామయుడు కరంచంద్ గాంధి
పందొమ్మిదొందల నలబయి యెనిమిది
జనవరి ముప్పయి సాయంకాలం
బిర్లా బవనం నుంచి ప్రేర్దనకు[1] బయిలు దేరినాడూ ॥తందాన॥
మిలమిలలాడే ముద్దు మోముతో
కలకలలాడే కళ్ళ కాంతితో
తడబడి యడుగులు వేయుసుగాంచి
నడిసి వచ్చుతుండే-బాపూనడిసి వచ్చుతుండే ॥తందాన॥
హేతువు దగ్గర దుస్టుడొక్కడూ
పిస్తోల్ చేత బట్టి పొంచెరా
వచ్చే బాపుకు వందనమిచ్చి
పిస్తోలెత్తి కాల్చి యేసినాడూ

1. పార్థన.

కాల్చిన యెంటనే పిస్తోలు గుళ్ళు పొట్టలో దూరాంవా ॥తందాన॥
గుళ్లు దూరిన యెంటనే రకతము
నెత్తురు ఏరు కారసాగెరా
కరునామయుడగు మాత్మ గాంధి[1]
బవుతిక దేయము[2] కూలిపోయెనంటే
బాపూ కూలిపోయెనండీ

## 57. తందానా అయ్యో తందానా

(పాడినవారు : చెప్పాల చెన్నయ్య)

తందానా అయ్యో తందానా వోదేవ తందనానా
అయ్యో ఆతుకూరిలో[3] ఆకులున్నాయి
పోలెపెల్లిలో[4] పోకలున్నాయి
రాయారం[5]లో రాతలున్నాయి
అయ్యో సన్నెగళ్ళలో చన్నాయి[6] మాట్టాడె
మేర్యాగులో[7] మేళాలు మోట్టాడి
పర్లె[8] లోపల పప్పన్నమూ తిని
తాళ్ళపల్లిలొ తలంబ్రాలు బోసిరి
అయ్యో అన్నేయప్పురమందు అయిపోయె పెళ్ళి
సట్టు మిట్టలలో సమర్తలాయె
అయ్యో యిరికెపెల్లిలో యిద్దర్ని గలిపిరి
పంచరగుంటలో కడుపే ఆయెను
సింతపెల్లికాడ సిన్నోడు బుట్టే
సన్నెగళ్లకాడ సందే దగిలె
బల్మనీ[9] లోపల సేయి జూసిరి
మంగలగిరిలో మందులు బోసిరి
గుంటూరిలో గుంటలో బెట్టిరి
రంబంపాటిలో[10] కాకులా కేసిరి
అయ్యో సెంద్రవంకలో[11] సేతులు గడిగిరి ॥తందానా॥ (చె.చె.)

---

1 మహాత్మగాంధి 2. దేహము 3. ఆత్మకూరు 4. పోలేపల్లి
5. రాయవరం 6 సన్నాయి 7. మేర్యవాగు 8. ఓబులేశునిపల్లె
9. బల్మని 10 రంభంపాడు 11. చంద్రవంక.

## 58. తందానో అయ్యో తందానా

(పాడినవారు : కొండం వెంకటనర్సయ్య)

తందానో అయ్యో తందానా ఓదేవ నందనానా
అయ్యో పంమటి దక్కున
స్వేత నగరమని పన్నొకటి గలదో ॥ తందానో ॥
అయ్యో సుక్కలు సూసే గుడి గోపురములు
సక్కని బవనములు!
అయ్యో కరునాకరుడగు
దుజ్జను డొక్కడు కలడా పట్నాన! ॥ తందానో ॥
అయ్యో కరునా రసంయాను డతి
దూర్తుడు గాతకుడతడండె' ॥ తందానో ॥
అయ్యో బీతియేమిటో యెరుగరు
కడు గంబీరులు సాయసులు
అయ్యో పాడు జన్మ గోపాలము యెందుకు
పెతివాడు మనపై బడువాడు! ॥ తందానో ॥
అయ్యో మెదిలితిమంటే గపమి తిన్నెదరు
కదిలిమంటే కాల్చియెసెదరు
అయ్యో మద్దినాల మా మందపైన బడి
అయిదు మేకలు అన్నేయమగ
పట్టుకొంటె సిన బసవయ్య జూసి
కూడదు కూడదు యీపని అంటే
కుమల వొడిసినారూ ॥ తందానో ॥

## 59. తుమ్మలకుంట

(పాడినవారు : జూపల్లి హొట్టెయ్య)

తుమ్మలకుంట తిరనాల
మమ్మో లేసిందిర బావు

ఏహ్ తుమ్మలకుంట తిరనాల
  మహమ్మ్రా లేసిందర బాపు
జాతీ దొరలా ఉండే
  మల్లొచ్చే మారుఉండి
జాతీ దొరలా ఉండి
మల్లొచ్చే మారుఉండె.

## 60. తూరుపు నా మబ్బు పట్టే

(పాడినవారు : కొండం వెంకట నర్సయ్య)

తూర్పునా మబ్బుపట్టే నా సామి
  తుమ్మలమ్మా శెరువు నింపే
పాతశేపలు ఎదురుపాదే నా సామి
  పాత మనుసులు మోజుతీరె
కట్టమీనా పాంపిట్టనా సామి
  కొట్టపోలే తేలుగుట్టే
మంతరించే గ్గేనులుంటే నా సామి
  మల్లెపూలం పానుపేస్తా
ఎర్రెం రజకోడి పుంజో నాసామి
  దిబ్బలెక్కి కూత గూసే
కాళ్ళ గలిగిన కన్నె పెట్టా నా సామి
  కూత కొక్కొ గుడ్డు పేట్టే
కట్ట కొమ్ముమీన దాని యిల్లా నా సామి
  ఎర్ర ముగ్గుల మీద మనుసూ
దానికోసము నేను పోతే నా సామి
  ఆరు నెలు ఎల్మర్రయిడు[1]

1. ఎక్కరైదు.

## 61. దిగు దిగు దిగు నాగా

(పాడినవారు : 1. చెప్పాల చెన్నయ్య. 2. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు)

దిగు దిగు దిగు నాగా
    వోదియ్యా సుందరినాగా
నీ ముదముతో రేపల్లె
    ముద్దూలనాగా నాగా దిగునాగా!
అచ్చమూపులపాలు వోనాగా
    అరిటి దోనెలబిండి
నీలుకలవకుండా నీకోమనిడుతూ
    నాఁగా వోనాగా దిగునాగా!
ఎఱ్ఱంగా పొద్దుపొడిసే వోనాగా
    యేటూ గడియలాయె
బాలుడికి యిసమెక్కె
    వొవు బారమాయె నాగా దిగునాగా!
యీపునా యిరవాయి వోనాగా
    తోరనా తొంబాయి
పక్కాన పదేల మచ్చలానాగా
    వోనాగా దిగునాగా!
ఆవతాలివతల యీతవనము వోనాగా
    నట్టనదమ నాపశేను
నాపశేను పూపులాకు నాగుమయ్యా తల్లడిల్లే
తందన్న తానోయి తందనానా
తానందన్న తానోయి తందనానా!
ఉప్పు పిచ్చన్నగూడి
    పుపాయం సేత్తుంటే
నక్కా నాగన్నవచ్చి
    నాదీ బాగమనే ॥తందన్న॥

ఆమ్మాలక్కలు గూడి
ఆలోచన జేత్తుంటే
నాబాబు[2] మంగమ్మా వచ్చి
నాదీ బాగమనే ॥తందన్న॥
కాలవలారా గెనెమెలారా
మడికిదారే నీల్లారా
నీళ్ళగట్టె సిన్నవాని
రేపే పయానమూ ॥తందన్న॥
కొత్త నీళ్ళవచ్చే నాని
యెక్కే కొండశేప
నిండే తురకప్ప శెరుపు
తూరుపలుగు తెల్లబారె ॥తందన్న॥ (చె. చె.)

## 62. కంచనపల్లి జగన్నాదం

(పాడినవారు : చెప్పాల చెన్నయ్య)

దుగ్గి[3] కాపూరస్తుడు కంచనపల్లీ
జగన్నాదం నారాయణరావు
పొందుగను మాశెర్ల పురిలో
పొన్నవిచ్చెను[4] జేయించె
ఏడుకొమ్మల పొన్నమాను
యెదురునడిసె వుడతలేమి
సిలకలు పావురములు యేమి
సిత్తారు గల్లమాను

---

1. ఊరికి వుత్తరాన వోనాగూ
పూడల్ల మర్రికింద నాగూ
కొమ్మసాటు నుండె నాగన్నా
నాగా దిగునాగు (అ చ., దొ. వెం)

2. నభాబు. 3. దుర్గి 4. పొన్న వృక్షము.

వంగిసూసె గుడ్డి కొంగలు
వారసూపు తెల్ల కొంగలు
సుట్టూ గొప్పెష్టలేమి[1]
నడమ నుండు కిష్టము రితి
కిలకిల నవ్వినట్టు వుండెనేమో
సబవంత జూసినట్టు వుండెనేమో
ముంగల గదిలో బంగారక్క
ముంగల కొంగు యెగబట్టూకోని
కళ్ళకూ కాటిక బెట్టి
పళ్ళాకు దాసీసయేసి
గులహాల కుంకము[2]
కుదురైన పాపటి బొట్టుయేమి
ముక్కుపుల్లలు బెట్టుకోని
నత్తులు[3] యెగ్గవోటుకుంట
జెరిజెరి సీరలుగట్టి
జగజ్యోతి పంచేలుగట్టి
జగజ్జోతి పంచెకొంగున
వక్కాకు సాలగట్టి
ఎప్పనీ మొగుణ్ణెంటాబెట్టి
ఏకుల రాటం సంకనబెట్టి
మాశెర్ల మద్దిరంగం[4]
తేరు ముందల కోపుబట్టి
యేసే కోలన్న కాళ్ళు
సూపే శెలిక త్తెలంతా
ఆకులొక్క లేసుకుంటూ
అంగడంగడి తిరుక్కుంటూంటే
మెడలో సొమ్ములు
దొంగలు సూరికి

1. గోపికలు. 2 గులాభిరంగుగల కుంకుమ 3. తలలో పెట్టుకొను నగలు. 4. మద్దిలింగం.

యెందూ కొస్తీనమ్మ - తిరనాల
నేను యేలా వస్తీనమ్మ - తిరనాల
ఈ పిల్లవాడు సెయ్యిబట్టె - తిరనాల
మా కిమతగాడు సెయ్యిబట్టె - తిరనాల
మా అత్తా వద్దనం గొత్తి - తిరనాల
మామామా శెప్పంగవత్తి - తిరనాల
నా మొగుడా బూమిలో లేనోడు - అమ్మయ్యో
నాగ్గా బజార్లు జూసి
నాజూగ్గ పట్టుకోని
పట్టుకున్న దొంగను
నట్ట నడిమికి తీసకొచ్చి
యీర బద్రుడి గుడిదనక
యివ్వరంగ బట్టకొచ్చి
చప్కు చచ్చప్కు తోటి
మూడు చప్కులు సప్పరిస్తే
ఎందూ కొత్తివిరా
దొంగలమ్మిడి కొడకా
నువు యేలా వత్తివిరా
దొంగలమ్మిడి కొడకా
లచ్చిమి దేవి మిద్దెల దనక
లచ్చనంగా తీసకొచ్చి
పోలీసు జవాన్ల బిలిసి
పొడి పిద్దునా నిన్ను
యెట్టివాళ్ళ బట్టిచ్చి
నెట్టిద్దునా నిన్ను
వనమున సిలకలు
సెలరేగుండగా
వలపు నిలపనా
వశమటిలలనా
నామందయ్యానా - నాబామా
ఇటయ్యాకు తద్దిమిత

## 63. దేవ దేవ మంగళం

(పాడినవారు . 1. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు, 2 తోట హనుమయ్య)

దేవ దేవ మంగళం
దేవాదిదేవ మంగళం
ఆంజనేయ మంగళం
వీరా జనేయ మంగళం
రామశెంద్ర మంగళం
శ్రీరామశెంద్ర మంగళం[1]

## 64. దైదగటము

(పాడినవారు : చెప్పాల చెన్నయ్య)

దైద గటమూ కాంతయ్యగారి కయిత్తమేనండీ
వాసిగను దైదాపురము వాసుడీతడండీ
దోసిలొగ్గువారికి నెల్ల దేశకుడవునండీ ॥దైద॥
ఉండీ లేనీ వానికొక్కా ముండాగలదండీ
ముండాకడుపున మూడులోకాల్వండీ నాయండీ ॥దైద॥
ఇరవయ్యొక్కయ్యార్లు నూర్లు కరుసురోజండీ
గుర్తు తెలియలేక మీరు గుద్దుకోకండి
తన్లో తాను తెలియలేక తన్నుకోకండి
యిన్నాదెవరో కన్నాదెవరో అన్నాదెవరండీ
తనలోతానే తెలియలేక తన్నుకోకండీ
దైద గటమూ కాంతయ్యగారి కయిత్తమేనండీ

## 65. నందికొండా వచ్చెనురో

(పాడినవారు : చెప్పాల చెన్నయ్య)

నందికొండా వచ్చెనురో రన్నారైతన్నా
నీకట్టమంతా తీరునురో రన్నాకూలన్నా

---

1. సక్కుబాయి మంగళం–సౌపమేల మంగళం (అ. చ., తో, హ.)

నాగార్జునుడికి నమస్కరించి
మాచర్లయో చెన్నునిదలిసి
కారంపుడి అంకమ్మను కొలిసి
గుత్తికొండ బెలస్తానంలోను
మస్తు పెద్ద బ్రెమ్మయ్యను[1]లేప! ||నంది||

ఆంధ్ర నాయకుల ఆందోలనతో
కాంగ్రెసు మంత్రుల కార్యదీచ్ఛతో
గవనరు[2] దువ్వేటి కలముపోటుతో
జవారులాలూ[3] సల్లని దయతో! ||నంది||

రైల్వేలు రాత్తాలు పెలట్టరు[4]
మాటలతో యెయ్యామడ ముచ్చట[5]
ఉప్పు గోంగూర ఊరతొక్కుతో
సప్పిడి తైదల సంకటిగాదిక
పప్పుగాక పది కూరలతోని
సాముల బువ్వారామరాజ్జెమై! ||నంది||

దియ్యో బవనములు యెలయగలవురా
పూలతోటలే పెబల[6]గలపురా
బందెడ బూములు పంటపండును! ||నంది||

నందిగొండ యినకొండగాదురా
నాగార్జున రుసి సాగరంబురా
సింములుదొక్కే కిష్నయేనిరా[7]
దీనులబోసే తెలుగుతల్లిరా! ||నంది||

---

1. బ్రహ్మనాయుడు (పల్నాటి యుద్ధంలో ప్రధానపాత్ర వహించినమంత్రి)
2. గవర్నరు 3. జవహర్‌లాల్‌నెహ్రూ 4. ఎలక్ట్రిసిటీ 5. తంతి
6. ప్రభల 7. కృష్ణవేణి

## 66. నమో నమో

(పాడినవారు · చొల నరసింహదాసు)

నమో నమో ప్రియ దారతమాతా
నమో జయ మంగళగీతా
అమోగ చెరితపు[1] పెమోద బరితవు[2]
సమాన రయితపు సల్లని తల్లిపి! ॥నమో॥
గౌతమ బుద్ధుని గాంది మాత్ముని[3]
రామక్రిష్ణ శ్రీ వివేకనందుని
దయానంద యీరేశలింగని
కనిపెంచిన మాకనికరాల తల్లి! ॥నమో॥
గంగా యమునా కిష్న గోదావరి
తుంగబద్ర కావేరి పెనాకిని
పొంగి పొరలెడు తరంగములపై
రంగారెడి మా బంగరు తల్లి! ॥నమో॥

## 67. నమ్మి వచ్చితినయ్య

(పాడినవారు : బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు)

నమ్మి వచ్చితి నయ్య నాపాలి దయివమా
రమ్మని పిలవరా బ్రెమ్మమో యీర బ్రెమ్మము
అయ్యా కమ్మి వున్నది అడివి దయివమో
కరునించి కాపాడు బ్రెమ్మమో యీర బ్రెమ్మము
పొన్న పూవులయందు వాన కురిపించితివి
నేనెట్లు నిలుతురా బ్రెమ్మమో యీర బ్రెమ్మము
అయ్యా పొద్దెక్కి మద్దేన[4] పొడదెండ లోపల
ఊరి నిండాయెరా బ్రెమ్మమో యీర బ్రెమ్మము

---

1. అమోఘ చరితవు. 2. ప్రమోద భరితవు.
3. గాంధీ మహాత్ముడు 4. మధ్యాహ్నం.

## 68. నా మాట యినవమ్మ

(పాడినవారు . 1. చాల నరసింహదాసు 2. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు
3. మక్కెన బంగారయ్య)

నామాట యినవమ్మా కోయిలా
ప్రేమనాదుని తేవమ్మా కోయిలా లలన[1]
నామాట యినవమ్మా కోయిలా
ప్రేమనాదుని తేవమ్మా కోయిలా!
ఎగిరేటి రెక్కలకు కోయిలా యెండి
ఆరములూ జేయిత్తూ కోయిలా
నడిసేటి కాళ్ళకు కోయిలా నాలు[2]
గందేలు జేయిత్తూ కోయిలా
వలవ్వూ నిలపాజాల కోయిలా
దాని వలలో సిక్కినాడే కోయిలా ॥ నామాట ॥ (చౌ.దా)

## 69. నిన్నే కోరియున్నాదీ

(పాడినవారు : కొండం వెంకటనర్సయ్య)

నిన్నే కోరియున్నాదీ
అల్లాదీ మంచీ కెలతసెట్టూ పక్లేదో
ఓ శెన్నారాయా నిన్నూ యేగమే తడవక
సేవకే రమ్మన్నదీ

---

1. నా మాట యినవమ్మ కోయిలా
ప్రేమనాదుని గనవమ్మ కోయిలా లలన (పారాం., బొ.వెం.)
2. ఇంద్రుని గనవమ్మ కోయిలా
నీకు యింద్ర ఆరము[3] లిత్తూ కోయిలా
శెంద్రుని గనవమ్మ కోయిలా నీకు
శెంద్రఆరములిత్తూ[4] కోయిలా లలన (అ చ., బొ.వెం.)
3. ఇంద్రహారము 4. చంద్రహారము.

ఎర్రాయెర్రాని సిన్నాదీ అదీ
యెండీసొమ్ములు గల్లదో
యెండీసొమ్ములు గల్లదీ
ఒరె బాలుడా నిన్నే మరువానన్నదీ
నల్లానల్లని సిన్నదీ అది
నడుమూ పిరికెడు గల్లదో
నడుమూ పిరికెడు గల్లదీ
ఒరె బాలుడా నిన్నే కోరియున్నాది
మొకమెల్ల మోటిమాలదీ అదీ
అంసామొగ్గాల రెయికాదో
అంసామొగ్గాల రెయికాదీ
ఒరె బాలుడా అండాబాయేనన్నాదీ
బంగారు గుండ్లాసారాము గల్లాదీ అదీ
బాజీ పొందూలు గల్లదీ
మదనా శాత్రమున[1] కదులూసు
మదినుంచు బాలుడా రమ్మన్నదీ (కొ.వెం.)

## 70. నీ నామరూపములకు

(పాడినవారు : కొండం వెంకటనర్సయ్య)

నీనామరూపములకు
నిచ్చజయా మంగళం
పవమానా సుతుడుపట్టూ
పాదార విందములకూ
నీ నామారూపములకు
నిచ్చజయా మంగళం
ప్రెహలాదా[2] నారదాది
మునిబక్తులు పొగుడుసుండు ॥నీనామా॥

---

1. శాస్త్రము. 2. ప్రహ్లాద.

నెలవొంక అకలంక
అకలంకయురమునకు ॥నీనామా॥
నీలినాకి ఎరుతీరు
నప్వ్వాగల మోమునాకు ॥నీనామా॥
సాకేత పురనివాస
సామి శ్రీరామచంద్ర ॥నీనామా॥

## 71. పగడసాల లాడుదాము

(పాడినవారు : 1. తోట హనుమయ్య, 2. చౌల నరసింహదాసు, 3. జూపల్లి పోట్టియ్య.)

పగడసాల లాడుదాము - పడతిజానకి అపురవుర జానకి
నపంగునము దానిమనుసు - సొగుసుబాలకి ఆపురవుర బాలకి
ఎండుజింత కొమ్మమీద - సిలకవాలెగారంగా[1]
ఆసిలకపలికె పలుకులాకు - అంసనడిసెగారంగా ॥పడగ॥
మోదుమాను[2] కొమ్మమీద - మొగిలిరెకువారంగా[3]
సూడరమ్మ దానికనులు - సూదిమొనలుగారంగా[4] ॥పగడ॥
జోడు గచ్చకాయలురెండు - జూదమాడగారంగా
జూదములో వొక్కరాజు - వోడిపోవగారంగా ॥పగడ॥

## 72. పరమపద గోయింద

(పాడనవారు : 1. చౌల నరసింహదాసు, 2. మందపాటి రాములు, 3. చెప్పాల చెన్నయ్య, 4. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు, 5. తోట హనుమయ్య.)

---

1. రెండుమూడు నల్లకాకులు - ఆటలాడగాలలనా
పగలుకాడి బాలలంతా - పాటపాడగాలలనా (అ. చ, జూ. పో.)
2. మోదుగమాను.
3. మొంచె సింతమానుమీన - మొగిలిరెకువాలలన (పాకాం., జూ. పో)
4. సూడబోతే దానిరొమ్ము - సూదిపొన్నురేంలన (పాకాం, జూ. పో)

పరమ ద గోయింద మాదవ
        పద్మనాబ జనార్దనా[1]
గజ్జె లందెలు పాదములపై
        గల్లు గల్లున మోగగా
గుజ్జు రూపము వొజ్జ గనపతి
        ఏమి పరసము సందమో[2]
ఎన్నగను ప్రెహలాద బక్తులు
        యెలమితో నిను గొలవగా
యిన్నపంబినుమయ్య తిరుమల
        హృదయ యెంకట నాయకా
సామి గనపతి నాయకా
        సామి యిగ్న యినాయికా
శరను మోముల జంగమేశర
        జేస్ట పుత్రి యినాయకా
తోకతో సురటీలు యిసరగ
        తనమోము చరనములాపుసూ
యిన్నపం బినుమయ్య తిరుమల[3]
        హృదయ యెంకట నాయకా
సామి గనపతి నాయకా
        సామి యిగ్నయినాయకా (చౌ. దా.)

---

1. శరను శ్రీధర గరుడ వాహన
   శరను యెంకట నాయకా (అ. చ, మం. రా.)
2. ఉదయ నాబ్రెము లాదగా. (పొరాం., చె. చె.)
3. ఏకదంతము వొజ్జగనపతి
        యేమి యందము సందమో
   కుడుములు వుండ్రాళ్ళునికరా
        పోసెదము గననాయకా
   కొటియరకలు సీకుచెప్పెద
        కాపాడుము నాయకా (అ. చ., చె. చె.)

## 73. పసుపూగొట్టే సిన్నా పడతీ

(పాడినవారు 1. జూపల్లి హొన్నెయ్య 2 కొండం వెంకట నర్సయ్య 3. నెమలి రామలింగారెడ్డి

పసుపూ గొట్టె సిన్నా పడతే పలకారించావే
వోలనా పలకారించావే
గంధానూ కస్తూరీ నాపై సిలకారించావే! ॥పసుపు॥

ఇన్ని సొమ్ములు యెంత కిస్తా గొల్లావారికి
వోలలనా గొల్లావారీకి[1]
ఎల్లుండి నువ్వు రాకుంటె నాపల్లనేరమా! ॥పసుపూ॥

పాలాకానీ నువ్వేరావే పనసపాటీకి
వోలంనా పనసాపాటికి
నెతీకానీ నేనేవత్తా నెలతాపాటకి ! ॥పసుపూ॥

ఎల్లాయూరికి గొల్లాపల్లి యెంతో దూరమూ[2]
వోలంనా యెంతో దూరమూ
నేనొద్దామంటే పడకాటెల్లా ఎదమూ ఎంతుందో ! ॥పసుపూ॥

## 74. పారాబ్రెమ్మ

(పాడినవారు · కొండం వెంకటనరసయ్య)

పారాబ్రెమ్మ పారామేశ్వర
పురుసోత్తమ సదానందా ॥పారా॥

---

1. ఇన్ని సొమ్ములు యేలరకిస్తా గొల్లావానికి
పిల్లడ గొల్లావారికి (పారాం., కొ.వెం.)

2. పోయిలూరి రావణ మీకు సందుదూరమా
పిల్లడ సందు దూరమా
జామొస్తానంటే పడపల్లా ఎంతా దూరమూ
పిల్లడ యెంతా దూరమూ. (అ.చ., కొ.వెం.)

పరాంజోతీ పరాత్పరా
పతితపావన సుప్రకాశ
వరదాయక సకలలోక
వాంఛిత సుకదా ప్రమేయ
పాయి పాయి మంపాయి ॥పారా॥

## 75. పాలావరునాప సిలకా

(పాడినవారు . 1. చౌల నరసింహదాసు 2. చెప్పాల చెన్నయ్య
3. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు. 4. మక్కెన బంగారయ్య)

పాలావరునాప సిలకా పలువరుసా రేమి
పలుకవేమోయి తమ్ముడా
వోయీ లచ్మనా పలుకవేమోయి తమ్ముడా[1] !
ఒదినా కోసాము బోయా వారాది గట్టించి
వారిగిపోతీవి తమ్ముడా
వోయీ లచ్మనా వారిగిపోతివి తమ్ముడా!
కొండలకు పాడ్మాటా కోనేరు తొవ్వించి[2]
కూలీ పోతీవీ తమ్ముడా[3]
వోయ్ లచ్మనా కూలిపోతివి తమ్ముడా!
ఆకాశనుండేటి ఆ యింద్రాజిత్తు
సూర్యబానము నాటెనా

---

1 వో లచ్మనా పలుకావేమోయి తమ్ముడా (పారాం , చె చె )
లచ్మన తనయా పలుకు ముద్దుల తమ్ముడా.
2. కొండలకు మజ్జలో కోనేటి దగ్గర (పారాం , బొ.వెం )
3. i) కోలుపోతిరా తమ్ముడా (పారాం., బొ.వెం )
ii) లచ్మనా తనయా కోలుపోతిరా తమ్ముడూ (పారాం , బొ.వెం.)

వోయ్ లచ్మనా శెంద్రాబానము నాజెనా![1]
నీయంటె తమ్ముండూ యిక నీరమంతుడా
ఏజల్మమునా జాతురా
వోయ్! లచ్మనా! యే జల్మమున జాతురా[2]!
యేడాలు యేడాలేకాని యెదుటెకెన్నడురావు
తొడంపై వోరాగిరివా
వోయ్ లచ్మనా! తొడలపై వోరాగీతివా[3]!

---

1. పాపిస్టి రామనుని బానమూ తాగిలీ
వొరిగి పోతివా తమ్ముడూ (పారాం, వొ. వెం)
ఈ యాంద్ర రాష్ట్రమున యీ అంసా జీవికి (పారాం., మ బం.)
2. మనతండ్రి దశరద మరెయాద తాప్పక
అడిమి పాలుగ జేసెరా
లచ్మన తనయా అడిమిపాలుగా జేసెరా (అ. చ., బొ. వెం)
పుట్టినపుడు కయిక కుతికానిండొప్లూపోసి
కూర్చి సంపకపోయెరా
లచ్మన తనయా కూర్చి సంపకపోయెరా (అ. చ., బొ. వెం.)
పుట్టినపుడు తల్లి యిసములు పోయక
యెతలు జెందకపోతివా
వో లచ్మనా యెతలు జెందకపోతివా (అ చ, పారాం., చె చె.)
ఉత్తమ యిల్లాలు యెదురుగ రాగానే
ఉరిమెళతొ యేమందురా
లచ్మనా తనయా వురిమెళతొ యేమందురా! (అ.చ., బొ.వెం.).
3 రావోయీ అనుమంతు బీమంతుడవు నీవు
సంజీవిని తేగలవుగా
నా చిన్ని తమ్ముని సామిని లేపగలవుగా
నిదయ నామీద సల్లాగా గలిగుంటె
సంజీవి తేగలనుగా
లచ్మన సామిని లేపగలనుగా ॥పాలా॥ (అ.చ., బొ. వెం.).

## 76. పాయి పాయి గనేశ

(పాడినవారు : చౌల నరసింహదాసు)

పాయి పాయి గణేశ బవుకర
పార్వతీశ కుమారకా
పాయి బంగరు గండపెండెర
పాదములు నెరనమ్మితీ
ఆడెదము పాడెదము కోలన్న
ఏసెదము బయబాత్తితో
మేమాడెదము కడు శ్రద్ధతో
మొక్కులొసగెటి వారి పనులను
సక్కబెట్టే దేవరా !
మా బత్తిగని కాపాడరా
మక్కువతో త్రిబుగుణములేలెటి
    కొక్కు నెక్కిన దేవరా
మా బత్తిగని కాపాడరా ॥పాయి॥

## 77. ప్రతివత యెప్పుడు

(పాడినవారు : నెమలి రామలింగారెడ్డి)

ప్రతివత యెప్పుడు పతిపాదంబులు
    పూజించినదే ఆడది
పతిని యిడిసి పరపురుసుల యెంబడి
    పరుగులెత్తినది గాదెవ
అత్తమామలను ఆదరించుకొని
    హొత్తుతో వున్నదే ఆడది
యిత్తనమంతా సేతాబట్టి
    పెత్తనము జేసినది గాడెద

బావ మరుదులను అన్నలో బావను
    జూసుకున్నది ఆడది
కుచ్చిత గుణములు మదిలోనుంచి
    తంతనము జెందినది గాదెద
వచ్చేపొయ్యే సుట్టాలనెల్ల
    సంపచ్చన జేసిందాడదీ
కావర గునములు మదిలో నుంచీ
    పామరము జెందినదిగాదెవ (నె. రా.)

## 78. పేదల్లారా

(పాడినవారు : కొండం వెంకటనర్సయ్య)

పేదల్లారా వో పేదల్లారా
మంచీ దనికూనాకు సేవలుజేసే
పేదల్లారా సైసై!
ఇల్లే లేదుగా ఆఁ పొలమే లేదుగా
ఈ గుంపేడు పిల్లాంతోనూ
కాపుర మేలాగా సైసై!
కష్టసేవులహా ఆఁ పంచారాతేగా
ఆఁ మొదంకూ పూయీూ పూతలు
సున్నపురాళ్ళేగా సైసై!
ఒర్సకులంరా! ఆఁ.... కార్మికులారా!
మన కష్టాలను గట్టెక్కించేప
నాయకు దేవండి
కలికిరో యినగదవ
కొండ వెంకటనర్సయ్య
బుమ్మకుక్కపరో సేర్పినాదే
కులుకుల కోలన్నా సైసై! ॥పేద॥

## 79. పోతుంది సూడరా

(పాడినవారు . నెమలి రామలింగారెడ్డి)

పోతుంది సూడరా కల్లింటికి
లంజె తాగినంకారాదు మాయింటికి
పోతుంది సూడరా జీతగాని వోలె
కాసు సేతీకిచ్చి కలుబోయమంటాది
సుట్టాలు వచ్చిననూ మాయింటికి
కల్లు బాగుంటె రేపొత్త మీయింటికి
సల్ల దాగినవారి కీనాటికి
కల్లు సంగతేమెరకమ్మ లోకానికి
కల్లైతె తాగింది - కళ్లెల్ల బెట్టింది
పళ్ళిగల బట్టింది - బడబడా గక్కింది
ఇకపోను కల్లుకి యేనాటికి
ఎంతపని యాయనే దేయానికి
ఆది సింతలే జేసింది పానానికి
యికపోను కల్లుకీ యేనాటికి యాని
బుద్ధులే జెప్పింది పానానికి
ఎవరన్న జూచితే యేమనుకుంటరని
బట్ట దులుపూకోని బాటబడి వస్తుంది

## 80. పో పోమ్మానే

(పాడినవారు · 1. జంపల్లి పొట్టెయ్య, 2. కొండ వెంకట నర్సయ్య)

పో పోమ్మానే పొమ్మానే
పో పోమ్మానే పొమ్మానే లలనా

వాడ్ని వో వోమ్మానే వొమ్మనే[1]
కరులు మోడిసినాడు[2]
సిరత పాయమున[3]
ఉరులొడ్డి నన్నెంతో
మరులు గొలిపేనే వాడు[4] ॥వో వోమ్మనే॥
అద్దములో దొట్టు రిద్ద నేర్చినగాని
వద్దాకు రంమ్మాని వరలు పలికేనేవాడు
వాడ్ని వో వోమ్మానే వొమ్మానే
ఉసెత్తు పాట. తిమ్మలకుంట తిరనాల
దుమ్ముల గింజలబాయి[5] ॥తిమ్మల

## 81. బంతిపూలా

(పాడినవారు : కొండం వెంకటనర్సయ్య)

బంతిపూలా వోసిన్నదానా
బండితోలే వో సుబ్బరాయుడా
బంతిపూలు యిక వాడిపోయే
వాడి ప్రెమలు యిక తీరిపోయే ॥బంతి॥
పెసరపూతా వోసిన్నదానా
పెదవులెత్తి నన్పిల్వరాదా
పెసరపూతా యిక రాలిపోయే
వాడి ప్రెమలు యిక తీరిపోయే ॥బంతి॥

1. అద్దాల మేడలో ఉద్దరముండంగ
ముద్దు టుంగరమిచ్చి ముద్దు బెట్టిన జాలు (అ.చ., కొ.వెం.)
2. ఆఁ....కురులూ ముడికీ రాని (పాతాం., కొ.వెం.)
3. కులుకూ ప్రాయమునాడు (పారాం., కొ వెం.)
4. ఉరులొడ్డి నాళ్ళంత - మరులు కొమ్మానే (పాతాం., కొ వెం)
5. సిత్తారు సెవికలో - సెలియా నే నుండంగ (అ.చ, కొ వెం.)

వారముసుకుల వోసిన్నదానా
ముసుగులెత్తి నన్పిల్వరాదా
వారముసుగులు యెగిరిపోయె
వాడి ప్రేమలు యిక తీరిపోయే! ॥బంతి॥
సూరుకింద వడ్లెండబోసి
సూసుకుంటా నేదంచుకుంటా
వడ్లపొట్టూ యికలేసిపోయె
వాడి ప్రేమలు యికదీరిపోయే! ॥బంతి॥

## 82. బలిరె కమ్మంపాడు

(పాడినవారు : చెప్పాల చెన్నయ్య)

బలిరె కమ్మంపాడు[1] బలిరె కమ్మంపాడు
బలమైన కమ్మోరు బాగ్గెమున్నది కమ్మంపాడూ
ఉత్తమైనా కమ్మంపాడూ
అటునిటు పూగుసున్నది కమ్మంపాడూ
అయ్యో గుంటూరి జిల్లాలో గురిజాల తాలుకా
మాశెర్ల పోస్టుకి మజ్జెవున్నది కమ్మంపాడూ
వయ్యారి సోజ్జమైనా కమ్మంపాడు ॥ఉత్త॥
పల్నాటి సీమలో కమ్మం పాటిలో
కోదండ రామయ్య[2] కొడుకు రాంబ్రెమ్మయ్య
గోవులు కాసేటి గోపాల నరసయ్య
గోవుపాలాతోనే పందెవేసిన కమ్మంపాడూ

---

1. భళిర కంభంపాడు.
2. కంభంపాటి వాసి కమ్మకులానికి చెందినవాడు ఈ కాలంలోని వాడే. మోజుపడి కోలాటం పంతులు చెప్పాల చెన్నయ్యతో తన కుటుంబంపై పాట చెప్పించుకున్నాడు. ఈయన కొడుకులు 1. గోపాల నర్సయ్య. 2 రాంబ్రెమ్మం. ఈ పాట "బలిరే టంగుటూరు" అనే పాటను అనుకరించి పాడింది. చరణాలు, లయ, పల్లవి మొదలయనవన్నీ అనుకరణలే.

వయ్యారి సొజ్జమయినా కమ్మంపాడూ
మన్నె రేగళ్ళేమీ, పైరవరిగేలేమీ
వజ్రాలు, మోరీలు, వర్తకులు, కోమట్లు
వయిలు గున్నది కమ్మంపాడూ
వయ్యారి సొజ్జమైనా కమ్మంపాడు ॥ఉత్త॥
పెదపెద్ద నాగేళ్ళు పేరైన గుంటకాలు
ముప్పూరి పగ్గాలు మునమాను కర్రాలు
అనుమంతు దట్టీలు అయిదేళ్ళ కుంగరాలు
అమిరి వున్నది కమ్మం పాడూ
ఉత్తమైనా కమంపాడూ
అటు నిటు వూగుసున్నది కమ్మంపాడు

## 83. బలిరె టంగుటూరు

(పాడినవారు : 1. చౌల నరసింహదాసు, 2. చెప్పాల చెన్నయ్య, 3. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు.)

బలిరే టంగూటూరు బలిరే టంగూటూరు
బటుపైన కాపులు బామలున్నది టంగుటూరూ
వయ్యారి సేడెలున్నది టంగుటూరు
ఆహా యిస్తరెంచిన టంగుటూరూ
అటుయిటు వూగుసున్నది టంగుటూరు!
గుత్తంపు తోటైన సజ్జ మామిళ్ళయిన
వజ్రాలు మోరీలు వర్తకులు కోమట్లు
వయిలు గున్నది టంగుటూరూ
అటు యిటు వూగుసున్నది టంగుటూరు!
పెదపెద్ద నాగేళ్ళు పేరైన గుంటకాలు
ముప్పూరి పగ్గాలు ములకాల కర్రాలు
అనుమంతు దట్టీలు అయిదేళ్ళకుంగరాలు

(పారాం., చె.చె )

అమిరి వున్నది టంగటూరూ
అటుయిటు పూగుసున్నది టంగుటూరూ!
రేనాటి బూమిన నెమిలి సిన్నపరెడ్డి
కొడుకు అయ్యపరెడ్డి
గోపాల కిష్నమ్మ గోవులే కాయంగ
గోవుపాలాతోనే కోరియేసిన టంగుటూరూ
ఆహా యిస్తరించిన టంగుటూరూ
అటు యిటు పూగుసున్నది టంగుటూరు!
ఇవతలా సెన్నేరు అవతలా మన్నేరు
నడమ కందూకూరు, కందూకూరూ సుట్టు
గనమైన పట్నాలు కదులుతున్నది టంగుటూరూ! ॥ఆహా॥
పెసరబేడల సీరె పేటంచు రెయికాది[1]
వయ్యారి సేడెలున్నది టంగుటూరు[2]! ॥బలిరే॥

## 84. దేశభక్తి గేయం

(పాడినవారు: 1. చౌల నరసింహదాసు 2. చెప్పాల చెన్నయ్య 3. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు)

బారత దేవిరో నిన్నూ బాగుగా నెరనమ్మినామూ
బారమనక మమ్ముల బ్రోవుమా బాత్తులజననీ
గొప్పదాన వనుసు నిన్నూ కోరి వేడినాము జనని
తప్పకా రాచ్చించవలెనుగా దయచేద జననీ
అమ్మరో నిను నమ్మినామూ ఆపదలను దీర్చవేమీ

---

1. పెసరబేళ్ళా సీరె పేటంచు రెయికలు (పారాం., చెచె)
2. అత్తార్ పన్నీరు అద్దాలమేడలు అమిరి వున్నది టంగుటూరు (అ.చ., చె.చె.)

కొమ్మరో రాచ్చింపవలెనుగా దయలేద జనని[1]
వాసిగా శ్రీనాగరుకంటే[2] వాసుడయిన నాగమణిని
దాసు-ము రాచ్చింపుమా నీ దాసులు జనని ॥భారత॥ (పొ.దా)

## 85. భారతీయులారా

(పాడినవారు : బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు)

భారతీయులారా మనకి
భాగ్గె దైవతనమున్
పారవేసుకొంటి మనసా
భారతాంబ నేడ్చె నాయనా
ఆటలాడిరీ అచ్చరు
లాటాలాడిరీ నాయనా
హారతు లిచ్చిరీ గాందికి
హారతు లిచ్చిరీ నాయనా
గగనమునకు సెండ్లెగరవేయగను
కస్తురి పోకయి రేకలతో చెల్ ॥ఆట॥ (బొ.వెం.)

## 86. మంగాళమని పాడి ఆడరే

(పాడినవారు · జూపల్లి పొట్టయ్య)

మంగాళమని పాడి ఆడరే
అంగానులు జయ జయ
మంగాళమని పాడి ఆడరే
సుందరమైనట్టి మేలు

---

1. ఏమనీ వర్ణింతూనిన్నూ - యేటికి దయరాదే జనని
ముందు భద్రాద్రియందూ - కొదువాలేకుందు
దోసిలొగ్గియుంటి మోయమ్మా దయజూడుజనని (అ.చ., బొ.వెం ,
2. వాసిగా ఏజెండ్లాదాసా-వాసుడయిన నాగమణిని (పారాం , బొ.వెం.)

బంగారు పళ్ళెరమున
రంగు మీరియున్న మంచి
చెంగదీసి రాలు గట్టి
చెంగున యా రాజులు
సారంగును సూరించి
ఇంత మాయ ప్రెపెంచము
రంకు చేయగాను మీరు
సంకటములన్ని బాపు
యెంకట రమణాలాకు ॥మంగళా॥
హద్దు దప్పకాను పారు
సుద్దిగాను ఆత్మలోనే
ఆత్మలోనే పొద్దు పుచ్చును ॥ఇంత॥

## 87. మందయ్యాన - వో మందయ్యానా

(పాడినవారు : 1. నెమలి రామలింగారెడ్డి 2. కొండం వెంకట నర్సయ్య 3. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు)

మందయ్యానా వో మందయ్యానా
నీమాటాలెంతో మామిడిపళ్ళు
సుందారాదానా సైసై[1]
ఏమే బామా! మాట్టాడావేమే
కిట్టబాలుడు సిన్నోడనుకున్నావా
బామానందానా సైసై
బామామంచిదీ బంగారూగూళ్ళదీ
నేనేమిజేతును తమ్ముళ్లారా
కానీకులమూదీ సైసై[2]

---

1. మందయ్యాన వో మందయ్యానా
యెంతో దండానా జేసేటివాడే
కుందారాదానా సైసై (పారాం., కొ. వెం)

చైత్రసుద్ధ నామీనాటా
కిట్కా! తెన్న కేశవులు పెళ్ళిగదురా
తెలియా నందనా సైసై
అక్కా సూడే! యీడెక్కడోడే
నా పక్కలోన సేరీనాడూ
సక్కానోడే సై సై[3]
బామా నమ్మితీ! బామా పిల్లనమ్మితీ
బామాకున్న పల్లెదండ పల్లా కమ్మితీ సై సై
బర్రెనమ్మితీ బరె దూడానమ్మితీ
బర్రెకుండా పంగలగుంజ
పన్నూ కమ్మితీ సై సై[4] ॥మందయ్యాన॥ (నె రా.)

---

2 బామా మంచీదీ బంగారు గుళ్ళవీ
అది కానీకులము కన్నెపడుసు
యేమిజేతురా సైసై (పారాం., కొ. వెం )

3. అక్కా సూడే యీ డెక్కడోడే
మన పక్కాన బడుండేవాడు
సక్కానయ్యా సై సై (పారాం., బొ.వెం.)

4. కలికిరొ యినగదవే - ముడుమాల కోటయ్యా[5]
శ్రీ రుప్పినీపురములో[6] పిల్లుట్లా బాలులకూ
బల్మకుక్కవతోచ సెప్పినాడే కులుకుల కోలన్నా సై సై[7] (అ చ ,కొ వెం )

5. కొండం వెంకట నర్సయ్యకు కోలాటం నేర్పిన గురువు.

6. పిల్లుట్ల శివారులోని గ్రామము

7. బామరొ యినగదవే - కొండ వెంకటనర్సయ్యా
కయ్యా జేసీ నాడూ గదరా
కలికీ నందనా సై సై (కొ.వెం.)

## 88. మదనాజనకా సిన్నికిస్టొన్న

(పాడినవారు : నెమలి రామలింగారెడ్డి)

మదనా జనకా సిన్నికిస్టొన్న
మానవేరా అపర బుద్ది
యెరుగనమ్మా యేశోదమ్మా
యేమి పనులు జేసితినమ్మా!
కొత్తా కోడలిల్లా జేరి
దుత్తాలన్ని పగలాగొట్టి
మొత్తుకున్న కొరడు దాన్ని
వత్తీ వత్తీ సంపీ నావట!
వారూ జలకామాడు సుండగ
సీరాలన్ని మూటాగట్టి
పొన్నా సెట్టూయెక్కి కూసోని
యెంతయేడినా పలకాడాయె!
మదనా జనకా సిన్నికిస్టొన్న
అద్దరాత్రీయేళా కిస్టున్నడు
మిద్దెలెక్కివచ్చి కూచొన్ని
నిదరబోయే స్త్రీలా జడలను
కట్టీ పరిగెత్తొచ్చినాడు ॥మదనా॥

## 89. మనోహరాయినరా

(వాడినవారు : 1. చౌల నరసింహ దాసు, 2. చెప్పాల చెన్నయ్య, 3. మక్కెన బంగారయ్య, 4. మందపాటి రాములు)

**మనోహరా యినరా**
**నా మనమని గైకొని పోరా**
**వాసిగ సిటుకుల కేశవ దాసుని**
**వాసి కెక్కిన నిన్నే నమ్మితిర** ॥మనో॥

మీన కేతనుడు - మానక శరములు
మానక మాపై - పూనివైవెద[1] ॥మనో॥
పొన్నల సాటున - కన్నూ సైగల
యెన్నా చొంగవని - నిన్నే నమ్మితిర.[2] ॥మనో॥

## 90. మల్లెపందిరదిగో

(పాడినవారు : 1. చౌల నరసింహదాసు. 2 శివయ్య. 3. తోట హనుమయ్య)

మల్లె పందిరదిగో శెలి - మాదవుపల్లతుగో శెలి
మల్లె సుగందులు మలిసికొలపగా
వల్లగాదు యిది పల్లవపానిరో[3] ॥మల్లె॥

సెయి సెయ్యి గలిపి మానా - సేతులు పైకెత్తి[4] వోశెలి
హరిగోయిందని అడుగులు వేయుసు
బజగోయిందని పదములు పాడుసు ॥మల్లె॥

మాటి పారణములూ శెలి - పూలకార్పణములూ
రారా కిష్ణని రమనులు పిలవగ
పోరా కిష్ణని పడతులు మేచ్చగ[5] ॥మల్లె॥

---

1. వాటముగను - తన గోటమీటు సును (అ చ., చె చె)
2. తకదిమి తకదిమి - తకునట జనతరి
ఇట్టియ్యకు తద్ధిమిత. (అ.చ., మ.బం.)
3. మల్లె పందిరదిగో సుందరి మాదవు దల్లడుగో
మొల్ల సుగందులు మొనిసిగొలవగా
పల్లకాదువో పల్లవపానిరో (పారాం., పా.శి.)
4. అంగనలనూ బిలిసీ సెంగులశామరములు వీసీ
అబ్బురంబుగానూ గుబ్బలుబ్బునూ -
మబ్బు దీరినా మదన కటారిరో (అ. చ., పాశి.)
5. మిరతోరనములూ - మొగిలి విరుల దర్పనమూ
రారా శ్రీక్రిష్ణని సతిపతులు గొలవగాను
రమ్యమైన రాకేందువదనముతో (పారాం , పా.శివయ్య)

శెందన తరువులనూ నీడ శేసతల్పములనూ
 శెందాస్తంబము లందు తోడునే
 పొందునుగను మకరందము బట్టితి ॥మల్లె॥
శెలియలంత గలిసీ మరియొక - శెలిరమ్మని పిలిసీ
 శెలియరో మోముల కరియాడ మొసంగిన
 యెంకట పలితోటా వోశెలి ॥మల్లె॥

## 91. మాను మాను పూలుగోసి

(పాడినవారు : వెప్పాల చెన్నయ్య)

మాను మాను పూలుగోసి
 మాను మొదట్లో రాసిపోసి
వాడు బోయె వాడ పేరమూ
 సావాసకాడా వోలలాడే బాలప్రాయమూ
నే సిలకనిచ్చి కొంచనిమ్మా
 సిత్రకోళ్ళ పట్టెమంచ ॥నే సిలక॥
ఆయ్యో యిద్దరికి యిమ్మలాలదూ! రంగయ్యబావ
 గూడుటూడు బాగ వున్నది.

## 92. మాలెత్తి జవ్వాలు

(పాడినవారు : కొంచం వెంకట నన్నయ్య)

మాలెత్తి జవ్వాలు పోయాలి నరుడా
నాగార్జునడాము నిలపాలి తమ్ముడా
యిలుకాలనంటారు పైలానంటారు
యిజయపురంటారు అవటిల పెట్టండి ॥మాలెత్తి॥
రైటు బాంకంటారు లెంపమోటంటారు
సాగర కేంపంత యిపతలు పెట్టండి ॥మాలెత్తి॥

ఆనీరు పారాలి మాభూమి మారాలి
మాభూమి మారాలి మాగాని కావాలి
మాగానికావాలి మాసేనుపండాలి
మాసేను పండాలి మామూలనిండాలి
మామూల నిండాల పిల్లలెల్లా బతకాలి ! ॥మాలెత్తి॥

## 93. మెళ్ళోముచ్చాల పేరు

(పాడినవారు : చౌల నరసింహదాసు, 2 చెప్పాల చెన్నయ్య,
3 బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు )

మెళ్ళోముచ్చాలపేరు ముద్దుగొమ్మా బంగారి బొమ్మా
సక్కానిగోపాల కెష్ణుడమ్మా ప్రేమనాదుడమ్మా
చెలీ యీ రాత్రేవచ్చినాడు
బాలుడమ్మా ॥చెలీ ఈరాత్రే॥
ఈ రాత్రేవచ్చినాడు బాలుడమ్మా గోపాలుడమ్మా ॥సక్కాని॥
మేటి సావారి మీన
వచ్చెనమ్మా ॥మేటి॥
మేటిసావారిమీనవచ్చెనమ్మా మెల్లిపోయెనమ్మా ॥సక్కాని॥
జోగీ జగ్గయ్య పేట
వాసుడమ్మా ॥జోగీ॥
జోగీ జగ్గయ్యపేట వాసుడమ్మా వాసుదేవుడమ్మా
ఉరపాతి కొండమీన యీసుడమ్మా యెంకటేశుడమ్మా
పట్టూపీతాంబరము
తెచ్చినాడే వాడు ॥పట్టూ॥
పట్టూపీతాంబరము తెచ్చినాడే సెలికిచ్చినాడే
సిగనా సంపెంగపూలు సుట్టినాడే వాడు ముడిసినాడే ॥మెళ్ళో॥

1. మేటిసవారిమీన పోయెనమ్మా యెల్లిపోయెనమ్మా (పాఠాం., పా.వెం.)

## 94. మేరువా సావాల్మ్రద

(పాడినవారు : 1. చౌల నరసింహదాసు 2. చెప్పాల చెన్నయ్య
3. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు)

మేరువా సావాల్మ్రదా సందమామో రాజూ[1]
మేటియొక్క మాల్లట్టె[2] సందమామారాజూ
రేపు జూస్తే యెంకటగిరిలో సందమామారాజూ
రేల బూసి నటులే యుండు సందమామారాజూ
మాపు జూస్తె యెంకటగిరిలో సందమామారాజూ
మల్లె బూసి నటులే యుండు సందమామారాజూ
పొద్దుబోయీ యెంకటగిరిలో సందమామారాజూ
పొన్న బూసీ నటులే యుండే సందమామారాజూ
ఎంపల్లి పూవూలాకూ సందమామోరాజూ[3]
సొంపు లేల కాలపయ్యా సందమామారాజూ[4] ॥మేరువా॥

## 95. యోగిరా సయ్యోగిరా

(పాడినవారు : చౌల నరసింహదాసు. 2. మక్కెన బంగారయ్య)

యోగిరా సయ్యోగిరా
సంసారిరా సుకబోగిరా

---

1. మేల్వా సవాల్మ్రనా సందమామారాజూ (పెంరాం, చె చెం.)
మేర్వాస్తంబాల్మ్రనా సందమామారాజూ (పాలాం, చ చె)
2. మహల్.
3. ఏడు గొర్ల మందసేలో సందమామారాజూ,
ఎత్తెనోయీ గుబ్బగొడుగూ సందమామారాజూ (అ వ, చె చె.)
4. సందమామా సందామామా సందమామో రాజ
సంది తెల్వేగ్గేను లెవరో సందమామా రాజ
జంట నాగ సరమునుబట్టి సందమామారా
పాముకు ఆటపాటల్ నేర్పినాడూ సందమామారాజూ
తొమ్మిది కోమల్ ఓగియించాడే సందమామారాజ
పాముపొవు మెలుకువాతో ఓరుగూసుండె సందమామారాజూ (అ చ., చె చె)

అపి వసుపు వగిసిన దాని కౌంగిట
వౌంలాడిరి బాంలా[1]
కాళ్ళగజ్జెలు కంచుతాళము[2]
వెనక మద్దెల నింపగా[3]
అది తధిమి ధిమితప లాడుసున్నది
కిన్నెబౌగము సిన్నది[4] ॥యోగిరా॥
నూనెబుంగద జారుకొప్పుపి
కాటుకా కన్నులదీ
అది సీకవెంకికి వన్నెదెప్పిన
అతివ యెరకల సిన్నదీ ॥యోగిరా॥
తడిన వాత్రము మెడన లింగము
నొసట యీబుది రేకదీ
అది మాటెమాటికి శివుని దలిసే
మటము జంగము సిన్నది ॥యోగిరా॥
గోరమైనా అడిమిలోనే
సీరెలుదికే సిన్నదీ[5]

---

1. ఎగిసి సొగసీ దాని కౌంగిట
వోలలాడిరిబాలలా (పారాం.. మ. బం.)
2. యీాటలో దానిల్లురా
బాజారులో దానంగడీ
అది గడియ గడియకు పేటమిస్తది
సకియ రోమపి సిన్నది (అ. చ., మ. బం.)
3. తొడన తలుకులు పసిడిరంగుల
పంతి నోరూసిన్నది (పారాం., మ. బం.)
4. తకిట ధిమితప తకిట ధిమితక
సకియబోగము సిన్నది (పారాం., మ.బం.)
5. గోరమయినా అడిమిలోనే
సీరెలుదికే సిన్నదీ (అ.చ ,మ.బం)

అది యాడి యిష్నూకొన్నెదెచ్చిన
యతివ సాకల సిన్నది ॥యోగిరా॥

వదన తలుకులు పసిడి రంగులు
పడతి సొగసుల మాటదీ
అది శెరువు వాకిట సీరెలుదికె
సేడె బ్రేమ్మణ సిన్నది ॥యోగిరా॥

సిన్నదీ బలె వన్నెదీ
యేమన్నదీ రమ్మన్నదీ
అది కంటికి యింపయినా సిన్నది
కర్నగొల్లోళ్ల సిన్నదీ ॥యోగిరా॥

తెల్లవారెను కోడిగూసెను
సేత పిడకల గంపదీ
అది సుట్టూ యామడ గట్టూకొచ్చిన
సేడెసూద్రుల సిన్నదీ[1] ॥యోగిరా॥

లొట్టిమీదా లొట్టిబెట్టీ
దుత్తమీదా దుత్తాబెట్టీ

---

1. యీపు జడలది తోపురెయికదీ
లోపలా తాబొందుదీ
అది మారుబాసాలాడుతుంది
మగవ తురకల సిన్నది ॥యోగిరా॥

మాట యున్నది మళ్ళిరమ్మని
మెడకు గందము పూసెరా
మెడకు పూసిన మంచి గందము
నెలకి గుమగుమలాడెరా ॥యోగిరా॥

పెళ్ళిగానిదాన్నిరా పెనిమిటి
మొకమెరుగానురా
నాపుముగ్గురు మొగులు గలరని
నవ్వుతుందురు జగములో ॥యోగిరా॥

(అ.చ., మ.బం.)

అదికల్లో కల్లని యమ్మతున్నది
కాంత గొంలోళ్ళ సిన్నదీ ॥యోగిరా॥
దీని యర్ధము దెలియరయ్యా
సదువుకున్నామాన్యులూ
ఆరు నెలల గడువు యిచ్చెను
అయ్యా యీరబ్రెమ్మమూ ॥యోగిరా॥

## 96. రండీ రండోయీ

(పాడినవారు : 1. చొల నరసింహదాసు, 2. తోట హనుమయ్య)

రండీ రండోయీ
యిక లెండీ లెండోయీ
దండీగ వరగత్తెర కోపు
తొరగా[1] వేయూడీ లలన
కాళ్ళా గజ్జేలూ
చే కర్రా యేటూలూ[2]
మెల్లాగా కలగలుపుడు తేనె
వలపూ పాటలూ లలన
మొలక నవ్వులూ
మో వంపూ[3] సూపులూ
ఈ శెలియల వలపులు మానుడయ్యా
తలలా వొంపూలూ లలనా
ఏకా మనుసూతో
సరివేశుడి బాటూతో
సీకాకూ పడకా వేయూడయ్యా
బారత కోలన్నా లలనా ॥రండీ॥

---

1. త్వరగా, 2. బ్రేటులు, 3 మోహంపు.

## 97. జోల పాట

(పాడినవారు : 1. చౌల నరసింహదాసు 2 చెప్పాల చెన్నయ్య
3 బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు)

రామా లాలీ మేగ శ్యామాలాలి
తామా రాసానయనా దశరద తలయాలాలీ నాయనా
జో కొట్టి జోలలు పాడితే
ఆలకించేవా నాయనా! ఆలకించేవా
సాలించి వూరుకుంటే సైగలు సేసేవా
నాయనా సైగలు సేసేవా ॥రామా॥
ఎంతో ఎత్తూ మరిగీ నావూ యేమీ జేతురా
బొజ్జాలో పాలరుగుడుగాక నిద్దర బోవరా
నాయనా నిదరా బోవరా ॥రామా॥
అబ్జ వజనా[1] ఆటలాడీ ఆలకించేవా[2]
బొజ్జాలో పాలరుగుడు గాగ నిదర బోవరా
నాయనా నిదరా బోవరా ॥రామా॥
ఆజోలా తొట్టిలోనే నీవు ఆలకించేవా
సాలించీ వూరుకుంటే సైగలు సేసేవా
నాయనా సైగలు సేసేవా ॥రామా.॥
అంతటికి మూలమై ఆదిరాగగా[3]
ఇంతగా యినకొండా పట్నం ఏరా రాగవా[4]

1. అబ్జవదన.
2. అబ్జవజనా ఆటలాడీ-అనుమానించకురా (పారాం., చె.చె.)
3. ఆది రాఘవా.
4. ఇంతగా యినకొండా పట్నం ఏరా రాగవా (పారాం , బొ. వెం.)

## 98. రారా ముద్దులగుమ్మా

(పాడినవారు . చెప్పాల చెన్నయ్య)

రారా ముద్దుల గుమ్మా వోలలనా
రాప్పారి సెలికాడా
రాప్పారి కురవలోనే రేపే పయానము[1]
రారా ముద్దులగుమ్మా
సెర్లోన గవిసెగట్టి వోలలనా
సేమంచి దడిగట్టి
సేమంచి వాసనకు సెదిరింది మనుసూ
రారా ముద్దులగుమ్మా
కట్టమీన కత్తి మెరుపూ వోలలనా
శెర్లోన సేప తలుకూ
ఆ॥ సింతలపూడి కురవలోనే సిన్నదానికులుకు
రారా ముద్దులగుమ్మా
కురవలోనే కూతలాయే వోలలనా
నడవలోనే జగడమాయే
నడమబొయ్యే నల్లపడుసుకి ఎడమరెక్క కేటుదగిలె
రారా ముద్దులగుమ్మా ॥రారా॥

## 99. రావే రావే నల్లతుమ్మెదా

(పాడినవారు : కొండం వెంకటనర్సయ్య)

రావే రావే నల్లతుమ్మెదా నీవు
రాకానేపొయ్యేవే తుమ్మెదా
వాడ నెవ్వరులేరు తుమ్మెదా వచ్చి
వోలలాడి పోవే తుమ్మెదా ॥రావేరావే॥

---

1. ప్రయాణము

కందిపువ్వందనము తుమ్మెదా నీ
కరణము పేరేమి తుమ్మెదా
కరణము కిష్టయ్య తుమ్మెదా వచ్చి
వోలలాడిపోవే తుమ్మెదా ॥రావేరావే॥

మునగపువ్వందనము తుమ్మెద నీ
ముడుసూబు[1] పేరేమి తుమ్మెద
ముడుసూబు సుబ్బయ్య తుమ్మెదా వచ్చి
వోలలాడిపోవే తుమ్మెదా ॥రావేరావే॥

మోదుగపువ్వందనము తుమ్మెదా నీ
మోతాదు పేరేమి తుమ్మెద
మోతాదు వుస్సేను[2] తుమ్మెద వచ్చి
వోలలాడిపోవే తుమ్మెద ॥రావేరావే॥

ఎలకపువ్వందనము తుమ్మెద నీ
యెట్టోడి పేరేమి తుమ్మెద
యెట్టోడు దేవదానము తుమ్మెద వచ్చి
వోలలాడిపోవే తుమ్మెద ॥రావేరావే॥

## 100. రెడ్డన్న పెద్దన్న

(పాడినవారు : మక్కెన బంగారయ్య)

రెడ్డన్న పెద్దన్న కోలన్న యేత్తుంటే
నీ పాన మెట్టుందిరో కొడకా
నీకేడ నిదరొచ్చెరా కొడకా
ఏ ముండ దగ్గి లిచ్చెరా కొడకా
శేత్రబోలు[4] సెగ రోగమూ[5]
ఓ.... యెరజొన్న రొట్టెతో
యెన పూస[6] ముద్దతో ॥ఎరజొన్న॥

---

1. మునసబు. 2. హుస్సేను. 3. వెట్టి.
4. చేత్రబోలు, 5. శగ రోగము, 6 వెన్నపూస

యెరజొన్న రొట్టెతో యెనపూస ముద్దతో
ఎన్నాళ్ళు యేదిద్దురా కొడకా
ఎన్నాళ్ళు యేదిద్దురా ॥ఏముండ॥
మందు పిడతొాక సీత
కోడిక వొాక సీత ॥మందు॥
మందు పిడతొాక సేత కోడిక వొాక సేత ॥ఏముండ॥
కడ యింటి సి న్నదీ
కా్రేటి కోకదీ ॥కడ॥
కడయింటి సిన్నదీ కా్రేటి కోకదీ
ఆముద్ద మొకముదీ ఆరొండ మొకముదీ
అ ముండ దగిలిచ్చెనే తల్లీ
శే్రోలు సెగ రోగము.

## 101. లాలిలాలోయమ్మ

(పాడినవారు : జూపల్లి పొట్టెయ్య)

లాలీలాలోయమ్మా లాలిమాయమ్మా
లాలీ ముద్దూలగుమ్మాలాలి సీతమ్మాలాలీ
అంగదుడు అనుమంతు అతి జాంబమంతూ
మన జనకుడింటోనే పెళ్ళి జయమందరాదాలాలీ ॥లాలి॥
కోదే కాళ్ళందరూ కోలన్న వేయ్యా
నవ్వుతూ కిష్నయ్య లాలనుసుపాడా ॥లాలీ॥
నాలుగూ యేదముల గొలుసులమరించి
బలిమైన పనిరాజు పానుపేయింటీ ॥లాలి॥
మన సెల్లాట డోలికలో సేర్చిలాలించే లాలీ

## 102. లాలిశ్రీ క్రిష్నయ్యా

(పాడినవారు : 1. నెమలి రామలింగారెడ్డి, 2. కొండం వెంకటనర్సయ్య)

లాలిశ్రీ క్రిష్నయ్యా నీలామేగాశ్యామన్నా[1]
బాలాగోపాలన్నా పవ్వళించగరావయ్యా
వాలుకొండెపువ్వులూ పల్లవిగ శిగజుట్టి
గజ్జలందెలు పాదాగల్లుగల్లూనారావయ్యా
శేసుసెలియాపై[2] పవ్వలించగరావయ్యా
నవమోవనాంకారా[3] నాంచారీకావలెనా
పొద్దూసేన వోయెదరా[4] ఒొకముద్దూనాకియ్యరా
ఇందరిలోపలనీకు యెవరుకావలెతనయా
లలితాంగి రుప్పినీ లలనాదేవి గావలెనా ॥లాలిశ్రీ॥

## 103. లేరా క్రిష్నా

(పాడినవారు : చౌల నరసింహదాసు)

లేరా కిష్నా తెల్లవారె
 లేరా క్రిష్నా
 తెల్లవారె
నారదమునులు నాట్టెము[5] సేయగ
 నారదమునులు
 నాట్టెము సేయగ
పొన్నమాను మీన పోకిరి కిష్నా
 పొన్నమాను మీన
 పోకిరి కిష్నా
సీరెలేయరా[6] యేశోద తనయ
 సీరెలేయరా
 యేశోద తనయా

---

1. నీలమేఘశ్యామ. 2. శేషతల్పము 3. మోహనంకార
4. ప్రొద్దువాలాపోయెరా 5. నాట్యము. 6. చీరెలీయరా.

## 104. పంచనగలడే

(పాడినవారు మిర్యాల ...గారయ్య)

పంచన గండే దేవాలయు
పచనని పింపడే నామరిద
మంచీ రత్నము నామరదీ
జయరాముని తమ్ముడా నామరిది[1]
ఎడూ యేళ్ళనాడు
ఎండిపోయిన జాజిమాలు[1]
ఏడూ యేళ్ళనాడు యెండిపోయిన జాజిమాలు
పువ్వులు దెమ్మనే నామరిద[1] ॥మంచీ॥
పదీయేళ్ళ నాడు
పాడుబడ్డ బాయిలోన[2]
పదీయేళ్లనాడు పాడుబడ్డ బాయిలోన
పుదకము దెమ్మనె నామరిది
నన్ను పుదకము దెమ్మనెనామరిది ॥మంచీ॥

## 105. వానలు గురవగ

(పాడినవారు : బూపల్లి పొట్టెయ్య)

ఓ. వానలు గురవగ
జానలు బండగ
వానలు గురవగ
జానలు బండగ
వలపు నిలపవే
పళపుడే లలనా
నా పయ్యారిబామా
చందానగంధీ[3] బామా

1. జాజిమాల. 2. బావిలోన. 3. చందనగంధి.

## 106. యిడవరా

(పాడినవారు తోట హనుమయ్య)

యిడవరా[1] గోపాలాబాలా యిడవరా
యిడవరా నడియీటి[2]లోపల
గడియకను[3] ప్రెజలెల్ల జూడ
యిడవరా నాకొంగిడవరా
అత్తమామలు గల్లదాననూ
కొత్తగా కోపరకమొచ్చితి ॥యిడవ॥

బడలితినినే పడుసుదానిని
యిడవరా నా కొంగిడవరా
యిడవరా నా సెంగిడవరా
బల్లు బల్లున తెల్లవారెనూ
పల్లెలకు సల్లమ్మబోవలె ॥యిడవ॥

## 107. యినవే పూర్మిళ

(పాడినవారు : 1. కొండల వెంకటనర్సయ్య, 2. మందపాటి రాములు)

యినవే పూర్మిల నా ముద్దు సెల్లెలా
సవాసగానుడమ్మా[4] నా మరిది
రగురాముల[5] తమ్ముడమ్మా నా మరిది ॥యినవే॥
హరి! పన్నెండేళ్ళ నాడు
పొడుబడ్డ బాయిలోనే[6]
పంట పండించె నమ్మా నా మరిది
రగురాముల తమ్ముడమ్మా నా మరిది ॥యినవే॥
హరి! యెదూ యేళ్ళ నాడు
ఎండిపోయిన దాడి నిమ్మ[7]
పంట పండించెనమ్మ నా మరిది
రగురాముల తమ్ముడమ్మా నా మరిది ॥యినవే॥

---

1. విడువరా. 2. వీధి. 3. దడియు. 4. సవాసగాడు.
5. రఘురాములు. 6 బావి. 7. దానిమ్మ (దాడినిమ్మ)

## 108. ఎయ్యార కోలాటం

(పాడినవారు నెమలి రామలింగారెడ్డి)

ఎయ్యార కోలాటం యీ ఆయ్యారు హేరాలు
సియ్యాతు[1] వదని తెల్పిందేసిద నీతుల కోలాటం సైసై
లంగలు[2] గూడేరు సాటున సంగము[3] జేసేరు
ఈ లంగలు జేసిన సంగాలకు యీ రంగుల కోలాటం సైసై!
తెలిసే దొక్కడురా సాచ్చెంపలికేదొక్కడిరా
తెలిపిన మాటలు పలికినందులకు కులుకుల కోలాటంసైసై!
సచ్చెము తప్పేరు బీదలముచ్చట కొచ్చేరు
ఈ రుచ్చగునంబులు యీడకు పోతే[4] కుచ్చుల కోలాటం సైసై!
దోసము లేదంటా మూతికి మీసము లేదంటా
కాసులుపొడిసితె తెలిసిందేగద కేసుల కోలాటం సైసై!
పిల్లల పాటలురా పుడిమిలో[5] సెల్లవ తీరదురా
ఈ సెల్లని సాచ్చెము పలికిన వారికి సేసిన కోలాటం సైసై!
ఎచ్చుగమునుగంటె[6] జరిగిన ముచ్చటగనుగొంటె
ఈటుచ్చిరాములు జెప్పినమాటలు పిచ్చివిగావంటె సైసై!

## 109. ప్రార్థన పాట

(పాడినవారు : జూపల్లి పొట్టెయ్య)

సెరను[7] సెరనూ వయికుంటా[8] నాయికా
సెరను శివ అనవే
గజ్జెలందెలు పాదములపై జింద
గల్లుగల్లునా మోగగ నయ్యోయ్యో
అయ్యోయ్యో యెంకట నాయికా
సెరను శివ అనవే

1. నియతి. 2. లంగులు (విటులు). 3. సంఘము 4. ఏడకపోతే.
5. పుడమి. 6. హెచ్చుగ. 7. శరణు. 8. వైకుంఠ.

కిట కిట తయ్యాకు తద్దిమిత
కాళ్ళకు గజ్జెలు గట్టి
యెళ్ళకు వుంగరాలూ బెట్టి
గల్లు గల్లున మోగనయ్యాయొ్యా
సామి యెంకటనాయికా ॥సెరనూ॥

## 110. సివ కేశవులకు బేదమూ

(పాడినవారు . బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు)

సివకేశవులకు బేదమూ
సుగ్గేనవంతులకు వాదమూ
ఎద్దునెక్కినవాడు లింగడూ
వాలి గద్దనెక్కిన వాడు రంగడూ
ఎద్దునెక్కినలింగ గద్దనెక్కినరంగ
వారిద్దరొకటేను వాదాపనరులారా ॥సివ॥
రుద్రాచ్చలు దరించె లింగడూ
తులసిమాలలు దరించెరంగడూ
రుద్రాచ్చంలింగ తులసి మాలలరంగ
వారిద్దరొకటేను వాదాపనరులారా ॥సివ॥
పులిశెర్మము దరించెలింగడూ
పట్టుశాలువ దరించెరంగడూ
పులిశెర్మములింగ పట్టు శాలువలరంగ
వారిద్ద రొకటేను వాదాపనరులారా ॥సివ॥
బూబూది దరియించెలింగడూ
పట్టెనామము దరియించె రంగడూ
బూబూదిలింగ పట్టె నామాలరంగ
వారిద్దరొకటేను వాదాపనరులారా ॥సివ॥
త్రిసూలము దరియించె లింగడూ
సెంకు శెక్రము దరియించెరంగడు
త్రిసూలములింగ సెంకు శెక్రములరంగ
వారిద్దరొకటేను వాదాపనరులారా ॥సివ॥

## 111. సివసివ యని

(పాడినవారు : నెమలి రామలింగారెడ్డి)

సివసివ యని బజియించేవారికి
సిత్తము యిలపై యెక్కడిదీ
అవివేకంబుగ తిరిగేవారికి
ఆత్మయిచారం ఎక్కడిదీ
పెద్దలు తెలియని పెడును మానవుకు
ఎద్దుగాక బుద్దెక్కడిదీ
గద్దరి సేట్టలు మానని మోటుకు
గంగాస్నానం బెక్కడిదీ
పరపురుసుల గని బ్రమిసే శేమకు
ప్రతివతదర్మం బెక్కడిదీ
ఇరుగు పొరుగు కడకేగేవానికి
ఇంటిమీన గోలెక్కడిదీ
పెండన మెదిలే కీటకంబునకు
బెల్లము రుచి యింకెక్కడిదీ
తిండిపోతునకు కుండపైన కుతి
దేమునిపై మనసెక్కడిది
పరగ రోత తినే వూరపందికి
పరమాన్నము కాంచెక్కడిదీ
మురిగిన జలములు తాగే కప్పకు
సెరుకురసము తీపెక్కడిదీ ॥సివ॥

## 112. సివసివమూర్తివి

(పాడినవారు : తోట హనుమయ్య)

శివశివ మూర్తివి గననాదా[1] నీవు
సిమునీకుమారుడవు సామినాదా

1. గణనాథ

కాపులు నిన్నుగొల్వ గననాదా నిన్ను
కాడిమేడందురయ్యా సామినాద ॥సివసివ॥

కోమట్లు నిన్నుగొల్వగననాదా నిన్ను
కోటిలాబమందురయ్యా సామినాదా ॥సివసివ॥

బ్రేమ్మలు[1] నిన్నుగొల్వగననాదా నిన్ను
బ్రెమ్మదేముడందురయ్యా సామినాదా
సివసివనాయక గననాదా నీవు
సిమునీకుమారుడవు సామినాద (తోహ)

## 113. సిముని మెడలో

(పాగినవారు : మందపాటి రాములు)

సిముని మెడలో నాగరాజా
సిన్నిపార్వతి పిలిసెను దేవా
దేవి పిలుపు లాలకించేవా
సివనాగరాజా! తల్లిపిలుపు లిన్నగించేవా
ఓ నాగారాజా! తల్లి పలుకులు యిన్నగించేవా
అయిమావాతి[2] అన్నపూర్నా పంకజాచ్చి పద్మావతి
కనకదుర్గ నిన్నే పిలిసెనుగా
సివనాగ రాజా! కన్నెకాంబ నిన్ను పిలిసెనుగా
ఓనాగరాజా కెన్నెకాంబ నిన్ను పిలిసెనుగా
యెండిగిన్నెలో[3] యెన్నబెట్టి[4]
పయిడిగిన్నెలో పాలుబోసి
పాలు బోసిన పార్వతి బిలిసెనుగా
ఆరగించావేమి నాగయ్యా
సివనాగరాజా ఆరగించావేమి నాగయ్యా
ఓ నాగరాజా ఆరగించావేమి నాగయ్యా

---

1. బ్రాహ్మణులు. 2. హైమావతి. 3. వెండిగిన్నె. 4. వెన్న.

మల్లెపూల మాలుగట్టి[1] మనులఆరంమజ్జన నిలిపి
తులసిమాలలు నీకేయే సేమా
సివనాగరాజా! తులసిమాలలు నీకేయే సేమా
ఓ నాగరాజా! తులసిపూజా నీకు జేసేమా
సట్టులాగా[2] పుట్టయుంది పుట్టకేమీకోమాలేదు
కోమలిడిసి సంతులివ్వయ్యా
సివనాగరాజా! కోమలిడిసి సంతులివ్వయ్యా
ఓ నాగరాజా! సంతులిచ్చి కావరావయ్యా
దుగ్గెలోని[3] పిల్లలెల్లా నీదుపూజాజేసేరయ్యా
మాదుబకితీ ఆలకించెవా
సివనాగరాజా మాదుబకితీ ఆలకించేవా
ఓనాగరాజా! మాకు ముకితీనందజేయావా ॥సిముని॥

## 114. శికారపల్నాటి సీమలో

(పాడినవారు : 1. జూపల్లి పొట్టెయ్య. 2. చెప్పాల చెన్నయ్య)

శికార పల్నాటి సీమలో నెలకొన్న
సితిని పుప్పలపాటి సిన్నది
ఆది సితిని వుప్పలపాటి సిన్నది
గణపాల నందనుడు గరుడు ముత్తెయ్యాను
గాట్టిగ లేసి రమ్మన్నదీ
ఆది గట్టిగ లేసి రమ్మన్నది
అంగ జాతిలో కేశిలింగాము దొరికితే
ఒడియ రాజుల బోదమన్నదీ
ఆది ఒడియ రాజుల బోదమన్నది
కొంగు ఖాౖజము దగిలి పొసకయుప్పలపాటి
పురమందు నెలకొన్న సిన్నది
ఆది పురమందు నెలకొన్న సిన్నది

1 మణులహారం. 2. చట్టూ 3. దుర్గి

బూసంగు[1] నరులను పపించ జేసితే
పట్టంబు రాలేనన్నదీ
ఆది పట్టంబురాలేనన్నది
కొలపట్టి సూచితే గోత్రమందున నాకు
కులములేదని సెప్పుకోమన్నది
ఆది కులము లేదని సెప్పుకోమన్నది
సరసులు యెవరన్న జాబు రాసెదమన్న
సరషులు నేనిచ్చే నన్నదీ
ఆది సరషులు నే నిచ్చే నన్నది
తరుసుగా నాతోటి తరికించి నోరికి
తారకములు తెల్పే నన్నదీ
ఆది తారకములు లేల్పే నన్నది
పాటలు పాడేటి పద్మ దలాచ్చిరో
బోటి నేనాక్కా దాన్నన్నదీ
ఆది బోటి నేనాక్కా దాన్నన్నది
మాట దప్పక రమ్ము మజిలీ రేపే నంట
తూరుగోటికే రమ్మన్నదీ
ఆది తూరుగోటికే రమ్మన్నది[2]
వరద సిరిగిరి పాటి[3] పురమందునా యింక
కీర్తనా సదివేటి సిన్నదీ
ఆది కీర్తనా సదివేటి సిన్నది
గుడి నిల్పి గట్టిగ గురుడు ముత్తయ్యాను
గుండ్ల పాడికే రమ్మ న్నదీ
ఆది గుండ్ల పాడికే రమ్మన్నది.

---

1. భూషణ
2. నా మొగుడు బొయ్యాడు అడివిలో పున్నాడు
నా కేమి బయము రమ్మన్నదీ
ఆది నా కేమి బయము రమ్మన్నది (అ చ., చె.చె)
3 శ్రీగిరిపాడు (మాచర్ల తాలూకాలోని గ్రామము).

కాటిక కన్నుల కలికి ముద్దుల కొలికి
కటియారమే తెమ్మన్నదీ
ఆది కటియారమే తెమ్మన్నది
కోటయ్య కొండాకి కోసులిరవై రెండు[1]
సూటిగ తూరుపు నుండయీ
ఆయి[2] సూటిగ తూరుపునుండయి
రాతెండి కడియాలు రైలు వడ్డానామూ
రంగుమెరిసిన ముద్దు సిన్నదీ
ఆది రంగు మెరిసిన ముద్దు సిన్నది
రాకుండ పోకుండ రాదారి లేకుండ
రవ్వంత సీటంత మన్నదీ
ఆది రవ్వంత సీటంప మన్నది[3]
దగ దాగ మానేటి జలతారు సీరెకు
తగినట్టు రెయిక తెమ్మన్నదీ
ఆది తగినట్టు రెయిక తెమ్మన్నది
తత్తార పడబాకు పుత్తాదే నువుయాని
సిత్తాము దయవుంచ మన్నదీ
ఆది సిత్తాము దయవుంచ మన్నది[4].

---

1. పేరైన మిరియాల పెదకాపు రెడ్డిని
నే మరువనని సెప్పమన్నదీ
ఆది నేమరువనని సెప్పమన్నది (అ.చ , చె.చె.)
2. అవి.
3. అత్తమామలు యింటే బొత్తిగ రానియ్యరు
ఉత్రంబు రాసంపమన్నదీ
ఆది ఉత్రంబు రాసంప మన్నది (అ.చ., చె.చె.)
అగిని బాద పూర్వ పుడిగొప్పుల దొరవారి
పురమందు నెలకొన్న సిన్నదీ
ఆది పురమందు నెలకొన్న సిన్నది (అ.చ., చె.చె.)
4. తత్తారు జంతారు ఉత్తాది కాదయ్యా
సిత్తంలో దయ వుంచమన్నదీ
ఆది సిత్తంలో దయ వుంచ మన్నది (పారాం., చె.చె.)

## 115. శికారా వందరూజానా

(పాడినవారు: చౌల నరసింహదాసు 2 మందపాటి రాములు
3. మక్కెన బంగారయ్య)

శికారా వందరూ జానా
సింధు సోమ నామదీయ
పాక సుతానాది వందనా
బక్తాశెందనా
ఏమసీ వర్నింతూ నిన్నూ
యేటికి దయరాదే మందూ
ముందు బక్తివిలాసామూ
ఏ మందు కొదువాలేదందూ
బక్తవరుల బ్రోసెదవనీ
బిరుదు వయించితివి జననీ
అదియుగా బద్రాద్రి శబరిపీ
నీకే తాగు పొందూ
పూరి కలుసరదనీ మిత్రా[1]
పూర్వదేవ బయ్యాశెరిత్రా
పారాయన బయ్యో శరిత్రా
పాద్మా కళాత్ర[2]
ఓ సీతా[3] చేజెళ్ళాదాసా[4]
మోముల పురి సన్నిది వాసా[5]

---

1. భూరి కలుష రజనీమిత్ర.
2. త్రిపురాయన బయ్యో శెరిత్ర పద్మా కళాత్ర (పారాం. మం రా.)
3. పోషిత
4. పోసిత సేజెండ్లాదాసా దాస దాసుడే (పారాం., మం.రా.)
5. అమ్మరావే అంబాయమ్మా
   అమ్మ నిన్ను బంపేమమ్మా (అ.చ, మం రా.)

శేస తల్పరా తాకోటి తేజా[1]
శ్రీయెంకటేశర[2] ॥శ్రీకారా॥

## 116. శీగిరిపాటీలోన

(పాడినవారు : బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు)

శీగిరిపాటీలోన బొక్తులందరిగావ నెలకొన్న
అనుమయ్యా కరునను జూపించరావా
అనుమ రయమున మముజేరరావా
అనుమ అనుమాయాని నిరతమ్ముగొలిసేటి
అందరి నొకటిగ జూడ ఆదరించగనీవురావా
అనుమ రయమున మము జేరరావా ॥శీగిరి॥
శానీవారమునాడు జనమంత నీగుడిలో
వరదచ్చినలు దిరిగి వొక్కపొద్దూలుండ
యిస్టమైనా కోర్కెయీడేర్దువుగానిరావా
అనుమ రయమున మము జేరరావా ॥శీగిరి॥

---

1. దేశ దెల్పురవి కోటేశా
శ్రీయెంకటేశ (పారాం., మ బం.)

2. కాకినాడ బోగము పిల్లా
కట్టినాదీ గాజుల మేడా
మేడ జూడ గాలికిబోయె
గోడ సున్నము రాలిపోయే!
సాకలోళ్ళరేపూ కాడా
సన్నజాజుల వానే గురిసే
సిరులు దడిసే మరులూ దడిసే
శెనగ పూల రెయికా దడిసే (అ.చ., మం.రా.,)

3. హనుమ

పల్నాటిలోపల యిస్టదై వామాని
ప్రెజెలంత నీపేరు పిల్లలకిపెట్టంగ
బొమ్మపై మొలతాట ముద్దుగా సువుజేరినావా
సామి బిళ్లవయి మెడజేరినావా ॥శిగిరి॥
గుడికిచ్చినవారి గుట్టెరిగీ నీవు
ఆదరించీ పంపరావా! జనులమేలుజేసీ పంపరావా ॥శిగిరి॥

## 117. శ్రీ గురుపదములు

(పాడినవారు : నెమలి రామలింగారెడ్డి)

శ్రీగురు పదములు మదిలో యెప్పుడూ
సింతన జేయుమురోరన్నా
కిట్క[1] యేగతి జూసిన యింతకు మిక్కిలి
యేదిర దీనికి వోరన్నా!
గురుడే బ్రెమ్మం గురుడే యిస్నువు[1]
గురుడే రుద్రుడు వోరన్నా
గురుడే సర్వము గురుడే సచ్చెము
గురుడే తోడురా వోరన్నా!
ఆది బ్రెమ్మయని అమరేంద్రాదులు
అబినతి జేతురు వోరన్నా
నాదు బిందుకల జాడతెలిసిన
మోదమొందుమో వోరన్నా!
అందరాని పలమంద బోకుమీ
ఆశలు దీరవు వోరన్నా
ముందుగ గురుతెరగని పనులు
మోసము గదురా వోరన్నా
యశము బొందవలె మానవ జల్మము
యెత్తినప్పుడే వోరన్నా
నెత్తురు మాంసము తిత్తేగాని
పుత్తడి గాదురా వోరన్నా (నె రా.)

---

1. విష్ణువు

## 118. శిరాములనమికి

(పాడినవారు : పాల నరసింహదాసు)

శిరాముల నమికి వోవరె
సింతయేమిటన్నయా
వొంటరీగా వచ్చితీవి
వడిస యేదేరన్నయా!
సెల్లెలా వొశారదాంబ
సెప్పజాలా గోరము[1]
గోదావరి పడవ జేసెను
గోరమయినా మరనము!
మరనమసి యింపించితీవి
యేమి జరిగే నక్కడా
మయిమ[2]గల శిరామ సమికి
మరనమేమిటన్నయ!
మీ వొదిన వొక్కరెగాదు సెల్లెల
వందలే మరనించిరి
అందరెట్లా మరన మంగిరి
అసలు దెల్పారన్నయా
నీకు మాత్రమే గాదు సెల్లెల
ప్రెజల కందరకిప్పుడే
యీ గోరమైనా యిసయమూలు[3]
సెప్పుదమురా సెల్లెలా

## 119. స్రీయెంకటేశ్వరుని

(పాడినవారు : మందపాటి రాములు)

స్రీయెంకటేశ్వరుని సిరిమల్లె తోటలో
పాదులై గుందామా

---

1 ఘోరము. 2. మహిమ. 3. విషయములు.

ఆత్మగురుడా మనకు అందెవ్వరున్నారు
పరమాత్ము నేలుకుందామా!
శ్రీయెంకటేశ్వరుని సిరిమల్లె తోటలో
తీగెలయి వుందామా
ఆత్మగురుడా మనకు అందెవ్వరున్నారు
పరమాత్మ నేలుకుందామా!
శ్రీయెంకటేశ్వరుని సిరిమల్లె తోటలో
ఆకులై వుందామా
ఆత్మగురుడా మనకు అందెవ్వరున్నారు
పరమాత్మ నేలుకుందామా!
శ్రీయెంకటేశ్వరుని సిరిమల్లె తోటలో
పూవులై వుందామా
ఆత్మగురుడా మనకు అందెవ్వరున్నారు
పరమాత్మ నేలుకుందామా!
శ్రీయెంకటేశ్వరుని సిరిమల్లె తోటలో
కాయలయి వుందామా
ఆత్మగురుడా మనకు అందెవ్వరున్నారు
పరమాత్మ నేలుకుందామా

## 120. సందెవేళను

(పాడినవారు : వెప్పాల చెన్నయ్య)

సందెయేళను పొంద నంటడు
సవుక్కె[1] మేమమ్మక్కరో
సందడి కాకుంద నీవు
సందు కెళ్ళవే సెల్లెలా
సందు కెళ్ళే సమయ మంగూ
యెప్ప డిస్తా మక్కరో

1. సౌఖ్యం.

కామ రూపిని కాయి లున్నడు
కవుగిలించవే సెల్లె లా
కామ రూపిని కాయి లుంటే
కట్టదేమమ్మ క్కారో
పనికి మాలిన పట్టు సీరె
జాయి రియ్యవే సెల్లెలా
పనికి మాలిన పట్టు సీరె
పట్టదేమమ్మక్కారో
పట్టకుంటే పాల బాగం
జాయిరియ్యవే సెల్లెలా
సెల్లెలా మా తల్లి వే
సిత్తమున మే నాత్తవే
అత్త కొడుకుకు పిల్ల నిత్తే
ఆదిగ్గేనమే సెల్లెలా.

## 121. సామిరార పొట్టి శీరామ

(పాడినవారు : 1. బొమ్మిశెట్టి వెంకటేశ్వర్లు. 2. చెప్పాల చెన్నయ్య)

సామిరార పొట్టి శీరామ
ఆంద్రులాకు యమర జీవి
ఆంద్ర మాత తనయు డావూ
ఆశలన్నియు దీర్చినావూ ||సామి||

తల్లి బారత దేవికి నీవూ[1]
తనయుడావై జన్మించావా
ఆంద్ర మాత తనయు డావు
ఆశలన్నియు దీర్చినావు

1. ప్రేమ తోడ వందానములుం
అందుకోర సామి నేడూ ||ఆంద్ర||

నాలుగు కోట్ల జనాళి కోసం[1]
నీ తనువునే అర్పించి నావా (బో. వెం.)

## 122. సామిరార సారంగదర

(పాడినవారు : 1. చౌల నరసింహదాసు, 2. మందపాటి రాములు, 3. చెప్పాల చెన్నయ్య, 4. పాలకుర్తి శివయ్య, 5. తోట హనుమయ్య 6. కొండం వెంకటనర్సయ్య.)

సామిరార సారంగదారా
కాము నిలపజాలనయ్యో
కామకేళిగూడి నామది
ప్రేమ దీర్చిపోరసామి
వంచన సేయవలదు రాజా
పంచెవన్నెల పావురమిత్తు
అంచితముగ గూడి నాతో
ఆశ దీర్చిపోర సామి[2]
నిన్ను యిడిసి నిదర రాదూ
యెన్ను గూడిన ఆరుస రీతి[3]

---

1. అరవ దొరలు నిన్ను నేడు
అనగ దొక్క జూసినారా ॥ఆంధ్ర॥
అన్నపానము ముట్టానట్టి (అ.చ., చె.చె.)
ఆంధ్ర మాత తనయ డావూ ॥సామి॥
2. అంది పొంది గూడి నామం
ఆశ దీర్చిపోర సామి (పారాం., కొ.వెం.)
3. నిన్ను జూసి నిదర లేదూ
యెన్నుగూడిన ఆరుకురీతయ్యో (పారాం., కొ.వెం.)
నిన్నుజూసి నిదర లేదూ
నన్నుగూడి సారసమియి (పారాం., తో. హ.)
నిన్ను జూసి నిదరలేదూ
యెన్నుగూడిన సలుపులిస్తయ్ (పారాం., చె.చె)

పున్న పెన్నెలంటి మనుసూ
    బిన్న మాయెరార సామీ[1]
తాడువాయె తాలగలేను
    యేడుకాతో యేలర నన్నూ[2]
సూడసక్కాదనమూ నీదీ
    జోడుగూడి పోరసామి[3, 4] ॥సామి॥

---

1. పున్న పెన్నెలవంటి మనుసూ
    బిందువాయె రార సామి (పారాం.,పా.శి.)
పున్న పెన్నెలవంటి మనుసూ
    బిందమాయె రార సామి (పారాం.,చె చె.)

2. తాడువాయె తాళలేను
    యిక నన్ను యేలుకోరా (పారాం.,పా.శి.)
తాడువాయె తాళలేను
    యింకనన్ను యేలుకోరా (పారాం.,కొ.వెం.)
తాడువాయె తాలగలేనూ
    ఇకానైనా మరువర సామీ (పాతాం.,చె చె.)

3. సూడ సక్కదనము నాకు
    జోడు గూర్చిపోర సామి (పారాం.,కొ.వెం.)

4. వారకాంతలినవె యీడు
    దూరి శెన్న కేశవుని
ఏరికోరి యున్నదాని
    సేరనీయవేమిర సామి
పిన్న తల్లివి కావలెనమ్మా
    పంచె వన్నెల పావురమియ్యి (అ.చ., తో.హ.)
తాడువాయె తాలిలోన
    నన్ను బంపు తల్లి నేడూ (అ.చ , తో.హ.)

ప్రేమతోటి వందనములు
అందుకోర సామీ నేడు[1] (అ.చ., తో.హ.)

## 123. సుందర సకులారా

(పాడినవారు: 1. చౌలనరసింహదాసు, 2. చెప్పాల చెన్నయ్య)

సుందర సకులారా
ఓహో శెందనంపులారా[2]
జాడలు గంటిరటే[3]
సీతా జాడలు గంటిరటే
పాపాత్ముండెవడో సీతను[4]
ఎత్తుకు పోయాడూ[5]
సూసితిరా మీరు
సుందర సకులారా[6]

---

1. సక్కాని వాడమ్మ సారంగదరుడు
చిట్కాసిత్రాంగి పిన తల్లి సేత
మారు తల్లి సేత మాటపడలేక
సావులకు లోనేగె సారంగదరుడు (అ.చ., చె.చె.)

2. సుందర సకులారా
వోశెందన దరులారా (పారాం , చె.చె.)

3. కుందనంపులారా
వోహో జాడలు గంటిరటే (అ.చ., చె.చె)

4. నారి కేలులానా వనిజము
ఘూర పలములారా
నీరు తల్లులారా మీరూ
జాడలు గంటిరటే
సీతా జాడలు గంటిరటే
వోయమ్మా (అ. చ., చె.చె)

5. పాపాత్ముండెవడో సీతను
శెరపట్టుకు పోయేను (పారాం., చె.చె)

6. సూసితిరా మీరూ
సీతను సుంగారముగాను (పారాం.,చె.చె.)

ఆసతి జూసితిరా
సీతా నన్నెడ బాసితివా
మోసమాయెగదరా లచ్మన
యెంత జరిగె గదరా
సుందర సకులారా
వోహోశెందనంపులారా
జాడలు గంటిరచే
సీతా జాడలు గంటిరచే

## 124. సుబ్బదాసుని

(పాడినవారు : పాలకుర్తి శివయ్య)

సుబ్బదాసుని గాంచుమురోరన్నా సిన్నన్నా
నీ మోచ్చమార్గము నెరుగుమురోరన్నా సిన్నన్నా
పేరుగాను పల్నాటిసీమనా
ధర్మవరంబను[1] పురములోపలా
సిరుమామిళ్ళ[2] వంశమందునా ॥సుబ్బ॥

శీలవంతుడై జన్మించెనురా
ఆ వూరికి తూరుపుదిక్కునయున్న
అందమైన ఆ మటములోపలా
యోగముద్రసే[3] యెలిసియున్నను ॥సుబ్బ॥

యోగపుంగవుని గాంచుమురన్నా
హాలికవృత్తిచే జీవించెనురా
రాజయోగియై యిలసిల్లెనురా
'యేదాంతమునే యివరించెనురా
బాత్తులనందరి ముక్తులజేసెనూ ॥సుబ్బ॥

1. గురజాల తాలుకాలో ఒక గ్రామము. 2. చిరుమామిళ్ళ.
3. యోగనిద్ర.

బాత్తులనందరి గాసినవాడు
ము_త్తిమార్గము జూపినవాడు
బత్తుడైన చెన్నయాఖ్యునకు
ము_త్తిమార్గమును జూపెను రన్నా ॥సుబ్బ॥

## 125. సౌరకాయా

(పాడినవారు : నెమలి రామలింగారెడ్డి)

సౌరకాయా సొక్కుం బీరాకాయా
ఇదీ ముదిరితే కొరగాదు బెండాకాయా
సౌరకాయా సొక్కుం బీరాకాయా
శెర శెర శెంపాదెబ్బ మన్నించే వీపు దెబ్బా
కన్నెర్ర జే సింది క_త్తీ దెబ్బ
ఈ మూడీ టీ మించింది గుతపా దెబ్బ ॥సౌర॥

శెర శెర చెనగా పప్పు
మన్నించె పెసరా పప్పు
క న్నెర్ర జేసింది కందీ పప్పు
ఈ మూ డీటి నోడ గొట్టే నేతీ బొట్టు ॥సౌర॥

శెర శెర శెనగా పిట్టా
మ న్నించె గురకా పిట్టా
క న్నె ర్ర జే సింది కము జూ పిట్టా
ఈ మూడీ టి నో డగొట్టే కోడి పెట్టా ॥సౌర॥

శెర శెర జెల్లా పిల్ల
మన్నించె బుడ్డా బరక
కనెర్ర జే సింది కంశామ ట్ట
ఈ మూ డీటి నోడ గొట్టె కొర్రా మట్టా ॥సౌర॥

